# ప్రేమసాగరుడు

## అవతార్ మెహెర్ బాబా జీవిత చరిత్ర




**5వ భాగం**

రచయిత:

నిట్టి భీమశంకరం

ప్రచురణ:

అవతార్ మెహెర్ బాబా
ఆంధ్ర సెంటర్ - కాకినాడ

అవతార్ మెహెర్‌బాబా

జీవిత చరిత్ర **5** వ భాగం

ఈ అయిదవ భాగము

అవతార్ మెహెర్‌బాబావారి

13 వ, అమరతిథి సందర్భమున

**31-1-82** న ప్రకటించడమైనది

అవతార్ మెహెర్‌బాబా - ట్రస్టు

అహమ్మద్‌నగర్ వారి

సౌజన్యముతో



ముద్రణ

శ్రీ సీతారామాంజనేయ ప్రెస్

ఏలూరు-1

# అవతార్ మెహెర్ బాబా కీ జై

## తొలిపలుకు

మెహెర్‌బాబా వారి జీవిత చరిత్రను బాబా వారి సందేశముల వ్రాత ప్రతులను మండలి డైరీలను ఆధారముగ విశేష శ్రమ కోర్చి వివరముగా కీ శే. నిట్ట భీమశంకరంగారు వ్రాయగా మొదటి భాగమును 'అవతార్ మెహెర్‌బాబా చరిత్ర' యను పేరుతో కీ శే యన్ వి. రమణయ్య గారు ప్రచురించిరి రెండు మూడు నాలుగు భాగములను ప్రేమ సాగరుడు అను పేరుతో అవతార్ మెహెర్‌బాబా ఆంధ్ర కేంద్రము తరపున సదరు కేంద్రమునకు వైస్ ప్రెశిడెంటు అయిన చింతా సర్వారావుగారు సర్వాంగ సుందరముగా ముద్రించి ఆంధ్ర ప్రేమికులకు అందించి ఎల్లప్పుడు వర్షించుచున్న బాబా వారి ప్రేమాశీస్సులకు పాత్రులైరి. భీమశంకరంగారి రచనలో ఆయనకు బాబా యెడల గల ప్రేమ ప్రతి వాక్యమునను ఉట్టి పడుచున్నదనుట అతిశయోక్తికాదు. ఇప్పుడు మనకు అయిదవ భాగము కూడ అందించబడుచున్నది ఈ రచనలను వెలువరచుటలో కృషి చేస్తున్న ప్రేమికులపైని, చక్కగ అచ్చు వేయుచున్న శ్రీ సీతారామాంజనేయ ప్రెస్, ఏలూరు వారిపైని బాబాగారి కృపామృత వృష్టి కురియుగాక యని కోరుచు

బాబా వారి సేవలో

**టి. ధనపతిరావు**

అధ్యక్షుడు

అవతార్ మెహెర్‌బాబా ఆంధ్ర కేంద్రము, కాకినాడ

16—1—1982

కాకినాడ



అవతార్ మెహెర్ బాబా

జై బాబా

# అవతార్ మెహెర్‌బాబా జీవితచరిత్ర

## ఐదవ భాగం

## హైదరాబాదు మకాం

యాదగిరినుండి బాబా పరివారముతో హైదరాబాదు చేరుకున్నారు 1945వ సంవత్సరములో బాబా యిక్కడికి వచ్చినపుడు అనేకమంది మస్తులను సాంగత్యం చేశారు. ఈసారికూడా 16వ తేదీన అనేకమంది మస్తులను బాబా కలుసుకొని ఆధ్యాత్మిక సాంగత్యం చేశారు

దీనాషా అనే అరబ్బీ నిజాము సేనలో ఉద్యోగంలో ఉండేవాడు మూడు మెరుగు కర్రలను పుచ్చుకొని అతడు నడుస్తుంటాడు అతనికెవరయినా డబ్బు యిస్తే అది వెంటనే ఒక హోటలు యజమానికి యిచ్చేవాడు. ఆ హోటలువాడే యితనికి భోజనం పెట్టేవాడు దీనాషా 70 ఏళ్ళ మనిషిలా కనిపించేవాడు ఇతడు సాలిక్ లాంటి మస్తులా కొన్ని సమయాలలోను మజూబ్‌లా యితర సమయాల్లోనూ కనిపిస్తాడు

నజీర్ అలీషా మొదట్లో మాంట్గొమెరీలో ఉండేవాడు. కాని యిప్పుడు చాలా కాలంగా హైదరాబాద్ (దక్కను)లో ఉంటున్నాడు ఇతనికి చిత్తు కాగితం ముక్కలు ఏరి ఒక సంచిలోనికి వేసుకోవడం అలవాటు ఉర్దూ మాటలు వ్రాసిఉన్న కాగితాలే ఏరుతానని యితడు బైదుల్‌తో చెప్పాడు భగవంతుని పేరు జనుల కాలి క్రింద పడడం యిష్టంలేక అలా చేస్తున్నాననికూడా చెప్పాడు. ఇతనిని మొదట బాబా 1945 లో సాంగత్యం చేసారు.

హావల్దార్ మస్తాన్ ఒక మసీదులో నివసిస్తున్నాడు ఇతడు సైన్యంలో హావల్దార్ (సార్జెంటు)గా ఉండేవాడు. అతనితో మాట్లాడితే అతడు అన్నం వండి యితరులకు యిచ్చేస్తానని చెప్తుంటాడు ఇతనిని బాబా 16 మే న సాంగత్యంచేసారు. 17 వ తేదీనకూడా బాబా హైదరాబాదులో కొందరిని సాంగత్యం చేసారు అషుట్ అహమద్‌సాహెబ్ హైదరాబాద్ నగరంలో తిరుగుతూంటాడు హైదరాబాద్‌లో యితడంటే అందరికీ బాగా తెలుసును. ఇతనిని ఒక వలీగా గౌరవిస్తారు బాబా యితనిని ఆరోజున (17-5-49) సాంగత్యం చేసారు.

రాజయ్య మస్తాన్ ను బాబా మొదట 1915 లో సాంగత్యం చేసారు ఈమారు బాబా యిక్కడికి వెళ్ళినపుడు బాబా శిష్యుడు యితనిని ఒక రైల్వే లెవెల్ క్రాసింగ్‌వద్ద కనుగొన్నాడు అప్పుడు రాజయ్యా మస్తాన్ భోజనానికి రాబోలు తొందరగా వెళ్తున్నాడు శిష్యులు యితనిని ఒక రిక్షాలోనికి ఎక్కించుకొని జైలువద్ద ఒక స్మశానానికి తీసికొని వెళ్ళారు అక్కడ ఒక చిన్న గదిలో యీ మస్తును సాంగత్యం చేసారు. ఆ సమయంలో రాజయ్య కొన్ని పింగాణీ ముక్కలు బాబాకి యిచ్చాడు తరువాత రాజయ్యను ఒక రిక్షాలో తీసికొనివెళ్ళి నగరంలో ఎక్కడో వదిలారు. రాజయ్యవెళ్ళిన తరువాత పింగాణీముక్కలు ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టమని బాబా తమ శిష్యులొకనిని ఆజ్ఞాపించారు 70 ముక్కలున్నాయి అవన్నీ ఒక జేబు రుమాలులో మూటకట్టి, జాగ్రత్తగా దాచమని బాబా విష్ణుకి చెప్పారు ఆ మూట జాగ్రత్తగా ఆయాకి తీసికొనివెళ్ళి యిలా మస్తులు యిచ్చిన సామానులతో చేర్చారు. రాజయ్య మస్తాన్‌తో సాంగత్యానికి బాబా చాలా సంతోషించారు

జేన్‌మియాం మజ్జూబ్ పగలంతా నగరంలో తిరుగుతాడు. కొన్ని సమయాలలో ఒకానొక మసీదులో కూర్చుంటాడు కొన్ని సంవత్సరాల క్రిందట ఒకమరుగు దొడ్డివద్ద నివసించేవాడు ఇతడొక మోతావయిన మస్తుఅని బాబా అన్నారు కాలాఖాన్ మజ్జూబ్‌తో సాంగత్యం అసాధారణంగా జరిగింది బాబా మండలితో బస్సుమీద వెళ్ళాలని అనుకుంటున్నారు ఆ సమయంలో మామూలుగా మంచి దుస్తులు వేసుకుని వెళ్తూఉన్న ఒకనిని బైదుల్‌కి చూపించి ఫలానా చోటుకి ఏ బస్సులో వెళ్ళాలో అతనిని అడగమని బాబా చెప్పారు బైదుల్ వెళ్ళి అతనిని అడుగగా అతడు జవాబు చెప్పక అటు ముఖం తిప్పుకున్నాడు బైదుల్ మళ్ళీ అడిగాడు ఈ ప్రశ్నపని యింకొకడు ఆ మనిషి కాలాఖాన్ మజ్జూబ్ అనే ఒక భగవదున్మత్తుడని చెప్పాడు వెంటనే బాబా ఆదేశం ప్రకారం "అవ్‌కా" అనే ఒక హోటలుకి వానిని తీసికొనివెళ్ళి అతనికి టిఫిన్ పెట్టించారు అతనితో సాంగత్యం అయాక బాబా "కాలాఖాన్ మజ్జూబ్ సంపూర్తిగా మజ్జూబ్‌లా ఉన్నాడని అతనికి శరీర చైతన్యం బొత్తిగాలేదనీ చెప్పారు. ఇతనికి అన్నం పెట్టినప్పుడు చాలా జాగ్రత్తగా పెట్టాలని లేకపోతే ఉక్కిరిబిక్కిరి అవుతాడని బాబా చెప్పారు ఇతడు మంచిమస్తు అని అతనిని ఎవరో హైదరాబాద్‌లో సంరక్షణ చేస్తున్నారని అతని శరీరం మంచి స్థితిలో ఉందనీ అతడు మంచి బట్టలు వేసుకున్నాడనీ బాబా చెప్పారు

అషఫ్ మియా అనే మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. ఇతనిని మొదట బాబా 1945 లో కలుసుకున్నారు. సైయిద్ మోయినుద్దీన్ హైదరాబాద్ కి ఆధ్యాత్మిక పాలకుడు ఇతని సాంగత్యం చేయాలని బాబా 17, 18 తేదీలలో ప్రయత్నించారు ఇతనిని యిదివరలో బాబా 1945 లో వచ్చినప్పుడు సాంగత్యం చేసారు ఈ మస్తు యిప్పుడు బాబాని తనదగ్గరకు వచ్చేందుకు ఒప్పుకోలేదు. బాబా అతనితో గాని యింకొక మస్తుతోగాని మంచి సాంగత్యం చేస్తేగాని తనమీద ఉన్న భారం తీరదు అన్నారు అందువేత మంచి మస్తుకోసం బాబా మండలి వెదుకుతున్నారు వాలిసాహెబ్ అనే మస్తును ముందు చూసి తరువాత ఆనందస్వామి అనే ఒక తిరుడ ఐన యాత్రికుని కోసం వెళ్ళారు అతడు కాచిగూడాస్టేషన్ వద్ద ఉంటాడని తెలిసింది ఆనందస్వామి రోజూ ఉదయాన్న ఒక కుళాయివద్ద ఉంటాడు అక్కడే ఒక కుండనిండా నీరు పడతాడు ఆ కుండ నీటితో అతడు కాలకృత్యాలు తీర్చుకుంటాడు తరువాత ఆ మిగిలిన నీళ్ళన్నీ పారబోస్తాడు ఆ కుళాయి వద్దనే అతడు నీళ్ళు పోసుకుంటాడు (స్నానం చేస్తాడు) వంటికి సబ్బుకి బదులుగా దుమ్ము ధూళిని తోముకుంటాడు స్నానం చేస్తూ అతడు నీళ్ళతో ఆడుకుంటాడు

బాబా వారి మండలితో యీ కుళాయికి దగ్గర ఉండే రోడ్డుకి అవతలి వయిష్ణవ శాస్త్రి బువా అనే మహాత్ముడు వెళ్తున్నాడని బాబా కనిపెట్టారు ఇతడు ఏడు మైళ్ళదూరంలో సికింద్రాబాద్‌లో ఒకచోట ఉంటున్నాడని చెప్పారు ఇతనిని బాబా 1945 సంIIలో చాలా మార్లు సాంగత్యం చేసారు అతడు 6 వ భూమికలో ఉన్న మస్తు ఆ ఊరిలో మొదట బాబా యీ శాస్త్రిబువాను సాంగత్యం చేసారు ఆ సమీపంలో ఉన్న ఒక సందిట్లో తరువాత ఆనందస్వామిని సాంగత్యం చేసారు బాబా యీ యిద్దరు మహాత్ములతో సాంగత్యం పూర్తిచేసి తనమీద ఉన్న భారం దీనితో తొలగిందని చెప్పారు.

హైదరాబాద్ నుంచి బాబా వారి మండలి బొంబాయి మీదుగా మౌంట్ అబూకి మే 20 వ తేదీ సాయంకాలానికి చేరుకున్నారు బాబా వారి మండలితో అబూనుంచి మకాం ఎత్తేసి మే నెల (1949) ఆఖరి వారంలో బయలుదేరి పంచ్‌గనీ వచ్చేసారు దారిలో బాబా బొంబాయిలో ఒకటి రెండు రోజులుండి కొద్దిమంది మస్తులను సాంగత్యం చేసారు

బొంబాయిలో మెంగుటూరు వీధిలో నివసిస్తున్న బోరా అనే మస్తు అట్టపెట్టెలు, గోధుమరంగు కాగితాలు పాతగోని సంచులు మొదలయిన వాటితో కప్పబడిన ఒక పందిరిక్రింద నివసిస్తున్నాడు ఇతని సాంగత్యం తరువాత ఆరోజునే (8 మే 1949) శాండ్‌హర్స్ట్ రోడ్డులో బోజా మహమ్మదీయుల గోరీలదొడ్డి దగ్గర ఒక మంచి మస్తుని సాంగత్యం చేసారు అతడొక నడిపయస్కుడు రోడ్డు ప్రక్కన నడిచే గట్టుమీద కూర్చుని ఉంటాడు అతడు మళ్ళగుడ్డలు కట్టుకుని ఉన్నాడు ఇతని పేరు ఎవరికీ తెలియదు ఎందుకంటే అతడెవరితోను మాటలాడడు తీర్చిదిద్దిన ముఖము తేజస్సుతో వెలిగే నేత్రాలు కలవాడు.

మంగ్‌సాజీ మహరాజ్ ఉత్కృష్టుడయిన యాత్రికుడు ఇతనిని బాబా 1944 సం. ఆగష్టు మాసంలో ధుళ్‌గామ్‌లో సాంగత్యం చేసారు బొంబాయిలో చర్చిగేటులో అతడు నాగిన్‌మహల్ అనే భవనంలో ఒక భాగంలో మంగ్‌సాజీ మహరాజ్ యిప్పుడుంటున్నాడు వీరిందరి సాంగత్యం అయాక బొంబాయినుంచి బాబా పింపల్‌గామ్‌కి తిరిగి వెళ్ళారు

జూన్ 7వ తేదీనుంచి 17వ తేదీవరకు [illegible] లోని మస్తు అయిన ఆలీషాను మెహెరాబాద్ నుంచి మెహెరాజాద్‌కి రప్పించి అక్కడ ఉంచారు ప్రతీరోజున మామూలుగా అతనితో బాబా స్నానం చేయించి పని చేస్తున్నారు జూన్ 18వ తేదీన ఆలీషాను బాబా కేబిన్‌లోకి రప్పించి అక్కడ అతనితో కొంతసేపు కూర్చొని బాబా అతనికి అన్నం పెట్టారు ఈ సాంగత్యానంతరం బాబా ఆలీషాను మెహెరాబాద్ పంపించేసారు జూన్ (1949) నెలలో బాబా ఆదేశంప్రకారం డెలియా పనామానుంచి వస్తూ అమెరికాలో మార్గరెట్‌ని, కిటీని, యితర బాబా ప్రేమికులను కలుసుకుంది. కిటీ తను న్యూయార్కులో ఉన్న యింటిలో ప్రేమికులను యితరులను సమావేశపరచి బాబా ప్రవచనాలను చదివి చెప్తోంది

జూన్ 21వ తేదీన ఏకాంతవాసం ప్రారంభం చేసే సమయంలో బాబా హిందూ, ఇస్లామ్, క్రిస్టియన్, జొరాస్ట్రియన్ మత ప్రార్థనలు చదివించారు అప్పు డక్కడ ఉన్న మండలికి యిలా వివరించారు. బాబా —"ఇవన్నీ ఒకే భగవంతుని ఒకే సత్యమును చేరుటకు వివిధ మార్గాలు ఈ మత గ్రంథాలయొక్క సారం అంతా ఒక్కటే."

ఏకాంతవాసం ఉపవాసం గురించి చెప్తూ బాబా——

"ఇది ఒక తపస్సూ కాదు, ధ్యానమూ కాదు. నేను అన్ని విధాలా స్వేచ్ఛగా ఉన్నాను కానీ నా అంతట నేను బంధింపబడతాను. రేపటినుంచి 40 రోజులపాటు నేను ఏకాంతవాసంలోకి వెళ్ళడానికి నాకు నూటికి నూరు కారణాలు ఉన్నాయి."

జూన్ 22 వ తేదీ సాయంకాలం బాబా పింపల్‌గావ్‌లోని వారి కేబిన్‌లో 40 రోజుల ఏకాంతవాసం చేయడం ప్రారంభించారు. అందులోనుంచి ఏకాంతవాసం అయిపోగాన ఆగస్టు 1 వ తేదీన బయటకు వచ్చారు. ఈ నలభై రోజులు బాబా మస్తులతోను, పిచ్చివారితోను, పేదవారితోను కార్యక్రమాలు జరుపుతూ కాలక్షేపం చేసారు. జూన్ 29 వ తేదీన వివిధ రకాలకు చెందిన ఏడుగురు మనుష్యులను బాబా రప్పించారు. అందులో యిద్దరు మస్తులు, కొంతమంది పిచ్చివారు. వారందరిని బాబా కేబిన్‌లోనికి ఒక్కొక్కరినే పంపించారు. బాబా వారందరికీ స్వయంగా జుత్తు కత్తిరించారు. తరువాత ఒక్కొక్కరిని స్నానం చేయించి నూతన వస్త్రాలు ధరింపచేసారు. తరువాత బాబా ఒక్కొక్కరికి ఒక మిఠాయిపొట్లం యిచ్చారు. ఈ ఏడుగురిలో ఒకడు బాబు అనేవాడు. అతడు సింగార్ అనే గ్రామంనుంచి వచ్చాడు. అతడు ఎడమచేయి పోగొట్టుకున్నాడు పాపం నిద్రపోతూ ఉన్నట్లుంటాడు.

తరువాత షట్టి అనేవాడు అహమద్‌నగర్‌నుంచే వచ్చాడు. జాల్ కేరావాలా అతనిని పేరు ఏమిటని అడిగితే సయ్యద్ నూర్ సయ్యద్ అమీర్ తట్టి దరోగా అని చెప్పాడు. పహిల్వాన్ అనేవాడు అహమద్‌నగర్‌లోనే తిరుగుతూ ఉంటాడు. ఇతనినే 1947 జనవరి మాసంలో మహాబలేశ్వర్ ఆశ్రమానికి తీసుకువెళ్ళారు.

భగవాన్ అనేవాడు బిహార్‌నుంచి వచ్చాడు. ఇతడు సంతోషంగా ఉండే సుఖం కలవాడు. చింతలు లేనట్లుంటాడు. ఇకడొక మోతాదయిన మస్తు సద్వాఅనే వాడు వడర్డి అనే గ్రామంనుంచి వచ్చాడు. అది అహమద్‌నగర్‌కి 30 మైళ్ళ దూరంలో ఉంది. అక్కడినుంచి యితనిని ఆదీ తన కారులో తీసుకువచ్చాడు. ఒక మోతాదయిన మస్తు యితడు.

ఆరవవాడు అహమద్‌నగర్‌లోని సర్దేశ్‌పురానుంచి వచ్చిన మున్ని అనే వృద్ధుడు వెహాత్రి అనేవాడు యువకుడే కాని బలహీనుడు అతన్నిచూస్తే తిన్నగా నడవలేడేమో అనిపిస్తుంది ఇతడే ఏడవవాడు.

జూలై 10 వ తేదీన బాబా శిష్యులందరు ఆయన ఇచ్చు ప్రకారం మౌనం పాటించారు ఆ రోజునే మెహెరాబాద్ నుండి మరల పింపలగామ్ కి రప్పించారు బాబా. అప్పటినుంచి ఆగస్టు 1 వ తేదీవరకు బాబాతోనే అతనిని ఉంచారు ఆ రోజున మరల అతనిని మెహెరాబాద్ పంపించేశారు బాబా జూలై 16 నుండి 21 వరకు పూనాలో ఉన్నారు అప్పుడు బాబాతో ఆరీషానికూడా పూనా తీసుకువెళ్ళారు ప్రతి రోజూ ఆరీషాతో మామూలుగా బాబా పనిచేసేవారు పూనాలో బాబా జూలై 17 వ తేదీ కేశవ్ అనే మస్తును సాంగత్యం చేసారు. 18 వ తేదీన హాషమ్ అనే 50 ఏళ్ళ ఒక పిచ్చివానిని అతడు ఖోజా మహమ్మదీయుడు, — అల్లా బక్ష్ అని 35 సంవత్సరాల యింకొకణ్ణి సాంగత్యం చేసారు బాబా వారిద్దరిని స్నానం చేయించి బట్టలు కట్టించి భోజనంపెట్టి వారితో పని అయిపోయాక పంపించేసారు

జూలై 19 వ తేదీన అల్లాబక్ష్ అనే అదే పేరుగల యింకొక మస్తును బాబా బంగళాకి తీసికొని వచ్చారు అదే సాయంకాలం నస్సూరబాయి అనే వానిని కూడా సాంగత్యం చేసారు బాబా ఆ సాయంకాలమే బాబా కారుమీద షికారువెళ్ళారు. పూనాలో వాడియా కాలేజివద్ద రోడ్డుమీద ఒక సన్యాసి నడిచి వెళ్తూ ఉండడం బాబా చూసారు బాబా కారు ఆపించి అతనెవరో తెలుసుకు రమ్మని ఎరచ్‌ని పంపించారు. అతడు ఏడేళ్ళనుండి మౌనం అవలంబిస్తున్న సన్యాసి అని ఎరచ్ తెలుసుకొని వచ్చాడు అతడు భారతదేశం అంతా దేశాటనం చేస్తున్నాడట కూడాను కాని అతనిని మౌనిబాబా అని గుర్తించి బాబా కొన్ని సంవత్సరాల క్రిందట అతనిని హరిద్వార్‌లో సాంగత్యం చేసారని చెప్పాడు బాబా అతనిని పిలిచి కారులో ఎక్కించుకుని పింపరీ స్మశానానికి కారును పోనిచ్చి కొద్దినిమిషాలసేపు బాబా అతనిని సాంగత్యం చేసారు

బాబా పూనాలో ఉంటూ జూలై (1949) 20 వ తేదీన ఒక సాధువును పిల్పించారు సాంగత్యం కోసం బాబా అప్పుడు ఒక కొండమీద బంగళాలో

---

ఉంటున్నారు. ఆ కొండకి వెళ్ళేద్వారం వద్ద ఒక ఆలయం ఉంది. ఈ సాధువు ఆ ఆలయానికి నిర్వాహకుడు. ఆ రోజున మధ్యాహ్నం రామశాస్త్రి అనే వానిని బాబా సాంగత్యం కోసం తీసికొని వచ్చారు. జూలై (1949) మాసంలో ఒక రోజున పూనాలో ఒక మూత్రశాలలో ఉండే ఒక మస్తును సాంగత్యం చేసి బాబా డా॥ గనీతో యిలా అన్నారు

"నాకు రెండే రెండు యిష్టం - మస్తుల సాంగత్యం. పిల్లలతో ఆట. మస్తులను వాళ్ళ (ఆధ్యాత్మిక) బలానికి యిష్టపడతాను పిల్లలను వాళ్ళ నిస్సహాయతకు యిష్టపడతాను ప్రేమ రగుల్కొంటే ఆ జ్వాల వలె తీవ్రమయినది మస్తుల కది ఉంటుంది. - భగవంతుని యెడల, ప్రియతముని యెడల ప్రేమ"

డా॥ గని బాబాని అప్పుడడిగాడు -

"బాబా ఎంతోమంది మస్తులు కుళ్ళు స్థలాలలోను అనారోగ్య పరిసరాల లోను ఉంటారేమి? వాళ్ళ ఆరోగ్యం దానివల్ల ఎందుకు దెబ్బతినదు?"

బాబా జవాబిచ్చారు - (అక్షరాల బోర్డుమీద)

"వారి యొక్క తీవ్రమయిన ప్రేమాగ్ని పిల్ల మస్తులు ప్రియతమునికి ఒక సవాల్. ఈ సవాల్ వారి సంపూర్ణ అహంకార శూన్యత్వం వల్ల, నిస్వార్థత వల్లా మరీ యెక్కువ అవుతోంది. ఒక మరుగుదొడ్డి గాని, కంపుకొట్టే స్థలాలలోను గాని ఉంటే తన భౌతిక అస్తిత్వాన్ని పూర్తిగా మరచిపోయినట్లే. శరీరం పూర్తిగా పట్టించుకోకుండా ఉంటే - వారి చైతన్యం ప్రియతముని యెడల ప్రేమనే తెలుసుకుంటుంది - ఆ శరీరం క్షీణించిపోదు, దానంతటదే ఆరోగ్యంగాను బలంగాను అవుతుంది. సాధారణ మానవులు వారి మనసును నిరంతరము వారి శరీరాలమీదనే ఉంచబట్టి, వారు వారి శరీరాల గురించి ఎంతజాగ్రత్త తీసుకున్నా ఆ శరీరాలు క్షీణిస్తూంటే వారు ఏమీ చేయలేరు. కబీరు ఏమన్నాడు?

"తన్ తక్యా టన్ టహో

---

తన్ టఫే ఆన్ జాయే

---

యహి అచంబా హమ్నే దేఖా
మదా కల్‌కో ఖాయే'
శరీరాన్ని వదిలేసెయ్య - అది ఉంటుంది ;
శరీరాన్ని రక్షించు, – అదే పోతుంది ,
అందుచేత ఆశ్చర్యమేమిటంటే
ఏమీ జాగ్రత్త పడని శవం మృత్యువునే కలిసొస్తుంది"

"ప్రతివాడూ భగవత్ప్రేమికుడు కాలేడు అలాంటి ప్రేమికులు వారి ప్రేమాగ్నిలో ఆహుతి అవుతారు వారి ఆధ్యాత్మిక ప్రగతియొక్క స్థాయి వారు తెలుసుకోలేరు. భగవంతునిలో ఐక్యం అయ్యే ఆలోచన వారికి రాదు. వారు ప్రేమ యొక్క బాధను తీయగా అనుభవిస్తారు అది యింకా యింకా కావాలంటారు ప్రియతమునితో వియోగంగురించి వారు ఆలోచించరు. అతనితో ఐక్యంగురించి అసలే ఆలోచించరు. వారు ఏ స్థితిలో ఉన్నారో అదే చాలునని ఊరుకుంటారు వారు యిలా ఊరుకున్నప్పుడు, వారి ఉదాసీనత పరాకాష్ఠనందినప్పుడు ప్రియతముడే వారితో ఐక్యత కోరతాడు. హాఫిజ్ పెర్షియన్ భాషలో అంటాడు—

'ఫిరాఖ్ - ఓ వసల్ చెఖాహీ,
రజా – ఎ – దుస్త్ తలాబ్

"వేరే ఉండడం, ఐక్యంగా ఉండడం, వీటితో నీకు
పనిలేదు – ప్రియతముని ఇచ్ఛకు కేవలం లోబడి ఉండాలని చూడు."

పూనానుంచి పింపలగామ్‌కి జూలై (1949) 24 వ తేదీ సాయంకాలం తిరిగివచ్చి ఆ రోజున వెంటనే తమ కేబిన్‌కి వెళ్ళి ఏకాంతవాసం కొనసాగించారు. ఆగస్టు 1 వ తేదీ ఉదయం 7 గంటలతో యీ ఏకాంతవాసం ముగిసింది ఆరిషా మస్తుతో ప్రతిరోజున బాబా పని చేసారు మెహరాబాద్‌లోనే యీ ఏకాంతవాసం జూలై 31 వరకు గడిపారు బాబా జూలై 1 వ తేదీనుంచి బాబా అభిలాష ప్రకారం ప్రపంచంలోని బాబా భక్తులందరు పాక్షికంగా ఉపవాసం చేస్తూ మౌనం పాటించారు. ఈ ఏకాంతవాసం మండలం రోజులు మూడువైపుల గోడలున్న ఒక ఆరుబయట స్థలం మెహరాబాద్ లో ఎన్నుకున్నారు. ఆ ఆశ్రమంలో స్థలానికి నాల్గవ

వైపున పలకలు కట్టించేసారు ఈ ఆవరణలో ఒకవేపు చెట్టుక్రింద యింతకుముందు డిసెంబరు 1938 నుంచి జూన్ 1941 వరకు భారతదేశం అంతా తిరిగివచ్చిన సిటి బస్సు ఉంది. అది పాతదైపోయి యింక పని చెయ్యకపోతే ఆ బస్సు ఒక వేపచెట్టు క్రింద నీడలో నాలుగు కాళ్ళనూ డ్రమ్ముల మీద పెట్టి గట్టిగా ఇటుక సున్నంతో చెలలవంతా కట్టించేసారు. అందులో బాబా యిప్పుడు ఏకాంతంగా ఉంటున్నారు. ఈ 40 రోజులలోను చాలా దినాలు యిందులోను మరి కొద్దిరోజులు మాత్రం పూనా రోను గడిపారు బాబా.

1949 వ సంవత్సరములో దీర్ఘకాలం (జూన్ 22 వ తేదీ నుండి జూలై 31 వ తేదీవరకు 40 రోజులు) ఏకాంతవాసం చేసినపుడు బాబా ఈ క్రింది సందేశం యిచ్చారు

"ఎవరిని మునల్మానులు అల్లాఅని, జొరాస్త్రియనులు అహురామజ్ద్ అని, హిందువులు ఈశ్వరుడని పరమాత్మ అని, యింకా అనేకమంది యితరులు అనేక యితర పేర్లతో పిలుస్తారో ఆ భగవంతుడు, ప్రేమికులు ఎవరితో ఐక్యతను అహం కార నాశనంద్వారా కోరుకుంటున్నారో, ఎవరిని ద్రష్టలు ఒకటే సత్యంగా చూస్తు న్నారో, జ్ఞానులు ఎవరిని వారి నిజమైన ఆత్మగా తెలుసుకుంటున్నారో, ఈ పరమ చైతన్య స్వరూపుడు, ఈ చైతన్య పరమాత్ముడు, ఎవరు సంతతము అవతారుడుగా సద్గురువుగా మూపొందుతున్నాడో, ఆయన, ఆయనయొక్క కరుణామయమయిన చర్య ద్వారా మన మీద తన అనుగ్రహమును బరిపుగాక ! ఈ సంవత్సరాంతమునకు మన చిక్కులు విడదీయుగాక ! బాబా యీ సంవత్సరంలో పంపిన సర్క్యులర్ లేఖ ప్రకారం యీ సంవత్సరాంతమునకు అంతా పూర్తిచేసి వచ్చే సంవత్సరారంభంలో బాబాను మౌన విరమణ పలికేలా చేయుగాక !"

ఈ ఏకాంతవాసంలో అన్ని రోజులూ అన్నివేళలా తలుపులు మూసుకొని లోపలే కూర్చొనేవారు బాబా ? జూలై. 26 వ తేదీన (జూలై, 1949) బాబా బయటకు వచ్చి తమ ఆవరణలోకి 26 మందిని పేదవారిని పింపలగామ్‌కి బస్సులోకే రప్పించి వారి పాదాలు కడిగి వారికి ప్రణమిల్లి ఒక్కొక్కరికి పదేసి రూపాయలు దక్షిణాయిచ్చి పంపించారు ఈ 26 మందిని వెదకి తీసికొని రావడం మండలికి కష్టము అయింది.

[ 2 ]

ఎందుకంటే వారు మామూలు బిచ్చగాళ్ళు కాదు వివిధ కులాలకు చెందిన దీన సంసారులు – బ్రాహ్మణులు, పార్శీలు, ముస్లిములు వగైరా వారిని వెదకి తీసుకు రావడం కొంత శ్రమతో కూడుకొన్న పనే. పైగా బాబాచేత కాళ్ళు కడిగించు కోవడమా ? ఈ మహాపాపం మాకు వద్దు మీరు యిప్పించే డబ్బూ వద్దు అని రావ డానికి నిరాకరించారు కొంతమంది వీరిలో బిచ్చగాళ్ళు లేకపోయినా అంతా నిరు పేదలు.

కాళీ డ్రమ్ముల మీదను ఇటుకతోను సిమెంటుతోను బలపరచబడిన దిమ్మల మీద గట్టిగా నిలబెట్టబడిన సిరి బస్సులో బాబా ఏకాంతవాసం చేస్తున్నారు కదా. ఆ బస్సు ఒక వేపచెట్టుక్రింద ఉంది బస్సు టాపుమీద టపటప శబ్దం చేస్తూ వేప పళ్ళు తరుచుగా రాలుతున్నాయి అప్పుడు బాబా గంటవాయించి కావలికాస్తున్న కాకాను పిలిచి వేపచెట్టు ఎక్కి పళ్ళన్నీ కోయించేసారు ఏకాంతవాసంలో బాబాకి ఏ మాత్రం శబ్దం పనికిరాదు కానీ మొదటి రోజుల్లోను పర్యటనలు చేసేటప్పుడు ఆయన ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగా ఇతరలోకాలలో ఆధ్యాత్మికమయిన పని ఏదో చేయ సంకల్పించి నెత్తిమీద ఏదయినా వస్త్రాలుగాని కండువాగాని వేసుకుని మీపని మీరు చేసుకోండి, మీరు ఏం చేసుకున్నా నాకు శాంతిభంగం కాదులెండి అని మండలిలో చెప్పేవారు అప్పుడు మండలి మామూలుగా మాట్లాడుకున్నా ఏ శబ్దం అయినా ఆయనకి యిబ్బంది కలిగేదికాదు అంటే ఆయన చైతన్యం ఏ యితర లోకాలలో వెళ్ళిఉన్నమాట కానీ ఏకాంతవాసాలలో మాత్రం ఎంతమాత్రమూ శబ్దం అవకూడదు అందు నిమిత్తం బాబాకి ప్రియమైన శిష్యులు కాకాను కావలా ఉంచేవారు స్త్రీలు కూడా ప్రక్క ఆవరణలో ఉండి అప్రమత్తులై ఉండేవారు వేపచెట్టు ఎక్కించినపుడు ముందు స్త్రీలకు అభ్యంతరం లేదుకదా అని హెచ్చరిక చేయించారు బాబా వారి వద్దనుంచి మామూలు సమయాల్లో శబ్దం వస్తోందని బాబా అనేకసార్లు కబురు పంపించేవారు అలా కబురు రాగానే స్త్రీలు నడుస్తూంటే కూడా శబ్దం అవకుండా మునివ్రేళ్ళ మీద నడుస్తూండే వారు

అహమదునగర్ లోని బాబా శిష్యులందరిని పింపలగావ్ లో 1949 ఆగస్టు 1 వ తేదీన ఉదయం 7 గంటలకు సమావేశం కమ్మని బాబా ఆదేశించారు అందరూ హాలులో కూర్చున్నారు స్త్రీలు ఒక తెర వెనుక కూర్చున్నారు పురుషుల వైపున ఏమి చెప్పబడుతున్నదీ స్త్రీలకు వారు చూడలేకపోయినా వారికి వినబడుతుంది-

ఆ సమయంలో బాబా కఠినమైన ఆజ్ఞ ఒకటి శిష్యులందరికు జారీ చేసారు 1949 వ సం॥ అక్టోబరు 16 వ తేదీ నుండి ఎవ్వరూ కూడా బాబాకు గౌరవసూచకంగా నమస్కారం చేయరాదు ఎవరయినా దీనికి విరుద్ధంగా ఆయనకు వందనం చేస్తే బాబా తిరిగి వారికి ప్రణామం చేయవలసి వస్తుంది ఈ కాలమందు బాబా తరుచుగా చేతులు జోడించి కూర్చోవడం మామూలే ప్రతి మానవునిలో ఉన్న ఆ పరమాత్మకు జోహారు అన్నట్లుగా చేతులు జోడించి ఉంచుకునేవారు.

ప్రతిరోజూ మెహెరాజాదులో బాబా ఉదయం 6-30 గంటలకు తమ పడకను వదిలేవారు ఆ తరువాత 7 గంటలకు బాబా పురుష మండలి వద్దకు వెళ్ళారు అప్పుడు అక్కడ చదివే బాబా సందేశమును అందరూ వినాలి అన్ని భాషలలోను బాగా గట్టిగా చదివించేవారు తర్జుమాలన్నీ అయిన తరువాత అందరూ "ఆమెన్" అనిగాని "ఆమీన్" అనిగాని అనాలి. అలా అన్న తరువాత బాబా మాట్లాడరు పరమ మౌనంగా ఉండాలి అప్పుడు బాబా స్వహస్తాలతో ప్రసాదం పంచిపెడతారు ఈ విధంగా జరిగిన తరువాత బాబా అందరితోను టీ తీసుకునేవారు రస్కు (తీపి పిండి వంట) కూడా తినేవారు

ఆగస్టు (1949) 15 వ తేదీనుండి ప్రతిరోజూ సమావేశాలుంటాయని నూతన జీవితం గురించి చేయవలసిన మార్పులు ఏర్పాట్లూ చర్చించవలసి ఉంటుందని ఆగస్టు 20 వ తేదీ వరకు ఎవరూ బయటికి ఎక్కడికీ పోకూడదని బాబా చెప్పారు. సరోష్‌కి ప్రజలతో పనులు ఉంటాయి గనుక అతనికి మాత్రం అనుమతి యిచ్చారు బయటికి వెళ్ళడానికి 15 వ తేదీన సమావేశానికి రావడానికి అతనికి వీలులేకపోయింది. అందువల్ల అతను అడుగగా గైరుహాజరు కావడానికి బాబా అనుమతి యిచ్చారు ఈ రోజుల్లో జరిగిన సమావేశాల్లో బాబా ముఖ్యంగా వారి మండలిలోని ఫరమ్‌కి చెప్పారు—

"నీవు జలగలా నాకు అంటిపెట్టుకుని ఉండాలి. ఈ రోజుల్లో నేనుచెప్పేది ఏదీ వినకుండా పోకూడదు" ఈ సమావేశాల్లో జరిగిన విషయం ఫరమ్ షార్టుహ్యాండ్‌లో వ్రాసేవాడు బాబా చేస్తున్న అంతరికమయిన పని చాలా ఎక్కువ వత్తిడితో కూడినదై యుండెను మండలిలోని వారు ప్రతిరోజు అప్రమత్తులై బాబా చెప్పిన పనులు చేస్తున్నారు వారివల్ల ఏ కొంచెం లోపం కలిగినా వెంటనే బాబా

తెలుసుకునేవారు ఇప్పుడు బాబా మౌనం లోనుంచి ఏ ధ్వనీ వినిపించదు పూర్తిగా నిశ్శబ్దంగా ఉంటోంది మండలివారు చేసినపనులు మళ్ళీ యింకొకరు వేలు పెట్టక్కర్లేనంతా సమర్థవంతంగా చేస్తున్నారు బాబా వారితో యిలా చెప్పారు

"మీరు ఎంత పని చేస్తూ ఉన్నప్పటికీ ఎల్లవేళల యిక్కడ ఉండటం మాత్రం మానవద్దు తరువాత నేను మీకు అందుబాటులో ఉండను ఇలాంటి అవకాశం మీకు మళ్ళీ రాదు మీరు యింకా నాకు ఏపనీ చేయవలసిన అవసరం ఉండదు నేను చెప్పినదంతా శ్రద్ధతో విని అలా చేయండి తేలికగా తీసుకున్నవారిని. వారి వ్యక్తిగత వైఖరుల వలన అపార్థం చేసుకున్న వాళ్ళను దెపుడే రక్షించాలి వారికి చేప్పుడే సహాయం చేయాలి అని యీ విధంగా మండలిని హెచ్చరిస్తూ ఉండేవారు

మొదటి రోజు సమావేశానికి దిగువ మెహెరాబాద్ హాలులోనికి బాబా ఎనిమిదింపావుకి వచ్చారు బాబా రాగానే గుస్తాద్‌జీని, కైకోబాద్‌ని ఆలింగనం చేసుకున్నారు అప్పటికి యింకా రమ్మని చెప్పినవాళ్ళు కొందరు రాలేదు. రాకపోవడానికి తగిన కారణం ఉందని బాబా తృప్తి పడిన తరువాతే ఆరోజు సమావేశం సాగించడానికి బాబా ఒప్పుకున్నారు "మరునాటినుంచి ఉదయం 7 గంటలకే మీరంతారావాలి నేను రాకపోయినా సరే మీరు సరిగా సమయానికి రావాలి" అని బాబా చెప్పారు. బాబా గుజరాతీ లో అక్షరఫలకం మీద చెప్పారు అది ఆదీ చదువగా డాన్కిన్‌కి మిత్రులకి అర్థం కాకపోవచ్చునని ఇంగ్లీషులోను మరాఠీలోను బాబా తర్జుమా చేయించారు బాబా వారి మండలితో యిలా అన్నారు

"నేను చెప్పినదంతా సావధానంగా వినండి మనం యీ రోజుల్లో చర్చించుకున్నదంతా అందరికీ యథాతథంగా తెలియజేయాలి ఇతర ఏర్పాట్లు గురించి యీ రోజున మనం సాధారణంగా మాట్లాడుకుందాం నా గురించి మూడు అంశాలు నేను నిర్ణయం చేసుకున్నాను మీరంతా ఏం చేయాలంటే నేను నిర్ణయించుకున్న దానికి అనుగుణంగా మీరు ప్రవర్తించాలి. ఈ మూడు నిర్ణయాలు ఏమిటంటే—

(1) మొదట, నేను నిజంగా—ఆ మాటకి అర్థమేమిటో అలాగే, నాకు కలిగే ఏదో ఒక వినాశకరమయిన ఆపద వల్ల నేను పూర్తిగా నిస్సహాయుడనుగా ఉంటాను అది నాకు జరిగే ముందే మండలికోసం, మనవున్న పరిమితమయిన

ప్రోత్సాహంతో సాధ్యమయిన ఏర్పాట్లు చేయాలనుకుంటున్నాను ఎందువలనంటే అప్పుడు లౌకిక వ్యవహారాలు చూడటం నేను మానెయ్యవలసి వస్తుంది.

(2) రెండవది, యీ కొద్ది రోజులలోనూ నేను చేసే నిర్ణయాల ప్రకారం ఎవరయితే వారి స్వంత బాధ్యత మీద ఆచరించడానికి సిద్ధంగా ఉంటారో వారినే నా వద్ద నుండనిస్తాను నేను యితరులకు అందుబాటులో ఉండను.

(3) మెహెరాబాద్, పింపల్‌గావ్ ఆశ్రమాలు రెండింటినీ నేను ఎత్తేస్తున్నాను ఇవి అసలు లేకుండా చేస్తాను

నేను వేచియున్న సమయం దగ్గరకు రానే వచ్చిందని చెప్పడానికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను నేను ఎంతవరకు నిస్సహాయుడను అవుతానో ప్రపంచమంతా తెలుసుకుంటుంది నాతో ఎంతవరకు మండలి వస్తారో నాకు తెలుస్తుంది ”

మరియొకనాడు బాబా ఎవరికి తోచినది వారు మాట్లాడవచ్చును అని చెప్పగా ఆలీ అక్బర్ పెర్షియన్ భాషలో మొదలుపెట్టాడు అతడిని వెంటనే బాబా ఆపేసి “నీవు చెప్పదలచుకున్నది నీకు చేతనయినట్లుగా హిందూస్తానీలో చెప్పు. ఎందువలనంటే ప్రతిమొక్కరు యిక్కడికి వచ్చినా రాకపోయినా, నేను యిక్కడ చెప్పినవన్నీ తెలుసుకోవాలని కోరుతున్నారు” అన్నారు.

మరియొకరోజున పాపా (ఎరచ్ యొక్క తండ్రి) ఏదో తన స్వంత సంసారవ్యవహారాలు బాబాతో రహస్యంగా మాట్లాడదామనుకున్నాడు. అతడు బాబాకి ఒక ఉత్తరం వ్రాసి తెచ్చాడు అందరు ఆశ్చర్యపోయారు బాబా ఆ ఉత్తరం అందరికీ వినబడేలా గట్టిగా చదివించి యిక్కడ రహస్యాలు పనికిరావు అన్నారుబాబా.

బాబా ఎవరయినా సలహా అడిగితే “మీరు అమ్మగలిగినవన్నీ అమ్మేసెయ్యండి ఈ సమావేశాలలో నిర్ణయించింది మీరు స్వయంగా తెలుసుకొని ఆ ప్రకారం అన్ని ఏర్పాట్లు చేయండి నాతో ఉండగలరో లేదో మీరు నిర్ణయించుకోండి ఆధ్యాత్మిక లాభాలు నాతో ఉన్నందువల్ల ఏవీ ఉండవు నేను ఆధ్యాత్మికంగా సంపూర్ణుడనయితే ఆధ్యాత్మికంలోనుంచి ఎవరూ వదలబడరు ”

బాబా వారితో వచ్చేవారి గురించి ఎంత శ్రద్ధ తీసుకుంటున్నారో రానివారిని గురించి, వారికి భౌతికావసరాలు యివ్వడం కోసం, వారిపోషణ నిమిత్తం అంతే శ్రద్ధా తీసుకుంటున్నారు ఈ విధంగా మండలితో వరుసగా కొన్నిరోజులు సమావేశాలు జరిపారు పురుషులతో దిగువ మెహెరాబాద్‌లోను, స్త్రీలతో కొండమీదను చర్చలు జరిపారు.

బాబామీద ఆధారపడినవారి పోషణకు ఏర్పాటు చేయడానికి బాబా యొక్క ఆస్తులన్నీ అమ్మమని చెప్పేసారు "నావద్ద వేరే ఒక పనికోసం ఉంచిన డబ్బు తప్ప యింకేదీలేదు ఈ ఆశ్రమ భవనాలు, భోగాలు, ఇళ్ళు, అహమ్మద్‌నగర్, ఆరంగాబ్, పింపల్‌గావ్‌లలో ఉన్నవన్నీ, కుర్చీలు, బల్లలు, మంచాలు వగైరా అన్నీ, కార్లు, పశువులు, యితరసామానులు నావని ఉన్నవన్నీ అమ్మివేయవలసినదే నా ఆస్తి అంటూ ఏదీ నా పేరుతో ఉండకూడదు మెహెరాబాద్ కొండమీద నా శరీరం నిక్షిప్తం చేయడానికి కట్టిన నా సమాధి తప్ప" అప్పుడు బాబా అలా చెప్పగా అబ్దుల్‌గనీ యీ క్రింది ప్రార్ధన చేసాడు

"ఓ దైవమా! బాబా ఆయన శరీరాన్ని త్వరలో వదిలేయకుండా ఉంచు గాక!" ఉన్నవారంతా "ఆమెన్" అన్నారు బాబా మరల చెప్పడం ప్రారంభించారు

"నా ఆస్తులన్నీ అమ్మగా వచ్చిన సొమ్ము నా మీద ఆధారపడేలా నేను చేసినవారి పోషణ నిమిత్తం యివ్వడానికి యింకా వాగ్దానాలు చేసిన మొత్తాలు యివ్వడానికి ఉపయోగించాలి నాకు, నాతో వచ్చేవారికి ఏమీ అక్కరలేదు నాతోరానివారికి ఏర్పాటు చేసే నిమిత్తం ఆ డబ్బు అవసరం ఉంటుంది నామీద ఆధారపడినవారిని అకస్మాత్తుగా దిక్కులేనివాళ్ళనిగా ఏమి వాళ్ళకి తిండికి యివ్వకుండా వదిలెయ్యలేను ఆధ్యాత్మిక విషయం యొక్క ప్రశ్నలేదు ఆ విషయం నేను సంపూర్ణుడను అవునా కాదా అన్నప్రశ్నమీద ఆధారపడి ఉంటుంది ఇప్పుడు మనం ముందు వంద రూపాయలు ఖర్చుపెట్టడానికి మన చేతిలో ఒక్కరూపాయే ఉంది మీ సలహాలు వగైరా చెప్పడంలో నిజాయితీతో ఉండండి ఎవరు ఏమనుకుంటారో అనిగాని వేరు కారణాలవల్లగానీ మీ అభిప్రాయాలు మీరు చెప్పదలుచుకున్నవి మానకండి "బాబా! మీ యిష్టం" అని మాత్రం అనకండి అనేకమందికి సంబంధించిన నిర్ణయాలు తీసుకోవడానికి మనం కొద్దిమందిమే యిక్కడ సమావేశమైనాము స్త్రీ మండలి

కూడా తీసేస్తాను అవీ ఉండవు మనం నిర్ణయించుకున్నది స్త్రీలు కూడా ఆ ప్రకారం ఆచరించాలి ఈ నిర్ణయాలు నాతో ఏదో విధంగా సంబంధం ఉన్నవారందరికీ వర్తిస్తాయి. ఈ పదిరోజుల్లోను చేయవలసిన నిర్ణయాలు చేసెయ్యాలి ఇంతవరకు నా అలవాట్లు వగైరాలవల్ల నా ఎంత ఘోరంపిల్ల మీరు అపార్థం చేసుకొని తప్పుదారి పట్టకండి అక్టోబరు నెలలో మెహెరాజాద్ ఆశ్రమం తీసేస్తున్నాను. అయినా అక్కడ కొన్నివోల్ల దీపాలు ఏర్పాటు చెయ్యమని పాద్రీతో చెప్పాను కొత్తదాంట్లో ప్రవేశించే వరకు పాతది సాంప్రదాయానుసారంగా అన్నీ యథావిధిగా ఉంచడం అలవాటు అది నా పద్ధతి తీసేసేదానికి యీ దీపాల అలంకరణ కూడా ఎందుకు అనుకోవచ్చు మీరు అన్నీ సక్రమంగా ఆఖరివరకు ఉండాలని నా ఊహ ఇప్పుడింక నా అలవాట్లని వాటి కూడా అంతం చేస్తాను అన్నిటినుండి అందరినుండి నేను స్వేచ్ఛగా ఉంటాను నేనింకా చాలా కఠినంగా ఉంటాను ఖాతరు లేకుండా ఉంటాను పైరా లేకుండా ఉంటాను వంగేసే ఖుదాకీ తర్హా హై ఈ నామెత ఏమిటంటే నగ్నంగా అంటే ఏమీలేని దిగంబరుడుగా ఉన్నవాడిక చెప్పులు కూడా బరువౌతాయి అని

అమ్మవలసినవన్నీ అక్టోబరు 15 నాటికి అమ్మెయ్యడం అయిపోవాలి. బాబా మండలి పేర వ్రాసిన మరణశాసనం కూడా రద్దు చేసేస్తానన్నారు అది 1940లో వ్రాసారు మండలివారు వ్రాసిన విల్లులు కూడా బాబా తీసి ఒక్కొక్కటే చింపేసి ముక్కలుచేసి ఎవరి విల్లు ముక్కలు వారికి జ్ఞాపకార్థం దాచుకోమని యిచ్చారు

మెహెర్ పబ్లికేషన్స్ అనే ఫండ్ కూడా రద్దు చేశారు అదికూడా వ్యాపారం ఎత్తేశారు ఆ పుస్తకాలన్నీ ఆయా గ్రంథకర్తలకే యిచ్చేసారు

నరోష్, మెహెర్ జీ, నారిమన్లు బాబా చేసిన నిర్ణయాలు విని కొంచెం గాభరా పడ్డారు నరోష్ పురుష, స్త్రీ మండలులంతో అందరిని పోషించే భారం వహి కుంటానని బాబాతో చెప్పాడు బాబాకి వచ్చిన చిరునవ్వునిబట్టి మాస్తే నరోష్ అన్న మాటకి బాబా చాలాతృప్తిగా సంతోషించారని అనుకోవచ్చు. కాని ఆయన నరోష్తో యిలా అన్నారు-

“నీవు అసలు సంగతి అర్థం చేసుకోలేదు ఉత్తలమ్మగా ఇచ్చిన డబ్బు నాతో రానివారికోసం కేటాయించాను కదా అది మరచి పోతున్నావు నాతో అక్టోబరు 15 తరువాత ఉండేవారి కోసం ఏ ఏర్పాటు చేయలేదు నేనూ చాల్ని

బాధలు పడతాము. ఏ రక్షణా లేకుండా మేము ప్రారంభం చేస్తాం మేం బిచ్చ మెత్తుకోవలసిందే ''

ఆగస్టు 17వ తేదీన ఉదయం సమావేశమయినపుడు పురుషమండలికి మూడు చెప్పి వాటిలో వారి యిష్ట ప్రకారము ఏదో ఒకటి అంగీకరించి తతిమ్మా రెండు విసర్జించమని చెప్పారు. అవి యేమనగా—

(1) నేను పెట్టిన షరతుల ప్రకారం చేయగలిగినవారు వాటిని అంగీకరించిన వారు నాతో వస్తారు

(2) నాతో రాలేనివారు వారి బ్రతుకుతెరువు వారే చూసుకోవాలి. వారు సంపాదించిన డబ్బులో నుంచి యివ్వగలిగితే పొదుపు చేసిన మొత్తాన్ని నామీద ఆధారపడి ఉన్న కుటుంబాలని పోషించడానికి యిస్తూ నేను యిదివరకే వారికి యిచ్చిన ఆజ్ఞలను గాని నేను యికముందు యివ్వబోవు ఆజ్ఞలను గాని వారు పాటించాలి

(3) నాతో రానూలేక యితరుల పోషణకు యివ్వనూలేక నా ఆజ్ఞలను పాటించలేని వారు వారి యిష్ట ప్రకారం ఎక్కడికయినా పోవచ్చు

ఇంక ముందుకి వెళ్ళి చర్చించేముందు బాబా అబ్దుల్ గనీని యీ క్రింది ప్రార్థన చేయమన్నారు.

'దేవుడు మందరికి మంచి బుద్ధిని ప్రసాదించుగాక వారికి నిండయిన విచక్షణా జ్ఞానాన్ని దేవుడు కలుగజేయు గాక '' అప్పుడు బాబా వారు చెప్పిన సూత్రాలకి దృష్టాంతాలు చెప్పారు—

''రంజా నాతో రాకపోయినా, అహమదునగర్‌లో ఉండిపోయినా అతనికి అప్పచెప్పిన పనులు చేస్తూనే ఉంటాడు నా ఆజ్ఞలను పాటిస్తూ ఉంటాడు అందువేత అతనికి యిప్పుడు నాతోఉన్న ఆధ్యాత్మిక సంబంధం అలాగే ఉంటుంది. అలాగే పాద్రీ నాతో రాలేకపోతే అతన్ని నేను ఏదయినా ఉద్యోగం చూసుకోమని చెప్తాను. ఆ జీవితంలో నుండి తాను పోషించుకుని మిగిలినది ఆ కుటుంబాలకి యిస్తాడు పాద్రీ నా ఆజ్ఞల ప్రకారం నెరవేర్చితే నాతో అతనికి ఉన్న ఆధ్యాత్మిక సంబంధం యీ

రోజున ఉన్నట్లే ఉంటుంది బైరమ్ నాతో వస్తే సరేసరి. లేకపోతే క్రైస్తవ చర్చిలలో అతడు పని చేయవలసి ఉంటుంది

స్త్రీలకు అలాగే నాలుగింటిలో ఒకటి అంగీకరించమని మిగిలినవి విసర్జించమని బాబా చెప్పారు ఆ నాలుగు ఏమిటంటే — (1) ఏ స్త్రీ అయినా ఆమె కుటుంబంలో ఎవరయినా ఆమెకు ఆర్థికంగా సహాయకారిగా ఉంటే ఆమె యిప్పటిలాగా కొండమీద ఆశ్రమంలో ఉంటూ ఉండవచ్చు. కాని ఆమెకు ఏవరయినా సాయం కావలిస్తే దిగువ మెహెరాబాద్ పురుషమండలి ఎవరూ ఉండరు.

(2) వారి జీవనం కోసం వారు పని చేయవచ్చును. వారు యివ్వగలిగిన మొత్తం బాబామీద యింతవరకు ఆధారపడిన కుటుంబాల సహాయానికి యివ్వాలి.

(3) వారు తమ యిష్టం వచ్చినదారి తొక్కవచ్చును ఇంక వారికీ బాబాకీ ఏ సంబంధమూ ఉండదు.

(4) వారుఅంతా బాబాకే వదలిపెట్టి ఆయనచెప్పినట్లు తు॥చ॥ తప్పకుండా చేస్తూ ఆయన వారికోసం ఏమి నిర్ణయం చేసినా అది పూర్తి విశ్వాసంతో అంగీకరించాలి.

పురుషుల కిచ్చిన వాటికి స్త్రీలకిచ్చిన వాటికి ఉన్న తేడా గురించిచెప్తూ బాబా స్త్రీలకోసం బాబాయే నిశ్చయంచేసే అవకాశం బాబా తీసుకున్నారు. పురుషులు అలాకాదు. వారే నిశ్చయం చేసుకోవాలి బాబా అన్నారు —"ఎలాగయినా ప్రతి వ్యక్తీ, పురుషుడు గాని, స్త్రీ గాని, నా సమక్షంలో వారి వారి నిర్ణయాలకి వారే స్వంతంగా బాధ్యులని దేవుని యెదుట ప్రమాణం తీసుకోవాలి ఆ నిర్ణయం వారు తీసుకున్నాసరే నా ద్వారా తీసుకున్నా సరే"

స్త్రీలతో జరిగిన సమావేశం గురించి యింకా చెప్తూ బాబా క్రైకోబాద్ బైరమ్ ల కుటుంబాల గురించి మాట్లాడారు –

"నేను క్రైకోబాద్ కుటుంబసభ్యులతో మాట్లాడినపుడు ముందు క్రైకోబాద్ ని అడిగి తెలుసుకోమన్నాను ప్రతి యొక్కరు అప్పుడు వారు నాకు చెంపుతామని నేను

ఏమి చెప్తే అది చేస్తామని నాతో చెప్పారు. అలాగే బైబుల్ కుటుంబ సభ్యులను వారిని అడగాలా బైబుల్ని అడగాలా అని నేను అనగా వారి భవిష్యత్తులో బైబుల్కి సంబంధం లేదని వారు బాబా ఏమిచెప్తే అది చెయ్యడానికి సిద్ధంగా ఉన్నామని నాకు చెప్పారు ''

అగస్టు 16 వ తేదీన జరిగిన సమావేశపు సంగతులు మాట్లాడుతూ బాబా యిలా చెప్పారు –

"నాలుగు అంశాలూ జాగ్రత్తగా ఆలోచిస్తే ప్రతియొక్కరు నేను ఏది చెప్తే అది ఆచరిస్తామని నాలుగో అంశం సమర్థించారు వారు యీ మాట ఎంత వరకు నిజాయితీతో చెప్పారో అని వారి యొక్క నిజాయితీకి చిహ్నంగా ఒక్కొక్కరినే వచ్చి నా చేతిని ముద్దు పెట్టుకోమన్నాను. దాని తరువాత ఆ ముద్దు జూడాస్ పెట్టిన ముద్దు (ద్రోహ చింతనతో కూడినది) కాకూడదని, అది వారి విధేయతకి చిహ్నంగా ఉండాలని నేను హెచ్చరించాను."

బాబా చేస్తూ ఉన్న దైవ ప్రార్థనలు, బాబా యెదుట ప్రతి మనిషి తన బాధ్యతను ఒప్పుకోవలసి ఉండడము అగస్టు 18 వ తారీకుకి ఒక కొలిక్కి తీసుకు వచ్చారు బాబా. ఆరోజున బాబా ఉదయం 6-50 నిమిషాలకే సమావేశానికి వచ్చారు. రాగానే మొదట బాబా డాన్కిన్ని, ఖాక్సాహెబ్ని, కైకోబాద్ని, కాలేమామాని, వారి బైబిల్, ఖురాన్, అవెస్తా, గీతలతో సిద్ధంగా ఉండమని స్నానం చేసిన తరువాత వారు వాటిని తీసుకురావాలని బాబా చెప్పారు ఈ నలుగురిని బాబా మండలి ముల్లాలని అంటారు కొంతసేపు బాబా మెహెర్జీతోను నారిమన్తోనూ మాట్లాడాక నలుగురు ముల్లాలని పిలిచి బాబాకి కుడివైపున వరుసగా నిలబడమన్నారు. మొట్ట మొదట కైకోబాద్ని "కస్తీ" (పార్సీలు చేసే ఒక ప్రార్థన) చేయమన్నారు. తరువాత అయిదు నిమిషాలు మామూలు ప్రార్థన అందరికి వినిపించేలాగ చదవమన్నారు. తరువాత డాన్కిన్ను పిలువగా అతడు బైబిల్ లో నుంచి సెయింట్ మాథ్యూ సువార్త నుంచి క్రీస్తుయొక్క సిలువవేత గురించి చదివాడు తరువాత ఖాక్సాహెబ్ ని పిలిచి నమాజ్ చదవమని బాబా చెప్పగా అతడు నిశ్శబ్దంగా నమాజ్ చేసాడు. తరువాత నిశ్శబ్దంగానే రెండు రకాత్లు చేసాడు కాలేమామాను ఆఖరున పిలిచి భగవద్గీత చదవమనగా పదవ అధ్యాయంలో ఏడుశ్లోకాలు అతడు చదివాడు. ఈ

ప్రార్థనలు చేస్తుండగా చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం ఉంది హాలులో ప్రతి ప్రార్థనా అయిన తరువాత ఆ గ్రంథం తీసుకుని బాబా తమ ఒడిలో పెట్టుకున్నారు వాటిమీద బాబా తమ చేతివ్రేళ్ళను ఉంచారు. ఆఖరు ప్రార్థన కూడా అవగానే బాబా తమ ఒడిలోని పుస్తకాలన్నీ గీతతో సహితంగా ప్రక్కనున్న బల్లమీద బాబా స్వయంగా పెట్టారు. ప్రస్తుతం బాబాకి వ్యాఖ్యాత అయిన గనీని ఆ ప్రార్థనా గ్రంథాలను రెండు చేతులతోనూ మూసి ఉంచమని బాబా గనీచేత యీ ప్రార్థన చెప్పించారు—

దేవుడు బాబాకి అన్నీ త్యాగం చేసి వెళ్ళిపోయేలాగ సహాయం చేయుగాక ! అక్టోబరు 16 వ తేదీనుంచి ఆయన నూతన జీవితంలో ప్రవేశిస్తే యింక మళ్ళీ వెనక్కి రావడం అనేది ఉండకుండా ఉండుగాక !''

దేవుని సహాయం కోరుతూ బాబా ఎప్పుడూ ఇదివరకు ప్రార్థన చేయలేదు. ఇప్పుడిలా ప్రార్థన చేయగా మండలివారు కలవరపడిపోయారు వారికేమీ తోచక చివరన 'ఆమెన్' అనికూడా అనలేకపోయారు

అవసరాన్ని బట్టి పరిస్థితులను బట్టి బాబా తమ మండలిని చీవాట్లువేస్తూంటారు వారిని పొగిడి ఆకాశంమీదకి ఎత్తేస్తుంటారు. ఆగస్టు 18 వ తేదీనాడు ఆలీ అక్బర్‌ను అతని భక్తికి అతని సేవలకి మెచ్చి ప్రశంసించారు బాబా. ఆ ప్రశంసకు అతడు దానితో పరవశం చెందినట్లున్నాడు చాలా కాలం నుంచి ఆలీఅక్బర్‌కి తెలుసును బాబా ఎవరినీ వారి పాదాలు స్పృశించనివ్వరని. ఆలీఅక్బర్ బాబా కుర్చీవద్దనే కూర్చున్నాడు ఆ సమయంలో. ఎవరూ చూడకుండా ఆలీఅక్బర్ తన చేతిని జాపి బాబా పాదాలమీద ఉంచాడు వెంటనే వాతావరణం అంతా గంభీరంగా మారిపోయింది మిగిలిన మండలి అంతా నోటమాట లేకుండా అయిపోయారు. ఆలీ అక్బర్‌ని యిందుకోసం బాలా కోపపడతారనుకున్నారు కాని బాబా నెమ్మదిగా ఆలీ అక్బర్‌ను లేచి నిలబడమన్నారు. కదలవద్దని అతనిని హెచ్చరించాడు అప్పుడు బాబా అకస్మాత్తుగా తమ కుర్చీలోంచి లేచి ఆలీఅక్బర్ పాదాలు తాకడానికి క్రిందికి వంగారు ఎలా జరిగిందో తెలియదు కాని వెంటనే పెద్దగా ఎవరో అరిచారు. ఆలీఅక్బర్ ఒక గంతు వేసాడు. హాలులో రాతినేల మీద ఆలీఅక్బర్ పడిపోకుండా చాలామంది చేతులు అడ్డంపెట్టి అతనిని పట్టుకున్నారు ఆ గెంతడంలో బాబా చేతికి ఏదో దెబ్బ తగిలి

నట్లుగా ఉంది. ఆయన తన చేతిని పట్టుకున్నారు ఆలీఅక్బర్‌కికూడా దెబ్బతగిలి ఉంటుంది కాని దాని సంగతి బాబా ఏమీ పట్టించుకోక చెప్పినట్లు అక్షరాలా చెయ్యాలని అతనికి చెప్పారు చెప్పి ఆలీఅక్బర్ పాదాలు బాబా స్పృశించారు ఆలీఅక్బర్ పడిపోయినప్పుడు అతని బరువంతా బాబా కుడిచేతి వ్రేళ్ళమీద మోపడంచేత ఆచేతి వ్రేళ్ళకి దెబ్బతగిలింది. అందుచేత కట్టుకట్టించి మెడలో ఒక గుడ్డకట్టి అందులో బాబా కుడిచేతిని వేసుకున్నారు డాన్‌కిన్ నీలూలు అప్పటికప్పుడు బాబా చేతికి కట్టు కట్టారు. ఈ విధంగా 10 రోజులు బాబా తమ చేతిని మెడలో గుడ్డలో పెట్టుకోవలసి వచ్చింది. రాత్రిళ్ళు బాబాకి ఆ వ్రేళ్ళు చాలా నొప్పి పెట్టి బాధించేవి.

ఒక వారం తరువాత కూడా బాబా వ్రాసిన మరణశాసనం రద్దుచేయిద్దామని నాసిక్ జిల్లా రిజిస్ట్రారు వద్దకు కాగితం వ్రాసిపెడితే దానిమీద బాబా సంతకం పెట్టడానికి వ్రేళ్ళు కూడదీసుకుని కలం పట్టుకోవడం చాలాకష్టమయింది ఆ ఒక సంతకం చేయడానికి ముందు వేళ్ళతో కలం పట్టుకుని వ్రాయగలనో లేదో అని ఏదో కాగితం మీద ఏవో గీతలు గీసారు. ఆ 18 వ తేదీనాడు గందరగోళం అయి పరిస్థితి శాంతించిన తరువాత బాబా ఆలీఅక్బర్‌ని క్షమించానని యింక యీ సంఘటన గురించి మనసులో బాధపడవద్దని చెప్పారు అప్పుడు అందరితోటి బాబా యిలా చెప్పారు

“నా ఆజ్ఞలను పాలించడం అన్నిటికంటె ముఖ్యమయినది నేను మీ వాళ్ళమీద పడడానికి ఏమీ ప్రాముఖ్యత లేదు షరతులన్నీ మీరు పూర్తిగా పాలిస్తే తప్ప నాతో రావడానికి మీకు ఎలా సాధ్యమవుతుంది ? ఏమో ఆ షరతులలో ఒకటి మీరందరు తెల్లవారి లేవగానే నా ముఖం మీద ఉమ్మివేయవలసి వస్తుందేమో లేక ప్రతి ఉదయం మీ పాదాలకి నేను ప్రణమిల్లుతానేమో !”

ఆలీఅక్బర్ వైపు చూస్తూ బాబా “అలా అయితే నీవు ఆ షరతులు అంగీకరిస్తావా ?” అని అడిగారు ఆలీ “అది ముక్కలయిపోవడం వంటిదే” అన్నాడు బాబా - “అదికాదు. ఆ షరతులన్నీ తు - చ తప్పకుండా పాటించాలి” అని అకస్మాత్తుగా ఆలీఅక్బర్‌ని బాబా తమ చెప్పులను మెలిపెట్టమన్నారు. ఆలీఅక్బర్ చిరునవ్వుతో వెంటనే బాబా ఆజ్ఞ పాటించాడు బాబా చిరునవ్వుతో “ నా చెప్పులు మెలి పెట్టమని ఆలీఅక్బర్‌నే అన్నాను ఇంకెవరినీ కాదు. మీలో ఎవరికయినా పాతకోపం తీర్చుకునేందుకు వచ్చినా చెప్పులు మెలిపెడితే నాకేం అభ్యంతరం లేదు. నాకు కోపం

వస్తుందని అనుకోకండి '' ఆ మాటలు విని అందరూ నవ్వులబడి నవ్వారు. బాబా యింకా యిలా అన్నారు – "నా చెప్పులు మోసివెయ్యడం సులభమే, కాని నేను చెప్పినట్లు నా ఆజ్ఞలు పాలించడం కష్టం ''

"బాబాతో వెళ్ళవలసినవారు చనిపోయినవారితో సమం అని అనుకోవాలి. మరణించిన వారికి భౌతిక సంబంధం ఏమీ ఉండదుకదా. చనిపోయినవారు ఏ ప్రశ్నలూ వేయరు. వారికి సందేహాలే ఉండవు వారు ఏదీ కావాలని కోరరు అందుచేత ఎవరు నాతో వచ్చి చనిపోయినట్లు అయిపోతారో చూస్తాను '' అన్నారు బాబా.

మండలి వారి హృదయపూర్వక సహకారం కావాలని బాబా అన్నారు. అనేక నిర్ణయాలు చేసి వాటిమీద వారి అభిప్రాయాలు చెప్పమన్నారు వారికి ఉన్న స్వంత యిష్టాయిష్టాలు మరిచిపోయి వారు సమాధానాలు చెప్పాలనీ అవి సందిగ్ధంగా ఉండరాదని బాబా వారితో చెప్పారు. "మస్తు ప్రయాణాలలో కష్టాలుపడ్డాం కదా అలాటివే ఉంటాయి అనుకోకండి ఉద్వేగాలను అణచుకోవడం యిప్పుడొక పెద్దపని అవుతుంది. తక్షణ విధేయత చూపవలసి వస్తుంది ఏది చెయ్యమన్నా ఏది చేయ వద్దన్నా వెంటనే ఆ ప్రకారం ఆచరించాలి. మీకు కోపాలు, యిష్టాయిష్టాలు కలుగ వచ్చు కాని నేను చెప్పేది ఆ భావాలకు మీరు పరోక్షంగా గాని అపరోక్షంగా కాని వ్యక్తం చేయకూడదని. నేను అన్నివిధాలా స్వేచ్ఛగా ఉంటాను. మీరు అన్నివిధాలా బంధించబడి ఉంటారు. మీలో ఒకడినిగా మీ సోదరుడిగా నేను నివసిస్తాను. కాని అన్ని సమయాల్లోను, అన్ని పరిస్థితులలోను నన్ను మీరు మీ యజమానిగా భావించాలి. ఏ పరిస్థితులలోను నాకు గౌరవం కలిగేలా నాకు సన్మానం జరిగేలా మాత్రం చూడ కండి అలాటిదే గనుక జరిగితే వెంటనే ఎవరయితే నాకు గౌరవం చూపిస్తారో ఎవరయితే వందనం చేస్తారో వారి పాదాలమీద నేను పడడం తథ్యం. ఎవరి ఆరోగ్యాలు ఎలా ఉన్నా నేను ఏమీజాగ్రత్త తీసుకోలేను. నాతో చివరివరకు ఉన్నవారు నా చేత పూజింపబడటానికి అర్హులవుతారు అందుచేత నాతో మండలివారు ఎంత మంది ఎక్కువగా వస్తే అంత సంతోషిస్తాను కాని నేను వివరించిన కష్టాలు పరిస్థితులు దృష్టిలో ఉంచుకుని 500 మంది వస్తానంటే చివరికి అయిదుగురయినా మిగులుతారా అని నేను సందేహిస్తున్నాను'' అన్నారు బాబా

ఆగస్టు 21 వ తేదీనాడు బాబా చెప్పిన అంశాలను బట్టి గనీ సహాయం చేయగా డాన్‌కిన్ షరతులయొక్క ముసాయిదా వ్రాసాడు- కాని యిది చదివేముందు బాబా యీ క్రింది ప్రార్థనను గనీకి చెప్పి వ్రాయించి ఆరోజు ఉదయం 10 30 గం॥లకు లతనిచేత చదివించారు

"షరతులలో ఉన్న ప్రతిదానికి చివరివరకు పాటించేలాగ దేవుడు బాబాకు బలం సంతోషంతో యిచ్చుగాక !" తరువాత మళ్ళీ కొంత చర్చచేసి షరతులకు వేరే అర్థాలు రాకుండా ఉండేందుకు ఆ ముసాయిదా లో కొద్దిగా మార్పులు చేయించారు బాబా. ఆగస్టు 13 వ తేదీనాటికి యీ షరతులు చివరి రూపం దాలుస్తాయి- "నేను తీసుకున్న నిర్ణయాలకి తిరుగుండదు. మెహెరాబాద్ కి గాని పింపలగామ్ కి గాని నేను తిరిగిరాను ఆ రోజున మల్లా సభ్యుల ద్వారా తీసుకున్న ప్రమాణాలవల్ల అది తిరుగులేనిదయింది. నేను పవిత్ర మత గ్రంథాలమీద వేసిన చేతి వ్రేళ్ళకు నాకు దెబ్బలు తగిలినందుకు నేను సంతోషిస్తున్నాను దీనినిబట్టి నా మండలికి కనువిప్పు కాగలదు, నాతో వచ్చినవారికి బాధలే మిగులుతాయని." నీలూ "అదంతా చాలా సుల భంగానే ఉంటుంది" అన్నాడు అప్పుడు బాబా — "అసలు కష్టమన్న మాటే లేదు రేపు మధ్యాహ్నం 2 గంటలకి చెయ్యమని రంజూకి అప్పగించిన పని జరుగక పోతే మాత్రం కష్టం కలుగుతుంది." అన్నారు.

నూతన జీవితము. దాని షరతులు బాగా తెలుసుకోవలసిన మీరే యిలా ప్రశ్నలడగడం నాకు ఆశ్చర్యంగా ఉంది నూతన జీవితం మీరింకా బాగా అర్థం చేసుకోలేదన్నమాట నాకు ఎవరు అన్నా ఏ బాధ్యతా లేదు మహరాజ్ తన వద్దనుంచి నా వద్దకు బదిలీ చేసాడని గుస్తాద్ జీ యెడలే నేను బాధ్యత వహించడం లేదు అయితే అదిగుస్తాద్ జీ నాకు విధేయుడుగా ఉండడం మీద ఆధారపడి ఉంది అలా లేకపోతే అతనిని కూడా పంపించేస్తాను.

"ఈ చేతితో నేను చేయవలసినది మీరు ఊహించుకోవడం మంచిది నేను చెప్పేకంటే. తరువాత రెండవ చేతికి ఏ పక్షవాతమో వచ్చి పడిపోతే అప్పుడు నేను ఒరేరకంగా నిస్సహాయుడనై పోతాను అప్పుడు నాతో ఉండేవాళ్ళకి ఉపవాసాలే శరణ్యం అవుతాయి నేను మీరు తెచ్చిన ఆహారం నా వద్దకు తెచ్చియిస్తే నేను పంపితే అప్పుడు మీరు తినాలని గదా షరతుల్లో ఉంది "

మొదట అహమద్‌నగర్‌లోనూ బయటా ఉన్న మండలి సభ్యులందరికీ యీ షరతుల నకళ్ళు పంపుదామనుకున్నారు ఇంకా బాబాతో సంబంధం ఉన్న అందరికీ కూడా పంపాలని చూసారు తరువాత 25 ఏళ్ళకి తక్కువ 60 ఏళ్ళకి ఎక్కువ వయసు ఉన్నవాళ్ళు నూతన జీవితానికి పనికిరారని బాబా తీర్మానించారు రోజులుపోనుపోను బాబాతో ఉండవలసినమండలి ఎవరో నిర్ణయించేందుకు వ్యవధితగ్గిపోతోంది ఈ షరతులు బాబా ఎన్నుకుని చెప్పినవారికే పోస్టులో పంపించమని అన్నారు. ఇదివరలో ప్రాణాలు పోయినానరే బాబా చెప్పినట్లు చేస్తామని సంతకం పెట్టినవాళ్ళ జాబితా బాబా పరిశీలించి చూసారు. ఆ జాబితాలో 1200 మంది ఉంటే 32 పేర్లే బాబా ఎన్నుకుని వారికే పంపించమని చెప్పారు ఆగస్టు 25 నుంచి రోజంతా బాబా కొండమీదే స్త్రీలతో ఉండడం ప్రారంభించారు. ఆ రోజున మధ్యాహ్నం 3 గంటలకి దిగువ మెహెరాబాద్ నుంచి కొందరు శిష్యులను బాబా కొండమీదకి రమ్మని కబురుచేసారు. వారు వచ్చిన తరువాత బాబా వారికి యిలా చెప్పారు.

"స్త్రీలకు నేను నాలుగు తరహాలుగాచెప్పి ఏదో ఒకటి వారిని అంగీకరించి మిగిలిన మూడు విసర్జించమని చెప్పానన్న సంగతి మీకు తెలుసుకదా. ఆ ప్రకారం స్త్రీలంతా వారికోసం నన్నే నిశ్చయించమని కోరారు- పురుషులకి అలాకాదు. వారి సంగతి వారే నిర్ణయించుకోవాలి వారిని గురించి యీ వేళ ఒక నిర్ణయం చేసాను. మొదట్లో క్రిందగాని మీదగాని మండలి ఎవరూ ఉండరనే నిశ్చయం చేసుకున్నాం. ఈ నిర్ణయం ఏమిటో వినిపించుదాం అని మిమ్మల్ని కొండమీదకి పిలిచాను మండలిలో కొందరు ఎవరయినా దిగువ మెహెరాబాద్‌లో ఒక సంవత్సరంపాటు ఉండవచ్చునని తీర్మానించాను. కొందరు శాశ్వతంగానే అక్కడ ఉండవచ్చు అలాగే నేను స్త్రీలకి నిర్ణయాలు తీసుకున్న ప్రకారం కొందరు స్త్రీలు కొండమీద శాశ్వతంగానే ఉంటారు. నిర్ణయం తీసుకోవడం నేనే అయినా స్త్రీలని వారి ఉద్దేశాలేమిటో అని కనుక్కున్నాను ఈ నిర్ణయాల ప్రకారం కైకోబాద్ కుటుంబం, మన్సారీ, కొండమీదే ఉంటారు వాళ్ళు అయిదుగురున్నారు ఆ అయిదుగురు కొన్ని షరతులకు లోబడి కొండమీద ఉండవచ్చును.

(1) నన్ను మళ్ళీ యీ కొండమీద చూస్తారని గాని కొండమీద నేను ఉండడానికి మళ్ళీ వస్తానని గాని నన్ను మళ్ళీ మీరు కలుస్తారనిగాని ఆశించవద్దు

(2) కొండమీదనివాసానికి ఏర్పాటుచేసిన మామూలు షరతులకి లోబడిఉండాలి

షరతులన్నీ ఒకమారు చెప్పించి బాబా ఆ అయిదుగురినీ బాగా అర్థం చేసుకున్నామని బాబా వారిచేత అనిపించారు కైకోబాద్, మన్సారీ వాటన్నిటికీ ఒప్పుకున్నారు ఈ నిర్ణయం స్త్రీల తరపున బాబా చేసినప్పటికీ వారంతట వారే నిర్ణయాలు తీసుకున్నట్లు వారి స్వంత బాధ్యతమీదే నిర్ణయం తీసుకున్నట్లు అన్నమాట ఇందులో స్త్రీ మండలి అందరితోపాటు మెహెరాకూడా ఉంది. ప్రతి యొక్కరు దేవుని యెదుట వారి స్వంత బాధ్యతలను అంగీకరిస్తూ చెప్పారు బాబా సమక్షంలో మన్సారీ ఆప్రమాణం తీసుకుంది. బాబాతో అక్టోబరు 16 వ తేదీన వెళ్ళవలసిన వారు నలుగురే అని బాబా స్పష్టం చేసారు. పాతికమంది అన్ని షరతులు అంగీకరించారు. గాని తుదకు బాబా వారితో 4 గురినే (స్త్రీలను) తీసుకువెళ్తారు. మిగిలిన వారిని బాబా కొన్నిసమూహాలుగా ఏర్పరచి వారికి ఏవో నిర్ణయాలు చేసి పెట్టారు "స్త్రీలకి ఒక్కొక్కరి నిర్ణయం వ్రాతమూలకంగా యిస్తారు. బాబాతో భౌతికంగా విడిగా ఉన్నా మేము బాబాయొక్క నూతన జీవితంలో పాల్గొంటున్నాము ఆయన చెప్పినట్లు మేము జీవిస్తున్నాముగనుక. ఏ వస్తువులూ కొనము డబ్బు కలిగి ఉండము. క్రొత్తవస్తువు ఎవరయినా యిస్తే అంగీకరించము సినిమాలకి వెళ్ళము. ఎవరెవరు 'ఎవరితో ఉండాలో వారి దగ్గర నుంచి ఉండడానికి నివాసం, తినడానికి తిండి అలాంటి అవసరాలు మాత్రం అంగీకరిస్తాము బాబాతో వెళ్ళవలసిన వారు గాక మిగతావారు బాబాను మళ్ళీ చూస్తామనే ఆశ నూటికి నూరుపాళ్ళు వదలుకుంటాము. ఈ విధంగా నిరాశ కలిగిఉండి బాబా చెప్పినట్లు చేయడంద్వారా నూతన జీవితంలో మాకు పాలు (భాగం) ఉందన్నమాట" అని స్త్రీలు అర్థం చేసుకున్నట్టు బాబా వారిచేత చెప్పించారు

"చిక్కంతా ఆశ పెట్టుకోవడంలోనె ఉంది ఆశ పెట్టుకోకపోతే ఆశాభంగాలు కలగవు అక్టోబరు 15 వ తేదీ తరువాత మనలో ఎవరికయినా ఏదయినా జబ్బుచేసినా ప్రమాదం కలిగినా యింక అది నా బాధ్యత కాదు. ఏం జరిగినా ఎవరికి వారే బాధ్యులు ఇది మనం హృదయపూర్వకంగా అంగీకరిస్తే దేవుని యెదుట యీ బాధ్యత అంగీకరిస్తున్నట్టు ప్రమాణం తీసుకోవాలి." బాబా అప్పుడు ప్రతి యొక్కరిని ఆమె చేతులు కాళ్ళు ముఖము కడుక్కొని నిర్గుణుడయిన దేవునిముందు యీ ప్రమాణం తీసుకోవడానికి లోపలికి రమ్మన్నారు. ఆ ప్రకారం అందరూ వచ్చి ప్రమాణం తీసుకున్నారు. ఇదంతా గంభీరమయిన వ్యవహారం అనీ యిది నవ్వులాటకాదని, యిది గంభీరంగా తీసుకుంటూ యింకా నవ్వగలిగితే అది మరీ మంచిదని అన్నారు. బాబా

స్వయంగా 31 వ తేదీన ప్రమాణం తీసుకుంటారు. తరువాత మండలి ఒకరొకరే ప్రమాణాలు స్వీకరిస్తారు ఖరీదయిన నగలన్నీ స్త్రీలు యిచ్చేసి అమ్మేయ్యమన్నపుడు అవి చూసి నిబ్బరంగా ఉండడం కష్టమే అయింది మండలికి బొంబాయిలో స్త్రీలు కొందరు భక్తులు వారంతటవారు రు 10,000/- నగదు పోగుచేసి బాబాకి యిచ్చారు, యీ నూతన జీవితం గురించి విని కొందరు బాబాకి వారి సర్వస్వం ధారపోసారు. ఈ వార్తవిని బాబా వారి త్యాగాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయారు ఒకామె యిన్ని సంవత్సరాలుగా ఆమె పొదుపుచేసిన యావత్తు ధనము ఆవిడకున్న మొత్తం ఆస్తి అంతాయిచ్చి అది సొమ్ము చేసుకోమంది ఇంకొకామె కూటికి గుడ్డకి కరువుగా బ్రతుకుతోంది. ఆమె ఎలా యిచ్చిందో, రు 400/- బాబాకి యిచ్చింది ఈ కబురు అందుకున్నపుడు ఆమె ఉదంతం తెలుసుకొని బాబాకి కలిగిన సంతోషానికి హద్దులేదు. ఆమెను మనసారా దీవించారు బాబా. అమూల్యమయిన యీ దీవనలు పొందిన ఆమెదే భాగ్యము.

ఆగస్టు 31 వ తేదీన ఉదయం 8 గంటలకి అందరిని దిగువ మెహెరాబాద్ హాలులోకి రమ్మన్నారు బాబా స్నానం చేసి మంచి బట్టలు వేసుకొని అందరూ పరిశుభ్రంగా రావాలి అన్నారు హాలుకూడా తెల్లవారుతుండగా శుభ్రంగా కడిగించారు. 8 గంటలకి ముందు ఎవరూ హాలు లోపల ప్రవేశించకూడదని అన్నారు. బాబా అనుమతి తీసుకొని వచ్చేవారికి ప్రత్యేకస్థలం ఏర్పాటు చేసారు బొంబాయి ధోండ్మార్గం మీద ప్రయాణం చేసి సరిగ్గా సమయానికి ఆఫ్సేరీ వచ్చాడు రైలు మెహెరాబాద్ మీదుగానే వెళ్తుంది గనుక అతడు రైలులో కనిపించగానే సమయానికి అందుకోలేడని అతన్ని రైలుస్టేషన్నుంచి తీసుకు రావడానికి బాబా కారు పంపించారు అందుచేత సమయానికి రాగలిగాడు. ఎవరినీ 8 గంటల తరువాత హాలులోనికి ప్రవేశించనివ్వ వద్దని బాబా కఠినంగా శాసించారు అలాగే ఒక్క నిమిషం ఆలస్యంగా వచ్చిన వెహ్రం (బాబా తమ్ముడు) బయట ఉండిపోవలసి వచ్చింది. బాబా గడియారం 8 కొడుతూంటే లోపలికి ప్రవేశించారు. మండలి వారిని తరువాత ప్రవేశించమని బాబా ఆదేశించారు.

బాబా కూర్చునే కుర్చీకి ఎదురుగా ఉన్న చపరను బాబా కొంతసేపు నిలబెట్టి ఉన్నారు పాద్రీని బాబా హాలులోంచి అటుయిటు నడవమన్నారు. "నాకు ఎదురుగా

ఒక పిల్లి వచ్చినాసరే గాని ఏ మనిషి నా యెదురుగా రాకూడదు బాబాకు యిదివరలో యిచ్చిన 1200 మంది జాబితాలో యిప్పుడు వచ్చినవారు బాబాచేత ఎన్నుకోబడినవారని బాబా జ్ఞాపకం చేసారు నలుగురు మండలిని పిలిచి బాబాపైకి వినిపించేలా అవెస్తా, బైబిల్, ఖురాన్, భగవద్గీత నుండి ప్రార్థనలు చదివించారు మొదట బాబాని, మండలిని అందరినీ క్షమించమనికోరుతూ దేవుని ప్రార్థించారు తరువాత పవిత్రగ్రంథాల నుండి చదివించాక ఖాక్‌సాహెబ్ ఖిరాత్ వేశాడు—అనగా ఖురాన్ నుండి శ్రావ్యంగా చదివాడు బాబా అదివిని అన్నారు—"ఇలాంటి శ్రావ్యమైన ప్రార్థన విని దేవుడు, ప్రభావితుడు కాకపోతే ఆ దేవుడు చెవిటివాడేనా అవాలి లేక చచ్చిపోయి అయినా ఉండాలి" అన్నారు బాబా దీనితరువాత యింక కర్మకాండ అన్నమాట ఉండదు- ఇదే ఆఖరిది అందరికీ కొన్ని నిమిషాల విరామం యిచ్చి తరువాత సమావేశం ప్రారంభించారు ఇక్కడ యింతవరకు చేసిన ఏర్పాటు లేమిటో రంజానీ అందరికి తెలియజెప్పమన్నారు

ఏమీలేకుండా నూతన జీవితం ప్రారంభించడం గురించి రంజూ చెప్పాడు. తరువాత ఇంగ్లీషులో నూతన జీవితం షరతులన్నీ వివరించమని డాన్‌ని అడిగారు. ప్రమాణాలు తీసుకున్న తరువాత అందరికి షరతుల నకళ్ళు పంచిపెడతారని బాబా చెప్పారు అది అందుకుని ప్రతివారు షరతులు బాగా చదివి అర్థం చేసుకోవాలన్నారు బాబా. నాలుగు గంటలలో వారి నిర్ణయాలేమిటో 'అవును' 'కాదు' అని యీ రెండు మాటలలో ఏదో ఒకటి వ్రాసి ఆ షరతుల కాగితం తిరిగి యివ్వాలన్నారు ఇంగ్లీషు బాగా తెలియనివారికి మరాఠీతర్జుమా సిద్ధంగా ఉంచారు. బాబాలేచి గోడ వైపుకి తిరిగి (వీపుమండలివైపు పెట్టి) నిలబడ్డారు ఆయన యెదుట పవిత్ర గ్రంథాలున్నాయి ఆ రోజున చేసిన నిర్ణయాలు తిరుగులేనివని అవి అన్ని కాలాలకు నిలబడి ఉంటాయని బాబా అన్నారు. ఎవరయితే వీటిని నూటికి నూరుపాళ్ళు గంభీరంగా తీసుకోరో దాని ఫలితంవారు అనుభవించవలసి వస్తుందన్నారు అందరిని అన్ని షరతులు పాటిస్తామని ప్రమాణాలు తీసుకోమన్నారు ఎవరెవరు ఏయే ఏర్పాట్లు చేయాలో జాబితా వ్రాసి సిద్ధంగా ఉంచుకున్నారు

మండలిని భోజనం చేసి రమ్మన్నారు బాబా వారి జవాబులు చేరేవరకు ఆయన భోజనం చేయనని చెప్పారు రెండు గంటల కాలంలో అందరూ వారివారి

నిర్ణయాలు బాబాకి యిచ్చేసారు. అందులో కొన్ని వచ్చినవారందరికీ, నాదాకి కూడా ఆశ్చర్యాన్ని గొలిపాయి.

ఏదో పొరపాటైన కాల్‌కేరావాలాకి షరతుల కాగితం యివ్వడం జరిగింది. అతడు ఏర్పాటుదార్లలో ఒకడు. అతడు 'అప్రసు' అని ఆ కాగితం మీద సంతకం పెట్టి యిచ్చాడు. బాబా తరువాత అతని 'అప్రసు' పత్రాన్ని అంగీకరించి కేరావాలా గురించి ప్రత్యేకంగా ఆయనతో అతడు రానక్కరలేదని ఆజ్ఞ జారీచేసారు. అతడు ప్రస్తుతం చేసేపనులే చేస్తూ ఉండాలన్నారు. పాద్రీ 'కాదు' అని వ్రాసినదానికి బాబా ఆశ్చర్యం ప్రకటించారు. "పాద్రీ నాతో వస్తే బాగుండును. అతడు రానన్నందుకు నాకు విచారంగానే ఉంది. మెహెరాబాద్‌కి నాలుగు స్తంభాలయిన వారిలో మిగిలిన మూడు స్తంభాలు (విష్ణు, పెండు, ఆదీ (సీనియర్)) పడిపోయినా ఒకటయినా బాగా ఉంటుంది," అన్నారు బాబా. కాదు అని వ్రాసిన వారిలో గడేకర్ ఒకడు. దేశ్‌ముఖ్ ఒకడు ఉన్నాడు. బాబా "దేవుడు ఎప్పుడూ గడేకర్‌ని నా హృదయంలో ఉంచుగాక "దేశ్‌ముఖ్ నాకు ఎప్పుడూ దగ్గరగాను ప్రియంగానూ ఉంటాడు". అన్నారు. వచ్చిన వారందరూ మూడు విధాలుగా విభజింపబడ్డారు "అప్రసు గాళ్ళు" "కాదు - గాళ్ళు" "ఏర్పాటుదార్లు". కాదుగాళ్ళకి బాబా వాళ్ళు యిప్పుడేమిచేస్తున్నారో అదే కొనసాగించమని అన్నారు. ఒక్క మాణెక్ మెహతాకి 31-12-50 వరకు బాబా వ్యవధి యిచ్చి అతని ప్రస్తుత వ్యవహారాలన్నీ ముగించుకోమన్నారు. అతన్ని మెహెర్‌జిప్ మండల్ తీసేయమన్నారు. దాన్నిగురించి అతనిని అన్ని సంబంధాలు వదులుకోమన్నారు. తరువాత 1-1-51 వ తేదీని బాబాని చేరమన్నారు. అప్రసుగాళ్ళందరూ అక్టోబరు 1 నుంచి 5 వరకు మెహెరాబాద్‌లో ఉండాలన్నారు బాబా. ప్రస్తుతపు జీవితానికి స్వస్తిచెప్పి వారంతా బాబాతో బయలుదేరడానికి సిద్ధంగా ఉండాలన్నారు.

ఆగస్టు 31 వరకు బాబాని అడిగితే నేను ఎక్కడికి వెళ్తున్నానో నాకే తెలియదు అనేవారు. సెప్టెంబరు 1 వ తేదీనుంచి బాబా వారి భవిష్యత్ప్రథకం ఏమిటో నెమ్మది నెమ్మదిగా ఒకటొకటే చెప్పడం ప్రారంభించారు. రిషీకేశ్‌కి సమీపంలో ఎక్కడో ఒకచోట ఒక స్థలం కొనాలని ఏర్పాటు చేస్తున్నానన్నారు. నూతన జీవితంలో నిరాశ, నిస్సహాయతతో జీవించడానికి ఆ స్థలం వారి మకాంగా ఉంటుందన్నారు. ఎవరిపేరుతో కొంటే బాగుంటుందో న్యాయశాస్త్రం ప్రకారం ఆలోచించి చెప్పమన్నారు- ఢంజూని, ధాకేని ఎవరికి ఆ స్థలం బాబాకి గాని వారి శిష్యులకు

గాని ఎవరికీ రాకూడదని అన్నారు ఈ క్రొత్తస్థలం నవంబరు 1950 లో కాలి నడకను వెళ్ళి చేరాలని బాబా అన్నారు బాబా ఉత్తర దేశానికి బయలుదేరే ముందు అప్పుడుగాళ్ళందరితోను బాబా అక్టోబరు 16 ని కాలినడకను బయలుదేరుతానన్నారు. ఔరంగాబాద్ వేపు వెళ్ళి మొదటి $2\frac{1}{2}$ మాసాలు ఖుల్దాబాద్‌లోనో పైఠన్‌లోనో, ఉంటామన్నారు ఖుల్దాబాద్ షిర్డిసాయిబాబా తన ఆధ్యాత్మిక జీవితం ప్రారంభించిన ఊరు అని బాబా చెప్పారు తరువాత కొన్ని ఆవరణకు సంబంధించిన కారణాల వలన ఘోద్‌నది వరకు నడిచి వెళ్ళాలని అనుకున్నారు అక్కడనుంచి బస్సులో బెల్గామ్ వెళ్ళాలని బాబా అనుకుంటున్నారు బెల్గామ్‌లో ఒక స్థలంలో ఉన్న యిల్లు ఉంది. అక్కడ స్త్రీలు ఉండగలరు ఆ స్థలం పురుషులందరు ఆరు బయట నివసించ డానికి చాలునన్నారు. అందులో ఒక మంచినీళ్ళ బావికూడా ఉంది బెల్గామ్‌లో ఉండగానే భావి జీవితంలో భిక్షాటన చేయడానికి అలవాటవుతుంది సేవాజీవితము, నిస్సహాయ జీవితము కూడా అలవాటు అవుతుంది నాలుగు చక్రాలసవారీ బండి ఒకటి తయారుచేసి డిసెంబరు 15 నాటికి యివ్వాలన్నారు అది రెండెద్దులు లాగడానికి వీలుగా ఉండాలి. బాబాతో ఉండే స్త్రీలకోసం అది అవసరం అన్నారు ఉత్తరదిక్కుగా నడిచి వెళ్ళడానికి అది కావాలన్నారు విష్ణు-నీలు పూనా నుంచి బెల్గామ్‌కి వెళ్ళే రోడ్డుమీద బెల్గామ్ పట్నంలో ప్రవేశించే చోట ఉదయం 5 మొదలు అర్ధరాత్రి వరకు డిసెంబరు 15 వ తేదీన వేచియుండాలని బాబా అన్నారు "కారవాన్" బండితో వచ్చేవారు డిసెంబరు 15 వ తేదీనగాని అంతకుముందు గాని వచ్చి ఉండాలని బాబా వచ్చేవరకు అక్కడవేచి ఉండాలని చెప్పారు

బాబా వారితో వచ్చేవారిని యిప్పటినుంచి షరతులకి అనుగుణంగా నడచు కోవాలని చెప్పారు. "నేను మీకు చేతనైన సహాయం చేదామని ప్రయత్నం చేస్తు న్నాను అప్పుడు మీలో అందరు చివరివరకు నాకు అంటిపెట్టుకుని ఉండాలి" అన్నారు.

"శిష్యులు నన్ను విడిచిపెట్టేలా చేయాలని నేను ఏ ప్రయత్నము చేయనని" బాబా చెప్పారు. నేను అలా ఎందుకు చేయాలి అయితే నేను డాన్‌కిన్‌ని పశ్చిమదేశా లకి వెళ్ళి నాకోసం ఒక ప్రత్యేకమయిన పనిని చేయమని చెప్పేవాడను. అతడు సంతోషంతో చేసేవాడు. నాతో వచ్చినవారి గురించి నాకే బాధ్యత లేదని నేను చెప్పినా వారు చివరివరకు నన్ను వదలకుండా ఉండాలని చెప్తూంటాను. వారికి సహాయంకోసం

బెల్గామ్‌లో ఉన్నప్పుడు 2½ మాసాలు వారికి శిక్షణ యివ్వాలని నేను అనుకుంటు న్నాను ఆ శిక్షణ నూతన జీవితంలో చివరిది సంపూర్ణత్వానికి దారితీస్తుంది. కాకాతో కొంత డబ్బు ఉంచాను. అది అతడెవరికోసమూ ఖర్చు పెట్టడు. మూగజీవులు కొన్ని, ఆవులు వగైరా, మాతో ఉంటాయి గనుక వాటి మేతకి ఖర్చుపెట్టవలసి వస్తుంది కారవాన్ బండికి అవసరమయిన మరమ్మత్తులు చెయ్యవలసి వస్తుంది.

ఇలా ముఖ్యమయిన విషయాలు ఆలోచిస్తూ ఉన్నా బాబా మండలితో ఆడిలాడుతూ ఉండేవారు లింగోర్చు అనే ఆట ఆడేవారు, సమావేశాలకి మధ్యమధ్య కొంతవాటికి మనసుకి ఆహ్లాదం కలగాలని మండలి బాబా చెప్పినట్లు నవ్వుతూ ఉంటు న్నారని బాబా దేవునికి ధన్యవాదాలు చేసారు. "మనం యింతా నవ్వగలుగు తున్నాము" అన్నారు బాబా

ఈ చర్చలకు ఫలితంగా బాబా తమ యావదాస్తిని యితరులకు వ్రాసి యిచ్చేసారు మెహెరాబాద్ ఆశ్రమం భవనాలతోసహా నారిమన్ దాదాచాన్‌జీ పేర వ్రాసారు ఇతడు మండలిలో ధనవంతుడైన ఒక సంపన్నగృహస్థుడు బాబాకు చాలా సన్నిహితుడు బాబా అతని భార్య అర్నవాజ్‌కి బాబా గృహంయొక్క వెండి తాళంచెవిని అందజేసారు మెహెరాబాద్ మెహెరాజాద్ ఆశ్రమాలు, భూములు, భవనాలు అన్నీ నారిమన్ మెహెర్‌జీలు కొంటామని అంగీకరించారు ఆ ఆశ్రమాల యొక్క పవిత్రతను మనసులో పెట్టుకుని బాబు యీ త్యాగం చేసారు ఎవరయినా కొనేవాళ్ళుంటే యివన్నీ వాళ్ళకి అమ్మెయ్యండి అని బాబా చెప్పగా నారిమన్ అన్నాడు మేము మళ్ళీ అమ్ముదామనుకుంటే మేము అసలు యిందులోకి దిగకనే పోదుము" బాబా అప్పుడు — "ఈ ఆస్తులు యింక మీవి నావికావు అవి మీరు ఉంచుకున్నాసరే అమ్ముకున్నాసరే నాకేం అభ్యంతరం లేదు." అన్నారు

అందరినీ ఎవరి పనిమీద వారిని వెళ్ళిపొమ్మని చెప్పి బాబా నోరీనాను ఎలిజబెత్‌ను మాత్రం తమ్మవద్దకు రమ్మని బాబా అమెరికా మిర్టిల్‌బీచ్ సెంటరుకు వచ్చేలోపుగా అక్కడ చేయవలసిన పని గురించి బాబా అమెరికాలో చేయబోయే పర్యటన గురించి వివరంగా వారికి చెప్పారు బాబా వారిని కౌగిలించుకుని బొంబాయికి వెళ్ళి అక్కడనుంచి న్యూయార్కుకి విమానం ఎక్కి వెళ్ళమని ఆ రోజునే వారిద్దరిని

ప్రయాణం చేయమని పంపించేశారు బాబా వద్ద త్వరలోనే పాశ్చాత్య దేశాలకు వస్తానని మాట తీసుకుని వారు బయలుదేరి బొంబాయి వెళ్ళారు.

ఎలిజబెత్ పాటర్సన్, నోరీనా మాటిచెల్లీ అమెరికా చేరుకున్నారు వారి ఫుమి బర్ట్రిల్ ఎచ్ సెంటరుపద్ద యూషన్ ఛ్యాన్స్‌లో స్థిరంగా నివసిస్తున్నారు వారి నివాసం సెంటరుకి 6 మైళ్ళ దూరం ఉంది బాబా వారిని అమెరికాకు పంపినది లగాయితు వారి ముఖ్యమైన పని మెహెర్ సెంటరులో నిర్మాణాలు పూర్తి చేయడం అన్ని విధాలా సెంటరుని అభివృద్ధి పరచడం, బాబా రావడానికి, వచ్చి అందులో ఉండడానికి సెంటరును తయారుచేయడం - ఈ పనులలోనే యిరువురు నిమగ్నమై ఉన్నారు.

దీర్ఘమైన ఏకాంతవాస ఉపవాసాలలో బాబా చాలా శ్రమపడి ఉంటారని మెహెర్జా, మనీ వారికి శ్రమ తెలియకుండా ఉండడంకోసం బాబాయొక్క వినోదం కోసం ఒక తోలు బొమ్మలాట ప్రదర్శనం సిద్ధం చేసాదు మణియే బొమ్మలు సంభాషణలు అన్నీ తయారుచేసింది ఇందులో సంగీతంకూడా అమర్చబడింది ఆగస్టు 1వ తేదీనాడు యీ ప్రదర్శనం జరిగింది బాబా అదిచూసి చాలా మెచ్చుకున్నారు. చాలా ఆనందించారు ఈ కార్యక్రమం చేదు తిన్నతరువాత తీపి నోట్లో వేసుకున్నట్లుందని బాబా అన్నారు అందరు మణిని మెహెర్జాని అభినందించారు

అక్టోబరు (1949) నుంచి నవ్యజీవితం ప్రారంభమవుతుందని అందుకు ముందు ఆశ్రమాలు అన్నీ ఎత్తేసి ఇండియాలో ఎక్కడా ఆస్తిలేకుండా అన్నీ అమ్మేసెయ్యాలని బాబా వద్ద ఉన్న శిష్యులలో చాలామందిని యితరస్థలాలకి ఉద్యోగాలు చూసుకోమని పంపించివేస్తానని చెప్పారు. బాబా మండలి ఎప్పుడూ మార్పులకు సిద్ధంగానే ఉంటారు తీపి ఎలా తినగలరో చేదు కూడా అలా మ్రింగడానికి వారు తయారుగా ఉంటారు నూతన జీవిత కఠిన నియమాలకు కట్టుబడి ఉన్నవారు చనిపోయిన వారివలె ఉండాలని అంటే ఏ కోరికలు, ఏ ఆశలు, ఏ రాగములు, ఏ మమతలు లేకుండా ఉండాలని రేపు అనే దినం ఎలా వెళ్తుందో అనే ఆలోచన లేకుండా అప్పటికి ఏ సరుకులూ నిలువలేకుండా చేసుకోవాలని బాబా చెప్పారు

ప్రతివారిని బాబా పిలిచి తాము (బాబా) ఏమి నిర్ణయించినా అది విధేయతతో ఆచరిస్తారా అని బాబా అడుగగా కొందరు వెంటనే అలాగే అన్నారు కొందరు కొంచెమాలోచించి సరే అన్నారు వాతావరణం గంభీరంగా ఉంది అందరూ సరే అని చెప్పగా బాబా చాలా సంతోషంగా ఉన్నారు కొందరు ఆరంగావ్‌లో యిదివరకే నివాసం ఉన్నారు బాబా మెహెరాబాద్ ఆశ్రమ్ - ఎగువ దిగువలకు - ఎత్తివేస్తానని చెప్పారు మెహెరాబాద్‌లో కిట్టీ, రానో, కేటీ, నూరా మాసీ, ఖోర్షెద్, మిన్నాసీ, జెర్మాయి ఆమె కుటుంబము, జలా. గూలూ, సుల్తాన్, దౌలత్ (బైదుల్ భార్య, కుమార్తె) ఉన్నారు మెహెరాజాద్ నుంచి మెహెరా, మణి, గోహెర్, మెహ్రా, నజా, వాలు వచ్చారు వీరందరు త్వరితగతిని సామానులు సర్దుకోవడం ప్రారంభించారు. 15 సంవత్సరాల నుంచి యింకా ఎక్కువ కాలం నుంచి ఉన్నవారు వారు ఉన్నస్థలం విడనాడి వెళ్ళిపోవాలి అవసరం లేనివన్నీ వదిలిపెట్టేశారు. ఏదీ కూడా విలువ ఉంచుకుందుకు వీలులేదు. కిట్టీదేవీ వద్ద ఉన్న చాలాపాటి పుస్తకాలు (బైండు చేయించిన మెహెర్ జర్నల్ పత్రిక సంపుటాలు) అదీకి యిచ్చేసింది. ఆమె బాబా ప్రవచనాల పుస్తకాలు మాత్రం బాబా తీసుకువెళ్ళడానికి ఉంచుకుంది. అలాగే అందరూ బల్లలు, కుర్చీలు, మంచాలు, అన్నీ అమ్మకానికి పెట్టేసారు. ఆడవారి ఆభరణాలు అన్నీ పైకి తీసి యిచ్చేసారు. మెహెరా మరి కొందరు ఖరీదయిన సిల్కు చీరెలు, వాటికి ఉన్న నగలు యిచ్చేసారు మంచాలు పరుపులు చీరువాలు అన్నీ లారీలో ఎక్కించేసారు. మెహెరాజాద్‌లో ఉన్న సామానులలో క్రొత్త రెఫ్రిజరేటరు ఉంది అది ఎలిజబెత్ ప్రత్యేకంగా అమెరికా నుంచి తెప్పించింది ఆమె బాబాకి యిచ్చినవి రెండు డిసోటో కార్లు, నారిమన్ బాబాకు బహూకరించిన చిన్నకారు యివికూడా అమ్మెయ్యాలన్నారు వారు నిజంగా నూతన జీవితానికి సిద్ధం అయ్యారు ఈ స్త్రీలలో మెహెరా, మణి, గోహర్, మెహ్రా బాబాతో కూడా వస్తారని బాబా చెప్పారు రానో, కిట్టీ, ఖోర్షెద్, నూనామాసి, బొంబాయిలో మెహెర్జీ యింటిలో ఉంటూ ఆ యింటిలో కావలసిన సహాయం చేస్తూ ఉండాలని బాబా అన్నారు కిట్టీ, రానో, ఉద్యోగాల కోసం ప్రయత్నం చెయ్యాలి. కేటీ, నజా కూడా బొంబాయిలో నారిమన్ యింటిలో ఉండాలి. కేటీ కూడా ఉద్యోగం వెతుక్కోవాలి బాబా కేటీతో తమాషాగా అన్నారు - ఏ చీనా జపాను వాడయినా నిన్ను లేవదీసుకుపోతాడేమో జాగ్రత్త అని తరువాత కేటీకి జపానీయ దౌత్య కార్యాలయంలో ఉద్యోగం అయింది. బాబా అన్నమాదిరో ఆయన జపానువాడని

మనసులో అనుకున్నారు. వీళ్ళు బాబా సైగలు అర్థం చేసుకోవడంలో జపానువాడు గాని చైనావాడుగాని అనడానికి చూపుడు వేలుతో బాబాముక్కు రెండువైపులా ముట్టితే అది జపానువాడికీ చైనావాడికీ కూడా వర్తిస్తుంది అందుకని అలా అనుకున్నారు రానో కిట్టీ నజాలకు నవ్యజీవితంలోనికి ఎప్పుడు బాబా రమ్మంటే అప్పుడు వచ్చి చేరడానికి సిద్ధంగా ఉండమన్నారు సొల్తాన్, దౌలత్, వాలు. వీరు ముగ్గురు పూనా వెళ్ళి అక్కడ గాయ్‌మాయి యింటిలో ఉండాలి జెర్మాయిని మాత్రం తన కుటుంబంతో మెహెరాబాద్‌లో ఉండవచ్చునని బాబా అనుమతి యిచ్చారు. అందువేత వారు ఆస్పత్రిభవనంలో నివాసం ఉన్నారు మన్సారీ (మణిదేశాయి) కూడా మెహెరాబాద్‌లో తన పిల్లలతో ఉండవచ్చునా అని అడిగింది. బాబా స్వంతంగా రోజూ ఉపయోగించని వన్నీ అమ్మకానికి పెట్టేయాలి టిన్‌షెడ్‌లోను సామానుగదిలోను ఉన్నవన్నీ పైకి తీసుకువచ్చారు. ఇత్తడి పాత్రలు, పళ్లాలు, కెటిళ్ళు, టీసెట్లు, గాజు సామాను, ప్లేట్లు వగైరా, తివాసీలు, జంకానాలు, ప్రాచ్య పాశ్చాత్య ప్రేమికులు యిచ్చిన బహుమతులు, యివన్నీ బయటపెట్టి బొంబాయికి తీసుకువెళ్ళడానికి లారీలో వేసారు అపురూపమయిన వస్తువులను చూసి కొందరు–"అయ్యో! ఇలాటివి మనకి మళ్ళీ దొరకవు" అని వాపోయారు. అవి మనం ఎలాగా ఉపయోగించము కదా అని మళ్ళీవారు సరిపెట్టుకున్నారు.

బాబాతో ఉండడానికి సిద్ధపడిన వారిని 'యస్‌వాలాలు' (అపుసుగాళ్ళు) అనేవారు. అట్టివారిని చచ్చిపోయిన వారిక్రింద లెక్కపెట్టవలసిందే అన్నారు బాబా. అంటే చచ్చిపోయిన వారికి—కోరికలు, రాగాలు, సందేహాలు, ప్రశ్నలు, రేపటిగతి ఎలాగ అనే ఆలోచనలు ఏమీ ఉండవుగా నవ్యజీవితంలో ఆ విధంగా వాళ్ళు అయిపోయినట్లే

ఎన్నో సంవత్సరాల నుంచి ఎన్నో వస్తువులు జాగ్రత్త చేసినవన్నీ అమ్మివేయడానికి బయట పెట్టేసారు అవసరమయినదేదీ అమ్మవద్దని బాబా చెప్పారు. జపాన్ నుంచి తెచ్చిన కొన్ని వస్తువులు, చైనాకోట్లు ఎన్నో విలువగల వస్తువులు ఉన్నాయి ప్రతిరోజూ బాబా కొండమీదికి వచ్చేవారు, స్త్రీ మండలితో కొంతసేపు గడపడానికి పెట్టెలలో పెట్టి సర్దే శ్రమ మరచిపోవడంకోసం పింగ్‌పాంగ్ మొదలయిన ఆటలు ఆడేవారు. బయలుదేరి వెళ్ళిపోయే రోజు దగ్గిర పడుతోంది. ముఖాలలో ఎక్కడా విచారం కనబడకూడదు అన్నీ వదిలేస్తున్నామని ఎవరూ విచారించ

కూడదు. కంట తడిపెట్టనేకూడదు నవ్వుతూ సంతోషంగా ఉండాలి. తమాషాలుచెప్తూ యితరులను నవ్విస్తూ ఉండాలని బాబా చెప్పారు —"ఎప్పుడూ అందరి ముఖాల మీద చిరునవ్వు తాండవమాడాలి" అన్నారు. స్త్రీలు చాలామట్టుకు సామానులు వదిలేసారని బాబా సంతోషించారు కిట్టీ మొదలైన పాశ్చాత్యులను యితరులను చాలామందిని బొంబాయిలో నర్సులుగాను, డాక్టర్లుగాను, టీచర్లుగాను, కార్యదర్శులుగాను ఉద్యోగాలు చూసుకొమ్మని, అవసరమయితే శిక్షణ పొంది తరువాత ఉద్యోగాలలో ప్రవేశించమని బాబా చెప్పారు బాబాతో వారు విడిపోతున్నా వారికి నూతన జీవిత నియమాలు పాటించడం ద్వారా బాబా జీవితంలో పాల్గొనే అవకాశం వారికి యిచ్చారు. డబ్బు ఉంచుకోక పోవడము కొత్త వస్తువులు కొనకపోవడము, సినిమాలకు వెళ్ళకుండా ఉండడము, ఆహరము మొదలైన అత్యవసర వస్తువులనే అంగీకరించడము, వగైరాలు ఎవరయితే బాబాతో ఉండేఅవకాశము లేకుండా వేరే ఉండవలసి వచ్చిందో వారు బాబాను తిరిగి చూడడానికి హృదయపూర్వకంగాను నిజాయితీతోను ఆశను వదులుకోవాలి. ఈ విధంగా నిరాశ కలిగి ఉన్నపుడే బాబా నవ్యజీవితం జీవిస్తూన్నట్లు అవుతుంది ఎప్పుడయితే ఆశ లేదో ఆ వ్యక్తికి ఆశాభంగం ఉండదు.

1949 ఆగస్టు 31 వ తేదీన పురుషమండలి వారందరినీ బాబా సమావేశ పరిచారు ఈ క్రొత్త నియమాలను పాటిస్తూ బాబాతో ఉండడమో లేక ఆయనను విడిచి పెట్టడమో ఏదో అందరిని జాగ్రత్తగా ఆలోచించి నిశ్చయించుకోమన్నారు బాబా. స్త్రీలకు మాత్రం నాలుగురకాల జీవితాలలో ఏదో కోరుకోమంటే బాబా ఎలా చెప్తే అలా చేయడానికి ఒప్పుకున్నారు అప్పుడు బాబా చెప్పినమాటలు యివి—ఇవి లేఖ మూలకంగా పురుషమండలికి యిచ్చారు బాబా—

"నేను ప్రతి యొక్క శిష్యుని, భక్తుని, అనుచరుని, యీ రోజువరకూ, తాను చేసిన తప్పిదములను, తన బలహీనతలను, తన అవిధేయతను అన్నిటిని క్షమించివేసాను. నాపట్ల నేను ఏదయినా తప్పు, అన్యాయము చేసిఉంటే, మీకెవరికయినా బాధ కలిగించి ఉంటే దానికి నన్ను నేనే క్షమించుకుంటున్నాను

"నేను యీ నవ్య జీవితం అంటే నూటికి నూరుపాళ్ళు చాలా గంభీరంగా శ్రద్ధతో తీసుకుంటున్నానన్న సంగతి మీరందరూ గ్రహించాలి గతంలో యిన్ని

సంవత్సరాల నుంచీ నా యెడల మీరు ప్రేమ విశ్వాసాలు కలిగి ఉన్నప్పటికీ, నా నుంచి మీరు ఏమీ పొందక పోయినా మీరందరు నాకోసం ప్రాణాలు కూడా ధారపోయడానికి సిద్ధంగా ఉన్నా, నా యెడల మీకు ఉన్న అతి పరిచయం వలన చనువువలన నేను చెప్పేది మీరు శ్రద్ధతో గంభీరంగా తీసుకోకపోవచ్చును. మీరు యీ తప్పుదారిలో పడే అవకాశం ఉంది.

"అందుచేత నేను యీ లేఖ మూలకంగా మాటకు మాటగా మీరు నిశ్చయించుకునే ముందు జాగ్రత్తగా చదువుకుని ఆలోచించుకోండి నేను చెప్పిన ఆజ్ఞలు నూటికి నూరుపాళ్ళు పాటించండి నా గురువుకు నేను చేయగలిగిన దానికంటె నా యెడల మీప్రేమ, మీ విశ్వాసము, మీ సేవ ఎక్కువుగా ఉన్నప్పటికినీ యీనూతన జీవిత నియమాలు మీరు చేసినదంతా పమ్ము చేయవచ్చు మీరు సంపూర్ణమయిన సత్యనాశి (అహంకార నిర్మూలనముతో నిరాశతో) గా జీవిస్తే తప్ప, అలా జీవించ డానికి తయారుగా ఉంటేతప్ప నాకు సంపూర్ణమయిన విధేయతతో ఉంటేతప్ప, మీరు వెనుకకు ఉండిపోయి నేను చెప్పినట్లు ఆచరించడం మంచిది నేను ఉన్నది ఉన్నట్లుగా నూతన జీవితంలోని సాధక బాధకాలన్నీ చెప్తున్నాను మీరు నన్ను అర్థం చేసుకో పడంలో గాని నేను మిమ్మల్ని అర్థం చేసుకోవడంలో గాని పొరపాట్లు ఉండవచ్చు అందుచేత యీ చెప్పేమాటలు జాగ్రత్తగా విని ఆ ప్రకారం ఆచరించాలి మీరు అన్నీ ఆలోచించుకుని మీకు మీరే నిశ్చయించుకోవాలి దేపుడు మీకు కావలసిన బలాన్నిమ్చుగాక.

"మీరు ఒకటి సరిగా తెలుసుకోండి నన్ను మీరు వదిలిపెట్టేవని, బలవంతంగా మీరు నన్ను వదిలెయ్యాలని నేను ఏపనీ చెయ్యను కొంతవరకు మీకు నేను మొదట్లో సహాయకారిగా కూడా ఉంటాను మీ నిశ్చయం ఆచరణలో పెట్టడానికి అది దోహదం చేస్తుంది. అది నూటికి నూరుపాళ్ళు మీ నిశ్చయం ప్రకారం జరిగించేలా చేస్తుంది కానీ ఆ నిశ్చయాన్ని సడలించేలా మాత్రం చేయదు నాతో వచ్చేవారికి అన్ని నిబంధనలూ నూటికి నూరుపాళ్ళు వర్తిస్తాయి నేను చేసిన వాగ్దానం ప్రకారం నేను ఆచరిస్తాను. ఈ రోజు లగాయతు అక్టోబరు 15 వ తేదీవరకు నేను మస్తుల తోను బీదవారితోను పనిచేస్తాను ఏకాంతవాసం ఉపవాసం కూడా చేస్తాను- ఇవి చేస్తూ నా పనులయొక్క వేగాన్ని యిదివరకు కంటే అధిగమిస్తాను దాని గురించి ఎవరూ ఏమీ వ్రాసి పెట్టనక్కరలేదు మండలి పనులు మాత్రం సెప్టెంబరు

7 వ తేదీతో అయిపోతాయి. ఈ మధ్యకాలంలో యీ నూతన జీవితం విషయంలో (మీ నిశ్చయం గురించి తప్ప) మీరు నన్నేది అయినా అడుగవచ్చును అక్టోబరు 15 వరకు యింతవరకు జీవించినట్లే నేను మామూలుగానే జీవితం గడుపుతాను:

బాబా నూతన జీవితం ప్రారంభించే ముందు పాశ్చాత్యులకు అక్టోబరు నెలలో యీ సందేశం పంపించారు_

"బాబా అనేక పనులతో కూడుకొనిన పాత జీవితం మానేసి కొద్దిమంది సహచరులతో సంపూర్ణత్యాగము కేవల నిస్సహాయతతో నిండిన నూతన జీవితం 1949 అక్టోబరు 16 వ తేదీతో ప్రారంభిస్తున్నారు బాబా యొక్కయు ఆయన సహచరుల యొక్కయు నూతన జీవితము వారు చేసే పనులు, వారు ఎక్కడ ఉంటు న్నది అందరికి తెలుస్తున్నప్పటికీ ఎవరూ బాబాని గాని ఆయనయొక్క సహచరులను గాని ఏ కారణం చేతనయినా చూడటానికి ప్రయత్నించకూడదు. బాబా ఎవరినీచూడరు బాబా ఆజ్ఞ ప్రకారం వారి సహచరులెవరూ యితరులను బాబాని చూడనివ్వరు-

1949 అక్టోబరు 15 వ తేదీన ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు బాబా మెహెరాబాద్‌లో ఉండి మరునాడు తమతో బయలుదేరవలసిన "అప్పునుగాళ్ళ"కి నూతన జీవితం గురించి చెప్పారు ఒక్కొక్కరు వారితో తీసుకువెళ్ళే సామాను పరిశీలించారు వారితో యీ విధంగా యీ ప్రయాణం సందర్భంలో చేయవలసిన పనుల గురించి చెప్పారు

(1) ప్రయాణం చేసేవారందరూ ఆ రోజు (15-10-49) సాయంత్రం 7 గంటలకే పడుకోవాలి

(2) అంతకుముందే సాయంకాలానికి వారి పెట్టెలు లారీలో ఎక్కించ డానికి యిచ్చెయ్యాలి.

(3) అందరూ తెల్లవారితే 16 వ తేదీ అనగా ఆ తెల్లవారుజామున 2 గంటలకే లేవాలి.

(4) అందరూ స్నానాలు ముగించుకుని ధరించిన దుస్తులపైన యింకొక జత దుస్తులు వేసుకోవాలి అవి బెల్గామ్ చేరగానే తీసేయాలి.

(5) తెల్లవారగట్ల 3 గంటలకు రొట్టె లేకుండా టీ తీసుకోవాలి.

(6) 4 గంటలకు మెహెరాబాద్ నుంచి కాలినడకను బయలుదేరాలి.

బాబా నలుగురు స్త్రీలతో పింపలగామ్ నుంచి బయలుదేరి తన ఆఫీసు నుంచి ఆదీ (సీ) ని తీసుకొని యీ బృందాన్ని అహమద్‌నగర్ రైల్వేస్టేషన్ వద్ద లెవెల్ క్రాసింగ్ గేటువద్ద కలుస్తారు. అక్కడనుంచి కాలినడకను అసలు ప్రయాణం ప్రారంభం అవుతుంది. బాబా స్త్రీలతో ముందు నడుస్తారు. ఒక ఫర్లాంగు దూరంలో వెనుక నుంచి మిగతాబృందం వస్తారు సామానులతో లారీ ముందుగా వెళ్ళాలి. లారీలో బైదుల్, కాకా, పెండు, సీలు వెళ్ళాలి.

నవ్యజీవితం ప్రారంభించేముందు బాబాకి ఆ జీవితంలో పాల్గొనే మండలికి విధించిన షరతులలో ఒకటి యీ ప్రకారంగా ఉంది—

"ఎవరూ కూడా ఏ విధమయిన వైఖరిని ముఖమందు ద్యోతకమయేలా ప్రదర్శించకూడదు" బాబా అన్నారు—

"ఇప్పుడు ఉద్వేగాలను భావాలను వశపరచుకొని అణుచుకోవడం చాలా అవసరం అది చాలా కష్టమయిన పనికూడాను. మీకు ఒక్కొక్కరికి అనేక విధాలయిన భావాలు కలుగవచ్చు- మంచివి, చెడ్డవికూడా, అనేకవిధాల అయిష్టతలు రావచ్చు అలాటివిరావని నేను అనుకోవడంలేదు. కాని నేను ఆశించేదేమిటంటే అలాటి భావాలు పరోక్షంగా కాని అపరోక్షంగా కాని మీరు వ్యక్తం చేయకూడదని," బాబా యింకా యిలా చెప్పారు

"దీనిమీద యీ షరతులకు లోబడి ఒప్పుకున్నట్లుగాని లేనట్లుగాని ఎవరికి వారు ఆలోచించి నిశ్చయించుకుని బాబాకు తెలపాలి. ఆ షరతుకు లోబడినవారే ఆయనతో నవ్యజీవితం ప్రారంభించడానికి అనుసరించాలి.

పాద్రీ బాబా మండలిలో ఒక ముఖ్యమయిన శిష్యుడు. ఇతడు మెహెరాంకు దగ్గర బంధువు కూడాను కాని అతడు కోపం వస్తే ఆపుకోలేడు అది వ్యక్తంచేసి తీరతాడు- అందుచేత అతడు నిజాయితీతో నేను నవ్యజీవితానికి రాను అని చెప్పాడు. మెహెరాబాద్‌లో విష్ణు, పెండు, ఆదీ (సీనియర్), పాద్రి వీరు నలుగురు నాలుగు

స్తంభాలవంటివారు. పాద్రీతప్ప కడమ ముగ్గురు బాబాతో వెళ్తున్నారు. ఆ ముగ్గురి లోను ఎవరికేమయినా నాలుగవవాడు క్షేమంగా ఉంటాడు. బాబా పాద్రిని చాలా ప్రేమిస్తారు. అందుచేత నిజాయితీతో కూడిన అతని నిర్ణయానికి బాబా సంతసించారు.'' అనేకమంది శిష్యులు బాదా శిక్షణలో వారివారి తరహాలను వైఖరులను మార్చుకొని ఎంతో నిగ్రహం సంపాదించారు.

## నవ్య జీవితం :—

అక్టోబరు 16 కి ముందే బొంబాయి పూనా నగరాలకి వెళ్ళవలసినవారు వెళ్ళిపోయారు పురుషులు పాద్రిలాగ ఒకరిద్దరు తప్ప అంతా బాబాతో వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు బాబా ఎక్కడికి వెళ్తే అక్కడికి ఆయనతో వెళ్ళాలనుకున్నారు. ఈ విధంగా నూతన జీవితం యొక్క తీవ్రనియమాంకు ఒప్పుకుని బాబాతో వెళ్ళడానికి నిశ్చయించుకుని బాబా చెప్పినట్లు చేయడానికి అంగీకరించిన వారు చాలామంది ఉన్నప్పటికి ఆ యెస్-వాలాలలో (అవునుగాళ్ళలో) 16 మందిని మాత్రమే తమతో తీసుకువెళ్ళడానికి బాబా ఎన్నుకున్నారు. వారు ఎవరెవరనగా—

(1) ఆదీ కె ఇరానీ (2) డా॥ విలియమ్ డాన్‌కిన్ (3) గుస్తాద్‌జీ ఎన్. హాంసోటియా (4) డా॥ నీలకంఠ్ నారాయణగోడ్సే (5) డా॥ అబ్దుల్‌గనీ మున్సిఫ్ (6) అస్పందియార్ రుస్తుం ఇరానీ (పెండు) (7) సదాశివ్ షెల్కే-(పటేల్) (8) విష్ణు ఎన్ దేవరుక్కర్ (9) మురళీ ఆర్ కాలే (10) అన్నాజక్కల్ (11) బాబా దాస్ ధర్మారె (12) దౌలత్‌సింగ్ (13) ఎ ఎస్. బారియా (కాకా) (14) ఆర్. బి బైదు లియాన్ (ఆగా బైదుల్) (15) ఆలి అక్‌బర్ షాపుర్‌జమాం (అలోబా) (16) ఎరచ్ జెహాంజీ జస్సావాలా.

వీరుగాక దౌలత్‌సింగును నూతన జీవితంలోకి తీసుకున్నారు. మిగిలిన వారు వెనక ఏగడి వారికి బాబా యిచ్చిన ఆజ్ఞలను నూటికి నూరుపాళ్ళు అనుసరిస్తూ ఉంటారు

'అవునుగాళ్ళు' అంటే నూతన జీవితంలో చేరినవారు మూడు రకాలుగా ఉన్నారు బాబాతో వెళ్ళినవారు, వెనుక ఉండిపోయిన వారు, ఏర్పాటుదార్లు బాబా చెప్పినట్లు వీరు కొందరు శిష్యరాండ్రకు సంరక్షకులుగా ఉంటున్నారు. ఆ బాధ్యత

వారు బాబా ఆదేశం మీద వహించారు అక్టోబరు 15వ తేదీ సాయంకాలం అందరూ 7 గంటలకే పరున్నారు. ఆశలతోను అనేక రకాల పనులతోను కూడుకొన్న పాతజీవితానికి స్వస్తి చెప్పి కొద్దిమంది సహచరులతో కూడి సంపూర్ణ త్యాగంతో కేవలం నిరాశతోనున్న నూతన జీవితాన్ని అక్టోబరు 16, 1949 తో ప్రారంభించారు బాబా ఎక్కడున్నదీ వారి సహచరులెక్కడ ఉన్నదీ తెలిసినప్పటికీ బాబాను ఎవరూ కలుసుకోవడానికి ప్రయత్నం చేయకూడదు అని వారి సహచరులను కూడా ఎవరూ కలిసి మాట్లాడరాదని యీ నూతన జీవిత నియమాలను గురించి బాబా చెప్పారు ఎవరూ కూడా బాబా కు ఉత్తరాలు వ్రాయకూడదు

నూతన జీవితం ప్రారంభించడానికి అక్టోబరు 16వ తేదీన తెల్లవారుజామున 2 గంటలకే అందరూ లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానాలు ముగించి దుస్తులు ఒకటికి బదులు రెండేసి ధరించి 3 గంటలకు టీ తీసుకున్నారు. బాబా స్త్రీలందరితో — మెహెరా, మనీ, మెహరూ, గోహర్ – సరోష్ నడిపిన కారులో ముందు బయలు దేరారు మిగిలినవారంతా బస్సు ఎక్కి స్టేషన్ సమీపాన రైల్వే లెవెల్ క్రాసింగ్ వద్ద బాబాని 4-15 గంటలకి కలుసుకున్నారు అక్కడినుంచి బయలు దేరినప్పుడు శుభసూచకంగా వర్షం కురిసింది.

బాబావారి పరివారం లెవెల్‌క్రాసింగ్ నుంచి బయలుదేరేటప్పుడు పాత జీవితం వదిలేసారు. అప్పుడు వర్షం బాగా కురుస్తూ ఉన్నందున గోనె సంచులు మడతపెట్టి నెత్తిమీద వేసుకున్నారు వర్షంపడుతోందని బాబాను స్త్రీ మండలిని తీసుకువచ్చిన కారు నడచివెళ్తూ ఉన్నవారి వెనుక వస్తే బాగుంటుందని సరోష్ బాబాతో చెప్పాడు వర్షం తగ్గకపోయినా కొంచెం ఎక్కువయినా కారు అవసరం అయితే సిద్ధంగా ఉంటుందని అలా చెప్పాడు వాప్ గ్రామానికి వెళ్ళేవరకు కారు ఉంటే మంచిదని సరోష్‌తో వెళ్ళి తనకారు కూడా తీసుకువస్తానని ఆదీ (జూ) చెప్పాడు బాబాకి వారిద్దరు చెప్పినదీ నచ్చింది ; సరే అన్నారు

బాబా ముందు ఆడవాళ్ళతో బయలుదేరి వెళ్తూ మిగిలినవారిని వెనకాల ఒక ఫర్లాంగు దూరంలో ఉండి రమ్మని చెప్పారు బాబా బయలుదేరుతూ అందరినీ వారి వెనకాల నిలబడి చేతితో గౌరవ మౌనములతో నేలను తాకమని ఒక నిమిషంపాటు అలా ఉంచమని బాబా తాను చేసి చూపించి అందరనూ అలా చేయమన్నారు. తరువాత

బాబా చేతులు పైకెత్తి "ఓ భగవంతుడా ! ఈ నూతన జీవితం మాకందరకు జయప్రదమై శాశ్వత సంతోషం కలుగజేయునట్లు అనుగ్రహించు" అని అందరిని ప్రార్థించమన్నారు బాబా ఆ ఒక్క నిమిషం మౌనములోను లోపల ఏ ప్రమాణం స్వీకరించారో ఎవరయినా తెలుసుకోగలరా అని అడిగారు ఎవరికి తోచినట్లు వారు చెప్పారు, బాబా అవన్నీ కావన్నారు. బాబా ఆ ప్రమాణం ఒక రహస్యమనీ అది ఎవరికీ చెప్పనని అన్నారు. అసలు బాబా ప్రమాణం తీసుకున్నట్లు కూడా ఆయన చెప్తేగాని తెలియలేదు.

బాబా పరివారంతో బయలుదేరి వాస్ గ్రామం వైపు వెళ్తుండగా వర్షం ఎక్కువయింది. బాబా చాలా కాలంగా చెప్తున్న 'సత్యనాశ' అనే దానికి వర్షం ఎక్కువ కావడం ఒక చిహ్నం అన్నారు. ఆ వర్షంలోనే బాబా వాస్ గ్రామంవైపు నడిచి వెళ్ళారు. కొంతదూరం వెళ్ళేసరికి వర్షం బాగా ఎక్కువకాగా బాబా స్త్రీలతో సరోష్ కారులో ముందు వెళ్తూ మిగతావారిని ఆదీ (జూ) కారు రాగానే అందులో రమ్మని చెప్పారు ఆదీ (జూ) తన కారులో అందరూ పట్టరు గనుక వాస్ కి రెండు మారులు కారు తిప్పాడు ఈ విధంగా రెండు మైళ్ళు నడిచి మిగతాదూరం కార్లలో వెళ్ళారు వర్షం మూలాన అనుకున్న ప్రకారం జరగలేదని వాస్ లో ఆగకుండా యింకా కొంత దూరంలో ఉన్న సూప అన్న గ్రామానికి పదండి అని బాబా ఆదేశించారు సూపకి చేరుకునే సరికి ఉదయం 6 గంటలయింది (16, అక్టోబరు 1949) అక్కడ రహదారీ బంగళాలో బాబా స్త్రీ మండలితో ప్రధానమయిన భాగంలో దిగారు. మిగిలిన వారందరూ కారు షెడ్డులోను వంట యింటిలోను యింకో చిన్న గదిలోను సర్దుకున్నారు టీ తీసుకున్న తరువాత బాబా కారు షెడ్డులోకి వెళ్ళి వారినవారులతో కూర్చుని నూతన జీవితం నాలుగు విధాలుగా ఉంటుందని వివరించారు

(1) 16 అక్టోబరు నుంచి 25 అక్టోబరు వరకు విశ్రాంతి తీసుకోవడం.

(2) 25 అక్టోబరు నుంచి 20 డిసెంబరు వరకు బెల్గాములో ఉండి శిక్షణ పొందడం

(3) 21 డిసెంబరు నుంచి 31 డిసెంబరు వరకు ఖాళీగా ఉండి తరువాత నిరాశ నిస్సహాయతలతో కూడిన నూతన జీవితంలో తిరుగు లేకుండా ప్రవేశించడం.

(4) 1950 జనవరి 1 వ తేదీనుంచి నూటికి నూరుపాళ్ళు నిరాశ నిస్స హాయతలతో ఉండే నూతన జీవితం ఇది చూసి దేవతలుకూడా ఈర్ష్య చెందుతారు.

(5) బాబాయిచ్చిన ఆజ్ఞలు కిమ్మనకుండా ఆచరించడం. ఆదీ కారులో అందరినీ ఒక్కమారు రమ్మనమంటే ఆ ఆజ్ఞ ఉల్లంఘించి రెండుసార్లు కారు తిప్పి అందరూ వచ్చారు. అలా ఉండకూడదు బాబా చెప్పినది చెప్పినట్లు తు-చ తప్పకుండా ఆచరించాలి అప్పటినుంచి దాపరికం లేకుండా అంతా నిజాయితీగా పైకి తెలిసి పోయేలా ఉండాలి ఏదీ దాచకూడదు దేనికీ రహస్యం ఉండకూడదు. అందరూ సమానులే అలాగే వర్తించాలి. నూటికి నూరుపాళ్ళు సత్యంగా ఉండాలి. ఎట్టిపరిస్థితుల లోను నిజం తప్ప ఏదీ మాట్లాడరాదు. అన్ని పరిస్థితులలోను సంతోషంగా ఉండడం చాలా ముఖ్యం. మనసు క్రుంగిపోయేటట్లు ఉండడం, మందంగా, చురుకులేకుండా, అసంతోషంగా ఉండడం, యిలాంటివి పనికిరావు ఒకరికి బాధ కలిగేలా ప్రవర్తించ కూడదు. కోపం వచ్చినా అది పైకి కనపరచకూడదు

అని బాబా చెప్పాక సహచరులందరకు వారు చేయవలసిన పనులు పురమాయించారు – కాకా, బైదుల్, మురళి మరి కొందరు వంటపని చేయాలి. డాన్కిన్, నీలు, ఆదీ (సీ) యింకా యితరులు కొందరు నూతిలోనుంచి నీరు తోడాలి. ఆ నూయి ఫర్లాంగుదూరంలో ఉంది అక్కడనుంచి నీరుతోడి తీసుకురావాలి. ఎవరి స్నానానికి వారు నీరు తెచ్చుకోవాలి. పాపం డా॥ గనీ నీళ్ళుతోడి తెచ్చుకుంటుంటే అతనికి ఆయాసం వస్తోందని మిగిలిన వారంతా నవ్వుకున్నారు. బాబా మాత్రం అతనికి ఆయాసం వస్తుంటే బకెట్‌తో నీరు తేవడానికి చేయూత యిచ్చి సహాయం కూడా చేసారు. ఇలాగే యితరులకు కూడా పనులు చెప్పారు అది వారివారి సమర్ధత లనుబట్టి అంట్లు తోమడం, కూరలు తరగడం వగైరా పనులు చెప్పారు చెప్పిన పనులు ఆషామాషీగా గాక శ్రద్ధగా జాగ్రత్తగా చేయాలని బాబా చెప్పారు డిసెంబరు ఆఖరు వరకు శిక్షణకాలంలో బాబా వారికి సహాయం చేస్తాడు అందరూ ఈ విధంగా నూతన జీవితం అలవాటు చేసుకుని అందులో వారు కలిసిపోవాలి.

డా॥ నీలు గురించి ఒక సంఘటన జరిగింది అది అందరికి నవ్వు తెప్పించింది. నీలు సామాను వేసిన లారీలోనుంచి దిగుతూ మెట్టు మీద కాలు అడుగు సరిగా పడనందున జారి క్రింద పడ్డాడు. కాని అతనికేదీ పెద్ద దెబ్బ తగలలేదు.

అతడు దెబ్బ తగలకుండా తప్పించుకున్నాడు గనుక బాబా పది రూపాయలు పెట్టి అందరికీ జిలేబీలు తెప్పించిపెడదామని నీలూని మురళీని సూప గ్రామంలోకి పంపించి అప్పుడే చేసిన జిలేబీలు తెమ్మన్నారు కాని బాబా సహచరులందరికి సరిపోయినవి క్రొత్తగా చేసినవి జిలేబీలు దొరకక వారు ఒట్టి చేతులతో తిరిగి వచ్చారు. పోస్టీలే ఘోడ్ నదికి వెళ్ళిన తరువాత చూద్దామని బాబా అన్నారు 16, 17 తేదీలు రెండు రోజులూ బాబా సూపలో ఉండడానికి నిశ్చయించారు వర్షం మూలాన చాస్‌గ్రామంలో ఒక్క రోజయినా ఉండకుండా వచ్చినందున యిక్కడ రెండు రోజులుండడం పడింది. సహచరుల ఆరోగ్యం విషయంలో గాని వారి సౌకర్యం విషయంలో గాని బాబా ఎంతో శ్రద్ధ వహించియున్నారు. బాబా మంచి ఉల్లాసంగా ఉన్నాడు.

17 వ తేదీన టీ తీసుకున్న తరువాత బాబా సహచరులున్న చోటికి వచ్చి గతరాత్రి వారికి బాగా నిద్ర పట్టినది లేనిది అందరినీ అడిగి తెలుసుకున్నారు. చాలా మంది బాగా నిద్రపోయామనే చెప్పారు బాబాకూడా యిదివరకు ఎప్పుడూ నిద్రపో నంత బాగా నిద్రపోయానని చెప్పారు. బాబా అసలు గాఢమైన నిద్ర పోనేపోరని తెలిసినవారు ఆయన చెప్పినమాట సరిగా అర్థం చేసుకున్నారు. ఆయన నిద్ర ఎలాటి దంటే ఏమాత్రంసవ్వడి అయినా బాబాకు మెలకువ వచ్చేస్తుంది. మనిషి కదిలినప్పుడు అతని బట్టలవల్ల కలిగిన చిరుసవ్వడివాలు ఆయన నిద్రనుంచి లేపడానికి బాబా పడున్న రహదారీ బంగళాలోని పెద్దగదిలో అర్థరాత్రివేళ ఎవరో వచ్చి తలుపుతోసి దానిమీద కొట్టారు అది కుక్క అయితే అంతగట్టిగా తలుపు కదులుతుందా ? కాదు. అది దయ్యం కానేకాదు. ఇదివరకు ఒకానొక ఆత్మ బాబా చుట్టూ తిరిగి ఆయన శరీరం రక్షణ చేస్తూండేది- ఆయన ఎక్కడ ఉన్నా ఇపుడు బాబా ఆజ్ఞచేత కొన్నాళ్ళుగా రావడం మానేసింది ఈ సంగతి బాబాయే చెప్పారు

ఎరచ్, బైదుల్ అది ఎవరో బిచ్చగాడైయుండాలి, రాత్రి పరుండుటకు వచ్చియుండాలి అనుకున్నారు సాధారణంగా గ్రామాలలో యిలాటి బంగళాలలో అలాగ ఎవరయినా వచ్చి రాత్రిళ్ళు పడుకోవడం మామూలే. ముఖ్యంగా బంగళా కావలిదారు ఎక్కడికయినా వెళ్ళినా వాడు నిద్రపోతూ ఉన్నా యిలాటివి జరుగుతూనే ఉంటాయి ఆ రాత్రి బాబా తమ పరుపును భోజనాలు చేసే పెద్ద బల్లమీద వేసుకొని

పడుకున్నారు. ఇది మామూలు మంచం కంటె ఎత్తుగా ఉంయింది. బాబాకి 55 సంవత్సరాల వయసు నిండింది. ఆ బల్లమీద నుంచి దిగుతూ బాబా క్రిందప్రక్కగా పడిపోయారు. చేతిమీద ఆపుకున్నారు. ఆయనకి అంత పెద్దదెబ్బ ఏదీ తగులలేదు. ఎరచ్ బాబాకి సమీపంలోనే పడుకున్నాడు. ఇది అయిన తరువాత బాబా మరల పడుకుని నిద్రపోయారు. సాధారణంగా బాబా యిలాంటిది జరిగాక మరల నిద్రపోవడం అరుదు. ఉదయాన లేచేసరికి బాబా మంచి ఉల్లాసకరమైన వైఖరిలో ఉన్నారు. అప్పుడు యీ సంగతి విన్నాక డా॥ గనీ, "యే దెబ్బాతగులకుండా నీలూ తప్పించుకున్నందుకు బాబా పది రూపాయిలు ఖర్చుచేసి జిలేబిలు తెప్పిస్తామన్నారే, బాబా అంతటివారు పడిపోయి దెబ్బతగలకుండా తప్పించుకున్నందుకు దానికి సరిపోయినట్లు పండుగ చేసుకోవద్దు మరి?" అని అన్నాడు. "ఓ! తప్పకుండాను" అని అందుకు ఖర్చుకుగాను రు 21 రూపాయిలు బాబా లడ్డూలకోసం యిచ్చారు. మోహన్‌నది వెళ్ళాక యీపని చెయ్యాలనుకున్నారు.

శిక్షణకాలం జయప్రదంగా జరగడానికి బాబా చెప్పగానే సహచరులు తక్షణమే విని చెప్పినట్లు ఆచరిస్తేను, ఏ సంకోచము లేకుండా చెప్పినట్లు చేస్తేనూ శిక్షణ బాగా జరుగుతుంది అన్నారు బాబా

మెహెరాబాద్‌లో బాబా ఒక రోజున దౌలత్‌సింగ్‌కి ఒక సిగరెట్ యిచ్చి కాల్చమన్నారు. బాబా మండలిలో ఎవరూ పొగ త్రాగరాదని నిషిద్ధం అందులోనూ బాబా ఎదురుగా కాల్చడం ఊహించడం కూడా కష్టం ఆరోజు బాబా సిగరెట్ యిచ్చి కాల్చమనేసరికి వెంటనే అది నోటిలో పెట్టుకుని వెలిగించడానికి సిద్ధమయేసరికి దౌలత్‌సింగ్ నోటినుండి బాబా సిగరెట్ లాగేసారు దౌలత్‌సింగ్ బాబా యిచ్చిన విపరీతమయిన ఆజ్ఞప్రకారం ఆయన ఎదురుగా సిగరెట్ కాల్చడమా అని ఏమాత్రం సంకోచించినా అవిధేయత క్రిందే వస్తుంది. అందుకనే అతడు బాబా ఆజ్ఞ పాటించాలని సిగరెట్టు నోటిలో పెట్టుకొని వెలిగించబోయాడు ఇలాగే సహచరుల విధేయత పరీక్షించాలని అనేక విధాలుగా బాబా ఆచరిస్తూంటాడు

జనవరి (1950) 1 టవ తేదీ తరువాత ఏ మాత్రం అవిధేయత కూడా క్షమించబడదు బాబా అలాంటి సహచరుని వెంటనే పంపించేస్తానన్నారు ఎవరిపనులు వారు చేసుకుంటూ ఉండాలి ఊరికే సోమరిగా ఉండకూడదు లఘుగురు శంక్షలకు

తప్ప ఆ స్థలం నుంచి బయటకు ఎవరూ బాబా ఆజ్ఞలేనిదే వెళ్ళకూడదు. ఎవరికయినా చేయడానికి ఏపనీ లేకపోతే వారికి యిష్టమయితే బయటికి వెళ్ళి మూడు ఫర్లాంగులకి ఎక్కువ గాకుండా షికారుగా నడిచిరావచ్చు ఈ అవకాశం డా॥ డాన్‌కిన్ తప్ప యింకెవరూ వినియోగించుకోలేదు ; వాళ్ళపనులలోనే ఉన్నారు.

దౌలత్‌సింగ్, గనీ ఏదో మాట్లాడుకున్న విషయం బాబాకు చెప్పారు. ఆ మధ్యాహ్నం బాబా సహచరుల ఆవాసానికి వెళ్ళి వారి సంభాషణ గురించి యిలా అన్నారు - "ఇప్పటి నుంచి యీ నూతన జీవితంలో మనం అందరం సమానంగానే ఉన్నాము. ఆధ్యాత్మికత్వం లేదు. గురుత్వం లేదు, శిష్యత్వంలేదు, అద్భుతాలు లేవు, ఆశలు లేవు, ఆశయాలు లేవు. లాభనష్టాల ఆలోచనల్లేవు. బాబాను అందరూ ఒక స్నేహితునిగా మాత్రారి డిసెంబరు (1949) ఆఖరువరకు ఒక స్నేహితునిగా, ఆయన సలహాను సహాయాన్ని తీసుకుంటూ ఉండాలి మాటలవల్ల చేతలవల్ల బాబా భగవంతుడనే ఆలోచనే లేకుండా ఉండాలి. బాబా భగవంతుడని గాని, ప్రభువని గాని, సద్గురువనిగాని, అవతారుడని గాని ఎవరూ అనుకుంటున్నట్లు వారి మాటల వల్ల చేతలవల్ల తెలియకూడదు. ఒక్క విషయంలోనే బాబా అందరికి ప్రభువు. ఆయన చెప్పినది వెంటనే ప్రతివారు విధేయులై ఆచరించాలి అని అడగడంలో మాత్రం మిగిలిన అన్ని విషయాల్లోను బాబా అందరికి మిత్రుడు బాబా యెడల నడవడికి అందరికీ పూర్తి స్వేచ్ఛ ఉంది. కాని ఆ నడవడిలో ఎవరూ అతిక్రమించి చరించకూడదు ఆయన యెదుట నవ్వవచ్చు, ఆయనతో పరిహాసాలాడవచ్చు; తమాషాగా మాట్లాడవచ్చు. హాస్యోక్తులవల్ల నవ్వించవచ్చు. "అంతకంటె నాకు సంతోషకరమయినదేదీ ఉండదు ఎవరికయినా మనోవైఖరి మారి కోపం వచ్చినా అది వ్యక్తం చేయకూడదు. కొంచెం ప్రయత్నిస్తే మనస్సు మనం చెప్పినట్లు వింటుంది" అన్నారు బాబా

మరునాడు ఉదయం 5 గంటలకు బయలుదేరి అక్కడనుంచి 17 మైళ్ళ దూరం ఉన్న సిరూర్ అనే ఊరికి వెళ్ళారు. అది నగర్‌కి పూనాకి మధ్యలో ఉంది. మగవారు ముందు నడువగా బాబా స్త్రీలతో వెనుక నడిచారు వర్షం లేదు మొదట కొంతదూరం వల్లగా బాగానేఉంది ముందు నడిచేవారందరితో బాబా మాట్లాడదామనుకుని చప్పట్లుకొట్టారు వారికి వినిపించలేదు మెహెరా కేకవేసింది డా॥ గోహర్ ఈలఊదింది. వాళ్ళు వినిపించుకోలేదు ఇంతలో డా॥ గోహర్ ఆమె ఈలలోని రాయి కదల

కుంటా పట్టుకుంటే ఆ ఈలను నేలనువేసి కొడుతోంది. బాబా మిగిలిన స్త్రీలు అదేమిటా అని నిలబడి చూస్తున్నారు గోహర్ చేస్తున్నది చూస్తే వారికి నవ్వు వచ్చింది ఈల బాగుపడింది. మళ్ళీ గట్టిగా ఊదేసరికి ముందుకు వెళ్ళేవారికి వినబడింది చెయ్యెత్తి వారిని ఆగమన్నారు. బాబా వారి వద్దకు వెళ్ళాక యిలా యిక ముందు జరగకూడదన్నారు. వెనకాల వచ్చేవాళ్ళకి వాళ్ళు 'మేము వెనక్కి తిరిగి చూడవద్దన్నారు కదా' అన్నారు 'మేము ఎంత ముందుకు వెళ్ళిపోయామో మాకు తెలియలేదు' అన్నారు. బాబా అప్పుడు యిద్దరు ముగ్గురు పురుషులతో ముందు నడుస్తా న్నారు వెనుకవారితో మాట్లాడాలంటే బాబా ఆగుతానన్నారు

సూప తరువాత ఆగవలసిన చోటు నారాయణ్‌గామ్ అది సూపకి యేడు మైళ్ళ దూరం ఉంది నారాయణ్‌గామ్‌లో ఒక పొలంలో చెట్లక్రింద ఉండటానికి ఏర్పాటు చేసుకున్నారు ఆ పొలంలో ఒక బావికూడా ఉంది. సమీపంలోనే ఒక చిన్నఏరు ఉంది అది వర్షాకాలం ఆ తడినేలమీద ఎలా పడుకుంటారు? అందుచేత నారాయణ్‌గామ్‌లో ఆగకుండా తిన్నగా 16 మైళ్ళు నడిచి మోద్‌నదికి వెళ్ళిపోదామని బాబా నిర్ణయించారు. ఆ రాత్రి (17-10 49) పడుండే ముందు తెల్లవారకుండా 2 గంటలకే లేవాలని 3 గంటలకు రొట్టె తీసుకొని టీ త్రాగాలని సరిగా 4 గంటలకు బయలు దేరాలని బాబా సహచరులందరికీ చెప్పారు వారంతా బయలుదేరాక సామానుతో లారీ బయలుదేరాలని అన్నారు.

ఆ ప్రకారంగా 8వ తేదీ ఉదయం 4 గంటలకి బాబా అందరితో కాలి నడకన బయలుదేరారు ఈ మారు సహచరులను ముందు నడవమని చెప్పారు వారి వెనుక బాబా స్త్రీలతో ఒక ఫర్లాంగుదూరంలో నడిచి వెళ్తున్నారు గతరాత్రి పెద్ద వర్షం పడింది. ఇంకా ఆకాశం అంతా మేఘావృతమై ఉంది నడిచే రోడ్డు అంతా బురదతో జారుతూ ఉంది. "వర్షం వచ్చినా లేకపోయినా ఏమైనాసరే యీ మాటు నడక సాగవలసిందే" అన్నారు బాబా. అలాగే కాళ్ళీడ్చుకుంటూ బాబా, సహచరులూ గంటకు 2½ మైళ్ళ చొప్పున నడిచారు. అందరికంటె దుర్బలుడు అనారోగ్యవంతుడు అయిన డా॥ గనీని బాబా చూసి "ఎలా ఉన్నావు? నడవగలుగుతున్నావా?" అని అడుగగా అతడు "ఆకలిగా ఉంది బాబా" అన్నాడు బాబా స్త్రీల వద్దకు వెళ్ళి వటికి బెల్లం తీసుకొని వచ్చి అందరికీ పెట్టారు.

రోడ్డుప్రక్కన ఉన్న నారాయణ్‌గామ్ గ్రామానికి రాగానే అందరూ టీ త్రాగితే బాగుంటుంది అన్నారు బాబా అప్పుడు నారాయణ్‌గామ్‌లో వారుండడానికి ఏర్పాటు చేయమని చెప్పి ఒకనికి పాలు ఒగైరాల కోసం 4 రూపాయలు అవ్వాన్ను యిచ్చినట్టు ఎరచ్ జ్ఞాపకం చేసాడు. అతను అందరికీ టీ యివ్వగలందనుకుంటాను అన్నాడు ఎరచ్. అప్పుడు ఎరచ్‌ని డా॥ డాన్‌కిన్‌ని ముందుగా నారాయణ్‌గామ్ గ్రామానికి వెళ్ళి అతనిని కలుసుకొని టీ సిద్ధంగా ఉంచమని బాబా చెప్పి పంపించారు కొనుక్కుందామన్నా యీ నూతన జీవితంలో ఎవరివద్దరా డబ్బులేదు గనుక యిది సమస్యను పరిష్కరించింది కాని ఒక్కడికి మాత్రం డబ్బు వద్దన ఉంచుకోవడానికి బాబా అనుమతి యిచ్చారు అతడు ముందుగా లారీలో ఫోచ్‌నది వెళ్ళిపోయాడు కూడాను

బాబా బృందం నారాయణ్‌గామ్‌లో ఒక గంట ఆగారు వారంతా టీ పుచ్చుకున్నారు కొంత సేవ తీరిన తరువాత వారు మరల అక్కడనుంచి నడక సాగించారు ఇప్పుడు ఎండ బాగా కాస్తోంది ఎండవేడి యీ పాంథులకు ఎక్కువగానే కనిపించింది నెత్తిమీదే యీ ఎండలో గంటకి రెండు మైళ్ళకంటె ఎక్కువ నడవ లేక పోతున్నారు బాబా నడిచినందున మృదువయిన ఆయన పాదాలు బొబ్బలెక్కాయి. బాబా చెప్పులు మారిస్తే బాగుండుననుకున్నారు మెహెరా తొడుగుకున్న జోడు ఆమెకు వదులయింది అదిగాక బాబాకోసం ఆమె యింకో చెప్పులజోడు తెచ్చింది. బాబా ఆ చెప్పులు తొడుగుకొని యిప్పుడు నడక ప్రారంభించారు

డా॥ డాన్‌కిన్ బాబా అరికాళ్ళకి గనీ అరికాళ్ళకి మందు ఉన్న టేప్ అతికించాడు బాబానుచూసి డా॥గనీ డా॥ నీలు, డా॥ డాన్‌కిన్ "బాబా ప్రస్తుత ఆరోగ్యస్థితిలో రోజుకి 4.5 మైళ్ళకంటె ఎక్కువ నడవలేరని" అన్నారు కాని వారిమాటలు నిరాధారమయినవని బాబారుజువుచేసారు ఆయనకు నీరసంఅనేదిలేకుండాఅందరిలాగానే ఆయన కూడా మామూలుగా నడిచారు. ఆ మాటలు వినకుండా డా॥ నీలు ముందు లారీలో వెళ్ళిపోయాడు ఇంక డా॥ డాన్‌కిన్ ఉన్నాడు. అతడు గనీ మాటలు విని ఏమంటాడు? ఏమీ అనలేకపోయాడు ఒకచోట గోహర్ చెప్పులతో నడవలేక రోడ్డుమీద చతికిలబడింది చెప్పులు లేకుండా నడిస్తే బాగుండుననుకుంది కొంచెం దూరం చెప్పులు తీసేసి నడిచిచూసి మళ్ళా తొడుక్కుంది, చెప్పులులేకుండా నడవలేక. వీరంతా నడిచి వెళ్తుంటే గ్రామీణప్రజలు తమాషాగా చూస్తున్నారు ఆఖరికి ఆగలేక ఒకడు

అడగనే అడిగాడు బస్సుండగా నడుస్తున్నారేమని బాబా పేరు చెప్పలేక ఏదో జవాబు చెప్పి తప్పించుకున్నారు కావాలనే నడుస్తున్నాం అన్నారు పొద్దెక్కుతూంటే ఎండ ఎక్కువవుతూన్న కొద్దీ ఉక్కపోయగా తొడిగిన ఓవర్‌కోట్లు తీసేసారు

ఇంక కొన్నిఫర్లాంగుల దూరంలో ఘోద్‌నది ఉన్నట్లుంది డా॥ గనీ చాలా అలిసిపోయాడు చాలా కష్టంగా కాళ్ళీడుస్తున్నాడు బాబా అతనివద్దకువెళ్ళి ఒకకర్రను పట్టుకోమని యిచ్చి "ఇది పట్టుకొని నడిచిరా ఎంతదూరం ఉంది అనేది ఏమీ చూడ వద్దు" అన్నాడు గనీ కొంతకాలం క్రిందట గుండె జబ్బుతో బాధపడ్డాడు. డా॥ నీలూని డా॥ డాన్‌కిన్‌ని గనీకి ఏం కావాలో చూడమన్నారు. వారు డా॥ గోహార్ వద్ద ఉన్న ఫస్టుఎయిడ్ కిట్ తీసుకుని అందులోంచి ఏదో మందుతీసి గనీకి యిచ్చారు. ఘోద్ నది గ్రామ పరిసరాలలోకి వచ్చేసరికి డా॥ గనీ యింక అడుగు వెయ్యలేను నాకు గొంతుక యెండిపోయి దాహం వేస్తోందన్నాడు బాబా అతనిని ఒక చెట్టునీడను కూర్చోపెట్టాను ఒక పావుగంట కూర్చోగానే అతనిలో కాస్త శక్తి వచ్చింది. కొంచెం మంచి నీళ్ళు కూడా యిచ్చి అతనిచేత త్రాగించారు. కొంచెం నీరు అతని తలమీద కూడా చల్లదనానికి చల్లారు దానితో డా॥ గనీ బాగా తేరుకున్నాడు మరల అంతా బయలుదేరారు గ్రామం యింక ఒక్క ఫర్లాంగే ఉంది. ఘోద్ నది మీద వంతెన సమీపానికి వచ్చారు. వంతెన దాటగానే ఊరే ముందు తిన్నగా ఊళ్ళోకి వెళ్దాం అన్నారు బాబా అందరినీ చూసుకుంటే అన్నా జక్కల్ ముందు వెళ్ళిపోయి నట్లు తెలిసింది. ఆ సంగతి తెలుసుకోగానే ఎరచ్ ని డా॥ డాన్‌ని ముందు పంపించి అన్నా జక్కల్‌ని వంతెన దాటవద్దని అక్కడ వేచి ఉండమని చెప్పమన్నారు వారు వంతెన వరకు వెళ్ళి తిరిగి వచ్చి అన్నా కనిపించలేదని చెప్పారు అతడు అంతకు ముందే ఊళ్ళోకి వెళ్ళిపోయి ఉంటాడు.

రహదారి బంగళా ఖాళీలేదు. ఎవరో అధికార్లు దిగారు. బాబా ప్రేమికు డొకనికి ఊళ్ళో ఒక సినిమా హాలు ఉంది అది బాబాకు సంతోషంతో యిచ్చాడు. అందులో యిప్పుడు సినిమా వెయ్యడం లేదు. అక్కడికి చేరుకునేసరికి మధ్యాహ్నం 12–30 గంటలయింది ముందు లారీలో వెళ్ళిన డా॥ నీలు, కాకా, బైదుల్, పెండు బాబాకు వారి సహచరులందరకు భోజనాలు సిద్ధపరిచారు. బాబా పరివారంతో సినిమా వద్దకు చేరుకోగానే ముందుగా అన్నా జక్కల్‌ని పిలిచి బాబాకి స్త్రీలకి ఒక ఫర్లాంగు కంటె ముందుగా వెళ్ళకూడదని బాబా యొక్క ఆజ్ఞను ఉల్లంఘించినందుకు గట్టిగా

మందలించారు. ఈ మాటకి బాబా అతనిని క్షమించానని చెప్పి అందరిని కాళ్ళు చేతులు సుఖం కడుక్కొని భోజనం చేసి విశ్రాంతి తీసుకోమన్నారు.

టీ సమయానికి నీను సూవలో పడిపోయి దెబ్బ తగిలించుకోకుండా తప్పించుకున్నందుకు అందరూ జిలేబీలు తెప్పించుకుని తిన్నారు కొంత విశ్రాంతి, జిలేబీలు, టీ, యివన్నీ అయాక అందరికీ జవసత్వాలు తిరిగివచ్చాయి నాలుగవ రోజు కూడా ఘోడ్‌నదిలోనే గడిపారు ఘోడ్‌నదికి వచ్చిచేరిన రోజు (18-10-49) దీపావళి పండుగ. కాని అందరు 16 మైళ్ళు నడిచి వచ్చారేమో పడుండి బాగా నిద్రపోయారు. టపాకాయల చప్పుళ్ళకి కూడా వాళ్ళకి మెలకువ రాలేదు 19 వ తేదీ ఉదయాన్ని లేచేసరికి వారికి హాయిగా ఉంది నడిచి అటూ యిటూ తిరుగుతూంటే నిన్నటిరోజున నడిచినందుకు కాళ్ళ నొప్పులు బాగా కనిపిస్తున్నాయి.

ఉదయాన్నే టీ తీసుకున్నాక బాబా అందరినీ పేరపిలిచి నూతన జీవితపు షరతులన్నీ మళ్ళీవారికి జ్ఞాపకం చేసారు. డిసెంబరు 31 వరకు బాబా వారికి కావలసిన సహాయం చేస్తానని జ్ఞాపకం చేసారు. జనవరి 1 వ తేదీ తరువాత ఆ ప్రమేయం ఉండదు. అప్పటినుంచి వారి జీవితం ప్రపంచం యొక్క దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటుంది – సంపూర్ణమయిన నిస్సహాయత, నిరాశ. తరువాత బాబా సహచరులు చేసే తప్పుల గురించి యిలా మాట్లాడారు – "వ్యక్తి గతంగా యిచ్చిన ఆజ్ఞలు పరిపాలించడంలో చేసే తప్పులు చిన్న తప్పులు నూతన జీవితానికి సంబంధించిన షరతులగురించి చేసేవి పెద్ద తప్పులు. (డబ్బు తాకడం, స్త్రీలను తెలిసి స్పృశించడం వగైరాలు) చిన్న తప్పులు తెలిసి చేసినా తెలియకచేసినా 1949 డిసెంబరు ఆఖరివరకూ క్షమించబడతాయి. పెద్ద తప్పులు తెలియకచేసినట్లయితే డిసెంబరు (1949) ఆఖరి వరకు క్షమించబడతాయి తెలిసిచేసిన పెద్ద తప్పులు ఎప్పటికీ క్షమించబడవు."

మధ్యాహ్నం టీ తీసుకునేటప్పుడు లడ్డు మిఠాయిలు తెప్పించి యిచ్చారు బాబా సూవలో వాగ్దానంచేసినప్రకారం. బంగళాలో ఆయన పక్కమీదనుంచి (బల్లమీద నుంచి) పడిపోయి దెబ్బలు తప్పించుకున్నందుకు యిలా పండుగచేసుకున్నారు బాబా సహచరులందరిని చన్నీళ్ళు గాని వేడినీళ్లుగాని ఎవరికి ఏవి కావాలో అవి తీసుకొని స్నానం చేయమన్నారు. ఆ సినిమా భవనంలో స్నానాలకి గదులు లేవు అందుచేత

బాబా వారి శ్రీ బృందావనం బాబా వరుంచిన గదిలోనే స్నానం చేసారు సహచరు లందరు అక్కడి లెట్రిన్‌లలో స్నానం చేసారు సాయంకాలం పెందరాళే భోజనాలు చేసి పడుకున్నారు దీపావళి దగ్గరపడుతూండటం చేత టపాకాయల చప్పుళ్ళ చెవులు బ్రద్దలయేలా వినిపిస్తున్నాయి అందుచేత ఎవరికీ నిద్రపట్టలేదు నిద్రలేకుండా ఊరికే పరుండే కంటె ప్రయాణం సాగిస్తేనే బాగుంటుందని బాబా అన్నారు ఆడవారు బస్సు ఎక్కవచ్చుకదా అని సంతోషించారు ఘోడ్‌నది నుంచి పూనా మీదుగా బెల్గామ్ నగరానికి ప్రభుత్వ రవాణా బస్సులో వెళ్ళటానికి ఏర్పాటయింది 19 వ తేదీ సాయంకాలం 7 గంటలకే సామాను లారీని పెండు కాకాలతో పంపించేసారు.

తెల్లవారితే 20 వ తేదీ అనగా రాత్రి 1-30 గంటలకు బాబా వారి సహచరులందరు బస్సులో పూనాకు బయలుదేరారు ఘోడ్ నదిలో ఉండగా కొద్దిమంది బాబా సినిమా భవనంలో ఉన్నారని పసిగట్టారు. ఆ రాత్రి బాబా వెళ్ళిపోయేటప్పుడు బాబా దర్శనం కోసం కొంతమంది సినిమావద్ద పోగయారు. వారికి యీ నూతనజీవిత కాలంలో బాబాకి పాదాభివందనం గాని దర్శనం గాని యిలాటివేమీ లేవని వివరించడం కొంచెం కష్టమే అయింది. ఎలాగయితేనేం చాలామంది వెళ్ళిపోయారు మిగిలిన జనంలోంచి దోవ చేసుకొని బస్సులోకి ఎక్కి ఆడవారు ముందు కూర్చున్నారు. కూర్చున్న ఆడవారి వెనుక తెర కట్టారు దానివెనుక పురుషులు కూర్చున్నారు అందులోని సీట్లు యిరుకుగా ఉన్నాయి సగం జోగుతూ అందులో కూర్చుని ప్రయాణం చేస్తున్నారు డ్రైవరుకి సరిగా వెనుక డా॥ గోహర్ కూర్చుంది బాబా "జాగ్రత్త ! నిద్రలో ముందుకి వాలేవంటే ఆ మెత్తమీద పడతావు " డ్రైవర్ పెట్టుకున్న టోపీని చూపిస్తూ అన్నారు గోహర్‌తో. దారి పొడుగునా వర్షం పడుతూనేఉంది తెల్లవారుఝామున బస్సులో పూనా రైలుస్టేషన్‌కి వెళ్ళేసరికి 4 గంటలయింది. అప్పుడు టీ దొరుకుతుందేమో చూడమని బాబా ఆజ్ఞాపించారు వారి సహచరులు వెళ్ళి చూడగా హోటళ్ళన్నీ మూసేసి ఉన్నాయి. స్టేషన్‌లోని టీ దుకాణం తెరిచే ఉంది· బాబా సహచరులందరకు అక్కడ టీ దొరికింది

పూనానుంచి ఉదయం 8 గంటలకు సతారా చేరుకున్నారు అక్కడ అందరు కాలకృత్యాలు తీర్చుకొని స్నానాలు చేసేసరికి ఒక అరగంట పట్టింది. బస్సులో యీ లోపుగా పెట్రోలువగైరా పోయించుకున్నారు. బాబా అందరికీ చపాతీలు,

లడ్డూలు వగైరాలు తెప్పించి పంపారు. పూనా స్టేషన్‌లో టీ పుచ్చుకున్నారు గనుక, యిప్పుడు ఊరుకున్నారు.

డా॥ నీలు ఆదీతో "మనమంతరం మెహెరాబాద్‌కి తిరిగి ఎప్పుడువస్తామో!" అని యీ ధోరణిలో మాట్లాడుతూ ఉంటే యీ సంభాషణ బాబా చెవిని పడింది. ఇలాంటి మనోవృత్తి నూతన జీవితానికి విరుద్ధం. ఇలాంటి లోపాలు బాబా డిసెంబరు (1949) ఆఖరివరకే క్షమిస్తారు జనవరి (1950) 1 టవ తేదీ తరువాత ఎవరయితే అలాంటి ఆలోచన చేస్తారో వారు మూట ముల్లె పుచ్చుకుని వెళ్ళిపోవలసిందే – అని బాబా గట్టిగా మందలించారు.

అక్కడ అందరూ బస్సులో బయలుదేరి కొల్హాపూర్ వెళ్ళేసరికి మధ్యాహ్నం 12-30 గంటలయింది. కొల్హాపూర్‌లో హోటళ్ళన్నీ బందయిన మూలాన (హర్తాళ్) అక్కడ వారు టీ తీసుకునేందుకు వీలుకాలేదు. పంచదార చాలినంత సరఫరా లేనందున హోటళ్ళ వాళ్ళు హర్తాళ్ చేసారు బస్సుకి ఏదో చిన్న మరమ్మతు వచ్చినందున పెట్రోలు పోయించుకోడానికి ఆగినందుకు కొల్హాపూరులో ఒక గంట ఆలస్యంగా బయలుదేరింది మధ్యాహ్నం 3 గంటలకు నిప్పాణి గ్రామం చేరింది. అక్కడ చపాతీలు, లడ్డూలు వారికి పంచిపెట్టి బాబా టీ కూడా యిప్పించారు.

బెల్గామ్ చేరేసరికి సాయంత్రం 4-30 గంటలయింది అప్పుడు కూడా వర్షం కురుస్తోంది. చలిగాలి వీచుతోంది బెల్గామ్‌లోని తలక్‌వాడిలో బాబా బస చేయవలసిన చోటు కనుక్కునే సరికి ఒక గంటసేపు పట్టింది. తలక్‌వాడిలో బాబా శిక్షణ కాలమంతా జరుపుతారు కాకా, పెండు యిరువురూ తీసికొని వెళ్ళిన సామాను లారీ అంతకు రెండు గంటల క్రితమే చేరింది తలక్‌వాడికి. వారికి ముందుగా బసల ఏర్పాటు చేయమని విష్ణుని పంపించారు బాబా. ఆ యిళ్ళ వద్దకు బాబా సహచరులతో చేరేసరికి కూలీలు యింకా యిళ్ళకి పనిచేస్తున్నారు. ఒక పెంకుటిల్లు 20 అడుగులు వెడల్పు, 30 అడుగుల పొడవు ఉంది. దానికి వెదురు చాపల గోడలకు మన్ను పూసారు నేల సిమ్మెంటు చేసారు ఇంకా తడి ఆరలేదు వర్షం మూలాన. బాబా విష్ణుగురించి ఎక్కడున్నాడు కనిపించదేమని అడిగారు బాబా అతనిని సా॥ 6గంటలకు అక్కడుండాలని యిదివరకే ఆజ్ఞాపించారు కాని బాబా సహచరులతో రెండు గంటలు

ముందుగా, 4 గంటలకే, అక్కడికి వచ్చారు బాబా వచ్చారని తెలిసి విష్ణు పరిగెత్తుకుని వచ్చాడు అతడు వచ్చాక యిల్లు యింకా తయారుకాని విషయం యింకా ఎన్నో ప్రశ్నలు విష్ణుని వేసారు. కాని వాటికి విష్ణు సిగ్గుపడి సమాధానాలివ్వలేక పోయాడు అప్పుడు వర్షం కురుస్తున్నందున ఆ యింటికి వచ్చేదారి బురదతో కూడి ఉంది. ముందుగా మెహెరా, మెహ్రూ వెళ్ళి బాబా ఉండే యిల్లు చూసారు ఇది ఒక పొలంలోని కుటీరం దగ్గరలోనే ఒక బావి ఉంది. సామానులారీని యీ యింటికి ఎంత దగ్గరగా వీలయితే అంత దగ్గరగా తీసుకురమ్మని చెప్పారు ఆ రాత్రికి ముఖ్యంగా అవసరమయిన సామానులే దింపించారు బాబా అందులో ప్రవేశిస్తూ బాబా అక్కడ ఉన్న యిబ్బందులేవయినా అవి తమ సత్యనాశి కాలానికి అనుగుణంగా ఉన్నాయన్నారు సహచరులందరికీ చపాతీలు పచ్చడి పడ్డించమని బాబా డా॥ నీలుని ఆజ్ఞాపించారు అవి వారితోకూడా ప్రయాణంలో తెచ్చుకున్నవే అవి తిన్నాక ఆ రాత్రికి విశ్రమించవ మని బాబా వారితో చెప్పారు

మరునాడు తెల్లవారాక (21-10-49) బాబా వచ్చి సహచరులందరిని రాత్రి బాగా నిద్రపోయారా అని కుశల ప్రశ్న వేసారు అందరు కూడా బాగానే నిద్ర పోయామని చెప్పారు క్రింద తడిగా ఉన్నా, బయట వర్షం కురుస్తున్నా, వారికి ప్రయాణబడలికవలన బాగా నిద్రపట్టింది ఘోప్‌నదినుంచి బెల్గాము 275 మైళ్ళుబస్సు లలో ప్రయాణం చేసి వచ్చారు వారికి ఎంత శ్రమ కలిగి ఉండవచ్చు ! గదులన్నీ నీళ్ళతో పాదాలు మునిగేలా నిండాయి సిమ్మెంటు నేల గట్టిపడాలని చీలమండవరకు నీళ్ళు వచ్చాయి. తలుపులు సరిగా లేనందున వర్షం లోపలికి రాకుండా మూసేందుకు వీలులేకుండా ఉన్నాయి ఇన్ని యిబ్బందులున్నా స్త్రీలు చాలా సంతోషంగా ఉన్నారని బాబా చెప్పారు. లారిలో నుంచి సామాను దింపి స్త్రీలబసకి పురుషుల బసకి లోపలికి తీసుకు వెళ్ళడానికి చాలాసేపు పట్టింది సామాను దింపడం యిక్కడికి అక్కడికి తీసుకువెళ్ళి పెట్టడం అన్నీ బాబా సహచరులే చేశారు కూలివాళ్ళని పెట్టలేదు ఈ పనిలో అందరూకూడా పాల్గొన్నారు. అందరూ సర్దుకొని స్థిరపడ్డాక గాని వంట తల పెట్టలేదు. అంతవరకూ రెండుపూటలా టీ తీసుకునేవారు భోజనం హోటలు నుంచి తెచ్చుకున్నారు. ఈ ప్రకారంగా 21 వ తేదీనుంచి 24 వరకు గడిపారు మరునాడు పురుషమండలిలో ఎవరో బావినుంచి నీళ్ళు తోడగా గోహర్ వంట యింటికి కావల సిన నీరు తీసుకువచ్చింది మెహెరా పర్యవేక్షణ క్రింద మణి వంట చేసింది ఇది

వరకు ఆమె యింత మందికి వంట ఎప్పుడూ చేయలేదు అందువేత ఆమెకు కష్టం అనిపించింది ఆమె కాచిన పులుసు ఘుమఘుమలాడేలా చేయడానికి బాబా చెప్పినట్లు ఆమె కాచింది. అందుకని పులుసు మంచి సువాసనగా చాలా రుచిగా తయారయింది. ఆ కారణం వల్లనే దానికి 'భగవాన్' పులుసు అని పేరు పెట్టారు

బెల్గాంలో ఒక భక్తుడు బాబాకు ఒక భూమి యిచ్చాడు. అది మరల ఆయన అతనికిచ్చేసారు కాని యిప్పుడు బాబా దిగినకుటీరం ఆ భూమి మీదే నిర్మించబడింది మధ్యాహ్నం బాబా నూతన జీవితం గురించి మాట్లాడుతూ అది ఎంత నిస్సహాయత నిరాశతో కూడియున్నా యీ శిక్షణ జయప్రదంగా జరిగిందంటే జనవరి (1950) 1 వ తేదీ తరువాత యీ జీవితం దేవతలకికూడా అసూయపడేలా ఉంటుంది అన్నారు ఇంకా వివరిస్తూ బాబా.—

'ఇంతవరకు జీవితం నొప్పితోను, బాధతోను కూడి ఉంది అది ఎవరికీ హాయిగా ఉండలేదు 1950 లో జీవితం యింతకంటె బాధాకరంగా ఉంటుంది. కానీ యీ బాధవల్లనే మీరు హాయిగా జీవిస్తారు. ఈ జీవితం అనుభవిస్తూ ఉంటే అది చేపునికి ఒక సవాలులా ఉంటుంది ఇంత కంటె యిప్పుడు నేనేమీ చెప్పలేను నిజం చెప్పాలంటే యిప్పుడేదీ అంత స్పష్టంగా గోచరించడం లేదు. మీరు ఏమయినా అనుకోండి. నాకు కనిపించేది అస్పష్టమయిన చిత్రం మాత్రమే." అన్నారు. బాధాయుతమైన యీ జీవితం హాయిగా అనుభవించడం ఎలాగ వివరించండని సహచరులు బాబాని అడిగారు అందుకు బాబా.—

'ఒకనికి కురుపులు వేసి దురద పెడుతున్నాయనుకోండి అది గోకుతూన్నంతసేపు వానికి సుఖంగానే ఉంటుంది అలాటిదనుకోండి బాధ సుఖంగా ఉంటుందంటే" అని బాబా వివరించారు

తరువాత అందరిని వేడినీళ్ళగాని చన్నీళ్ళగాని ఎవరికి కావలసినట్టు వారు స్నానాలు చేయమన్నారు బాబా తరువాత వారు తెచ్చుకున్న రెండవ జత దుస్తులు వేసుకోమన్నారు. ఈ దుస్తులు బాబాకి 25 వ తేదీన అప్పచెప్పాలి.

22 వ తేదీ ఉదయాన్నే మామూలుగా బాబా కుశల ప్రశ్నలయాక సహచరులందరూ ఎన్ని యిబ్బందులున్నా వాటికి తగినవిధంగా తట్టుకున్నందుకు బాబా

సంతోషం వెలిబుచ్చారు. టీ తయారు చేయడం, నీళ్ళుతోడటం, యింట్లోకి మోసుకు రావడం, పాత్రలు శుభ్రపరచడం యిత్యాది పనులన్నీ ఎవరెవరు ఏవి చేయాలో బాబా విశదపరిచారు స్నానాలు ప్రతిరోజూనో. వారానికోమారో, పదిరోజులకోమారో ఎప్పుడు చేసినా మనిషికి ఒక బకెట్ నిండా నీరు స్నానానికి, ఒక బకెట్ నిండా నీరు గుడ్డలు ఉతికి ఆరవేసుకుందుకు తీసుకోవాలి వేడినీళ్ళు కావలసినవాళ్ళు వాళ్ళే నీళ్ళు కాచుకోవాలి స్త్రీలు వారిదిపరకెన్నడూ చేయని చాకిరీ చేసుకుంటున్నారు. అందరూ యీ నూతన జీవితంలో పరస్పర సహకారంతో దాసీపనులు లాటివి – ఇల్లు తుడవడం, గిన్నెలు కడగడం, దుమ్ము దులపడం వంటి పనులు చేసుకుంటున్నారు.

25 అక్టోబరునాటికి ఎవరేయేపనులు చేయాలో నిర్దేశించి చెపుతారు బాబా. ఆనాటినుంచి శిక్షణ ప్రారంభం అవుతుంది మధ్యాహ్నం (22-10-49) బెల్గామ్‌లోనే ఉండి శిక్షణ పూర్తిచేసుకోవడం విషయం బాబా అందరితోను సంప్రదించారు. చాలాసేపు చర్చలు జరిగిన తరువాత యీ క్రింది ఉత్తరం బాబా చెప్పి వ్రాయించారు.

'ఏర్పాటుదార్లలో సంబంధించిన వారికి యీ ఉత్తరం వ్రాయడమయింది.

(1) మొదటి శిక్షణ కాలం బెల్గామ్‌లో నవంబరు (1949) 20 వ తేదీ వరకు దేహ పరిశ్రమయుతంగా గడపబడుతుంది

(2) రెండవ శిక్షణకాలం నవంబరు 25 నుంచి డిసెంబరు 10 వ తేదీ వరకు లంగోటి ధరించి జీవిస్తూ భిక్షాటన చేస్తూ జరుపబడుతుంది

(3) మూడవది ఆఖరుది అయిన శిక్షణకాలం హరిద్వార్ వెళ్తూ దెంచు, ఎరుకల వారివలె ఊరూరా తిరుగుతూ డిసెంబరు 10 వ తేదీనుంచి ఆనెలాఖరు వరకు గడుపబడుతుంది.

(4) 1950 జనవరి 1 వ తేదీ నుంచి, హరిద్వార్‌కి వెళ్తున్నా మరెక్కడున్నా, భగవంతుడు ఎక్కడికి తీసుకు వెళ్తున్నా నిస్సహాయకర మయిన అనంత మయిన నవ్యజీవితం అనుయిన శ్రద్ధతో గడపబడుతుంది

(2) బెల్గామ్‌నుంచి మనసుమంవరం రైలులో 3వ తరగతిలో నవంబరు 20 వ తేదీన కాశీ వెళ్తాము శిక్షణకాలం గడపడానికి పెట్టుకున్న డబ్బులోనుంచి యిందుకు ఖర్చుచేయాలి కావాపద్ద యిదివరకే పెట్టబడింది.

(3) బెనారస్ నుంచి డిసెంబరు 10 వ తేదీన కాలినడకను బయలుదేరి మార్చి (1950) 10 నాటికి హరిద్వార్ చేరుకుంటామని ఆశించబడుతోంది.

(4) సవారీ బండి, ఎద్దులబండి, ఎద్దులు డిసెంబరు (1949) 7 వ తేదీకి వారణాసి కంటోన్మెంటు స్టేషన్‌కి చేరుకోవాలి.

(5) డిసెంబరు 1 లగాయతు 7 వ తేదీవరకు నీలు, విష్ణులు యిద్దరూ ఆ కంటోన్మెంటు స్టేషన్ లో సవారీ, ఎద్దులబండి, ఎద్దులు వచ్చేయా అని దర్యాప్తు చేస్తూ ఉంటారు ''

ఆ సాయంకాలం (22-10-49) రు 21 ల మిఠాయిలు తెప్పించి బాబా స్వహస్తాలతో బెల్గాంకి శిక్షణ ప్రారంభం చేస్తూ అందరికీ పంచిపెట్టారు.

23 వ తేదీ ఉదయాన మామూలుగా బాబా సహచరులను కలిసి వారి క్షేమ వార్త తెలుసుకున్నారు చాలామంది రాత్రి చాలాసేపటివరకు దోమల బాధవలన నిద్ర పట్టలేదని చెప్పారు అప్పుడు బాబా స్త్రీలుకూడా దోమల బాధవలననే సరిగా నిద్ర పోలేదని ముఖ్యంగా మనికి చేతులమీదా ముఖంమీదా దోమలు కుట్టి ముఖం పొంగు జూవినట్లు కనిపిస్తోందని చెప్పారు గదులు తడిగా ఉన్నప్పటికీ అందరూ సంతోషంగా ఉన్నందున బాబా వారి సంతోషాన్ని వ్యక్తపరిచారు వారు (మండలి) నవ్వుతూ పేలుతూ ఉండడం ఆయనకి సంతోషాన్ని కలిగించింది. వంట చేయుటనేం దుకు మట్టితో పొయ్యిలు కట్టడం వాటికి మెరుగులు దిద్దడం పూర్తిచేస్తున్నారు. నవం బరు 1 టవ తేదీనుంచి వాటిని 20 రోజులపాటు ఉపయోగిస్తారు.

డాన్‌ను యీ లోపుగా వంటచేసేందుకు ఒక జాగా తయారు చేయ మన్నారు బాబా అక్కడ 25 అక్టోబరు నుంచి 31 అక్టోబరు వరకు, కాకా, బైదుల్ యిద్దరూ వంట చేస్తారు వారికి మురళి పై పనులు చేస్తూ సహాయం చేయాలని బాబా చెప్పారు బాబా సహచరులకు నవంబరు 20 వరకు ఒక్కొక్కరికి పనులు యీ విధంగా చేయాలని పురమాయించారు ఎరచ్ ఊళ్ళోకి వెళ్ళి చిల్లరపనులేవయినా ఉంటే చేసుకురావాలి బాబాతో కలిసి ఊళ్ళోకి ఆయన రమ్మన్నపుడు వెళ్తూండాలి నీలు, అవి, పెండు, ఆలి అక్బర్, సదాశివ్ నూతిలోనుంచి కావలసిన నీళ్ళన్నీ తోడి యివ్వాలి దౌలత్ సింగ్, బాబాదాస్ వంట పాత్రలు యితర పాత్రలు తోమి

శుభ్రం చేయాలి. కావలసినపుడు విష్ణు బజారు కెళ్ళి కూలీల సహాయం లేకుండా కావలసిన సరుకులన్నీ తెచ్చిపెట్టాలి గుస్తాద్‌జీ యిల్లు తుడవాలి తుడిచేటప్పుడు ట్రంకుపెట్టెలు వగైరా ఎత్తవలసి వస్తే బాబాదాస్, దౌలత్‌సింగ్ సహాయం చేయాలి. అన్నా జక్కాల్ రాత్రి 8 గంటలనుంచి తెల్లవారుఝామున 4 గంటల వరకు కావలి కాయాలి. డా॥ గనీ ప్రతిరోజు డైరీ వ్రాస్తుండాలి. ఇంకా అతనికి యిష్టమయిన యితరపనులు చేయాలి. గుస్తాద్‌జీకి అప్పజెప్పిన ఇల్లు తుడవడం పని అతడు చేయడం యిష్టంలేక అందుకు నిరాకరించినంత పని చేసాడు. అప్పుడు బాబా ఆయన చెప్పిన పనులు అందరూ ఎవరికివారు చేసి తీరవలసిందేగాని అవి మార్చబడవని స్పష్టం చేసారు.

"ఏ మాత్రం చెప్పినది చేయడానికి సంకోచించినా వారు తీసుకున్న ప్రమాణానికి విరుద్ధంగా ప్రవర్తించినట్లవుతుంది నూతన జీవితపు నిబంధనలను ఉల్లంఘించినట్లే." అని బాబా స్పష్టం చేసారు బాబా మరల యిట్లు నొక్కి చెప్పారు.

"ఎంత అసాధ్యంగాను అర్ధరహితంగాను చెప్పినది కనిపించినా అది చెయ్యడానికి కాదు అని చెప్పకూడదు సంపూర్ణమయిన సంకోచం లేని విధేయత ఆశించబడుతోంది మిగిలిన విషయాల్లో అందరూ సమానులే అందరూ సోదరులవలె సంపూర్ణ స్వేచ్ఛ కలిగిఉంటారు"

తరువాత శిక్షణాస్థలము వారణాసి అని నిశ్చయింపబడింది గావున ఆ మధ్యాహ్నం బాబా తమ సహచరులతో కాశీలో వారు ఉండవలసిన బసల గురించి చర్చించారు. అవును ఆ సంగతి ముందుగానే తెల్సుకోవాలని అందరూ అన్నారు ఎవరు అక్కడ ఏర్పాట్లు చేయడానికి వెళ్ళాలి అన్న విషయం మీద అనేకమయిన పేర్లు సూచించిన తరువాత ఎవరికి బాబా సదాశివ్, బాబాదాస్ ముందుగా వారణాసివెళ్ళి స్త్రీలకి పురుషులకి కావలసిన వసతి సౌకర్యాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు సదాశివ్ యిదివరలో కాశికి రెండుమార్లు యాత్రకోసం వెళ్ళి ఉన్నాడు గనుక, బాబా దాస్‌కి కాశీనగరం బాగా తెలుసును గనుక, 'అతనికి అక్కడ కొందరు పరిచయస్తు లున్నారు గనుక, వారిద్దరిని బాబా ఎన్నుకున్నాడు సదాశివ్‌ని బాబాదాస్‌ని 26 వ తేదీన కాశీకి వెళ్ళి అక్కడపని పూర్తి చేసుకొని బాబా వారి పరివారంతో కాశీకి వచ్చేవరకు అక్కడ వేచి యుండాలన్ని బాబా చెప్పారు

అక్టోబరు 24, 1949 ఉదయం బాబా మామూలుగా సహచరుల బసకి వారిని చూడడానికి వచ్చారు తరువాత ఆదీ హార్మోనియం వాయిస్తూ పాడుతూండగా బాబా మద్దెల వాయిస్తూంటే చూచి సహచరులంతా ఎంతో సంతోషించారు. మంజిల్-ఎ-మీమ్ (బొంబాయి) నివాసం తరువాత బాబా మద్దెల వాయించడం మండలివారు చూడలేదు ఆ రోజులలో బాబా మధురమయిన శరీరంతో హాఫిజ్‌యొక్క గజల్‌లు గానం చేసేవారుకూడా ఆ కంఠంతో యిప్పుడు ఆయన పాట వారికి వీనులవిందు కలిగించే అవకాశం లేదుకదా అని మండలి విచారించారు

బాబా ప్రయాణాల విషయంలో అన్ని ఏర్పాట్లు ముందుచేయించే అలవాటు. సదాశివ్, బాబాదాస్‌ల ప్రయాణం సందర్భంలో బొంబాయి ప్రశాంత్ రవాణాసంస్థవారి బస్సులు బెల్గామ్‌నుంచి బొంబాయికి ఎప్పుడెప్పుడు ఉన్నాయో, అసలు వెళ్తున్నాయో లేదో, వెళ్తే రైలు కంటే బస్సులో వెళ్తే ఏమయినా చవుక అవుతుందా యీ వివరాలన్నీ కనుక్కొనిరమ్మని ఎరచ్‌ని ఊళ్ళోకి పంపించారు

మధ్యాహ్నం అంచనా టీ పుచ్చుకున్న తరువాత బాబా డా॥ గనీని పిలిచి బాబా సహచరులు విధేయత పాటిస్తూ కామక్రోధలోభాదులు లేకుండా ఉండాలని. సహచరులంతా నిజాయితీతో ప్రవర్తిస్తూ సుఖంగా ఏ పరిస్థితులలోనైనా ఆనందంగా ఉండాలని యీ నూతన జీవితం మీద పద్యాలు రచన చేయమని చెప్పారు అటువంటి పద్యాలు వ్రాస్తే అవి ప్రతిరోజూ ఉదయాన్నే ఆరోజు కార్యక్రమం ప్రారంభించేముందు ప్రార్థనతోపాటు చదివిస్తానని బాబా అన్నారు. ఏదయినా పాట కచేరీ చేస్తే యీ పాట ముందు పాడిస్తానన్నారు. ఆ పాటకి పల్లవి కూడా బాబా అందించి మొదటి పంక్తి వ్రాయించారు.

రాత్రిపూట అన్నాజక్కల్ కాపలికాయడానికి బయట ఉంటే వర్షంలో తడవకుండా రెయిన్‌కోటు ఒకటి తనకు యిప్పించమని బాబాను అడిగాడు. అతడడిగినది బాబా సరే కొనుక్కోమని అన్నారు గాని బాబాకి యిలాటివి అపరోక్షంగా గాని పరోక్షంగా గాని చెప్పకూడదని సహచరులతో బాబా చెప్పారు. డిశంబరు ఆఖరివరకు బాబా సహాయం చేస్తానన్నారు గనుక యిప్పుడు క్షమించానన్నారు.

అక్టోబరు (1949) 25 వ తేదీ శిక్షణ ప్రారంభదినం ఆ రోజు ఉదయం బాబా తమ సహచరుల వద్దకువచ్చి ఒక్కొక్కరిని వారివారికి ఉన్న కష్టాలేమిటో

తెలుపవలసిందని కోరారు వారి కష్టాలేమయినా ఉంటే బాబాకి విన్నవించుకోవడానికి బాబా వారికి అవకాశం యిచ్చారు ఇక ముందు ఏదీ ఎవరిని చెప్పి వారిని తృప్తి పరచడానికి ప్రయత్నం చేయనని బాబా అన్నారు అలాంటిది డిసెంబరుఆఖరుతో సరి అన్నారు. జనవరి 1 వ తేదీ నుంచి నూతన జీవిత నిబంధనలను జాగ్రత్తగా పాటిస్తూ ముందుకు సాగిపోవడమో లేక ఎవరి బాధ్యతమీద వారి యిష్టప్రకారం నడుచుకోవడమో యీ రెండే మార్గాలు.

మాటల సందర్భంలో ఆదీ "ఏమో బాబా యొక్క ఉద్దేశాలేమిటో తెలియదు. ఆయన భావాలేమిటో, నాకు అనుమానంగానే ఉంది" అని అనేసాడు అది విని బాబా మరల అందరితోను యిలా అన్నారు—

"మీకు యింకో అవకాశం యిస్తున్నాను మీరు బాగా ఆలోచించుకోండి. నాతో ఉండి ముందుకు వస్తారో లేక వెనక్కి వెళ్ళిపోతారో చెప్పండి ఇలాటి శంశయా లుంటే యీ నూతన జీవితంలో మీరు ఉండలేరు తరువాత ముందు ముందు యిప్పటికంటె కోటిరెట్లు కష్టతరంగా ఉండవచ్చు నాతో జీవితం. ఇప్పుడయినా మించి పోయిందిలేదు మీకు యింకో అవకాశం యిస్తున్నాను గనుక మీరు నిశ్చయించుకోండి. ఈ సాయంత్రంలోపుగా తేల్చుకొని నాకు చెప్పాలి ఈ రోజు దాటితే మీకు యీ అవకాశం ఉండదు ఇప్పుడు ఆదీ అలా అన్నాడని కాకుండా నేను మీకు చెప్తున్నాను. ఇంకా అనేక కారణాలవల్ల నేను మీకు చెప్తున్నాను- భగవంతుడికి తెలుసు. నేను నిజం చెప్తున్నాను నాతో ఉండడమో లేక వెళ్ళిపోవడమో నిశ్చయించు కోడానికి యీ అవకాశం యిప్పుడు మీకు యిస్తున్నాను.

"నిన్నను మెహెరాబాదు చెప్పాను. 'ఎవరిమాట ఎలా ఉన్నా నేనయినా ఏ పరిస్థితులలోనయినా సంతోషంగా ఉండాలి' అని" మీతో వచ్చిన చిక్కు ఏమిటంటే, మీ మనస్సు, మీ వైఖరులు, మీ చిరాకు, యివి చాలు నేను ఎలాటిస్నేహితులనయినా, సహచరులనయినా వదులుకోడానికి. వాళ్ళని నేను నిందించను – కాని తప్పకుండా వాళ్ళని వదిలేస్తాను నాకు తెలుసు మనసును అదుపులో పెట్టడం ఎంతకష్టమో. నియమాల ప్రకారం నా ప్రమాణం మీ ప్రమాణాల ప్రకారం నేను యివన్నీ నా మనసులో పెట్టుకొని అవసరం వచ్చినపుడు నిర్ణయం తీసుకోవాలి మీరు నిశ్చయించుకోడానికి ముందు మిమ్మల్ని మీ కష్టాలేమిటో అడిగి తెలుసుకుంటాను

ఒప్పుకొన్న నేను తృప్తిపరచడానికి ప్రయత్నిస్తాను తరువాత మీ మీ నిర్ణయాలు చేసుకోండి ఆ తరువాత ఎవరినీ తృప్తి పరచడమనేదే వుండదు నిజం. నమ్మండి. నేను అబద్ధం చెప్పను కదా. ఇంకోసంగతి విశదం చేస్తాను. నేను వ్యక్తులవారీగా అందరి ముందూ అడుగుతాను. ఎందుచేతంటే వేరే వేరే పిలిచి అడిగితే ఎవరికయినా నేను అనవసరంగా వారికి ఎక్కువ ఉపకారం కలుగ జేసేలా ఏదయినా చేస్తానని అనుమానం రావచ్చు- వ్యక్తిగతంగా ఉన్న చిక్కులను నేను పరిష్కారం చేయ డానికి ప్రయత్నిస్తాను నేను ఎవరికి ఎక్కువ వితరణ చూపించను. ఎవరిపట్ల యితరులపట్ల లేని త్యాగం చూపించను. ఏ విధంగానూ నిబంధనలకి విరుద్ధంగా ప్రవర్తించను " అన్నారు బాబా.

ఇలా మాట్లాడుతూ బాబా దౌలత్‌సింగ్ వైపు తిరిగి అతనిని తమ వద్దకు వచ్చి ఒక్క లెంపకాయ (దావాను) కొట్టమని దౌలత్‌సింగ్‌ను ఆజ్ఞాపించారు. ఏ సంకోచమూ లేకుండా దౌలత్ సింగ్ బాబా చెప్పినట్లే చేసాడు అందువలన బాబా అతని విధేయత చూసి చాలా సంతోషించారు. తరువాత సహచరులందరిని వచ్చి బాబాకు ఎదురుగా నిలబడమన్నారు. వారు ఆ విధంగా వరుసలో నిలబడగానే బాబా ప్రతివారి పాదాలు తమ చేతితో స్పృశించారు. బాబాతో తమ మనసులలో ఉన్నది చెప్పుకుందామని బాబాతో వేరే మాట్లాడాలని చాలా మంది కోరారు. బాబా అందరిని బయటకు వెళ్ళమన్నారు అప్పుడు వ్యక్తిగత సంభాషణలు ప్రారంభమయినవి. ఆదీతో తప్ప యితరులెవరితోను సంభాషణలు ఆట్టేసేపు పట్టలేదు అందరూ కూడా బాబాతోనే వస్తామని వారి నిర్ణయాలు తెలియపరిచారు. ఆదీతో కూడా బాబా మాట్లాడిన తరువాత బాబా సహచరులందరిని పిలిచి ఆదీతో మాట్లాడను. అతడు సరిగా అవగాహన చేసుకోలేను అతని మనసులోని సందేహాలను తీర్చాను అపార్థాన్ని తొలగించాను ఇప్పుడతని మనువైఖరి సరిగా ఉండేలాగ భగవంతుడు సాయ పడతాడు. అతడు సంతోషంగా ఉండడానికి నూటికి నూరుపాళ్ళు ప్రయత్నం చేస్తాడు. అతనికి నేనేమీ వాగ్దానం చేయలేదు.

వ్యక్తిగతంగా సహచరులకున్న చిక్కులు విడదీయడానికి బాబా ప్రారంభిం చారు నీలు నీళ్ళగురించి ఏదోచెప్పాడు. నూతిలోనుండి నీరు తీసుకురావడానికి 4 గురు చాలరని అతడన్నాడు తరువాత దౌలత్‌సింగ్ బాబాని రెండు నెలల సెలవు అడి

గాడు. అతని కుటుంబవ్యవహారాలు దిద్దుకోవాలని వెళతానన్నాడు అతని కుటుంబం బెంగుళూరులో ఉన్నారు. బాబా అతనికి నూతన జీవిత నిబంధనలు తెలియనందుకు బాబా అతనిపై జాలి పడ్డారు. అయినా అతనిని బాబా క్షమించి సాయంత్రానికి ఏ సంగతీ నిశ్చయించుకుని చెప్పాలని బాబా అతనికి అవకాశం యిచ్చారు. దౌలత్ సింగ్ ఆ రోజు ఆందోళన చెందాడు కలవరపడ్డాడు. చివరికి ఆ సాయంత్రానికి బాబాతోటే ఉంటానని చెప్పగలిగాడు. అప్పుడు బాబా అతనిని తన విచారాన్ని తన చింతలను అన్నీ మరచిపొమ్మన్నారు. సంతోషంగా ఉల్లాసంగా ఉండమన్నారు. తన కప్పజెప్పిన పనులను హృదయపూర్వకంగా చేయమన్నారు.

నూతన జీవితంలో బాబా సహచరులు రాజకీయాలు మాట్లాడకూడదు. పత్రికలు చదువరాదు శుభ్రమయిన ఆహారం తీసుకొని ఆరోగ్యం చక్కగా చూసుకోవాలి వారణాసిలో నవంబరు 25 వ తేదీనుండి 20 రోజులుండడానికి తగిన బసవెదకి ఏర్పాటు చేయమని చెప్పి బాదా సదాశివ పటేల్‌ను, బాబాదాస్‌ను అక్కడికి పంపారు. తమవగ్గర అప్పుడు ఉన్న 500 రూపాయిలతో 20 రోజులూ తమబృందం 20 మందికి భోజనం పెట్టేవారెవరయినా ఉన్నారా అని విచారించమని బాబా వారికి చెప్పారు.

బాబా ఒకసారు తమ నూతన జీవిత సహచరులలో ఒకనితో అన్నారు—

'నా ప్రియమైన స్నేహితుడా ! నా ఆజ్ఞలను పాలించడంలో నేను అవి చేయమన్నట్లుగా చేసి నీవు నూటికి నూరుపాళ్ళు జయంపొందితే, అప్పుడు నీవు నాకు యజమానివవుతావు. నేనే నీకు బానిసనవుతాను ''

బాబా తమ సహచరుల వ్యక్తిగత అవసరాలకు యీ క్రిందివి సరఫరా చేసారు.

అందరికీ తలొక గొంగళీ, వారి దగ్గరున్నది కాక, బాబా యిప్పించారు. డా॥ డాన్‌కిన్‌కి మాత్రం దోమతెర యిచ్చారు ఏడుగురికి తలొకదుప్పటీ యిచ్చారు. దళసరయిన ఆ దుప్పటితో ముసుగు పెట్టుకు పరుంటే దోమలేమి చెయ్యవు కొద్ది మంది సహచరులకు చాలినన్ని బట్టలు లేవంటే అహమదనగర్ నుంచి బెల్గాముకు తీసుకువచ్చిన రెండోజత దుస్తులు వారిని ఉంచుకోమన్నారు అందరికీ కాకుండా కొంతమందికే దుప్పట్లు యివ్వడం బాబాకి తృప్తి నివ్వలేదు బాబాకి యిష్టమయిన

వారికే యిచ్చారనే మాట వస్తుంది, అలాంటిదేమీ లేకపోయినా. నూతన జీవితంలో అందరూ ఒకటే బాబాకి. అందుచేత విష్ణుని పిలిచి అందరికీ కూడా దుప్పట్లు యిప్పిన్నారు యాభై రూపాయిలు ఖర్చుచేసారు యిందుకోసం. డాన్‌కి దోమతెర యిచ్చారంటే అది ప్రత్యేకంగా యిష్టం చూపించడం గాదు ఇతరులతో పోలిస్తే అతడు చాలా బాధపడ్డాడు అయినా అతడేమీ గునియలేదు పైగా ఎల్లప్పుడు సంతోషంగా ఉల్లాసంగా ఉంటున్నాడు. అతని అలవాట్లు వేరు. భారతీయుల అలవాట్లు వేరు దినకృత్యాలలో అతనికేవీ ప్రత్యేకతలు చూపలేదు. ఈ దోమతెర విషయం ఒక్కటే యితరులకు లేకుండా అతనికిచ్చినది. అతని జీవితం యితరుల కంటె పరీదుర్భరం అవకూడదుకదా

ఆ సాయంత్రం బాబా సహచరులతో కూర్చొని ఉదయం నుంచి రాత్రి వరకూ ఏపని ఎప్పుడు చెయ్యాలో సమయాలు నిర్దేశించారు సహచరులంతా ఉదయం 5–30 గంటలకు లేవాలి. ఉదయం టీ 6 గంటలకి తీసుకోవాలి మధ్యాహ్నం భోజనం 11–30 గంటలకి తీసుకోవాలి. తరువాత టీ 2–15 గంటలకి తీసుకోవాలి. సాయంకాలం 6 గంటలకి భోజనం చేయాలి అందరూ రాత్రి 8 గంటలకి పరుండాలి ఎవరెవరు ఏ పని చేయాలో కూడా బాబా నిర్ణయించారు విష్ణు, మురళి బజారుకెళ్ళి సరుకులు కొనుక్కురావాలి. కాకా, బైడుల్ వంటపని చెయ్యాలి వారికి మురళి సహాయం చెయ్యాలి ఇంట్లో ఉన్నప్పుడు ఏరచ్, దౌలత్‌సింగ్ పాత్రలు పరిశుభ్రపరచాలి (అంట్లు తోమడం వగైరా) స్త్రీలకి పురుషులకి కావలసిన నీటిని నీలు, అదీ, పెండు, ఆలి అక్బర్, డా॥ డాన్ సరఫరా చెయ్యాలి డా॥ డాన్ ప్రతి ఉదయం రైలుస్టేషన్‌కి ఉత్తరాలు తేవడానికి వెళ్ళాలి. ఎద్దులకోసం గడ్డి కోసుకు రావాలి. అతని కొక్కడికి మాత్రం యిష్టం వచ్చినపుడు 3 మైళ్ళదూరం కంటె ఎక్కువపోకుండా షికారు వెళ్ళిరావచ్చునని బాబా అనుమతి యిచ్చారు.

అక్టోబరు 26, 1949 తేదీ బాబాదాస్‌ను, సదాశివపటేల్‌ను కాశీ వెళ్ళమన్న రోజు ఆ రోజున బాబా వారితో చాలాసేపు కాశీలో చేయవలసిన ఏర్పాటులను గూర్చి మాట్లాడారు అక్కడ 20 రోజులు ఉండడానికి తగిన వసతి చూడాలి కాశీలో మళ్ళీ అమ్ముడు పోయేవిగా చూసి రెండు ఆడగాడిదలను, రెండు ఆవులను కొనడానికి చూసి పెట్టాలి కాశీలో ఎలా జీవించాలో అక్కడ వారి నడవడి ఎలా ఉండాలో కూడా బాబా వారితో చెప్పారు. ఈ సంగతులు అందరికీ వర్తిస్తాయి గనుక మిగతా సహచరు

లనుకూడావినమన్నారు బాబా. వార్తాపత్రికలు చదువరాదని, రాజకీయాలు మాట్లాడకూడదని (వారిలో వారయినాసరే) మంచి, శుభ్రమయిన ఆహారమే భుజించాలనీ, ఆరోగ్యం బాగా చూసుకోవాలని, ఒకరికొకరు సహకారం చేసుకుంటూ ఉండాలని, ఎవరికయినా సుస్తీ చేస్తే మిగిలినవారు శుశ్రూష చేయాలని బాబా చెప్పారు

"కాకా వద్ద రు 500 మాత్రమే ఉంది కాశీలో 20 రోజులుండడానికి అది సరిపోవాలి అక్కడ యీ 500 రూపాయిలు యిస్తే బాబాకి పరివారానికి 20 రోజులూ ఎవరయినా భోజనం పెడతారేమో కనుక్కోవాలి- భోజనం దానికి తగినట్టుగానే పెట్టమంటే సరి ఇలా భోజనం పెట్టినందుకు మనం రుణపడి ఉండకూడదు అలా యిచ్చేవాడికి దర్శనంగాని, సేవగాని చేసుకోవాలని ఆలోచన రాకూడదు ఇది మామూలు వ్యాపారబేరంలా ఉండాలి డబ్బుయిస్తే భోజనం పెట్టాలి అంతే" అని వారిరువురికి బాబా చెప్పారు.

సదాశివ్ పటేల్, వాజాదాప్ ఆ రాత్రి బండికి బొంబాయి మీదుగా కాశీ వెళ్ళారు దౌలత్‌సింగ్ యితరులను తాను నిర్ణయించుకున్నది సరిగా ఉందా, అని అడుగుతున్నట్లు ఆ సాయంత్రం బాబా తెలుసుకున్నారు బాబాకి అసంతోషం కలిగిందేమోనని అతని భయం

డిసెంబరు ఆఖరిదాకా బాబా సహచరులకు కావలసిన సహాయం చేస్తారు. వాళ్ళుకూడా ఆయనకి సహాయం చేయాలి. "నా కెప్పుడయినా కోపం వస్తే మీరు నాకు కోపం వస్తోందని నేర్పుతో నాకు జ్ఞాపకం చెయ్యాలి పరస్పర సహాయం డిసెంబరు ఆఖరివరకు అవసరం అవుతుంది. జనవరి 1 వ తేదీ తరువాత నూతన జీవితం గాలి మీద ఉంటుంది. ఇందులో హృదయం ముఖ్యం మనసు కాదు. శరీరం దానికదే చూసుకుంటుంది ఇప్పటి జీవితానికీ దానికీ పోలిక ఉండదు. అది పూర్తిగా భిన్నంగా ఉంటుంది అది అసలయిన జీవితం" అని బాబా వారికి చెప్పారు

బాబా దౌలత్‌సింగ్ వైపు తిరిగి "ఇప్పటివరకూ నీ కుటుంబ పరిస్థితుల దృష్ట్యా. నీ కుటుంబం రెండు నెలల్లో యింటికి వస్తామని తీసుకున్న ప్రమాణాన్ని బట్టి నీకు నేను సలహా యిచ్చాను, నీవు ఒక నిర్ణయానికి వస్తావని. ఈ రాత్రి నీ ప్రమాణము, నా ప్రమాణము, ఈ నూతన జీవిత నిబంధనలు యివన్నీ ఆలోచించి నీ గురించి ఒక నిర్ణయానికి వస్తాను. అది నీకు నేను యిచ్చేలక్షణా నీవు నూటికి నూరు పాళ్ళు వర్తించాలి. ఇప్పుడే విచారమూ లేక హాయిగా నిద్రపో" అన్నారు

27 వ తేదీ ఉదయాన్నే బాబా బెంగుళూరు వెళ్ళే రైళ్ళ గురించి వాటి సమయాలను గురించి విచారించారు. విష్ణు ఉదయం 9 గంటలకు మెయిలు ఉందని చెప్పాడు బాబా దౌలత్‌సింగ్‌ని పిలిచి మిగిలిన సహచరులందరిని సమావేశం కమ్మని కబురంపారు వారంతా వచ్చి కూర్చున్న తరువాత బాబా యిలా చెప్పారు — "మిత్రుడా! నే చెప్పేది జాగ్రత్తగా విను. నీవు నీ పాత జీవితానికి తిరిగి వెళ్ళి పోవాలని నేను నిశ్చయించాను. నీ వల్ల తప్పు ఏదీ జరుగలేదు గనుక ఏ విధంగాను నేను చెప్పినది నీవు జరిగించకుండా ఉండలేదు గనుక నీవల్ల తప్పు లేకుండానే నిన్ను పంపించేస్తున్నాను నా అంతట నేను ఎవరినయినా వారి తప్పు లేకుండా పాత జీవితానికి పంపించేస్తే వారికి అవునని చెప్పిన వారితోగాని కాదని చెప్పినవారితో గాని ఏ సంబంధమూ ఉండదు. "నేను యిప్పుడు నీకు యివ్వబోయే కొన్ని ఆజ్ఞలను నీవు నాటికి నూరుపాళ్ళు పరిపాలిస్తే నా నూతన జీవితంలో నీవు నూటికి నూరుపాళ్ళ పాల్గొంటున్నావన్నమాటే ఈ రెండూ మాత్రం ఎప్పుడూ నీ బాధ్యతలై ఉంటాయి" (1) నీ కేవయినా జరిగితే దానికి బాధ్యత భగవంతుని సాక్షిగా అది నీదే (2) నా వల్లనుంచి భౌతికమయినది గాని ఆధ్యాత్మికమయినదిగాని లాభం చేకూడుతుందని ఆశించకూడదు నా అంతట నేనే నిన్ను పంపించేస్తున్నాను గనుక నాతో నీకు ఆధ్యాత్మిక సంబంధం ఎప్పటిలాగానే ఉంటుంది, ఫలితాలు ఎలా ఉన్నా నన్ను నీవు ఎవరుగా భావిస్తున్నావో అదే నేనయితే

"నీకు ప్రత్యేకంగా ఆదేశాలిస్తున్నాను —

"(1) నీవు బ్రతికి ఉన్నన్నాళ్ళు నీ భార్యతో కామ వాంఛతో ప్రవర్తించ కూడదు

(2) నీవు ఎన్నడూ అసత్యం పలుకకూడదు.

(3) నేను నీకు యివ్వబోయే కఫ్నీ సంవత్సరంలో ఒక్క నెల ధరించాలి. ఆ నెలలో నీవు భిక్షాటన చేసి జీవించాలి ఏ ఊళ్ళో భిక్షమెత్తాలో ఏ సమయంలో భిక్షకై వెళ్ళాలో నీవే నిశ్చయించుకోగలవు ఈ మూడు ఆజ్ఞలు నూటికి నూరుపాళ్ళు నీవు పాలన చేస్తే నా నూతన జీవితంలో నీవు నూటికి నూరుపాళ్ళ పాల్గొంటున్నావన్నమాట.

"మీ స్త్రీ పురుషుల కోసం నేను ఏమి చేసిపెట్టానో యిప్పుడు మీ అందరికీ నేను ప్రకటిస్తాను పాద్రిలాటి "కాదు" అని చెప్పిన వారికి కూడా యిది వర్తిస్తుంది మెహెర్‌జీవద్ద నా సహచరులకు — వారిని ఎవరినయినా వారి తప్పు లేకుండా నేను పంపించేస్తే — ఒక్కొక్కరికి వెయ్యి రూపాయిలు, నేనొకవేళ చనిపోతే. యిమ్మని చెప్పి ఉంచాను. అందుచేత దౌలత్‌సింగ్ : నీకు నేను సంతకం చేసి ఒక కాగితం యిస్తాను. నీవు మొదట బెంగుళూరు వెళ్ళు తరువాత సాధ్యమయి నంతత్వరగా అక్కడినుంచి బొంబాయి వెళ్ళి మెహెర్‌జీ వద్దనుంచి రు 1,000 లు తీసుకో నీ కిచ్చిన చీటీ. ఉత్తరం చూపించు అతడు డబ్బు యిస్తాడు ఈ డబ్బు నీ కుటుంబ ఖర్చుల నిమిత్తం నీవు ఉపయోగించ గలవు ఇక్కడమంచి నీకు నాతో భౌతికమయిన సంబంధం మిగలదు."

అలా చెప్పి బాబా దౌలత్‌సింగ్‌కి బాబా సంతకముతో చీటీ తయారు చేయించి యిచ్చారు అప్పుడు తను బాబా వద్ద యితర మిత్రుల వద్ద సెలవు తీసుకొని దౌలత్‌సింగ్ వెళ్ళిపోయాడు.

ఆ మధ్యాహ్నం బాబా సహచరులందరిని సమావేశపరచి యిలా చెప్పారు- "డిసెంబరు ఆఖరు వరకు ఎవరయినా సహాయకర మయిన సూచనలు చేయవచ్చు. ఆ తరువాత నేను కావాలని అడిగితే తప్ప ఎవరూ ఎట్టి సూచనలు చేయవద్దు.

మొదటిసారి సహచరులందరిని పిలిచి బాబా యిలా చెప్పారు — "నా కేదయినా అయి నేను మరణించినట్లయితే మీకు ఒక్కొక్కరికి వెయ్యిరూపాయిలిమ్మని మెహెర్‌జీ వద్ద దాచి ఉంచాను లేక ఎవరినయినా వాని తప్పులేకుండా నేను పంపించేస్తే కూడా ఆ వ్యక్తికి ఆ సొమ్ము యివ్వబడుతుంది" అలాగే యిప్పుడు దౌలత్‌సింగ్ నేరం లేకపోయినా అతనిని యింటికి పంపించినందువల్ల అతనికి వెయ్యి రూపాయిలిమ్మని మెహెర్‌జీకి చీటీ వ్రాయించి యిచ్చారు బాబా దౌలత్‌సింగ్ బాబా వద్ద సెలవుతీసుకొని యితర స్నేహితులకు అందరకు చెప్పి వెళ్ళాడు

ఇల్లు తుడవడం, గిన్నెలు కడగడం, వంటయింట్లో సహాయం చేయడం, సామానులు మోయడం, యిలాంటి పనులన్నీ బాబా చేయడం మొదలుపెట్టారు.

ఒకరోజున డా॥ నీలూ, డా॥ గనీ యిద్దరూ కోపంగా మాట్లాడుకుంటూంటే విని బాబా వారిద్దరినీ రమ్మని తమ (బాబాయొక్క) చెప్పులు వారిద్దరిని గిల్లమని చెప్పారు

బెల్గామ్‌లో వీరు బసచేసిన చుట్టుప్రక్కల జనులు బాబాను దర్శించాలని కోరగా తమ సంగతి ఎవరికీ చెప్పవద్దని సహచరులను బాబా కోరారు. స్వంత విషయాల గురించి ఎవరూ సూచనలు చేయనక్కరలేదు ఎవరికయినా ఉన్న స్వంత చిక్కుల గురించి నేను అడిగినట్లయితేనే అతడు తనకున్న కష్టాల గురించి ఉన్నది ఉన్నట్లుగా అతిశయోక్తి లేకుండా నిజం చెప్పాలి.

28 వ తేదీ ఉదయాన సహచరులను మామూలుగా కుశల ప్రశ్నలడిగిన తరువాత బాబా విష్ణు బాధపడుతున్న మోకాలు నొప్పి గురించి డా॥ డాన్‌కిన్‌ను సంప్రదించారు. అతనికి కావలసిన మందులు కొనడానికి అయిదు రూపాయిలు ఖర్చుపెట్టమన్నారు బాబా. అదిగాక 3 రూపాయిలు పెట్టి వెచ్చని ఊలు కట్టు తీసుకోమన్నారు

తరువాత వారంతా బెల్గామ్ నుంచి కాశీకి నవంబరు 20 వ తేదీన సాయంకాలం ప్రయాణం అవాలి గనుక, నవంబరు 18, 19, 20 తేదీలలో స్త్రీలకి పురుషులకి హోటలు నుంచి భోజనాలు తెప్పించమన్నారు ఈ 3 రోజులు సామానులు సర్దుకోవాలి ప్రయాణానికి. అప్పుడు తన సహచరులందరిని పిలిచి బాబా, జనవరి (1950) 1 వ తేదీ తరువాత విషయం గురించి యిలా చెప్పారు —

“1950 జనవరి 1 వ తేదీనుంచి ప్రారంభం అయే నూతన జీవితంలో నేను కూడా చేసే కొన్నిపనులు మిమ్మలను నేను చేయమనవచ్చు. ఒక్కొక్కప్పుడు నేను చేయని పనులు కూడా మిమ్మల్ని నేను చేయమని చెప్పవచ్చు ఎలాగయినా మనమందరం నూతన జీవితంలో పాల్గొంటాము.

“నేనేదయినా చేయవచ్చు. మిమ్మల్ని ఏదయినా చేయమనవచ్చు. నేను చెప్పినది మాత్రం మీరు తక్షణమే ఆచరించాలి. అసామాన్యమైనవి అసాధారణ మయినవి నేనూ మీరూ కూడా చేయవలసి ఉంటుంది, నేను అనుకునే నవ్యజీవితం అమలులోకి వస్తే మామూలు పనులు కూడా మీరూ నేనూ చేస్తాము.

అసామాన్యము అసాధారణము అయిన పనులంటే ఏవో నేను యిప్పుడు మీకు చెప్పలేను. ఎందువేతనంటే అవి నాకే తెలియదు. ఇదిమాత్రం తెలుసు. ముందు ముందు అసామాన్యమయినవి అసాధారణమయినవి కొన్ని సంగతులు తరచుగా జరుగుతాయి. అలాటి సంఘటనలతో నూతన జీవితం అందలి బాధ మనం సంతోషంతో అనుభవింపవలసి ఉంటుంది నూతన జీవితం ఎంత బాధాకరంగా ఉన్నప్పటికీ అన్ని విధాలా అది ఆనందకరంగా ఉంటుంది

"సహజముగాను, మామూలుగాను, సాధారణముగాను ఉండే సంగతులు సంఘటనలు అంటే కొన్ని ఉదాహరణలను యిస్తాను. "ఒకటి మాత్రం మీకు చెప్పాలి. నిబంధనలు, ఆజ్ఞలు యివే నూతన జీవితానికి మీకూ నాకూ కూడా నూటికి నూరుపాళ్ళు పునాదిగా ఉంటాయి, నేను యీ నిబంధనలనుంచి స్వేచ్ఛగా ఉన్నప్పటికీ "ఉదాహరణలు—పాత జీవితంలో చేసిన మస్తుల, సాధువుల, సాంగత్యం యిప్పుడు చేయడం లేదని మీ అందరికీ తెలుసును. అయినప్పటికీ నూతన జీవితంలో మనం ఎక్కడికి వెళ్ళినా నేను మస్తులను చూడవచ్చును మీచేతకూడా వారినిదర్శింప చేయవచ్చును నేను సాధువులను చూడవచ్చును మీరుకూడా వారి దర్శనంచేసేలా నేను చేయవచ్చును నేను సత్పురుషులను చూడటానికి వెళ్ళవచ్చును మీచేతకూడా అట్లు చేయించవచ్చును మీలో ఎవరినయినా గాని నేను ఒక యోగి కుటీరానికి వెళ్ళి ఆ రాత్రికి అక్కడ ఉండమని చెప్పవచ్చును, ఆ యోగి ఒప్పుకుంటే ఒక మజ్జూబ్‌ని నేను తీసుకువచ్చి అతనికి స్నానం చేయించమని మీతో నేను చెప్పవచ్చును. యోగుల యొక్క గృహాలలో ఉండమని నేను చెప్పవచ్చు. ఇవన్నీ మామూలు సంగతులకి ఉదాహరణలు. అసాధారణమయినవీ అసామాన్యమయినవీ జరిగినప్పుడు మీరు బాధ పడేటప్పుడు అది సంతోషంతో అనుభవిస్తారని మాత్రం నేను చెప్పగలను.

"ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే నాకు మీరు నూటికి నూరుపాళ్ళు విధేయులుగా ఉండటానికి, మీరు సిద్ధంగా ఉంటారని. మీరంతా నేను చెప్పినది చెప్పినట్లు, ఏ సంకోచమూ లేకుండా వింటే, నేను మీకు సహాయం చేదామని ప్రయత్నిస్తున్నట్లు మీరు నాకు సహాయం చేస్తున్నవారవుతారు.

ఇది ఆఖరి వివరణ — మనం నవంబరు 20 వ తేదీన యీ స్థలం వదలి వెళ్ళేవరకు యిలాటిదేమీ యింక ఉండదు "—అని బాబా విశదీకరించారు బాబా

ఒకమారు కుటీరంలోకి వచ్చి ఆ గది చీపురుతో ఊడిచారు ఆ పని గుస్తాదేజీ చెయ్య వలసినది. ఆరోజున అతనితో కలసి చేసారు బాబా సహచరులకు శిక్షణ జరిగిన కాలంలో బాబా చీపురుతో ఊడవడం, పాత్రలు శుభ్రపరచడం, వంట పనిలో సహాయం చేయడం, బరువులు మోయడం యివన్నీ చేస్తూఉండేవారు

సాధారణంగా ప్రతిరోజూ ఆదీ పాడడము, బాబా మద్దెల వాయించడం జరుగుతూండేది. అప్పుడు డా॥ నీలు తాళాలు వాయించేవాడు అతడు తాళాలు వాయిస్తూంటే బాగుంటవని ఆ అభ్యాసం బాగా చేయమన్నారు. మధ్యాహ్నం టీ త్రాగిన తరువాత బాబా యీ శిక్షణ కాలము పరస్పర సహాయం మీద ఆధారపడి ఉందని చెప్పారు బాబా ఏ విధంగా 31 వ డిసెంబరు వరకు వారికి సహాయం చేయడానికి ప్రయత్నిస్తున్నారో వారుకూడా ఆ విధంగా సహాయం చేయడానికి ప్రయత్నించాలని చెప్పారు అందుకనే ఆయన కోపంవస్తూన్నట్లు చూడగానే ఆ సంగతి వారు బాబాకి చెప్పాలన్నారు "మీరు నాకు చేసే అన్నిటికంటె గొప్ప సహాయం ఏమిటంటే యిష్టం తోను సంకోచం లేకుండాను నేను ఆజ్ఞ యివ్వగానే ఆ ప్రకారం చేయడమే." అన్నారు బాబా. ఉదాహరణకి, ఎప్పుడయినా బాబా ఆయన శిరసు ఎవరి పాదాలమీద యినా ఉంచితే వారను అలాగ చేయనివ్వాలి ఎవరినయినా ఆయనను తన్నమంటే అతడు దాన్ని గురించి ఏమీ అనుకోకుండా ఆ ప్రకారం చెయ్యాలి.

అక్టోబరు 29 వ తేదీ ఉదయాన్నే హరిద్వార్ ఆస్తిగురించి తమ సహచరులతో చర్చిస్తూ బాబా యిలా అన్నారు :—

"ఎరచ్, కాకా బారియా, ఢిల్లీవాసుడయిన కేకిదేశాయి యీ ముగ్గురు పేర్లతోనూ హరిద్వార్ ఆస్తి కొనడం జరిగిందని మీ కందరకు తెలుసును బెల్గామ్‌లో మనం నివసిస్తున్న దానిలాగే అదీ ఉంటుంది- ఆ స్థలం దేరాడూన్‌కి 4 మైళ్ళున్నూ హరిద్వార్‌కి 28 మైళ్ళున్నూ ఉంటుంది. అది దేరాడూన్ – హరిద్వార్ రోడ్డుమీద ఉంది రిషీకేశ్‌కి, భగీరధికి, తపోవన్‌కి సమదూరంలో హిమాలయ ప్రాంతంలో ఉంది. అది ఉండడం హరిద్వార్ కంటె దేరాడూన్‌కి దగ్గరలో ఉన్నా నేను దాన్ని హరిద్వార్ ఆస్తి అని అంటున్నాను దానికొక కారణం ఉంది. ఈ నూతన

జీవితంలో మనకు దేరాడూన్‌కంటె హరిద్వార్ రిషీకేశ్‌లతో ఎక్కువ పని ఉంది. దేరాడూన్‌కి దానితో నూటికి ఒక్కవంతు కంటె సంబంధం లేదు.

" ఈ హరిద్వార్ ఆస్తి మంజిమాఫీ అనే గ్రామంలో ఉంది ఆ గ్రామం పేరుకి అర్థం ఏమిటంటే – "పిల్లులు క్షమించబడ్డాయి" అని అంటే అక్కడ ఎలుకలు లేవు అని అనుకోవచ్చు " దీనినే మెహెర్‌మాఫీ అని అంటున్నారు.

బాబా యింకా యిలా చెప్పారు –

"ఈ హరిద్వార్ భూమిలో రెండు గదులు, ఒక వసారా, ఒక వంటగది, స్నానాల గది ఉన్న కట్టడం ఒకటి ఉంది వినడానికి యిది బాగానే ఉంది. ఎలా ఉంటేనేం మనం అది కొనడం అయింది. దానికోసం ఒక విల్లు వ్రాయడం జరిగింది. అది యిప్పుడు రంజూవద్ద ఉంది ఆ విల్లులో ఏమి వ్రాసానో మీరందరూ తెలుసుకోవాలి ఎందుకంటే యీ నూతన జీవితంలో దాపరికం ఏదీలేదు. దేని గురించి రహస్యం లేదు.

ఇదివరలో చెప్పినట్లు యీ ఆస్తి ఎరచ్, కాకా, కేకిదేశాయి యీ ముగ్గురి పేర్లతో కొనబడింది ఇందులో ఏ ఒక్కరైనా చనిపోతే మిగిలిన వారిద్దరు యాజమాన్యం వహిస్తారు ఇద్దరు పోతే మూడవవాడు దానిని నిర్వహిస్తాడు. ముగ్గురూ చనిపోతే యీ ఆస్తి ఏర్పాటుదార్లకు వెళ్ళిపోతుంది ఇది మీకు బాగా తెలిసిందనుకుంటాను పై ముగ్గురి యొక్క స్వంతానికి చెందదు యీ ఆస్తి అంటే వారు చనిపోతే వారి వారసులకు చెందదు యీ ఆస్తి. వారి జీవితంలోనూ తరువాత కూడా అందరూ ఉపయోగించడానికే యిది నా అనంతరమందు నా సహచరులు దానిని వారి యిష్టం వచ్చినట్లు చేయవచ్చు నూతన జీవితం కొనసాగించవచ్చు వారు, లేదా వారిష్టం వచ్చిన చోటుకి వారు వెళ్ళవచ్చు వారు హరిద్వార్ ఆస్తి అనే యీ యింటిలో ఉండవచ్చు లేక వారిష్టమొచ్చిన ప్రకారం వారి జీవితం వెళ్ళబుచ్చవచ్చును నా సహచరులలో _ నీలు లాటివాడు ఎవరయినా – యిందులో ఉండాలనుకుంటే ఏ యిబ్బందీ ప్రతిబంధకమూ లేకుండా యిక్కడ ఉండవచ్చు "

సహచరులూ, ఏర్పాటుదార్లు అంతా చనిపోయాక యిది ఏమవుతుంది ? అని అడిగితే బాబా "అగతా క్రిస్టీ రచించిన 'అప్పుడూ ఎవ్వరూ లేరు' అనే అపరాధ

పరిశోధక నవల జ్ఞాపకం వస్తోంది ' అన్నారు దావా చెప్పారు —"అంతా పోయిం తరువాత ఏమవుతుందో అని మెంమెకు ఆలోచించడం అందులో అర్థమేముంది ; అది ఎలా పోతే మనకేం ఎవరికి కావాలి ?" అన్నారు "ఇండియాలో ఏదీకూడా నాదికాదు. నా పేరుతో ఏమీ లేదు. బెల్గాంలో ఉన్న యీ 22 ఎకరాల భూమి వెనుక నాపేరులోనే ఉండేది. ఇది విష్ణు వాడిగారి పేరుకి (సోచరి వర్త _ విశ్వనాథ్ హల్దన్ కర్ ) ఏదో కొద్ది సొమ్ము యిస్తే హవాలా చేయబడుతుందని అనుకున్నాము. కాని విష్ణు ఒకే మంచి సూచన చేసాడు. ఏదో కొంత ధనం తీసుకొని మిగతాదంతా వ్రాసేసినా యింటితోబాటు నాలుగు ఎకరాల భూమి మాత్రం మెహెరా పేరులో ఉండా లన్నాడు. ఈ ప్రకారం ఒప్పుకోవడమయింది మెహెరా క్రొత్త జీవితంలో ఉంది గనుక, అందులోనుంచి ఆమె తిరిగిపోదు గనుక యీ ఆస్తి హలదన్కర్, మశిదేవ రుక్కర్ (విష్ణుసోచరి) మరియు ఏర్పాటుదార్లు యీ ఆస్తిని చూస్తూఉంటారు. ఆస్తి యాజమాన్యము, నిర్వహణ నిబంధనలు యీ ఆస్తికి, హరిద్వార్ ఆస్తికికూడా వర్తిస్తాయి

ఇంకమనం ప్రశ్నలన్నీ చర్చలన్నీ మానేద్దాం తప్పుడు సూచనలు చేయవద్దు సందేహాలు వద్దు. ఈ శిక్షణకాలంలో కూడా నే చెప్పినది శిక్షలో ఒక ఆవేశంగా ఎవరు ప్రశ్న లేకుండా అంతా వినాలి మీలో ఎవరయితే నేనింకా పాత జీవితపు విధానంగా ఉన్నానని అనుకుంటున్నారో వారు నాతో ఉండలేరు మీకు నిజం చెప్తున్నాను అందుకని యిందులో రహస్యంలేదు, యితరులకి కాకుండా ఏ ఒకరినీ యిష్టపడి చేసిందేమీలేదు ఒకరిని మోసం చేసిందిగాని, ఒకరికి వాగ్దానాలు చేసిందిగాని ఏమీలేదు – అంతా పరిశుభ్రంగా అనుమానం లేకుండా ఉంటుంది నేను చేసిన ప్రమాణానికి నూటికి ఒకపాలు కూడా వ్యతిరేకంగా నేను నడవాలని నాకు లేదు. మిమ్మల్నెవరినీ అలా చేయనివ్వను

"ఈ ఆస్తి యిప్పుడు మెహెరాది అయినప్పటికీ యిది ఆమె స్వంతం అయిపోవాలని నా కోరిక కాదు అంటే ఆమె చనిపోయినప్పుడు ఆ తరువాత ఆమె బంధువులు ఎవరికీ యిందులో హక్కు ఉండదు మీరు ఒకటి నమ్మవచ్చు బాబా యిక్కడకి (బెల్గామ్కి) మళ్ళా వచ్చేదిలేదు స్త్రీలూ రారు మెహెరా అనంతరమందు యీ భూమి సంగతి ఒక విల్లుద్వారా నిశ్చయింపబడుతుంది. విల్లు మసాయిదాలో మెహెరా అనంతరమందు యీ ఆస్తి నలుగురు ఏర్పాటుదార్లకు చెందుతుందని

వ్రాయబడుతుంది — వారు ఎవరంటే — సరోష్, రంజూ, మెహెర్‌జీ, నారిమన్‌లు. మన నూతన జీవిత ప్రారంభంలో మనం యిక్కడ నివసించామని జ్ఞాపకార్థంగా యీ భూమిని వారు చక్కగా చూస్తారు దీనిని వారు ఎలా కావలిస్తే అలా ఉపయోగించవచ్చు ఋశిని, హల్దన్‌కర్‌ను వారిష్టం వచ్చినట్లు ఉపయోగించడానికి అనుమతించవచ్చును కాని యీ భూమి మాత్రం అమ్మడానికి వీలులేదు" అని బాబా చెప్పారు.

ఏవో అసంబద్ధమయిన, పాడు విషయాల్లో నీలు, గనీలు ఉద్రేకపూరితులవడంతో వారిద్దరినీ వచ్చి బాబా తమ చెప్పులను గిల్లమన్నారు

ఆ మధ్యాహ్నం బాబా సహచరులందరినీ సమావేశపరచి — నేను ఉదయపు సమావేశంలో ఒక్క సంగతి చెప్పడం మరచాను జనవరి (1950) 1 వ తేదీ లగాయతు మనకు ద్రవ్యం లేదని మీకందరికీ తెలుసును మన ఆహారానికి మనం భిక్ష ఎత్తాలి లేక ఎలాగో సంపాదించాలి. ఒక్క సంగతి మీరంతా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆహారం యీ వేళది రేపటికి దాచిపెట్టకూడదు. ఒక చోటనుంచి యింకో చోటుకి వెళ్ళినపుడు ఈ నూతన జీవితంలో ప్రతిరోజు మనకు కొత్తరోజే. ఎక్కడయినా ఒక రోజుకంటె ఎక్కువ కాలం మనం ఉన్నట్లయితే అన్నం కొంత మిగిలిపోతే అప్పుడు అది మర్నాటికి ఉంచుకోవచ్చు నూతన జీవితంలో యీ విషయం అందరూ గమనించాలి

అక్టోబరు (1949) 30 వ తేదీ ఉదయాన్నే మొదటిమాటుగా బాబా, తమ సహచరులు, స్త్రీలు గతరాత్రి బాగా నిద్రపోయారనే మంచివార్త చెప్పారు బాబా ఆ రాత్రి వారి సహాయం చేస్తానని వాగ్దానం చేసినకాలం డిసెంబరు 31 తో వెళ్ళిపోతుందని అది యింకా రెండు నెలలే ఉందని అనుకున్నారు

బాబా వారి సహచరులతో అన్నారు—

"మనం కాశీ నుంచి డిసెంబరు 10 వ తేదీని బయలుదేరుతాము డిసెంబరు 10 నుంచి 31 వరకు మనం కాలినడకను వీలయినచోటల్లా భిక్షాటన చేస్తూ వెళ్తాము ఈ కాలంలో నా సహాయం మీకు కలుగుతూనే ఉంటుంది. జనవరి 1 నుంచి మనం కాలినడకను వెడుతున్నా, భిక్షాటన చేస్తూ ఉన్నా నా సహాయం మాత్రం యింక ఉండదు అది ఆపివేయబడుతుంది మహాప్రళయ కాలంలో సృష్టి అంతమయినట్లే

అది హరిద్వార్‌కి మనం నడిచి మార్చి (1950) ఆఖరికి చేరుకుంటామనుకుంటాను. ఈ పాదయాత్రలో డిసెంబరు ఆఖరివరకూ నా సహాయం మీకు ఉంటుంది మామూలుగా జరిగే యాధికమైన జీవితంతోపాటు అసాధారణము అసామాన్యము అయినసంఘటనలు కూడా మీరు సులభంగా ఎదుర్కోవడానికి నేను అన్ని ఏర్పాట్లు చేస్తున్నాను. నా మనసులో ఉన్న చిత్రం రూపం ధరిస్తే ఏప్రల్ 1950 నుంచి మీ అందరికీ అసాధారణ సంఘటనలు కూడా మామూలు దైనందిన వ్యవహారంగానే ఉంటాయి. మనం హరిద్వారంలో 2, 3 నెలలు ఉన్నా, ఆ కాలం అంతా అక్కడే విడవకుండా ఉంటామని అర్థం కాదు స్త్రీలకి అక్కడ నేను నివాసం ఏర్పరచవచ్చు మనం బహుశా వస్తూ పోతూ ఉంటాము. ప్రస్తుతం యీ క్షణంలో నేను అనుకుంటున్నదదీ. ఇది మాత్రం చెప్పగలను హరిద్వారం మనంవదిలాక మనకు జీవితం అసలయిన జీవితం అవుతుంది డిసెంబరు 10 వ తేదీని కాశీనుంచి బయలుదేరేమనుకుందు అక్కడ సాధ్యమయితే 20 రోజులుండాలి రాత్రినేను అదే ఆలోచించాను జనవరి (1950) 1 వ తేదీ తరువాత మనం ఎక్కడ ఉన్నప్పటికీ అది శిక్షణకోసం కాదు. దీన్ని గురించి బాగా ఆలోచించుకోవాలి. బహుశా నేను డాన్‌కిన్‌ని దేరాడూన్‌కో ఢిల్లీకో వెళ్ళి స్త్రీల కోసం కొన్ని పుస్తకాలు తెచ్చిపెట్టమనాలనుకుంటున్నాను" అని చెప్పారు బాబా.

కాశీలో బాబా వారి సహచరులతో 25 రోజులయినా ఉండేటట్లు చూడడం కోసం ఒక కార్యక్రమం రూపొందించి ఏర్పాటుదార్లకు తెలియపరచడమయింది. సదాశివపటేల్, వావాదాస్ అప్పుడే కాశీకి పంపబడ్డారు వారు యిప్పుడక్కడ ఉన్నారు. ఈ సంగతి వారికి ఒక టెలిగ్రాంద్వారా యీ విధంగా తెలిపారు బాబా.

"బెల్గాం.—తారీఖు 30—10—49.

మేము బెల్గాం నుంచి 12 (నవంబరు) వ తేదీన బయలు దేరతాము. మొగల్‌సరాయి 15 వ తేదీన ఉదయాన్నే చేరుకుంటాము కాశీ బంగళాలో నవంబరు 15 వ తేదీనుంచి 25 రోజులుంటాము ఈ 25 రోజులకు రు 600 లకు భోజనం ఏర్పాటు చేయవలెను. జవాబు వెంటనే యివ్వవలెను.—విలియం డాన్‌కిన్"

టీ అయిన తరువాత బాబా డా॥ డాన్‌కిన్‌ను పిలిచి దేశపటం (మ్యాపు) పరిశీలించి కాశీకి పాదయాత్ర చేయడానికి అనువయిన దగ్గరదారి చెప్పమన్నారు. బాబా

అప్పుడు యిలా అన్నారు—"స్త్రీలు నలుగురకూ నిబంధనలతో పనిలేదు నేను వారికి అన్ని నిర్ణయాలు చేస్తాను వారందరూ మనతో చివరివరకూ ఉండాలి గనుక నిబంధనల గురించి వారికి హెచ్చరిస్తూనే ఉంటాను

నేను తీసుకున్న ప్రమాణం తిరుగులేనిది జనవరి 1950, 1 వ తేదీ నుంచి మీలో ఒక్కరు కూడా నాతో ఉండరు అదే నేను అనుకుంటున్నాను అన్ని సర్దుబాట్లకు, నేను చేసే సహాయానికి అదే కారణం మీరంతా నాతో ఉండడం కోసమే యిదంతాను ఆడవారు ఏ నియమాలు పాటించనక్కరలేదు. నేనిచ్చిన ఆజ్ఞలు మాత్రం వారు పాటించాలి."

అని చెప్పాక బాబా నీలూని పిలిచి తనను (బాబాను) తన్నమని చెప్పారు. నీలు బాబా ఆజ్ఞాపించినట్లు చేసాడు.

బాబా యింకా యిలా అన్నారు –

"కొన్ని విషయాలలో అతి మానుషమయిన పనులు మీవల్ల జరుగుతాయని నేను ఆశిస్తున్నాను. మీతో కూడా నేను చిక్కుల్లో పడ్డాను ఎటువంటి పరిస్థితులలో నయినా సంతోషంగా ఉండడం మానవాతీతమయిన సంగతి అందుచేత మనం ఒండొరులకు సహాయం చేసుకుందాము నేను మీకు సహాయం చేస్తాను మీరు నాకు సాయం చేయండి . మన ప్రమాణాలు నిలుపుకోవడానికి ఒకరికొకరు సాయపడాలి.

పెద్ద జంకానా దులుపుతూంటే గుస్తాద్‌జీకి అలి అక్బర్ సహాయం చేయడం బాబా చూసారు అలి అక్బర్‌ని అప్పుడు "నీకు చెప్పిన పని (నీరు తేవడం, పాత్రలు శుభ్రపరచడం-) తప్ప యింకేమీ చేయవద్దు " అలి అక్బర్‌ని అతడు తప్పు దారిలో పెట్టకూడదు. అలి అక్బర్ గుస్తాద్‌జీ చెప్పినమాట వినకూడదు. ఇలాటిపని జనవరి (1950) 1 వ తేదీ తరువాత జరిగిందంటే నా వద్దనుంచి వెళ్ళిపోవలసి వస్తుందని బాబా అన్నారు

అక్టోబరు (1949) 31 వ తారీఖు ఉదయాన్నే సహచరులందరితోను బాబా కాశీ వెళ్ళిన తరువాత యితరచోట్లా అక్కడ భిక్షాటన చేయడం గురించి చర్చించారు. బాబా చెప్పారు –

"మనం ఆహారం కోసమే భిక్షం యెత్తాలి ఇక దేనికోసమూ అక్కర లేదు ఆహారమంటే వండినదయినా కావచ్చు వండవలసినదయినా కావచ్చు. ద్రవపదార్థమయినా కావచ్చు గట్టి పదార్థమయినా కావచ్చు ఏదయినా కావచ్చు లేక యివన్నీ కావచ్చు. భిక్షమెత్తేటప్పుడు ఏవీ ప్రత్యేకంగా కావాలని మనం అడగకూడదు. ఉదా॥ గనీ 'నాకు మాంసం కావాలి పెట్టండి' అని అడుగరాదు ఉదా॥ నీలు ఐర్వ్ గాని పాలుగాని కావాలని అడగకూడదు. మీరు 'భిక్షం పెట్టండి' అని మాత్రం అడగాలి, అంతే కాశీ వెళ్ళిన తరువాత మీరు 'ఏమని భిక్ష అడగాలో, ఎలా భిక్షమెత్తాలో నేను వివరంగా చెప్తాను. ప్రజలు మీకు బట్టలు యిస్తే పుచ్చుకోండి కాని ఏ పరిస్థితిలోను కూడా డబ్బు అడగకూడదు, డబ్బు యిస్తే పుచ్చుకోకూడదు బట్టలు యిస్తే పుచ్చుకోమన్నాను కదా అని బట్టలు యిమ్మని అడుగ కూడదు ఏదయినా మీరు తీసుకున్నది మొయిమ్ నాదగ్గర పెట్టాలి ఇతర వస్తువులేవీ మీరు స్వీకరించకూడదు – సిగరెట్లు, చెప్పులు, టోపీ, కలం, పెన్సిలు, కాగితాలు వగైరా. ఇత్తడి, రాగి గిన్నెలు, తయారుచేసిన దుస్తులు, కుట్టించని గుడ్డలు తీసుకోవచ్చును. గొంగళి, సాక్సు, రగ్గులు, శాలువలు మొదలయినవి వీటిలో దుప్పట్లు చరసాలు తీసుకోకూడదు ఈ సంగతి యీ రోజున నిశ్చయం చేసుకుందాం. మీకు వివరంగా కాశీలో చెబుతాను" అన్నారు బాబా

మధ్యాహ్నం విష్ణు, ఎరచ్ వగైరాలతో బాబా చర్చచేసారు కాశీలో కావలసినవన్నీ అక్కడ చేయవలసినవన్నీ ఒక కాగితంమీద వ్రాయమన్నారు. హరిద్వార్‌కు నడిచి వెళ్ళడానికి అన్ని ఋతువులలోను అన్నికాలాలలోను అన్ని బాధలూ ఎదుర్కొన గలిగేలా, యింట్లో ఉన్నా, బయట ఉన్నా తట్టుకోగలిగి ఉండాలి. బాబా సహితంగా సహచరులందరకు ఒక్కొక్కరికి రు 24/- చొప్పున కేటాయించిన డబ్బుతో ఒక్కొక్కరికి రు 7/- ఖరీదుచేసే కాలిజోళ్ళు, మిగిలినదానితో వెచ్చని బట్టలు కొనుక్కోవాలి పదేసి రూపాయిలు ఒక్కొక్కరు తీసికొని ఒక కాట్స్‌వూల్ చొక్కా యీ చలికాలంలో బాధపడకుండా కొనుక్కోవాలి. ఇంకోరకమయినదేదీ అంటే మేక చర్మంతోగాని యింకో చర్మంతోగాని కుట్టిన చొక్కాలాంటిది వద్దన్నారు. అవి ఖరీదు ఎక్కువవుతాయి ఉన్న డబ్బు సరిపోదు కాకాతో ఉన్నడబ్బు వేరే ఖర్చులకోసం ఏర్పాటయింది అది నహారీ రిపేర్లకి ఎద్దుల ఖర్చుకు వగైరాలకి ఉద్దేశింపబడింది. అందులోంచి డబ్బు తీయడానికి వీల్లేదు.

డా॥ గనీ హిందుస్తానీలో రచించిన నవ్యజీవితపు పాట బాబా బాగుం దన్నారు దానికి నకళ్ళు ఇంగ్లీషు తర్జుమా అతన్ని తయారుచేయమన్నారు బాబా.

ఆనాడు రాత్రి 9 గంటలకు బాబా సహచరులయింటికి వెళ్ళారు సహచరు లందరు బాబా రాకకి ఆశ్చర్యపోయారు బాబా అన్నారు — "డా॥ గనీ రచించిన క్రొత్త జీవితపుపాట చాలా బాగుంది. ఈ నూతన జీవితపు నిబంధనలను అందులో జొప్పించడమే గాక ఆ పాటలో ఎంతో కవితా సౌందర్యం కూడా ఉంది కాని ఎందుకో నాకు యీ పాట బయటి ప్రపంచం సరిగా అర్థం చేసుకోదేమో అని అను మానంగా ఉంది ఈ పాట నా స్తికత్వాన్ని ఉత్సాహపరుస్తుందని అనుకుంటున్నారు." ఈ విషయం గురించి బాబా సహచరులతో చర్చించారు అటువంటి అపార్థం కలిగించ కుండా పాట కొంత సవరించాలని అందరూ ఒప్పుకున్నారు బాబా కావలసిన భావాన్ని చెప్పి ఆఖరున నాలుగు పంక్తులు డా॥ గనీని రచించమన్నారు "ఈ పని డా॥ గనీ చెయ్యలేకపోతే మరునాడు ప్రొద్దున నూరు గుంజీలు తియ్యాలి" అంటూ బాబా వారి బసకు వెళ్ళిపోయారు.

ఆ సాయంత్రం వంట మొదటిమారుగా చేస్తూ సీమ వంకాయలు (రామ ములక్కాయలు, టొమాటోలు) పచ్చడి చేసారు వారు ఆ పచ్చడి అందరికీ సరి పోకుండా చేయబట్టి బాబా టొమాటోలు చాలినన్ని లేవు కాబోలు అన్నారు. మర్నాడు నవంబరు 1 వ తారీఖు ఉదయం యీ సంగతి గురించి చెప్తూ టొమాటోలు చాలినన్ని ఉన్నాయని ప్రథమంగా స్త్రీలు యింతమందికి చేయడం గనుక వారికి పదార్థాలు ఎంతెంత వాడాలో తెలియలేదని బాబా వివరించారు.

డా॥ గనీ గురించి మాట్లాడుతూ బాబా తమాషాగా డా॥ గనీ పోస్టాఫీసు దగ్గర కూర్చుని ఉత్తరాలు వ్రాసిపెట్టి డబ్బు సంపాదించుకోగలడు" అన్నారు. ఆ ఉదయాన్ని రైల్వేస్టేషన్ నుంచి డా॥ డాన్ ఒక టెలిగ్రాం తీసుకువచ్చాడు బాబా స్టేషన్‌మాస్టరు వద్దకు ఉత్తరాలకోసం అతన్ని రోజూ వెళ్ళమంటున్నారు. టెలిగ్రాం సదాశివ్ పెల్కే (కాశీ) నుంచి వచ్చింది.

"బంగళాలు 2 వ తారీఖున ఏర్పాటవుతున్నాయి. ఉత్తరం వ్రాస్తున్నాను — సదాశివ్"

ఆ రోజునుంచి సహచరులందరికీ సామూహికంగా నూతన జీవితపు పాట పాడడం తర్ఫీదు యివ్వడం ప్రారంభించాడు ఆదీ ఆ సాయంత్రం సహచరులందరినీ కలిసినపుడు బాబా స్త్రీలు వంట చేయడానికి చాలా యిబ్బంది పడుతున్నారని, ఆ యిల్లు చిన్నదైపోయిందని, పొగ వెళ్ళే మార్గం సరిగా లేదని చెప్పారు పాపం వాళ్ళు వంట చేద్దామన్నా సరిగ్గా చేయలేక పోతున్నారు ఒకటి రెండు రోజులు పోయాక కాన్తా, బైదుల్ వంట మళ్ళీ ప్రారంభించవలసి వస్తుందేమో అన్నారు బాబా.

2వ తేదీ ప్రొద్దున్నే బాబా సహచరులందరికి పలుల ప్రశ్నలు వేసాక వారితో బాబా యిలా చెప్పారు—

"ఈ నూతన జీవితంలో అన్ని విధాలా బాబా అవమానపడటం చూడవలసి వస్తుంది మీచేత, పై వాళ్ళచేత, మస్తుల చేత. యోగుల చేత, సాధువుల చేత యీ అవమానం జరుగవచ్చు. అలా జరిగినపుడు మీరు కలుగజేసుకోకుండా ఉండాలి నేను కోరితే తప్ప—" తరువాత బాబా—"10, 11 తేదీలలో వర్షం పడకపోతే నేను 6 మైళ్ళు నడుద్దామని అనుకుంటున్నాను. సహచరులలో సగం మంది 10 వ తేదీన, మిగిలిన సగంమంది 11 వ తేదీన నాతో రావాలి. అప్పుడు సహచరులు నూతన జీవితంపాట పాడుతూంటే బాబా మద్దెల వాయించడానికి కూర్చున్నారు. పాట అయిన తరువాత బాబా సహచరులకి యీ విధంగా చెప్పారు.

"భిక్షాటన చేసి జీవించేటప్పుడు ఎవరయినా ఆవుగాని, ఎద్దుగాని, గేదెగాని యిస్తే మనం పుచ్చుకోగూడదు. ఇలాటిది జరగడానికి సాధ్యమే, ఎందుకంటె హిందువులు సాధు సన్యాసులకు యిలాటి జంతువులను దానం చెయ్యడం కద్దు. ఎద్దులకి మేత (గడ్డి) తాళ్ళు, వాటికి ఇనుపనాళాలు అడగకుండా యిస్తే తీసుకోవచ్చు. మనం ఆహారమే అడగాలి, మనకి ఎద్దులకీ కూడాను కాని గొంగళీలు, శాలువాలు యిస్తే పుచ్చుకోండి- ఈ రోజున మనం చేసుకున్న నిర్ణయం ప్రకారమే నడుచుకోవాలి. జంతువులను యిస్తామంటే మాత్రం పుచ్చుకోవద్దు. అలా నిరాకరించేటపుడు తెల్లగుఱ్ఱాన్ని యిస్తే పుచ్చుకుంటామని చెప్పండి.

ఆ సాయంకాలం బెల్గాంలో ఉన్న కొంతమంది దివ్యజ్ఞానసమాజసభ్యులు బాబా యిక్కడ మకాం చేస్తున్నారని తెలిసి దర్శనానికి వచ్చారు అందులో ఒకడు

వా॥ గనీని ఎరుగును. కాని అతడు ఆ సమయంలో స్నానం చేస్తున్నాడు ఇది నూతన జీవితం గనుక బాబా ఎవరినీ చూడరని సహచరులలో ఒకడు వారితో చెప్పాడు. ఆయన సహచరులుకూడా ఎవరితోనూ మాట్లాడరు. గనీ ఆ సమయానికి లేకపోవడమే మంచిదయింది. అప్పుడు వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఆగంతకులు ఎరిగున్న వారయినా ఎవరినీ చూసి మాట్లాడరాదని సహచరులతో బాబా మళ్ళా చెప్పారు "ఎవరయినా వచ్చినపుడు ఎరుగని సహచరుడెవరయినా అతనితో మాట్లాడి పంపించెయ్యాలి అందరూ యీ సంగతి అన్ని పరిస్థితులంలోను జ్ఞాపకం ఉంచుకోవాలి " అని బాబా చెప్పారు.

నవంబరు (1949) 3 వ తేదీ ఉదయాన కాకా వూలుస్వెట్టర్ వేసుకొని మసాలా నూరుతుంటే బాబా చూసారు ఎండెక్కుతోంది గనుక బాబా అతన్ని స్వెటర్ తీసెయ్యమన్నారు. ఈ మసాలా నూరేసి తీసేస్తానన్నాడు కాకా. బాబా అందరినీ పిలిచి 'చూడండి కాకా చెప్పిన మాట వెంటనే వినలేదు' అని చెప్పారు. ఈ సంగతి ఎన్నోమారులు సహచరులందరికీ చెప్పారు చెప్పగానే తక్షణమే వినమని. ఇది జ్ఞాపకం ఉంచుకుని నూతన జీవితంలో ముఖ్యంగా జనవరి (1950) 1 వ తేదీనుంచి ఆచరిస్తే అది సహాయకారిగా ఉంటుందన్నారు బాబా.

"నేను డిసెంబరు ఆఖరి వరకూ మీకు చేసేసహాయంలో మిమ్మల్ని క్షమించడం ఉంటుంది కాని యీ కారణం చేతనే మీకు జనవరి నుంచి ఉపద్రవం కలుగవచ్చు చిన్నవీ పెద్దవీ అన్నీ మీరు చాలా గంభీరంగా తీసుకోవాలి. మీరు అజాగ్రత్తగా ఉండి పట్టుబడిపోయి ఆపదలు తెచ్చిపెట్టుకోవద్దు" అన్నారు బాబా

అప్పుడు కాకాని పిలిచి బాబా తమ చెవిని గట్టిగా గిల్లమని చెప్పారు బాబాకి కొంచెం కోపం వచ్చినట్టు అందరు గమనించారు. బాబా – "మిమ్మల్ని నేను చెవులు గిల్లమన్నా, కాలితో తన్నమన్నా మీ వల్ల జరిగిన తప్పులే దానికి కారణం అని అనుకోకండి నేను ఆ విధంగా ఆజ్ఞాపించడానికి నా స్వంతకారణాలు ఉంటాయి నాకు కోపం వస్తోంది గనుక మీరు అది తగ్గడానికి సహాయం చేయాలి తొందరపాటుచే గాని పొరపాటున గాని చేసేదయినా వాగ్దానం చేస్తున్నా, నాకు కోపం వస్తున్నా మీరు నాకు జ్ఞాపకం చేయాలి" అన్నారు "మీకు కోపం రావడం,

సంతోషం లేకపోవడం, యిష్టా యిష్టాలు యివన్నీ మీకు లేకుండా ఉండాలని నేను ఆశించడం లేదు - నేను అన్నివిధాలా స్వేచ్ఛగానూ మీరు అన్నివిధాలా బంధనంలోనూ ఉంటారు. మీ మధ్యలో నేనొక సోదరునివలె ఉంటాను కాని అన్నివేళలా అన్ని పరిస్థితులలోను మీరు నన్ను మీ గురువులాగే యజమానిలాగే చూసుకుంటూ నాకు విధేయులుగా ఉండాలని కోరుతున్నాను.

ఇప్పుడు మనకి ప్రధానమయిన దేమిటంటే యీ వర్తమాన దశలో నివసించడమే! అని బాబా నూతన జీవితపు గీతం అని రచించిన ఒక పాటలో వ్రాసారు. "వెనుక ఉండిపోయిన మనకు యీ పాట ఒక సవాలు ఈ పాటలోని విలువ, ప్రాధాన్యత యిప్పుడు మనం వర్తమానంలో జీవించడమే." అని బాబా చెప్పారు.

## నూతన జీవిత గీతము:—

(ఈ పాట బాబా 1949 నవంబరు 3 వ తేదీన తమ పర్యవేక్షణలో అబ్దుల్‌గనీ చేత వ్రాయించారు)

(1) మెహెర్ బాబా యొక్క నిశ్శబ్దమైన మాటలను వినండి

ఈ మాటలు ఆచరణలో పెట్టడంలోనే భగవత్ప్రేమికుల జీవితగాథ ఆధారపడి ఉంది.

ఈ నవ్యజీవనం జీవించాలని నిజంగా నీకు ఉంటే
అశాశ్వతమయిన యీ ఉనికిని నీ హృదయపూర్వకంగా త్యాగం చెయ్యి.

(2) మేము యీ జీవితాన్ని అవలంభించాము, ఇందులో మేము
భగవంతునే నమ్మాము,
చేయాలి లేకపోతే చావాలి అనే మా యిచ్ఛ మేము తీసుకున్న
ప్రమాణముచే బలపడింది,
నిరాశా గీతాన్ని మేము ఉల్లాసంగా పాడుతున్నాము;
మేము అన్నిక్లేశాలను, కష్టాలను ఆహ్వానిస్తున్నాము.

(3) మేము ఫలించని ఆశలకోసం దుఃఖించము . ఆడితప్పిన
వాగ్దానాల గురించి ఫిర్యాదు చేయము .
మేము గౌరవం కావాలని, అవమానం అక్కర్లేదని కోరము ;
పరోక్షనిందలు మాకు తెలియవు . ఎవరిని గూర్చి భయపడము .
ఇది యిప్పుడు మా నవజీవనపు విధానము —

(4) మా మనసులో యిప్పుడు కలవరపాటు లేదు · బంధాలు యింకలేవు;
గర్వము, క్రోధము, కామము, లోభము, మాకు తెలియవు
మాకు మతం లేదు ; శారీరక మానసిక భ్రాంతులు లేవు.
షేక్ గాని బ్రాహ్మణుడు గాని – అన్ని వర్ణాలకి, మతాలకి
అనువర్తించగలరు వీరు – ఇద్దరూ ఒకే పడవలో పయనిస్తున్నారు

(5) మనందరకు, కొద్దిగా గాని, గొప్పగా గాని, వర్తమానం లేదు :
గురువు – శిష్యుడు ప్రశ్న, భగవత్తత్వము – ప్రశ్న, ఉదయించదు ;
సోదరత్వము, తోటివాడనే అభిమానము – అదే ఉన్న సంబంధం ,
ఇప్పుడు పడుతున్న బాధను వినోదంగా తీసుకోవడానికి యిదే కారణం.

(6) ఈ ప్రపంచం గాని, తరువాత లోకంగాని, స్వర్గమయినా నరకమయినా,
మాకింక దాని గురించి బాధలేదు
శక్తులు, సిద్ధులు, గుప్తవిద్య, అద్భుతాలు చేయడం – మేము యింక
వాటి గురించి ఆలోచించడమే లేదు
ఈ అబద్ధపు ఆలోచనలన్నీ మా మనస్సుల నుంచి పారద్రోలాము.
ఇప్పుడు మాకు ప్రధానమయినది యీ ఆచరణాత్మకమయిన
వర్తమానంలో జీవించడమే .

(7) ప్రియులారా ! బాబా చెప్పినది శ్రద్ధగా వినండి
మీ స్థాయిలో నేను ఇప్పుడు ఉన్నప్పటికీ,
నా వద్దనుంచి వచ్చే ఆజ్ఞలన్నీ – మంచివయినా, చెడ్డవయినా
అసాధారణమయిన వయినా -
మీరు వెంటనే పాటించాలి – ఫలితం భగవానునికి వదిలి.

(8) ఆకాశం కిందకు కూలినా,
సత్యమును మాత్రం విడనాడ వద్దు ;
నీ జీవితోద్యానాన్ని నిరాశ, అశాంతిని నాశనము చేయనీ,
మరల దానిని సుందరపరచు, తృప్తి, ఆత్మసంతుష్టి అను మొక్కలునాటి

(9) నీ హృదయాన్ని ముక్కలు చేసినా, నీ పెదవుల మీద చిరునవ్వు తాండవించనీ.

ఒక్క మంచి సంగతి చెబుతాను విను –
ఏగాని లేని నీ చేతిలో విలువలేని పెన్నిధి ఉన్నది –
నీ బిచ్చగాని జీవితము రాజులకి కూడా అసూయాకారణము

(10) నిజంగా భగవంతుడున్నాడు ; ప్రవక్తలు సత్యమే ప్రవచించారు.
ప్రతీ యుగము ఒక అవతారుని గన్నది ,
ప్రతీ క్షణం మందు ఒక వలీ వెలిసాడు.
మాకు మాత్రం నిరాశ, నిస్సహాయత , మా
నవ్య జీవిత మేమిటో నీకు యింక ఎలా చెప్పాలి. —

ఈ పాట ప్రతిరోజూ ఆదీ చేత బాబా చదివించేవారు ఇంకా కొన్ని భవ్వాలీలు కూడా పాడించేవారు. ఆదీ పాడేటప్పుడు బాబా డోలక్ వాయించేవారు. తరుచుగా స్త్రీలవద్ద సాయంత్రం వేళల్లో బాబా డోలక్ వాయించేవారు ఆ లయవిన్యాసం విని మండలి మైమరచిపోయేవారు. వారు విని ఆనందించడమే కాకుండా ఆయన నన్నని ప్రేళ్ళు వడిగా మద్దెలమీద వడుతూండటంచూసి ఆశ్చర్యం పొందేవారు ఆవిన్యాసంలో బాబా తమ దృష్టిని కేంద్రీకరించడం వారు గమనించేవారు.

వారున్న యిల్లు ఒక పెంకుటిల్లు వర్షం కురిసినపుడల్లా గదిలో నీరు నిలిచేది. మండలి నిచ్చెన వేసుకుని పై కప్పులో ఉన్న చిల్లులు సిమెంటుతో మూసేవారు ప్రతిరోజూ గోడలకి ఎలుకలు కన్నాలు చేసి మట్టిపోసేవి ఉదయాన్ని 5 గంటలకే లేచి బాబా రాకమునుపు వారి సహచరులు అక్కడ శుభ్రపరిచేవారు. వారంవరకూ 6 గంటలకు టీ తీసుకునేవారు

ఒకరోజు రాత్రి మెహెరా నిద్రలో తన చేతి వేలు ఏదో కరిచిందని కేకవేసి అదేమిటో చూద్దామని లేచి కూర్చుంది ప్రక్క గదిలోనె మెహెరా ఉంది.

డా॥ గోహర్, మెహ్రాజూ దగ్గరలోనే ఉన్నారు అందరూ మణి పద్దకు పరుగెత్తుకు వచ్చారు మణి వేలు ఒక ఎలుక కరిచిందని కనుగొన్నారు. నిద్దర్లో ఆమె చేయి దోమతెర బయటకు వచ్చినట్టుంది. ఆ చేతివేలు ఎలుక కరిచింది. కరిచిన చోటనుండి రక్తం వస్తోంది డా॥ గోహర్ ఆమె చేతికి మందువేసి కట్టుకట్టింది గోహర్ కూడా ఒక రాత్రి లేచి మెహ్రాజూకి సుస్తీగా ఉంటే ఆమెను చూద్దామని వచ్చింది ఆమెకు నిద్రలో "సహాయం చేయండి, సహాయం చేయండి" అని వినిపించినట్టయింది మెహ్రాజూ గోహర్‌ను ఏమికావాలి అని అడిగింది సరే ఆమె ఏమీ అనలేదని గుడ్ల గూబ రాత్రి ఎక్కడినుంచో అరిచిందని నిర్ధారించుకుంది గుడ్లగూబ పైకప్పు నుంచి అరిచి ఉండాలని అనుకుంది ఆ శబ్దం గదిలోనుంచి వచ్చినట్లే ఉంది

నవంబరు 4 వ తేదీన ఉదయం బాబా యీ విధంగా వ్రాయించారు—"నా యొక్క నా సహచరుల యొక్క ప్రమాణాల ప్రకారం సహచరులందరూ రెండు విషయాలకి కట్టుబడి ఉంటారు—(1) భగవంతుని యెదుట బాధ్యత అంతా సహచరుల మీదే ఉంటుంది (2) భౌతికంగా గాని, ఆధ్యాత్మికంగా గానీ సహాయం గాని బహుమతిగాని ఏవీ వారికి ఉండదు డిసెంబరు ఆఖరి వరకూ నేను సహాయం చేస్తూ ఉంటాను భౌతికానికై కావలసిన శిక్షణలోను లంగోటీ జీవితంలోను వారికి కావలసిన సదుపాయాలలోను నా సహాయం ఉంటుంది సహచరులు వారిలో వారు ఒకరికొకరు సహాయం చేసుకుంటూ ఉండాలి అని నా అభిలాష నిబంధనలు జాగ్రత్తగా పాటించ టంలో ఒకరికొకరు జ్ఞాపకం చేసుకుంటూ ఉత్సాహపరుచుకుంటూ ఉండాలి ఎందు చేతంటే సహాయమూ, శిక్షణా అంతా డిసెంబరు ఆఖరువరకే తరువాత ఉండవు తెలిసీ తెలియకా చేసిన తప్పులు యింతవరకు నేను దిద్దుకుంటూ వస్తున్నాను. ఈ తప్పులు పాత జీవితపు అలవాట్లు వలన జరుగుతున్నాయి ఇంకముందు యిలా దిద్దు కోవడం జరుగదు

సహచరులు విశ్వాసంతోను, నిజాయితీతోను, నిజంగాను అర్థం చేసుకో వాలి.—సహాయం యివ్వడంలోను, ఉపయోగంగా ఉండడంలోను వారిలో తేడా లేమీ ఉండవు, యీ నూతన జీవిత నిబంధనలు పాటించడంలో. నాకు యీ నూతన జీవితంలో నాయొక్క నా సహచరులయొక్క ప్రమాణాలు అసలయిన ప్రాముఖ్యత కలవిగా ఉన్నాయి" అని వ్రాయించి బాబా సహచరు లందరి చేత చదివించి ఆ ప్రకారంగా అందరూ ఆచరించాలని హెచ్చరిక చేసారు

నవంబరు (1949) 5 తేదీన కాశీనుంచి సదాశివ్‌షెల్కే నుంచి ఒక మంచివార్త తంతిద్వారా వచ్చింది -" బనారస్ కంటోన్మెంటు వద్దనుంచి బంగళాలు కుదర్చబడ్డాయి -" అని.

ఆ మధ్యాహ్నం భోజనం చాలా బాగుంది. ఆ రాత్రి భోజనంలో శ్రీఖండ్ ఎక్కువగా వాడినందున పదార్థాలు తియ్యగా బాగున్నాయి ముఖ్యంగా డా॥ నీలుకి అది ఘనీభవించిన ప్రేమగా కన్పించింది ఆ మధ్యాహ్నం బాబా—"డిసెంబరు 31వ తేదీ వరకూ మీరు తినగలిగినంత తినండి. ఆ తరువాత జీవితం ఎలా ఉంటో నాకు చెప్పండి అప్పుడు మీరు రెండు పూటలా కడుపునిండా భోజనం చేయవచ్చు, లేక ఒక్కపూటే మీకు భోజనం దొరకవచ్చు, అదికూడా లేకపోవచ్చు కొన్ని రోజులు అలా అసలు భోజనం లేకుండా ఉండవలసి రావచ్చు

"ఇప్పుడు యీ విధంగా కడుపునిండా భోజనం చేస్తూ, రాత్రి శ్రీఖండ్ కూడా వేసుకొని భుజిస్తూ హాయిగా ఉన్నారు, కాని అలాగే అసలు భోజనంలేనప్పుడు కూడా జనవరి లగాయితు క్రొత్త జీవితంలో మీరు సుఖంగా ఉండాలి. ఇందులో మీరు జయం పొందితే మీరు నిబంధనలను నూటికి నూరుపాళ్ళు పాటిస్తున్నట్లే " అని చెప్పి బాబా ఊరుకుంటే నీలు, గనీ, ఎరచ్, ఆదీ బాబాని నూతన జీవితం గురించి యింకా చెప్పమని ప్రోత్సహించారు బాబా అప్పుడు చెప్పిన విషయాలు ప్రశ్నోత్తరాల రూపంలో ఉన్నాయి.

ప్రశ్న —నిబంధనలన్నీ హృదయపూర్వకంగా పాటించాలనే ఇచ్ఛ మీ కందరికీ ఉంది. ఇది ఎవరూ కాదనలేరు కాని మీదృష్టిలో యీ నియమాలను నూటికి నూరుపాళ్ళు పాటించినట్లు ఎలా అవుతుందో చెప్పండి

ఉత్తరం —ఈ నిబంధనల విషయంలో ముఖ్యమయిన అంశాలు నాలుగు గమనించవలసినవి ఉన్నాయి.

(1) డబ్బు ముట్టుకోక పోవడం

(11) ఆడవారిని తాకకుండా ఉండడం

(111) మంచివి, చెడ్డవి, అసాధారణమైనవి అన్ని ఆజ్ఞలు తక్షణమే ఏ సంకోచమూ లేకుండా పాటించడం

### (iv) ఎలాంటి క్లిష్ట పరిస్థితులలోనయినా సంతోషంగా ఉండడం

మొదటి రెండు షరతులు ధనము, స్త్రీ వీటి గురించి మీరేమీ బాధ పడనక్కరలేదు. అసలు ఎప్పుడోగాని వీటిగురించి ఆలోచించవలసిన పని ఉండదు, నేను మీతోనే చాలా మట్టుకు ఉంటాను గనుక. తరువాతి రెండు షరతులూ — బాబా ఆజ్ఞలను వెంటనే అమలు జరపడం, ఎల్లప్పుడూ సంతోషంగా ఉండడం — ఈ నవ్య జీవితంలో అవి చాలా ప్రధానమయినవి ఇవి గనుక మీరు యథావిధిగా మాటికి నూరుపాళ్ళు పాటించినట్లయితే మిమ్మల్ని ఏ శక్తీ — భగవంతుడు కూడా - నానుంచి వేరు పరచలేదు.

ప్రశ్న — ఈ నిబంధనలన్నీ మేము మాటికి నూరుపాళ్ళు పాటించడానికి సిద్ధంగా ఉన్నాము. కాని మాకిచ్చిన ఆజ్ఞ పాటించడానికి అసాధ్యమయితే మా కర్మ ఏలా ఉంటుంది ?

ఉత్తరం — నేనిచ్చిన ఆజ్ఞ పాటించడం భౌతికంగా అసాధ్యమయినా అది మీరు వెంటనే నిర్వర్తించడానికి సిద్ధం కావాలి దాని ఫలితం జయప్రదం కాకపోతే మీరేమీ విచారించనక్కరలేదు, ఉదాహరణకి ఒక ఒంటెని కాళ్ళు చేతులు కట్టేసి ఒక యింటి కప్పుమీదకి మోసుకు వెళ్ళమన్నాననుకోండి వెంటనే ఆ పని చేయడానికి ఉపక్రమించాలి. ఇది సాధ్యమా, అసాధ్యమా అని ఆలోచిస్తూ కూర్చో కూడదు. ఎందుకు చెప్తున్నానంటే మీరు ఎలా సిద్ధపడాలో తెలిసేందుకు, అంతేకాని యిది మీరు అక్షరాలా తీసుకోకూడదు.

మీరు తెలివి తక్కువగా చిన్నపిల్లవాడిలా ఆలోచించకండి. నేను ఆజ్ఞ లిచ్చేటప్పుడు నేను వాగ్దానం చేయను గాని, మీరు చేయలేనివి అసాధ్యమయినవి చెయ్యమని నేను చెప్పను. మీలో ఎవరయినా పక్షవాతం వచ్చి పడిపోయారనుకోండి; అతనిని నేను నాట్యం చెయ్యమని ఎలా చెప్తాననుకుంటారు ? అలాటివాడిని ఊపిరి నిలుపుకో అని చెప్పవచ్చు ఆపని అతనికి శారీరకంగా అశక్తుడయినా చేయగలడు గనుక. జ్ఞాపకం ఉంచుకోండి నేను యిచ్చే ఆజ్ఞలు - నేను వాగ్దానం చేయటం లేదనుకోండి — మీరు నెరవేర్చలేనివిగా మీ శక్తికి అతీతంగా మాత్రం ఉండవు. ఏవీ అసాధ్యం కాదు, మీరు వెంటనే నిజాయితీతో ప్రయత్నించాలి గాని.

ప్రశ్న —ఇంతకీ సారాంశం ఏమిటంటే, మీ ఆజ్ఞలు - అవి మంచివి కానీండి, చెడ్డవి కానీండి, అసాధారణమయినవి కానీండి, అవి వెంటనే ఇష్టంతో ఏ మాత్రం సంకోచం లేకుండా పరిపాలించడానికి సిద్ధపడాలి, ప్రయత్నించాలి.

ఉత్తరం ;—అవును. అదే నేను చెప్పేది. అంతే కాదు. నా ఆజ్ఞలు వెంటనే పాటించడమే కాదు అవి యిష్టంతోను సంతోషంతోను నెరవేర్చాలి.

ప్రశ్న —మేము నూటికి నూరుపాళ్ళు ఆజ్ఞలు పాటిస్తే అప్పుడు ఎవరినీ చంపించెయ్యడమనే ప్రశ్నే ఉండదు.

ఉత్తరం .—నా ప్రియమైన మిత్రుడా ! నీవు నా ఆజ్ఞలను నూటికి నూరు పాళ్ళు పాటించడంలో నేను ఎలా చేయాలంటానో అలా ఆచరించి జయం పొందితే అప్పుడు నీవే నాకు యజమానివి అయి నేను నీకు బానిసను అవుతాను. ఆవిషయంలో నాకు పూర్తి స్వేచ్ఛ ఉన్నప్పటికీ, నే నెవరినయినా పంపించేస్తానేమో అన్న భావం నీ మనసులో నుంచి తొలగించుకో.

ప్రశ్న —మీరు మెహెరాబాద్ లో చెప్పారు — "ఎవరికయినా ఏదయినా జబ్బు చేస్తే లేక ప్రమాదం జరిగితే, మీరు వెనక్కి తిరిగి చూడకూడదు ముందుకు సాగిపోవాలి, మీరు ఎవరికోసమూ వేచి యుండరాదు." అని

ఉత్తరం ,—నేను మీలో ఏ ఒక్కరిలాగా నయినా బలహీనంగాను బక్కగాను ఉన్నానని జ్ఞాపకం ఉంచుకోండి. నాకు జబ్బు చెయ్యవచ్చు. ఎవరికి తెలుసు. మీరు నాకు శుశ్రూష చేయవలసి ఉంటుంది ఎవరికేనా జబ్బుచేస్తే లేక ఏదయినా అయితే, ఆ వ్యక్తికి మనం అతడు కోలుకొనే వరకు సహాయం ఎలాగా చేస్తాము వాడి కర్మానికి వాడిని వదిలేయము ఒకవేళ ఆ జబ్బు దీర్ఘ కాలంగా ఉంటే అది వెంటనే తగ్గే జబ్బుకాకపోతే — టైఫాయిడ్ లాగా, పక్షవాతం లాగా, అప్పుడు తగిన ఏర్పాటుచేసి ఆ జబ్బుపడ్డవానిని చికిత్సకై వెనుక వదిలేసి మనం ముందుకు సాగిపోవాలి

ప్రశ్న :—ఈ నూతన జీవితం అంటే ఏమిటో చివరికి అది ఎలా పరిణమిస్తుందో మాకు సరియయిన భావం కలిగేలా చెప్పగలరా ?

ఉత్తరం :—ఈ నూతన జీవితం గురించి నాకు చాలా అస్పష్టమయిన చిత్రం నా మనోనేత్రానికి కనిపిస్తోంది దాని వివరాలు నాకే తెలియవు. నీ మనసులో ఒక అందమయిన యువతి బొమ్మ ఉందనుకో ఆమెను నీవు కలుసుకోవాలనుకుంటున్నావు. అది నీకు ప్రథమ అనుభవం అవుతుంది తరువాత ఏం జరుగుతుందో ముందుగా చెప్పడం సాధ్యం కాదు ఈ నూతన జీవితం మీకూ నాకూ అలాగే అవుతుంది.

ప్రశ్న —ఇలాటి నూతన జీవితం యిదివరకెవరయినా గడిపారా ? లేక యిది మీ కల్పనయా ?

ఉత్తరం .—నాకు తెలుసు అందుకనే నేను యింతకంటె ఎక్కువ చెప్పలేను. ఏమయితే యేం అది యిదే మీరందరూ నాతో రావాలని కోరుతున్నాను. వచ్చి నాతో చిరకాలం ఉండండి మీరు ఎవరూ రాకపోతే నేనొక్కడినే వెళ్తాను మళ్ళీ వెనక్కి రావడం ఉండదు

ప్రశ్న —చిరకాలం అంటే యేమిటి అర్థం ? ఈ నూతన జీవితానికి అంతమెందన్న మాటా ?

ఉత్తరం —చిరం అంటే యింతవరకు అని హద్దు ఏమీ లేకుండా అని అర్థం నేను అనుకుంటున్న నూతన జీవితం, అది నిజంగా జరిగితే దానికి అంతం అని చెప్పదగినదేమీ ఉండదు.

ఇక్కడ బాబా గనీ వ్రాసిన నూతన జీవితపు పాటను చదవమన్నారు. చదివిందాక ఆ పాటకి బాబా యిలా వ్యాఖ్యానం చేసారు

"ఈ పాట సూక్ష్మంగా నవ్యజీవితం గురించి చెబుతోంది. ఇందులో తీసుకున్న ప్రమాణం నూటికి నూరుపాళ్ళు పాటిస్తే మనలనందరను కలిపి ఉంచుతుంది లేకపోతే మనం ఎవరికివారే యమునాతీరే అయిపోతాము. భగవంతుడొక్కడే మిగులుతాడు అయిదో పాదంలో నేను చెప్పిన బాధ హాయిగా అనుభవించడం గురించి చెపుతోంది , ఆరవపాదానికి మీ యిష్టమొచ్చిన అర్థం చెప్పుకోవచ్చును"

ప్రశ్న — అందరూ వెనుక పడితే మీరు ఒక్కరూ ముందుకి వెళతానన్నారుకదా మీరు ఒక్కరూ ఎక్కడికి వెళతారు ? ఎందుకు వెళతారు ? మీరు

యింక సాధించవలసిందేమీ లేదు కదా, మీరు సహచరులతో వెళితే యీ నవ్యజీవితానికి అర్థం ఉంది.

ఉత్తరం :— నేనింకేమీ చెప్పలేను మీతోనయినా, నేనొక్కడినయినా సరే నేను మాత్రం వెళ్ళాలి. అది నాకు తెలుసును ఈ నూతన జీవితం గురించి మీరు నాచేత చెప్పించాలని చూస్తే మీరు నా నుంచి ఏమీ పొందలేరు. మీరు యింకా చిక్కుల్లో పడతారు

మనం ఒకే పడవలో వెళ్తున్నాం మనం పడవలో కలిసి వెళ్దాం లేక కలిసి ఈదుదాం. ఎందుకు విచారం ?

నాగపూర్‌లో పాపా సహాయంతో ఒకమారు దాసూదాయి ఈత నేర్చు కుంటోంది ఒక మారు ఆమె మునిగిపోతూంటే పాపా ఆమెకి సహాయం చేయ బోయాడు ఆమె పాపాను గట్టిగా కౌగిలించుకుని అతన్ని కూడా ముంచేస్తూంది. ఎలాగో పాపా ఆమెని తీసుకొని బయట పడ్డాడు

అందుచేత మిత్రులారా, మీరు కంగారుపడకండి లేకపోతే నన్ను మీరు లోతుగా తీసుకెళ్ళి ముంచేస్తారు నేను చెప్పిందేదో కిమ్మనకుండా ఆచరించండి. నూటికి నూరుపాళ్ళు మీరు ఆజ్ఞలను పాటిస్తే ఏ కష్టాలు వచ్చినా, ఏ పరిస్థితులలో నయినా మీరు రక్షింపబడతారు ఈ నవ్య జీవితం కోసమే నేను ఎంతో దీర్ఘకాలం నుంచీ వేచి ఉన్నాను మనం నిలబడగలిగితే యీ జీవితమే అంతులేనిదన్నమాట. ప్రపంచం మాట్లాడే యీ జీవితం జీవితంకాదు అది మరణమే

ప్రశ్న :— ఈ నూతన జీవితం మీరు యెందుకు తీసుకున్నారు ? దాని కేమయినా అవసరం ఉందా ?

ఉత్తరం — దానికి జవాబు లేదు

ప్రశ్న — మీరు తీసుకున్న ఆ ఆఖరి ప్రమాణం యేమిటి అది దేనిని గురించి ?

ఉత్తరం — అది చాలా విషయాల గురించి ; అవన్నీ నేను మీకు చెప్పలేను.

ఈ విధంగా బాబా జవాబులు చెప్పారు ఆ సాయంత్రం నూతన జీవితం గురించి బాబా వాడే 'సత్యనాశి' అనేమాట గురించి చర్చ చేసారు. సహచరులకి ఆ మాట నచ్చలేదు డా॥ గనీ యింకా యితరులు ఆ మాటకు బదులుగా వేరే మాటలు సూచన చేసారు – త్యాగము, ఖానాఖరాబీ, బర్బాదీఫకర్, ఫకీరీ యిలాంటివి వేటినీ బాబా ఒప్పుకోలేదు ఆయన అన్నారు – "ఈ మాటలకి ఆధ్యాత్మికమయిన అర్థాలున్నాయి ఈ మన నూతన జీవితానికి ఆధ్యాత్మికత్వానికీ సంబంధం లేదు. త్యాగానికి సత్యనాశికి చాలా తేడా ఉంది. త్యాగం ఎవరయినా అభ్యాసం చేయవచ్చును. అందులో వివిధమైన రకాలున్నాయి కాని సత్యనాశి అభ్యాసం చేయలేరు. అది కావాలంటే అలవడేది కాదు. దానంతట అదే వస్తుంది. దాన్ని నిరోధించడానికి వీలులేదు

బాబా తమ సహచరులతో బెల్గాంలో ఉంటున్నారని స్థానిక వార్తా పత్రికలో పడింది. "గొప్ప సాధుపురుషుడయిన శ్రీ మెహెర్‌బాబా కొద్దిమంది శిష్యులతో ప్రపంచయాత్ర చేయాలని బయలుదేరుతూ కొంతకాలం బెల్గాంలో ఉండడానికి వచ్చారు ___" అని పత్రికలో వ్రాసారు. ఈ వార్త చూసినవారు కొందరు బాబా దర్శనార్థం వచ్చారు నూతన జీవితపు నిబంధనల వలన బాబా వారికి దర్శన మీయలేదు

ఈ వచ్చినవారికి దర్శనానికి వీలుండదని చెప్పి పంపించడం ఒక పెద్దపని అయింది ఎంత చెప్పినా కొంతమంది బాబాకోసం కొన్ని ఫలాలు తెచ్చారు బాబాకి అర్పించడానికి అవి బాబా తీసుకోలేదు. దూరాన్నుంచయినా బాబాను చూడడానికి వీలు కలుగజేయమని ప్రాధేయపడ్డారు వారికి ఆశాభంగమే మిగిలింది కొందరు అలాంటి వారు యీ నూతన జీవితం ఎందుకు ఏమిటి అని ప్రశ్నలు కురిపించారు వారందరినీ తృప్తిపరచడం బాబా సహచరులకు కష్టమయిన పనే అయింది బాబాని గురువని వారి శిష్యులని అనకుండా ఉండమని చెప్పవలసి వచ్చేది అంతకన్న నూతన జీవితం గురించి వివరించడానికి వీలులేదు వారు ఏమేమి ప్రశ్నలు వేసారో వాటికి వీరు ఏమేమి జవాబులిచ్చారో ఎప్పటికప్పుడు బాబాకి చెప్తూండేవారు. కొన్ని విషయాలలో సహచరులు వారికి వచ్చిన కష్టాలన్నీ బాబాకి చెప్పుకునేవారు కొన్ని కొన్ని విషయాలలో అడిగిన ప్రశ్నలకు సమాధానాలిస్తూ ఎంతవరకు చెప్పవచ్చునో వారికి సందేహం కలిగింది ఏయే విషయాలు చెప్పకూడదో బాబాని స్పష్ట పరచమన్నారు ఎన్ని విధాల చెప్పినా ఆగంతులకి సహచరుల జవాబులతో

తృప్తి కలుగలేదు రెండుమార్లు మాత్రమే వచ్చిన వారిని బాబాను చూడటానికిమాత్రం అనుమతి యిచ్చి ప్రశ్నలేవీ అడుగకూడదన్నారు బాబా. నమస్కారాలు చేయరాదని పాదాలు స్పృశించకూడదనీ స్పష్టంగా చెప్పారు అంతేగాక బాబా యే వారి పాదాలు స్పృశించేటప్పుడు అభ్యంతరం పెట్టకూడదన్నారు ఈ షరతులకి అంగీకరించి యిద్దరు మాత్రం బాబాను చూసారు.

వచ్చిన వారికి ఎలా చెప్పి పంపించాలో యిక్కడా యికముందు కాశీలోను యితర స్థలాలలోను బాబా తమ సహచరులకు మధ్యాహ్నం టీ అయిన తరువాత వారిని సమావేశపరచి చెప్పారు.

"నిరాశ అంటే అన్ని ఆశలను విసర్జించడం అన్నమాట. లక్ష్యరహితత్వం అంటే అన్ని లక్ష్యాలను వదులుకోవడం నిస్సహాయత అంటే అన్ని సహాయాలు త్యాగం చేయడం గురువు లేడు, శిష్యుడు లేడు – అంటే ఆధ్యాత్మికత్వం వదులుకోవడం నేను అనుకుంటున్నా నూతన జీవితం అంటే అన్నీ త్యాగం చేయడమన్న మాట అందుచేత ఎవరయినా యీ నూతన జీవితం యేమిటి అని అడిగితే సంపూర్ణమయిన త్యాగం అని చెప్పండి దేని త్యాగం అని అడిగితే అన్నీ అని చెప్పండి — లక్ష్యాలు, ఆశలు, సహాయాలు, జీవితమే అని చెప్పండి

"ఇప్పటినుంచి ఆఖరివరకు యింక ప్రజలు అన్ని రకాల ప్రశ్నలు వేస్తూంటారు పాశ్చాత్యులు వచ్చినపుడు డాన్ వారినికలిసి మాట్లాడాలి ఐరోపీయులు వస్తే గనీ, ఆదీ, నీలు, ఎరచ్, పెండు, విష్ణు వీరు వారి ప్రశ్నలకు విపులంగా జవాబులివ్వాలి ఇంకా బాబా ఎందుకు మౌనం వహిస్తున్నారని ఎవరయినా అడిగితే అది ఆయన వ్యక్తిగతమయిన, స్వంతకోరిక అని చెప్పాలని బాబా చెప్పారు.

"మీరు ఎందుకు యీ పనులు చేస్తున్నారని అడిగితే మేము బాబాకు సమానముగా ఉన్న సహచరులమయినా మేము ఏర్పరచుకున్న ప్రకారము ఆయనకు మేము విధేయులమై ఉండాలి. ఆయన మాకు మిత్రుడే గాక మా సహచరుడు కూడా. ఆయన మాకు అన్నగారిలా కూడా ఉన్నారు! అని మీరు చెప్పాలి.

నూతన జీవితం గురించి అడిగినపుడు ముఖ్యమయినవి మాత్రం చెప్పండి — దర్శనాలు లేవని, ఆశీర్వాదాలు లేవని, లంగోటీ ధరించి భిక్షాటన ఎత్తుతారని, దేశపరిభ్రమ చేస్తారని చెప్పాలి

బాబా ఏం చేస్తారని అడిగితే మా అందరిలాగానే పని చేస్తారని చెప్పండి. వారి యెడల మీరు దయతో ప్రవర్తించాలి వారు ఏ ప్రశ్నలడిగినా మీరు మాత్రం ఏ పరిస్థితులలోను కోపం తెచ్చుకోకూడదు "

అని చెప్పి బాబా ఆశువుగా గనేకి కొన్ని పద్యాలు చెప్పి వ్రాయించారు. వాటిభావం ఏమిటంటే —

"మనలను గురించి యితరులేమనుకున్నా మన మేమీ పట్టించుకోకూడదు. మనకున్న వ్యాపారమల్లా బాధపడడమే. మనకు రాత్రయినా పగలయినా సమానమే రెండింటికీ సమాన విశిష్టత ఉంది ఉదయం తరువాత సాయంకాలం తప్పకుండా వస్తుంది. అలాగే మళ్ళీ ఉదయం కూడా వస్తుంది అయినాగానీ అబ్దుల్ గనీ జేబుల్లో ఉన్న సౌఖ్యం పేదరికమే."

ఆ సాయంకాలం నూతన జీవితం గురించి చర్చ చేస్తుంటే బాబా యిలా అన్నారు — "జనవరి (1950) 1 వ తేదీ నుంచి మీరు అడగకుండానే మీకు ఎవరయినా నెయ్యి, టీ, పంచదార, కట్టెపుల్లలు, కిరసనాయిలు, చిలుం గొట్టాలు, పుగాకు, అగ్గిపెట్టెలు. యివ్వి యివి యిస్తే పుచ్చుకోండి " అని.

నవంబరు (1949) 7 వ తేదీన బయట ప్రపంచానికి తెలిసేలా ఒక కాగితం అచ్చువేయించడమా వద్దా అని చర్చించు కున్నారు. అనుచరులకు ఆ కాగితం చూపిస్తే వారికి నూతన జీవితం గురించి తెలుస్తుంది కొందరు అచ్చు వేయించవద్దన్నారు కొందరు పరవాలేదన్నారు సహచరులతో బాబా యిలా చెప్పారు—

"నూతన జీవితానికి మూడు స్థాయిలున్నాయి మొదటిది అక్టోబరు (1949) 16 వ తేదీన ప్రారంభం అయిందని చెప్పవచ్చు మొదటి భాగం ఆ తారీఖు నుంచి డిసెంబరు ఆఖరువరకూను రెండవ భాగం జనవరి 1 వ తేదీ లగాయితు 4 నెలలో 6 నెలలో లేక 15 నెలలో సాగుతుంది మూడవ భాగం నిర్మాణానికి ఆఖరు రాయి వేసినపుడు ప్రారంభం అవుతుంది నూతన జీవితం గురించి వివరించ డానికి ఒక కట్టడం ఉదాహరణగా తీసుకుంటే మొదటి భాగం సహాయము శిక్షణ అనేది ఎటువంటి ఇటుకలు, సున్నము. అమిత ఉపయోగించాలో నిర్ణయించుకోవడం లాంటిది ఈ భాగంలో చాలా మట్టుకు కూడా పరిశీలించి ఉంటుంది

రెండవ భాగంలో రెండు కాలాలున్నాయి మొదటి దానిలో శిక్షణ రెండవ దానిలో అభ్యాసము భిక్షువిన కోసం శిక్షణ తీసుకోవడం. లంగోటీ జీవితం, కూలిపని, అభ్యాసమనేది నిజంగా కఫ్నీ తొడుగుకొని లంగోటీ ధరించి భిక్షకై వెళ్ళడం ఇది పైన చెప్పిన ఇటుక, సున్నం, కట్టుసామాను పోగుచేసుకోవడం లాటిది. పునాది వేయడం పునాది పూర్తయాక దానితో సంపూర్ణత్యాగం పోల్చవచ్చును.

మూడవది ఆఖరుది అయిన భాగం పైన భవన నిర్మాణము ఇది అసలు జీవితమన్న మాట ఈ జీవితానికి ప్రారంభం ఉంది కాని అంతం లేదు మొదటి భాగం అయిన శిక్షణ అభ్యాసములో మామూలు పరిస్థితులే ఉంటాయి అని యిదివరకే చెప్పడం అయింది అందుచేత లంగోటీ, కూలిపని, భిక్షాటన యివి పునాదిలో ఆఖరి రాయి వేయడం వరకు జరుగుతుందన్న మాట. అదే సంపూర్ణ త్యాగం

ఆ భవనంలో నివసించడం ఆఖరి భాగమన్న మాట. సంపూర్ణత్యాగం చేసిన తరువాత అది సాధించడమవుతుంది అప్పుడు సాధారణమయిన, అసాధారణ మయిన పరిస్థితులు ఏర్పడతాయి ఇవే మిమ్మల్ని బాధలను హాయిగా అనుభవించేలా చేసేవి; నేనింతకంటె చెప్పలేను ఈ స్థాయిలో జీవితము అనంతమయిన అంతాన్ని తీసుకువస్తుంది ”

మధ్యాహ్నం టీ అయిన తరువాత బాబా సహచరులతో కూర్చుని ఎవరికి ఏమి కావాలో వ్యక్తిగతంగా వారి అవసరాల గురించి చర్చించారు. దమ్మిడీకూడా చేతిలో లేకుండా గడపాలి జనవరి (1950) 1 వ తేదీనుంచి ఈ విషయం ఎందు కొచ్చిందంటే అప్పుడు డిసెంబరులో చలి విపరీతంగా ఎక్కువగా ఉంటుంది. అందు చేత సహచరులను అడిగి తెలుసుకోగా వారికి హిమాలయ పర్వతప్రాంతాల్లో భవిష్య త్తులో ఉండడానికి తగిన సంరజాం లేదని తేలింది అందుచేత బాబా ఒక్కొక్కరికి రెండేసి గొంగళీలు కొని యిమ్మని చెప్పారు, రాత్రి పరుండేటప్పుడు ఉపయోగించేం దుకు. ఇంకా కొన్ని చిన్న చిన్న వస్తువులు వారంతా కొనుక్కోవాలంటే వాటికి ఒక జాబితా వ్రాయమని చెప్పారు అవి సబ్బు, పళ్ళు తోముకునే పేస్టు, సూది, దారము, బొత్తాలు, పిన్నులు మొదలయినవి జాబితాలో వ్రాసినవి అన్నీ పరిశీలించి బాబా ఎరచోని కొని తీసుకురమ్మన్నారు తరువాత బాబా—“ఇప్పుడు మనకు ఉన్నవి యీ నూతన జీవితం చివరివరకు సరిపోవాలి జనవరి 1 వ తేదీ తరువాత ఏ వస్తువూ కొనడానికి వీలుండదు దానికి డబ్బు ఉండదు ఇంతకంటె యిప్పుడేమీ సరఫరా చేయలేను.

ఇప్పుడు యీ వస్తువులు కొనడంలో నా మనసు పరిశుద్ధంగా ఉంది. మనకున్న పరిమితమైన డబ్బులో ఎంతవరకు చేయాలో అంతవరకు చేసాను

నవంబరు 8 (1949) వ తేదీ ఉదయం బాబా సహచరులలో యిద్దరు – గుస్తాద్‌జీ, కాకా—బాబా ఆజ్ఞలను వెంటనే పాటించనందుకు బాబా వారిని మందలించారు. గుస్తాద్‌జీ రాత్రి తన పరుపుకి నాలుగు వైపులా గీతలు గీసుకునే అలవాటుంది ఆ అలవాటు ప్రకారం యిప్పుడు కూడా ఎందుకు చేస్తున్నావని బాబా అతనిని అడిగారు. అందుకతడు అందువల్ల నాకేం ప్రమాదం కనపడలేదు' అన్నాడు. ఇలా సరిగా జవాబు చెప్పనందున బాబా చివాట్లు వేసారు అలాగే బాబా కాకాను ఎందుకోరమ్మంటే రావడం ఆలస్యం చేసాడు అప్పుడతడు ఉల్లిపాయలు వేయిస్తూంటే ఆ ఉల్లిపాయలు కుంపటి మీద నుంచి దింపి మరీ వెళ్ళాడు. ఈ కొన్ని క్షణాల ఆలస్యానికి బాబా అతన్ని కేకలేసారు. అప్పుడు బాబా సహచరులందరినీ పిలిచి యిలా చెప్పారు –

"మీ పాత అలవాట్లను దిద్దడానికి నేను మీకు ఎంత సహాయం చేసినా మీరు ఏదోలే పోం అన్నట్లుగా చాలా తేలికగా జీవితం వెళ్ళబుచ్చుతున్నారు. నేను యిచ్చిన ఆదేశాలను సరిగా తీసుకోవడం లేదు నిన్న ప్రొద్దున గనీకి టోపి పెట్టుకోమని చెప్పాను అతడు ఎండ అంత ఎక్కువగా లేదని జవాబు చెప్పాడు ఆదీని అందరితో కలిసి పాడమన్నాను. ఆ సంగతే అతడు మరిచిపోయాడు నేను చెప్పినది చెప్పినట్లు చేస్తే మీ పాత అలవాట్లను జయించిన వారవుతారు. ఈ శిక్షణ మీకు చివరికి జనవరి 1 వ తేదీ నుంచి నూతన జీవితం ఆత్మవిశ్వాసంతో ఎదుర్కోవడానికి సహాయకారిగా ఉంటుంది

గుస్తాద్‌జీ, కాకా నేను యిచ్చిన చిన్నవయిన ఆజ్ఞలనే తిరస్కరించారు ఇది వారికి తెలియకుండానే చేసి ఉండవచ్చును. వారిపాత అలవాట్లను అధిగమించలేకుండా ఉన్నారు. వారిని చేతులు జోడించి అడుగుతున్నాను వారి పాత అలవాట్లను పోగొట్టుకోమని డిసెంబరు ఆఖరి వరకు యీ లోపాలన్నీ క్షమించబడగలవు. జనవరి 1 తరువాత మీ పాత పంథాలోనే మీరు ఉంటే మీరు నాతో ఉండలేరు.

జనవరి 1 వ తేదీ తరువాత నిబంధనల ప్రకారం నడుచుకోవడంలోను, నా ఆజ్ఞలు పాటించడం లోను నా సహవర్యంలో ఎంతకాలం నుంచి ఉంటున్నవారు ఎంతసేవ చేసినవారయినా అందరూ సమానులే ఒక కొండ యెక్కేటప్పుడు గనీ

ఆయాసంతో పడిపోతూంటే నేను అతనిని పాడమంటాను. డాన్ బలంగా ఉన్నా అతనిని యింక ఎక్కవద్దు ఆగిపొమ్మంటాను — అనుకోండి అలాంటప్పుడు గనీ పాడడానికి ప్రయత్నిస్తే అతడు జయించినట్లే డాన్ యింక ఎక్కకుండా ఆగి ఉంటే అతడు నామాట పాటించినట్లు లేక అతడు ఆగకుండా ముందుకు అడుగు వేస్తే అతడు విఫలుడైనట్లే మీరంతా పాత అలవాట్లను దులిపేసి నేనిచ్చిన ఆజ్ఞలు - అవి ముఖ్యమయినవి అయినా కాకపోయినా అర్థం ఉన్నా లేకపోయినా, తక్షణమే పాటించాలి. ఇప్పటి నుంచీ మీరు యిలా అలవాటు చేసుకుంటే జనవరి 1 వ తేదీ తరువాత అది మీకు చాలా మంచి కలుగచేస్తుంది."

ఆ మధ్యాహ్నం ఎరచ్ బాబా ఆజ్ఞ ప్రకారం సహచరులకు కావలసిన చిన్న వస్తువులను బజారులో కొని తీసుకువచ్చాడు బాబా వాటిని సహచరులకు ఎవరికి ఏది కావాలో పంచి యిచ్చారు ఈ రోజున స్థానిక కన్నడ పత్రికా సంపాదకుడొకడు బాబాను చూడాలని పట్టుపట్టాడు. నూతన జీవితంలో అలాంటిదేమీ పనికిరాదని ఆదీ ఎంత చెప్పినా అతడు వినలేదు అప్పుడు బాబా అతనిని తన యెదుటకు తీసుకు రమ్మన్నారు. ఆ సమయంలో బాబా గది ఊడుస్తున్నారు. అతడు రాగానే బాబా అతనికి ఎదురువెళ్ళి అతని పాదాలు చేతులతో స్పృశించారు ఆ పత్రికా సంపాదకుడు తన పొరపాటును తెలుసుకొని వెళ్ళిపోయాడు.

నవంబరు 9 వ తేదీన చూడగా నిన్నటిరోజున గుస్తాద్‌జీని కాకాని వేసిన చీవాట్లు యీ రోజు పని చేసినట్లు కనిపించాయి ఈ రోజు ఉదయాన్నే బాబా సహచరుల బసకి వచ్చి గనీని పిలిచాడు ఆ సమయంలో గనీ మరుగుదొడ్లో ఉన్నాడు. బాబా పిలుస్తున్నారని అతడు అక్కడినుండే విన్నాడు లాగు పైకి లాక్కోకుండానే ఎలా ఉన్నవాడు అలా పరుగెత్తుకుని బాబా వద్దకు వచ్చాడు. అలా రావడం చూసి బాబా చాలా సంతోషించారు మిగతా సహచరులందరినీ అతనికోసం చప్పట్లు కొట్టమన్నారు, చిన్నపిల్లల రేడియో ప్రోగ్రాంలో జేజేలు చెప్పినట్లు తరువాత బాబా సహచరులను ఒక్కొక్కరిని వారి నిద్ర గురించి ఆరోగ్యం గురించి కుశలమడిగారు. బాబా తమకి స్త్రీలకి కూడా బాగా నిద్రపడుతోందని చెప్పారు. రాత్రివ్పు కావలికాసే అన్నా జక్కల్ గుడ్లగూబలను గబ్బిలాలను దూరంగా తోలేసినప్పటినుంచి బాగా నిద్రపడుతోంది

విష్ణు పూనాకి ఏదో ప్రత్యేకమయిన పనిమీద వెళ్ళి గతరాత్రి తిరిగి వచ్చాడు అతడు రాగానే సహచరులంతా ఏమిటి పూనా విశేషాలు అని అడిగారు. బాబా వార్తాపత్రికలు చదవవద్దన్నారు ఎవరితోనే రాజకీయాలు చర్చించవద్దన్నారు. కానీ పత్రికలమ్మే పిల్లలు గోడ్సే ఆప్టేలను నవంబరు 15 వ తేదీన ఉరితీస్తారని కేక లేయగా విన్నాడు వారిమీద గాంధీ మహాత్ముని చంపినందుకు నేరం మోపారు

అది విని బాధతో వారి సహచరులు నవంబరు 15 వ తేదీన అంతా కాశీ చేరుకుంటామని బాబాకు జ్ఞాపకం చేసారు అక్కడ 144 వ సెక్షను అమలులో పెట్టినా పెట్టవచ్చు బాబా వార్తాపత్రికలు చదవకూడదన్న ఆదేశం సవరిస్తే బాగుం టుందేమో అన్నారు మాకు తెలియదు మేం చదవలేదని అనడం కంటె పత్రికలలో పడేది తెలుసుకుంటుంటే మంచిది కదా అన్నారు కొంత దూరం వారితో యీ విషయం మీద చర్చచేసి చివరికి బాబా యిలా నిశ్చయించారు ——

"సహచరులలో ఎవరూ పత్రికలు చదవరాదు రాజకీయాలు చర్చించ రాదు. ఇప్పటిలాగే ముందుకూడా ఉండాలి ఈ నూతన జీవితంలో యిలాటి విషయాల్లో నేను కూడా మీతో బాటే. అందుచేత మీలో ఒకరు చేసిన సూచన నేను అంగీక రించడం లేదు. పేపర్లు నాకు చదివి వినిపించనూ వద్దు నేను మీకు చెప్పనూ వద్దు అయితే యీ సమస్యకి ఒక పరిష్కారం ఆలోచించాను. డాన్ తన దగ్గర రు 75 లు ఉంచుకుని యీ రెండేళ్ళు ప్రతిరోజు దినపత్రిక కొని చదువు తూండాలి వీలయినపుడు అతడు కొనకుండా చదువుతూండాలి. అతడొక్కడే పత్రిక చదవాలి. చదివి ముఖ్యమయిన భాగాలు మనకు కావలసినవి కత్తిరించి ఉంచాలి. డాన్ ; నీవు అవి నాకు చూపెస్తూ ఉండు నేను అంగీకరించినవి సహచరులకు చదవడానికి యిస్తాను ఇందులో నూటికి నూరుపాళ్ళు యీ పని నీవు జాగ్రత్తగాచెయ్యాలి అంటే నీవు చదివినది రాజకీయవార్తలు ప్రపంచవార్తలు ఎవరికీ చెప్పకూడదు క్రొత్తచట్టాలు, కర్ఫ్యూలు సెక్షన్ 144అమలులో పెట్టడం, స్ట్రైకులు వగైరాలు మన జీవితానికి సంబంధించినవి మాత్రం కత్తిరించి చూపాలి నీవు చదివినది మరిచిపోయి పత్రిక చించి పారవెయ్యి ఇది డాన్ యొక్క జీవిత కర్తవ్యం

నవంబరు 10 వ తేదీన వంట మానేసి సామానులు సర్దుకోవడం ప్రారం భించారు 10, 11, 12 తేదీలలో భోజనం బయటనుంచి కొని తీసుకురావాలి ఆ

రోజున సీలు అనుకోకుండా బాబా ఆజ్ఞ పాటించవానికి ఆలస్యం అయేసరికి సహచరు లందరినీ పిలిచి బాబా ఒక దీర్ఘమయిన ఉపన్యాసం యిచ్చారు.

ఆ చెప్పినదాని సారాంశం ఏమిటంటే "ముఖ్యం అయినా కాకపోయినా బాబా చెప్పగానే చెప్పినట్లు ఆక్షణమే నిర్వర్తించాలి బాబా కోపపడినా సరే సహచరులు ఉత్సాహంగా ఉండాలి. మీరుచేసిన పని తప్పుకాక సరిగా ఉంటే బాబా కోపపడినా గానీ యింక విచారమెందుకు ! మీరు చేసినది తప్పయితే బాబా చెప్పినట్లు దిద్దుకోండి. తప్పుచేసినా చేయకపోయినా, వాదించవద్దు సమర్థించుకోవద్దు"

మధ్యాహ్నం పూట అనుకోకుండా విశ్వనాథ్ హల్దన్‌కర్ మకాంకి వచ్చాడు. అతడు బెల్గాం వచ్చి అతనిసోదరి యింటిలో వేచిఉండవలసింది విష్ణుకోసం ఈ నూతన జీవితంలో బాబాని గాని వారి సహచరులను గాని ఎవరినీ కలుసుకొనకూడదు హల్దన్‌కర్. జాల్‌రుసి బెల్గాంలో ఉన్నా అతడు బాబాను చూడలేదు ఆయన సహచరు లెవరి నీ కలుసుకోలేదు. డాన్ అతనిని ఎన్నోసార్లు కలిసాడు గాని యిద్దరూ కూడా ముఖాలు చెరొకవైపుకి తిప్పేసుకున్నారు హల్దన్‌కర్ వచ్చి బాబా కనిపించగానే చేతులు జోడించి నమస్కారం కూడా చేసాడు బాబా వెంటనే అతనిని పిలిచి అతని కాళ్ళకి ప్రణామం చేసారు దర్శనం కావాలని పట్టు పట్టినవారికి బాబా అలాగే చేస్తారు.

11 వ తేదీన అగ్ని విష్పడం కట్టడంతో సరిపోయింది సహచరులు ఆ రోజున ఆఖరిసారిగ స్నానం చేసారు వారిబట్టలు కూడా ఉతికి ఆరేసుకున్నారు.

12 వ తేదీ ఉదయాన సహచరులు వారి ట్రంకుపెట్టెలు పరుపులు సర్దుకొని కట్టేసుకుని సిద్ధంగా ఉంచారు, రైలుస్టేషన్‌కి తీసుకు వెళ్ళడానికి. మగవా రంతా రైలుస్టేషన్‌కి సా॥ 4-30 గంటలకు నడిచివెళ్ళారు- బాబా ఆడవారితో వెంటనే కారులో బయలుదేరి స్టేషన్‌కి వెళ్ళారు అందరికీ బెల్గాంనుంచి పూనా, బొంబాయి, మొగల్‌సరాయి మీదుగా బెనారస్ కంటోన్మెంటుకి టిక్కట్లు కొన్నారు స్త్రీలు నలుగురు మొదట తరగతిలో ప్రయాణం చేసారు బాబా, సహచరులతో, మూడవ తరగతిలోనే యెక్కి కూరుచున్నారు

బెల్గామ్‌నుంచి పూనా వెళ్ళేవరకు ప్రయాణం సాఫీగా జరిగింది బాబా ఎవరికీ దర్శనం యివ్వలేదు బెల్గాం స్టేషన్‌లో ఒక ముసలాయన మాత్రం బాబాను

ఆనవాలు పట్టాడు అతడు బాబాకు ప్రణామం చెయ్యబోతుండగా బాబా అతని పాదాలు స్పృశించారు ఎప్పు మరిచిపోయిన మిఠాయిలు తేవడం కోసం అనే మిషతో విశ్వనాథ్ హల్లన్‌కర్ బెల్గాం స్టేషన్‌కి వచ్చాడు మూడవ తరగతిలో సర్వెంట్సు కంపార్టుమెంటు (సేవకులపెట్టె) లో 13 గ్గురికే చోటు ఉన్నా సామానుతోనే పెట్టె అంతా నిండిపోయింది. మరునాడు (13-11-49 వ తేదీ) ఉదయం 6 గంటలకి పూనా చేరింది రయిలు పాసెంజరు బండిలో సామాను బుకింగ్ చేసారు అది పూనాకి తెల్లవారు ఝామున 2 గంటలకు వచ్చింది పూనా మెయిలులో సామాను వెయ్యవచ్చునని తెలిసి బాబా బైదుల్‌ని పెండుని ముందుగా ఆ రైలులోనే బొంబాయి వెళ్ళమన్నారు. జబల్‌పూర్ మొగల్ సరాయిల మీదుగా అదే రైలులో (కలకత్తా మెయిలు) బొంబాయినుంచి టిక్కట్లు కొని అందరికీ సీట్లు రిజర్వుచేయమని చెప్పారు.

బొంబాయినుంచి కలకత్తా మెయిలు రాత్రి 9 గంటలకు బయలుదేరు తుంది అందుచేత బాబా పూనా మెయిలును బొంబాయికి వెళ్ళిపోనిచ్చారు మధ్యాహ్నం 12-50 గంటలకు బయలుదేరి పూనా పాసెంజరులో బొంబాయికి వెళ్ళారు అంత వరకు పూనా రైలుస్టేషన్‌లోనే ఉన్నారు. బొంబాయి మెయిలులో వెళ్తే విక్టోరియా టెర్మినస్ స్టేషన్‌లో వేచి యుండవలసి వస్తుంది అంతకంటె పూనాలో ఉండడమే మంచిదనిపించింది బాబాకి పూనాకి వీరంవచ్చే రావడం ఎవరూ గమనించలేదు. గడేకర్, హాకీమ్ మాత్రం పుస్తకాల దుకాణం వద్ద ఉన్నారు వారికి తెలుసును గనుక దావాని గాని సహచరులను గాని వారు కలుసుకోవడానికి ప్రయత్నించలేదు. సహచరులు కూడా కొందరు వారిని చూసారుగాని చూడగానే ముఖాలు తిప్పేసు కున్నారు. బాదా కోరిక ఆయన ఆదేశం తెలిసి ఉన్నవారు గనుక అలా చేసారు

డా॥ నీలు డొడ్డికి వెళ్ళవలసి వస్తే ప్లాట్‌ఫామ్ మీద ఒక రైలు ఉంటే అందులో డొడ్డిలోకి వెళ్ళి కూర్చున్నాడు అది లోనవలా వెళ్ళే రైలు. అతని పని పూర్తికాకమునుపే ఆ రైలు కదిలింది ఆ హడావడిలో లాగు కట్టుకోవడానికి సమయం లేకఅలాగే చేత్తో పట్టుకుని రైలులోంచి దూకాడు. అలా దూకడంలో ప్లాట్ ఫామ్‌మీద గభాలున పడ్డాడు సగం నగ్నంగానే మూకేముందు కోటు, టోపి ముందు ప్లాట్‌ఫామ్ మీదకి విసిరేసాడు ఈ సంగతి సహచరులకి చెప్పగా వాళ్ళు పొట్ట చెక్కలయేలా నవ్వారు.

టీ అయిన తరువాత బాబా వారి పరివారం వారికి ఎవరు చేయవలసిన పనులు వారికి చెప్పారు ఆదీ, విష్ణులను రొట్టె, వెన్న, జామ్ము, అరటిపళ్ళు ప్రయాణానికి సరిపడవి కొనమన్నారు మొదటి తరగతి ప్రయాణీకులు వేచియుండే గదిలో కూర్చున్న నలుగురు డ్రింక్ ఏదయినా కావలిస్తే ఎరచ్ ని వారికి తెచ్చి యివ్వమని పంపించారు మిగిలిన సహచరులు ప్లాట్‌ఫామ్ మీద ఉంచిన సామానులు చూస్తూ ఉండాలి. 12-50 గంటలకు రైలు ఉంటే అప్పటివరకు బాబా ప్లాట్‌ఫామ్ మీద వేచి ఉండడం యిష్టం లేక బయటకు షికారుకి వెళ్ళి వద్దామని బయలుదేరి వెళ్ళారు. సంగం వంతెన వరకూ వెళ్ళి వద్దాము అని బాబా వారితో నీలుని గనీని తీసుకు వెళ్ళారు. వంతెన వద్దకి వెళ్ళి పడవరేవు వద్ద ఒక గంట బాబా వారిద్దరితోను కూర్చున్నారు. భోజనం దివాకర్ హోటలులో ఏర్పాటు చేసారు దానికి యింకా సమయం ఉంది గనుక బాబా ఇంజినీరింగు కాలేజీవరకు నడచి వద్దామని వెళ్ళారు ఆ వెళ్ళడం వెళ్ళడం శివాజి మిలిటరీ స్కూలుకి మళ్ళీపోయి ఉన్న సిమలా ఆఫీసు గోపురం వరకు వెళ్ళారు. మళ్ళీ వచ్చేటప్పుడు భోజనాలు కానిచ్చి అక్కడ నుంచి జిల్లా కోర్టువెనుక నుంచి 10-30 గంటలకు రైల్వే స్టేషన్‌కి చేరుకున్నారు. రైలు బండి టైం ప్రకారం బయలుదేరింది.

బొంబాయి వెళ్ళేసరికి సాయంత్రం 6 గంటల 30 నిముషాలయింది. పెండు, షెడ్యుల్ అక్కడ నుంచి ప్రయాణానికి మొదటి తరగతిలో ఆడవాళ్ళకి, సేవకుల పెట్టెలో కూర్చునే సహచరులకు టిక్కెట్లు కొనడం విషయంలో ఏం చేసారో బాబాతో చెప్పారు. విక్టోరియా టెర్మినస్ స్టేషన్‌లో విశ్రాంతి గదులలో ఆడవాళ్ళకి చోటు చూపించమని సామాను జాగ్రత్త అని చెప్పి బాబా గనీని ఆదీని తీసుకొని స్టేషన్ బయటకు వెళ్ళారు అక్కడ టాక్సీలు కార్లు ఉండే చోటికి వెనుకవైపు ఏకాంతంగా ఉండే అక్కడకు వెళ్ళి కూర్చున్నారు బాబా ఆ రాత్రి బయలుదేరే కలకత్తా మెయిలు విపరీతంగా ప్రయాణీకులతో క్రిక్కిరిసి ఉంది. బాబా మరి ఏడుగురు సహచరులు సేవకుల పెట్టెలో కూర్చున్నారు మిగిలిన సహచరులు ఎలాగో యింకో మూడవ తరగతి పెట్టెలో సర్దుకున్నారు. అది కళ్యాణ్ వరకు ఖాళీగా వెళ్ళేపెట్టె అందులో జనం ఎక్కకుండా చూడడం చాలా కష్టమయింది రాత్రి 9 గంటలకు మెయిలు బయలు దేరింది

సేవకుల పెట్టెలో 7 గురికే చోటు ఉంది అందులో బాబాతో 8 గురు ఉన్నారు. అక్కడి రెండు బెంచీలలోను ఒకటి బాబా కోసం ఆయన పక్క

సరిచేసారు. సహచరులు ఎలా పడుకుంటారు అనేది ఒక పరిష్కారింపబడని సమస్య అయింది. అలాగే కూర్చుని వాళ్ళు కునికిపాట్లు పడాలి. పైన ఉన్న బల్లమీద పంతుల వారీగా ఒక్కొక్కగంట ప్రతివాడు పరుండాలని బాబా చెప్పారు అందుకోసం దాని మీద పర్చిన పెట్టెలు వగైరాలు దింపి కూర్చునే బెంచీల క్రింద పెట్టారు దర్వాజాలు మూసేపి అక్కడ కొన్ని పెట్టెలు పేర్చారు

ప్రయాణంలో పగలంతా బాబా నవ్య జీవితం గురించి ప్రసంగిస్తూనే ఉన్నారు మధ్య మధ్య టీ త్రాగినప్పుడు భోజనము చేసినపుడు తప్ప. రాత్రి భోజనం వారికి సుష్టుగా కుదిరింది ప్రయాణీకులు ప్రతి స్టేషన్‌లోనూ ఎక్కడానికి ప్రయత్నించడం సహచరులు వీలులేదని తోసివేయడం జరిగింది రాత్రి జబల్‌పూర్ తరువాత ఒక స్టేషన్‌లో ఎంతో బ్రతిమాలితే సహచరులు బాబా ఆజ్ఞ ప్రకారం ఒక్కనిని ఎక్కించుకున్నారు

మొగల్‌సరాయి చేరేసరికి మర్నాటి రాత్రి 2-30 గంటలయింది. తెల్లవారితే నః౦బరు (1949) 15 వ తేదీ. మొగల్‌సరాయి జంక్షన్‌లో మెయిలు ఆగేసరికి సదాశివ్ పటేల్ వచ్చి కనిపించాడు. వారణాసి వెళ్ళే రైలు కొంచెం దూరంలో సిద్ధంగా ఉంది సామాను ఆ రైల్లోకి ఎక్కించడానికి ఏర్పాటులలో ఏదో పొరపాటు వల్ల సామాను దింపినచోట దానికి రక్షణగా నిలబడడానికి తోడు లేకుండా బాబా ఒక్కరూ ఉండిపోయారు ఇలా జరిగిన దానికి బాబా వాళ్ళని కోపపడ్డారు కోపం వచ్చినందుకు సహచరులను బాబా చెవులు గిల్లి ఆయనను లెంపకాయ కొట్టమన్నారు. ఆయన ఆజ్ఞ పాలించారు సహచరులు. చలి చాలా ఎక్కువగా ఉంది. సదాశివ్‌ని టీ తీసుకువచ్చి అందరికీ యిమ్మన్నారు. అంతా టీ సేవించారు ఈ రైలు కాశీకి 4-30 గంటలకు బయలుదేరింది

రైలు కాశీకి ఒక గంటలో చేరింది అందరికీ చలి చాలా బాధగా ఉంది. కాశీ కంటోన్మెంటు స్టేషన్‌లో బాబా సహచరులతో రైలు దిగారు. బాబాదాస్ అక్కడికి వచ్చి వారికి స్వాగతం చెప్పాడు. బాబా దర్శనం కోసమని 4 గంటలనుంచి డా॥ ఎస్ నాథ్ కుటుంబ సహితంగా వచ్చి ఉన్నారని బాబాదాస్ చెప్పాడు. బాబాకు మొగల్‌సరాయి జంక్షన్‌లో మనసు కలత చెంది కోపం వచ్చింది కదా. ఈ సంగతి విన్నాక బాబా మనసు అసలే శాంతించలేదు. ఈ నూతన జీవితంలో దర్శనాలు పనికి

రావనీ. లేవనీ వాళ్ళకి చెప్పక్కర్లేదా అని బాబాదాస్‌ని చీవాట్లేసారు. స్టేషన్‌కి రాకూడ దని చెప్పి వారు రాకుండా చేయవలసిన పని బాబాదాస్‌ది బాబాదాస్ తాను డా॥నాథ్‌కి, డా॥ ఖరేకి చెప్పినాగాని వాళ్ళు కుటుంబాలతో ఎలా వచ్చారో నాకు తెలియ దన్నాడు

కాశీలో దిగగానే యీ సంఘటనకి బాబా నొచ్చుకుని యిది భవిష్యత్తుకి ఏమీ అంతమంచి శకునం కాదన్నారు. ఆ డాక్టర్లు కుటుంబాలతో వెంటనే యిళ్ళకి వెళ్ళిపోవాలని పంపించెయ్యమని, వాళ్ళు వెళ్ళిపోయి మరల బాబాను చూడటానికి ప్రయత్నం చెయ్యకూడదనీ బాబాదాస్‌ని పరుగున వెళ్ళి చెప్పమని బాబా పంపించారు. వారికి ఆశాభంగం కల్గింది వాళ్ళు బాబా ఆజ్ఞప్రకారం కుటుంబాలతో వారి యిళ్ళకు వెళ్ళిపోయారు. ఈ గొడవమూలాన బాబా సహచరులతో వారికి ఏర్పాటుచేసిన బసలకి వెళ్ళడం ఒక గంటన్నర ఆలస్యం అయింది డా॥ నాథ్ కారులో బాబా స్త్రీలతో వారికి ఏర్పాటయిన బసలకి వెళ్ళారు. లోపలికి గదిలోకి వెళ్ళగానే గదినిండా కుర్చీలున్నాయి అది ఒక పెద్ద ఉపన్యాసపు గది. ప్రక్క యింకోగదిలో జంకానా వేసి ఉంది. గోడకి ఒక వాలీసు వేసి ఉంది స్త్రీలంతా ఆ గదిలోకి వెళ్ళి జంకానా మీద కాళ్ళు జాపుకొని పరున్నారు. ఆ వాలీసును దగ్గరకు లాక్కొన్నారు వెచ్చగా ఉంటుందని కాని అది మాసిపోయిన గలీబుతో ఉంది. అక్కడ ఉన్న కుర్చీలు బల్లలు ఉపయోగించవద్దని బాబా వారికి చెప్పినందున అవన్నీ ఒక ప్రక్కగా తొలగించ బడ్డాయి ఒక కుర్చీమాత్రం బట్టలు పెట్టుకునేందుకు ఉంచుకున్నారు

బాబాకి సహచరులకి నాటి ఇమ్లీ అనే స్థలంలో డా॥ ఎస్. నాథ్ చేత యీ బంగళాలు ఏర్పాటు చేయబడ్డాయి ఒక పెద్ద ఆవరణలో యీ రెండు బంగళాలు ఉన్నాయి పెద్ద ఇనుపగేటుకి కుడివైపున రెండంతస్తుల మేడ ఉంది మెట్లకి యిరువైపులా కాపలా బొమ్మలున్నాయి. అవి చూసి మండలి యిది కలా నిజమా అని అనుమానపడ్డారు. దానికి ఎడమవైపున వసారా, గది, యింకా పెద్ద గదులు, స్నానాలగది, వంటయిల్లు అన్నీ ఉన్నాయి

అందులో తోటకూడా ఉంది ఆ తోటలో పళ్ళ చెట్లు ఉన్నాయి ప్రధాన మయిన భవనానికి ఎత్తయిన ప్రహారీగోడ ఉంది ఆ తోటని నిచబాగ్ అంటారు అది చూస్తే పాతకాలంనాటి వైభవం జ్ఞాపకం వస్తుంది దాని యజమాని యిప్పుడు ఆ భవనాన్ని తన కాపురానికి ఉపయోగించటం లేదు. అక్కడక్కడ ఆ భవనాలు

పడిపోతున్నాయి. అవి అంత పాతవి అయినా అందులో నివసించడానికి అన్ని సదుపాయాలూ ఉన్నాయి దీపాలు, కుళాయిలు ఉన్నాయి నీరు తోడక్కర్లేకుండా ఎలక్ట్రిక్ పంపుసెట్లు తో పని ఒక బావిలోంచి పైకి తొట్లలోకి ఎక్కుతాయి. సహచరులు నీళ్ళు మోసుకుందుకు శ్రమపడనక్కరలేదు

బంగళా వద్దకు వచ్చాక సహచరులు సామానులు లోపలికి తీసుకువెళ్ళి ఎవరి సామానులు ఎక్కడ పెట్టాలో అక్కడ సర్దేశారు. ఉదయాన్ని అల్పాహారం తీసుకోగానే ప్రయాణశ్రమనుంచి అందరూ బాగా తేరుకున్నారు ఈ అల్పాహారాలు డా॥ నాథ్ కుటుంబంవారు చాలా రుచిగా తయారుచేసి పంపించారు పంపించినది ఎక్కువగా ఉండడం వలన అల్పంగా గాక, ఎక్కువ గానే కడుపునిండా తీసుకున్నారు మొదటి రోజున పురుష సహచరులు గదులు శుభ్రపరిచారు.

నూతన జీవితం అక్టోబరు 16 వ తేదీన ప్రారంభించిన తరువాత యీ స్థలంలోనే బాబాకు సహచరులకు సమస్త సదుపాయాలూ అమిరాయి ప్రధాన భవనంలో మేడమీద బాబా స్త్రీలతో ఉంటున్నారు మిగిలిన సహచరులు వసారాలోను డా॥ దాన్ మాత్రం గదిలోను ఉన్నారు బాబా సహచరులను మేడ అంతా ఊడవమని ఆయనకూడా ఊడవడంలో పాల్గొన్నారు క్రింద సహచరులు పరుండడానికి వరుసలో వారి పడకలు వేయించారు బాబా. బాబాదాస్ ద్వారా డా॥ నాథ్, డా॥ ఖరేలతో, ఎరచ్ ఆదీలు అనేకమార్లు మాట్లాడారు బాబా వారి సహచరులతో వారణాసిలో ఉండడానికి యీ డాక్టర్లిద్దరూ ప్రధానపాత్ర వహించారు అన్ని యేర్పాట్లూ చేసి.

బాబాదాస్, సదాశివ్‌లు బాబాకు కాశీ విషయాలన్నీ నివేదించారు – మొదట బసలకోసం చాలా రోజులు ప్రయత్నం చేసి సదాశివ్ యింక మానేద్దామని అనుకున్నాడు. అతడు బాబాకి ఎరచ్‌నిగాని ఆదీని గాని కాశీకి పంపించమని తంతి యిచ్చాడు. కానీ బాబాదాస్ డా॥ నాథ్, ఖరేలను కలిసాక ఆశ కలిగింది. డా॥ ఖరే యొక్క తండ్రి బాబా గురించి విన్నాడు ఆయన గురించి చదివాడు కూడా ఒకమారు బాబా దర్శనం కోసం అహమద్‌నగర్ వెళ్ళియున్నాడు అతడు డా॥ నాథ్ ఒక శిక్కు మతస్థుడు. అతడు కంటి డాక్టరు. అతని మత శాఖలో గడ్డం పెంచుకోవడం వగైరా నిర్బంధం కాదు. ఇతనికి బాబా గురించి ఏమీ తెలియదు కాని ఆధ్యాత్మిక శిక్షణ కలిగినవాడు గనుక బాబా సంగతి వినగానే డా॥ ఖరేకి సహకారం చేసాడు.

బాబాకి సహచరులకు కాశీలో ఏర్పాట్లు చేయడంలో తోడ్పడ్డారు సదాశివ్, బాబాదాస్ బాబాతో డా॥ నాథ్ వల్లనే నాటి ఇళ్లు బంగళాలు దొరికాయని చెప్పారు. వారణాసిలో డా॥ నాథ్‌కి ఉన్న పలుకుబడి గొప్పది బాబాదాస్ యింతా చెప్పాడు — డా॥నాథ్, ఖరేలు బాబావద్దనుంచి రు 600/— తీసుకోవడానికి సుముఖంగా లేరని 28 రోజులకి వారందరికీ భోజనం యేర్పాట్లు చేయడానికి డబ్బు తీసుకుందుకు సంకోచించినా అది బాబా అభీష్టమే అయితే వారు దానికి వ్యతిరేకంగా మాట్లాడరని చెప్పాడు.

ఈ సంగతివిని బాబా ఎరచ్‌ని పంపించి డా॥ నాథ్‌కి డా॥ ఖరేకి రు 600/— యిచ్చి రమ్మన్నారు. ఈ విషయాలుకూడా స్పష్టంగా ఆ డాక్టర్లకి చెప్పమన్నారు — రోజుకి రెండు పూటలా భోజనం పంపించాలని, (ఉదయం 10-30 గంటలకు, సాయంత్రం 5 గంటలకు) భోజనం 24 మందికి సరిపోవాలని చెప్పమన్నారు. భోజనంలో ఏమేమి ఉండాలో అది డాక్టర్ల యిష్టం అన్నారు. మధ్యాహ్నం అన్నం పప్పు, సాయంకాలం బంగాళా దుంపల కూర ఉంటే చాలని బాబా చెప్పమని అన్నారు.

రైలు స్టేషన్ నుంచి కారులో బాబాను స్త్రీలను నివిబాగ్ తీసుకురావడం బాబాకి డా॥ నాథ్ యిచ్చిన భిక్షగా పరిగణించాలని అతడు కోరాడు ఏ కారణం చేతనయినా ఏ సాకు మీదయినా యీ డాక్టర్లుగాని వారి కుటుంబాలవారు గానీ నిచిబాగ్ ఆవరణలో అడుగుపెట్టడానికి వీలులేదని, యీ డాక్టర్లతో బాబాదాస్, ఎరచ్, ఆదీ యీ ముగ్గురు తప్ప యింకెవరూ మాట్లాడరాదని, ఆ డాక్టర్లు యీ ముగ్గురితో తప్ప సహచరులెవరినీ కలుసుకోరాదని బాబా చెప్పారు డా॥ నాథ్‌కి బాబా ఎవరో చెప్పలేదు. ఆయన పేరుకూడా చెప్పలేదు బాబాని చూడాలని అతడు కోరకూడదు. ఇలాంటి షరతులు పెట్టినా బాబాకి ఆయన పరివారానికి డా॥ నాథ్ భోజనం ఆ నెల్లాళ్ళు పంపుతూనే ఉన్నాడు బాబా కాశీలో ఉన్నంతకాలము అతడే వారికి ఆహారం పంపేవాడు అంతేగాక బాబా కాశీనుంచి వెళ్ళి సారనాథ్‌లో ఉన్నన్నాళ్ళు కూడా వారే భోజనం ఏర్పాటు చేసారు. నవంబరు 16 వ తేదీ ఉదయం బాబా సహచరులందరినీ చూసి రాత్రి బాగా నిద్ర పోయారా అని కుశలప్రశ్న వేసారు. ప్రయాణ బడలికవలన గాఢ నిద్ర పట్టిందని అందరూ చెప్పారు.

బెల్గాం నుంచి తిన్నగా రైలులో పంపిన సామానుపెట్టె తీసుకురావడానికి బాబా విష్ణుని రైలుస్టేషన్‌కి పంపించారు కొంతసేపటికి సామానంతా వచ్చిందిగానీ

ఒకటి తక్కువయిందని అది దారిలో ఏమయిందో తెలియదని వార్త తీసుకువచ్చాడు విష్ణు సహచరులకి స్నానం చేసి మంచి బట్టలు వేసుకుందామంటే సామాను రావాలి. రైల్వేవారు సామానులన్నీ తెరిచి ఒక్కొక్కదాంట్లోను లోపల ఉన్న వస్తువులుకూడా జాబితా వ్రాసుకొని యిస్తారుట అని విష్ణు చెప్పాడు. బొంబాయికి, అలహాబాదుకి, మొగల్‌సరాయికి పోయిన సామానుగురించి తంతిసందేశాలు యిప్పించివచ్చాడు విష్ణు.

సామాను వచ్చేవరకు సహచరులు స్నానంచేసి ఆ గుడ్డలే కట్టుకోవాలని బాబా చెప్పారు మధ్యాహ్నం మరల బాబా ఎరచ్‌ని, ఆదీని, బాబాదాస్‌ని యీముగ్గురిని డా॥ నాథ్, డా॥ ఖతేలను కలుసుకుని వారికి రు 700/– లు తీసుకువెళ్ళి యిచ్చి రెండు ఆవులు, రెండు ఆడ గాడిదలు కొనిపించమని చెప్పమని పంపించారు. బాబాకి ఎలాగయినా సేవచేసి సహాయపడదామని వారికి ఉంది గనుక యీ పనికూడా బాబా వారికి అప్పజెప్పారు ఈ పని చేసినందువలన ఎవరూ ఎవరికీ రుణపడి ఉన్నదేమీ లేదు బాబా వారి పరివారానికి పాతజీవితానికి కొత్త జీవితానికి మధ్య ఒక సంబంధం నెలకొనేలా డా॥ నాథ్ ఉండాలని ఎరచ్ ని ఆదీని బాబా అతనితో చెప్పమన్నారు. నాథ్‌కి బాబా చెప్పమన్న మాటలు భవిష్యత్తులో చాలా విశిష్టత కలిగి ఉంటాయని అన్నారు.

నవంబరు 17 వ తేదీన ఉదయం టీ త్రాగిన తరువాత బాబా తమ సహచరులందరిని వారి పాదాలు బాగా కడుక్కుని ఒకరి తరువాత ఒకరు వచ్చి బాబాకు ఎదురుగా నిలబడమన్నారు వారు ఆ విధంగా వచ్చి నిలబడగానే బాబా తమ చేతులతో వారి పాదాలు స్పృశించారు.

బాబా తరువాత యిలా చెప్పారు—

"గాడిదల కోసం కేటాయించిన డబ్బువలన మనం యింత దూరం రాగలిగాం కాని డా॥ నాథ్ మనకు ఖర్చులేకుండా ఉండటానికి బంగళా ఏర్పాటు చేసినందున గాడిదల డబ్బు కొంతవరకు మనం మళ్ళీ పూడ్చుకోగలిగాం ఈ విధంగా పొదుపు చేసిన రు 200/–లు చేతిలో మిగిలినది రు 500/– లు వెరసి మొత్తం రు 700/–లు డా॥ నాథ్‌కి యిచ్చి రెండు ఆవులను రెండు ఆడగాడిదలను కొనిపెట్టమని చెప్పి యివ్వడం జరిగింది- ఆవులు దొరక్కపోయినా ఆడగాడిదలు మాత్రం తప్పక కావాలి డబ్బు యింకా కావలిస్తే డా॥ నాథ్ మిగిలినది బాబాకి భిక్షక్రింద

తన జేబులోంచి తీసి యివ్వమని చెప్పాలి." ఏదయినా పనులు చేసి కొంతడబ్బు సంపాదించమని బాబా స్త్రీలతో చెప్పారు. వారు రోజూ యిల్లంతా శుభ్రంచేసి బట్టలు ఉతుక్కొని స్నానాలుచేసి తీరికగా కూర్చున్నప్పుడు పౌరాణికమయిన బొమ్మలు దుస్తులు తయారుచేసేవారు. కృష్ణుడు కంసుని సంహరించినప్పుడు జరిగిన యుద్ధానికి సరిపడిన బొమ్మలు అవి కానీ, యీ బొమ్మలెవరూ కొనలేదు.

ఉదయం 10-30 గంటలకు డా॥ నాథ్ యింటివద్ద నుంచి వచ్చిన భోజనం చాలా రుచిగా బాగుంది. వీరు (డా॥నాథ్, డా॥ ఖరే) వారి శ్రద్ధాభక్తులు కావలసిన దానికంటె ఎక్కువగా చూపిస్తున్నారని బాబా అన్నారు. మధ్యాహ్నం సహచరులకు చెప్పులజోళ్ళు, మఫ్లర్లు, ఫులెన్ సాక్సులు, స్వెటర్లు, గ్లవ్సలు మొదలయిన చిన్న వస్తువులు యిదివరలో బాబా కొని పెడతానని చెప్పినవి యిప్పుడు కొనుక్కోమని డబ్బు యిచ్చారు. క్రొత్తజీవితానికి యింకా యీ చలికాలంలో కావలసిన వస్తు కొనుక్కోమన్నారు

బాబా అన్నారు - "చెప్పుల జోళ్ళకి యింకా కావలసిన చిల్లర సామానుకి ఒక్కొక్కరికి రు 14/- లు యిస్తున్నాను. చేతులకి గ్లవ్సలకి - అయిదేసి రూపాయి లిస్తున్నాను. కాకావద్ద ఉన్న డబ్బుతో మామూలు చొక్కా దుప్పటీ తలొకటీ అతడు కొంటాడు

ఈ విధంగా యీ వస్తువులు కొనుక్కుందుకే డబ్బు వాడాలి అంతే. ఇందులోంచి ఏమీ మిగల్చకుండా అంతా ఖర్చుపెట్టాలి ఏదయినా మిగిలితే అది బిచ్చగాళ్ళకు యిచ్చేయాలి. ఈ డబ్బుతో మీరు టీ, తాంబూలం మొదలయిన యితర ఖర్చులు చెయ్యకూడదు చేతులకు తొడిగేవి (గ్లవ్సలు) తప్పకుండా కొనాలి ఈ 5 రూపాయిలలోంచి మిగిలినదానితో యింకో చిన్నవస్తువేదయినా కొనవచ్చు. ఈ రోజునుంచి మీరు అతి జాగ్రత్తగా వ్యవహరించాలి నేను యిక మీ తప్పులు దిద్ది మీకు సహాయం చేయను మీరు అప్రమత్తులై ఉండకపోతే మీ పని అయిందన్న మాటే నేను నా వైఖరిని సరిగా ఉంచుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాను. నేను యిందులో అపజయం పొందితే దానికి నా వద్ద ఒక మంచి మందుంది

ఎరచ్, విష్ణు రైల్వేస్టేషన్‌కి వెళ్ళి అక్కడ ఉండిపోయిన సామానులన్నీ గాక ఎక్కడో తప్పిపోయిన ఆ ఒక్క సామాను కూడా తీసుకొచ్చారు. దానివల్ల

యింతవరకు మొత్తం సామానులన్నీ తీసుకోకుండా ఉండవలసి వచ్చింది ఆ సామాను ఆ రోజు ఉదయమే వచ్చింది ఇప్పుడు సామానులన్నీ వచ్చాయి గనుక వారి వస్తువులు సర్దుకొని క్షవరం చేసుకొని, స్నానంచేసి, మంచి దుస్తులు వేసుకున్నారు. ఈ మారుకి మాత్రం ప్రయాణంలో మాసిపోయిన బట్టలు చాకలికి వేయడానికి బాబా అంగీకరించారు తరువాత మాసినవి సహచరులు ఎవరి బట్టలు వారు ఉతుక్కోవాలి" అని వివరాలతో చెప్పారు

నవంబరు 30 వ తేదీ వరకు భిక్షాటనకు శిక్షణ కార్యక్రమం వివరాలతో కూడా బాబా రూపొందించారు –

"బజారులో ఉన్నపని 21 వ తేదీ నుండి 23 వ తేదీ వరకు పూర్తి చేసుకోవాలి. 18, 19. 20 తేదీలలో గంగానది రేవులు చూడడానికి నగరంలో యింకా తిరిగి చూడడానికి సరిపోతుంది నలుగురేసిమందిని వెంటబెట్టుకుని సదాశివ్ తీసికొని వెళ్ళి అందరికి యీ మూడు రోజుల్లోనూ నగరం చూపించాలి.

"26, 27, 28, 29 తేదీలలో బాబా ఆడవాళ్ళను తీసుకొని వెళ్ళి గంగానది రేవులు చూస్తారు. వారితో బైడుల్, కాకా, సదాశివ్‌లు ఉంటారు. 20 వ తేదీన డాన్ సార్‌నాథ్‌కె వెళ్ళి అక్కడ బంగళా చూసి అక్కడ 10 రోజులు లంగోటీ జీవితం శిక్షణ తీసుకుంటూ గడపడానికి బాగుందేమో చెప్పాలి

"బాబా కొందరు సహచరులతో డా॥ నాథ్, డా॥ ఖరేల గృహాలకి వెళ్ళి భిక్ష అడగడంతో భిక్షాటన శిక్షణ ప్రారంభం అవుతుంది 24, 25 తేదీలలో యీ విధంగా ఉదయం 10 గంటలకు వెళ్ళాలి. డా॥ నాథ్ యింటివద్ద డా॥ ఖరే కుటుంబము వారు కూడా వచ్చి ఉండాలి. డా॥ ఖరే విశ్వవిద్యాలయం దగ్గర దూరంగా నివసిస్తూండడం చేత అంతదూరం బాబా రాలేరు. తరువాత రోజులు 26, 27, 28, 29, 30 తేదీలలో సహచరులు యిద్దరేసి భిక్షకోసం వెళ్ళాలి ఎలా భిక్షమెత్తాలో, వెళ్ళి ఏమి చెప్పాలో 20 వ తేదీన వివరించబడుతుంది.

బజారులో స్వంతపని ఏదయినా ఉంటే రేపు, 18 వ తేదీన మధ్యాహ్నం 12 గంటల నుంచి సా॥ 5 గంటల వరకు ఆ పని చూసుకురావాలి డా॥ గనీతోను, ఆదీతోను 18 వ తేదీ మొదలు 30 వ తేదీ వరకు ఎవరు ఏ తారీఖున ఏ సమయంలో

ఏం పని చేయాలో పట్టిక తయారుచేసి యిమ్మని బాబా చెప్పారు. ఇందులో బాబా యొక్క ముఖ్యమయిన కార్యక్రమం చూపబడింది. బెల్గాంలో చేస్తున్నట్లు డా॥ గనీతో బాబా దేహపరిశ్రమ ప్రారంభించారు ఇది కూడా ఆ పట్టికలో చూపించారు ప్రతిరోజు డా॥ గనీ బాబాని ఉదయాన్నే చూసి సుప్రభాతం చెప్తూ పరాన్ పద్ధతిలో యీ విధంగా చెప్పాలి —

"(1) స్తాదయ్ మాషయ్
(2) ఖ్వార్దె మాషయ్
(3) జోదయ్
(4) తగ్దయ్
(5) ఖుష్‌హాలయ్
(6) కాలేమాషయ్
(7) నలాహాయ్"

రాత్రి పరుండేముందు వచ్చి గుడ్‌నైట్ చెప్తూంటే గనీని బాబా ఉర్దూభాషలో పాట - పాడుతున్నట్లు యిలా చెప్పమన్నారు -

"పాత జీవితము పలువిధములుగా
గడచెను ఓ భాయీ!

ఈ దినమెట్లో జరిగెను సరిలే
రేపటి మాటా మనకెందుకులే ॥పాత॥

28 వ తేదీన మధ్యాహ్నం నిచిబాగ్ యజమాని యీ తోటమాలితో ఆ యింటి ఆవరణలో తిరుగుతున్నాడు ఇది బాబా చూసి కలవరపడ్డారు డా॥ నాథ్‌కి ఖరేకి స్పష్టంగా అక్కడికి ఎవరూ రావడానికి వీలులేదని చెప్పడం జరిగింది. బాబా అందులో ఉన్నన్నాళ్ళు యీ మాట పాటించవలసిందే జరిగితే యజమాని వచ్చిన వారికి సదుపాయాల లోటుపాట్లు ఏమన్నా ఉన్నాయేమో కనుగొనేందుకే వచ్చాడు. బాబా అతనిని వెంటనే వెళ్ళిపొమ్మనమని మరల యింక అక్కడ అడుగు పెట్టవద్దని కబురు చెప్పగా అతడు తెలియక వచ్చానని బాబాకి అసంతోషం కలిగేపని యింక చెయ్యనని వెంటనే వెళ్ళిపోయాడు ఇలా జరిగిందని బాబా డా॥ నాథ్‌కి డా॥ ఖరేకి చెప్పి రమ్మనమని ఆదీని పంపించారు ఇలా యింక జరగడానికి వీలులేదని

యింటియజమానికి చెప్పమన్నారు. ఆ యింటి ఆవరణలో యితరులెవరూ అడుగుపెట్ట డానికి వీలులేదన్నారు.

బాబా పెండు పగలు నిద్రపోతూండగా చూసి కారణమేమిటో అడిగారు. పెండుకి కొంచెంగా జ్వరం ఒళ్ళునొప్పులు వచ్చి (ఫ్లూ) అతడు జ్వరంతో బాధపడు తున్నట్లుగా తేలింది డాన్‌తో చెప్పి బాబా అతనికి మందు యిప్పించారు పెండుకి వచ్చిన యిన్‌ఫ్లూయెన్‌జా జ్వరం మరెవరికీ రాకుండా ఉండడంకోసం అతన్ని కొంచెం వేరేగా ఉంచారు. పెండు అంమవేళ తాన్ గదిలో ఉంటున్నాడు బాబాకి కూడా కొంచెం జలుబు చేసిందని మణికి యిన్‌ఫ్లూయెన్‌జా జ్వరం వచ్చి మంచాన్ని పడిందని దగ్గుకూడా ఉందని బాబా చెప్పారు

నవంబరు (1949) 19 వ తేదీన డా॥ గనీ, సదాశివ్, కాకా, విష్ణు నదీ తీరాన మాడడానికి ఊళ్ళోకి వెళ్ళారు మధ్యాహ్నం ఎరచ్, పెండు సవారీబండీ, ఎద్దులబండి యింకా రాలేదని ఆ విషయం ఎత్తారు కాశీనుంచి వెళ్ళడానికి యీరెండూ స్త్రీలకి, బాబా సామానులకి చాలవని సహచరులకి తోచింది. అందరివి సామానులు అన్నీ వేయడానికి నాలుగు ఎద్దుబళ్ళయినా ఉండాలి బాబా చెప్పారు— "మనం ముందుకు వెళ్ళగా వెళ్ళగా యీ సామానులో సగం తరిగిపోతుంది డిసెంబరు ఆఖరునాటికి తిండికి కావలసిన సరుకులు వగైరా. యీ భిక్షాటన శిక్షణ కాలానికి సరి పోతాయి. జనవరి 1 వ తేదీనుంచి మనం భిక్షాటన చేసి తెచ్చినదానిమీదే జీవించాలి అప్పుడు చేతిలో డబ్బు ఉండదు. ఈ సందర్భంలో ఆదీ ఒక ఒంటె, ఒంటెబండి ఉంటే చాలా సామాన్లు పడతాయని సూచించాడు అప్పుడు బాబా నేను యిదివరకే బండిని గురించి కాకపోయినా ఒంటెని గురించి ఆలోచిస్తూనే ఉన్నాను ఈ అభి ప్రాయం అందరికీ నచ్చింది సమయానికి ఆదీ మంచి సలహా చెప్పాడని అతనిని బాబా అభినందించారు.

బైడుల్ తనకు ఇరాన్ దేశంలో ఒంటె లుండేవని అన్నాడు డా॥ డాన్‌కిన్‌కి కూడా ఒంటెని గురించి తెలుసును అతనికి సహారా ఎడారిలో ఒంటెలతో అనుభవం ఉంది పాతజీవితంలో. బాబా యీ విధంగా తమ నిశ్చయాన్ని డా॥ నాథ్‌కి చెప్పమని ఎరచ్‌ని ఆదీని పంపించారు

"కాకాపద్ద ఎద్దులమేత పగయిరాలకోసం ఉంచిన రు 3,000/- ల లోను రు 1,000/- లు డా॥ నాథ్‌కి యిస్తే అతడు మంచి ఒంటెని బండిని కొనిపెట్టాలి. ఇదికూడా కలిపితే డా॥ నాథ్ వద్ద యిప్పుడున్న మొత్తం రు 1,700/- దీనితో డా॥ నాథ్ ఒక ఒంటె, బండి, రెండు ఆవులు, రెండు ఆడగాడిదలు కొనిపెట్టాలి. డబ్బు చాలకపోతే డా॥ నాథ్ డబ్బువేసి కొనిపెట్టి అది బాబాకి భిక్ష యిచ్చినట్లుగా అనుకోవాలి"

ఈ సంగతి డా॥ నాథ్‌కి చెప్పగానే అతడు వెంటనే అంగీకరించాడు. వెంటనే ఏర్పాటు చేస్తానని చెప్పాడు తరువాత బాబాదాస్‌కి బైడుల్‌కి సాధువులు మస్తులు సుహాత్ముల గురించి చెప్తున్నపుడు సహచరులలో ఒకడు బాబాయొక్క మస్తు కార్యక్రమం సమాప్తమయిందని జ్ఞాపకం చేసాడు. అలా బాబా మెహెరాబాద్‌లో అన్నారన్నాడు ఇప్పుడు మళ్ళీ మస్తులంటున్నారేమిటి అని అడిగాడు

అప్పుడు బాబా యిలా చెప్పారు—

"మీకు జ్ఞాపకాలుండవు బెల్గాంలో యీ విషయంమీద నేనేం చెప్పానో మీరు గ్రహించలేదు" బాబా ప్రస్తుతం మస్తులతోను సాధువులతోను చేయదలచుకొన్న పని యిదివరకు పాత జీవితంలో వారితో చేసినపని యీ రెండింటికీ ఉన్న భేదాలు వాటికి ఉన్న ప్రాముఖ్యత గురించి వివరిస్తూ యిలా చెప్పారు—

"పాత జీవితంలో నాకు మస్తు కార్యక్రమం ప్రత్యేక ప్రాముఖ్యత కలిగి ఉండేది కాని యీ పని అందరికీ ముఖ్యమయినదే. గనీని నేను ఒక మస్తు కాళ్ళు చేతులు రాయమని చెప్పవచ్చు. విష్ణుని మస్తుకి అన్నం పెట్టమనవచ్చు. అందుచేత యిదివరకు నేను వారితో చేసిన పనికి యిప్పుడు చేయబోయే పనికి చాలా తేడా ఉంది మీచేత వారికి సేవచేయించవచ్చు నేను లేక నేనే స్వయంగా వారికి మీ యెదుట సేవ చేయవచ్చు. నేను మీ యెదుటగాని యితరులయెదుట గాని అవమానపరచుకోవచ్చు. ఈ నూతన జీవితంలో నేను మీ అందరితోను సమానంగా ఉంటాను మీరు మామూలుగా ఉంటే నేనుకూడా మీతో మామూలుగా ఉంటాను మీరు గొప్పగాను అసాధారణంగాను ఉంటే నేనూ గొప్పగానూ అసాధారణం గానూ ఉంటాను అలాగే సంత్‌లు సాధువులు, మస్తులు యోగుల విషయంలో కూడా నేను మీతో సమానస్థాయిలోనే ఉంటాను

ఈ సంగతి బైడుల్ సరిగా అర్థం చేసుకోకపోతే నన్ను చిక్కుల్లో పడేస్తాడు భగవంతుని కోపమయినా మీకు చెప్పిందేదో చెయ్యండి యీ విషయంలో మీ పాత అలవాట్లు మానెయ్యండి" ఒక మస్తుని పాతవాడా కొత్తవాడా కనుక్కొని వాబాదాస్‌ని చెప్పమంటే బైడుల్ వాబాదాస్‌ని ఏదో దిద్దబోతే బాబా పైమాట అన్నారు

డా॥ నాథ్‌కి అతని కుటుంబానికి అప్పుడప్పుడు వచ్చి బాబాను దర్శించ వచ్చని బాబా అనుమతి యిచ్చారు. ఆ ప్రకారం వారు వచ్చి ప్రియతమునికి ప్రణామాలు చేసి వెళ్ళన్నారు.

నవంబరు 20 వ తేదీన ఉదయం బాబా చాలా ఉల్లాసంగా ఉన్నారు. ఆయన గనీకి ఒక పద్యం చెప్పి వ్రాయించారు దానిభావం ఏమిటంటే___

"మన విస్పృహాయత యీ రోజున మనకు ఒక గొప్ప మంచిని చేసింది.

అది మనకు వీరునివలె ధైర్యాన్ని తెచ్చింది దానికోసం మనం ఎన్నో సంవత్సరాలుగా వేచి యున్నాము."

ఒక ప్రవక్తలాగా బాబా యిలా అన్నారు___

"మన మందరము గర్వంతో మనలను గురించి పైన చెప్పిన విధంగా చెప్పుకునే రోజు త్వరగా రావాలి."

తరువాత బాబా భిక్షాటన గురించి యీ రోజున చెప్తానన్నది యిలా చెప్పారు___

"కాశీ వదిలిన తరువాత భిక్షాటన సహజంగా ఉంటుంది. కాశీలో శిక్షణ కోసం యిక్కడ ఒక పద్ధతి అవలంభించాలి బయటదారిలో అన్ని విధాలా యీ పద్ధతి మనకి సరిపడక పోవచ్చు

"భిక్షాటనకి ముందు కావలసిన వేమిటంటే___

(1) కాలిజోళ్ళు లేకుండా ఒట్టి పాదాలతో వెళ్ళాలి.

(2) మోకాళ్ళ క్రిందకి దిగిన కఫ్నీ ధరించాలి.

(3) అక్షయపాత్ర - ఇత్తడిది - తీసుకోవాలి.

(4) జోలి పుచ్చుకోవాలి – (జోలికి వివిధరకాల ఆహారాలు వేసుకునేందుకు అందులో విడివిడిగా అరలు సంచులులా ఉండాలి. – వండని పదార్థాలు, గోధుమ పిండికి. బియ్యం వగైరాలకి, వేరేవేరే సంచులు ఉండాలి. నేనిదివరకు చెప్పాను స్వంత బజారుపనులకోసం స్త్రీలను తాకరాదు వారితో మాటలాడరాదు. అలాగే భిక్షాటనలో స్త్రీలను తాకకూడదు. కానీ మీరు పురుషుల వద్దనుంచి స్త్రీలవద్ద నుంచి కూడా భిక్షను వేయించుకోవచ్చును.

మీరు భిక్షాటనకు వెళ్ళినప్పుడు యీ విధంగా అనాలి భవతి భిక్షాందేహి; "మాయీ! భిక్షాదీజియే – అమ్మా! భిక్షవెయ్యండి - అని స్త్రీలను, భాయీ! భిక్షా దీజియే లేకపోతే భయ్యా భిక్షా దీజియే, సోదరా భిక్షపెట్టండి అని పురుషులను అడగాలి. మీకు భిక్షవేయగానే – అదెలాటిది అవనీ, ఎంత అవనీ. వండినదయినా, వండనిదయినా, వెంటనే వచ్చెయ్యండి. వచ్చి అది బాబాముందు పెట్టండి మీకు ఒక యింటివద్ద భిక్షపెట్టకపోతే వెంటనే యింకో యింటికి వెళ్ళాలి భిక్షపెట్టిన తరువాత చేతులు జోడించి నమస్కారం చేసి కదలండి ఇదంతా బెనారస్‌లో భిక్షాటనకై శిక్షణకోసం చెప్పినది. ఒక నపుంసకుడి వద్దకు వెళ్ళి భిక్షాటన ప్రారంభించకండి. అది శుభమయిన ప్రారంభంకాదు జనవరి 1 వ తేదీ తరువాత ఏం చేసినా ఫరవాలేదు

బాబా ఆజ్ఞప్రకారం యిద్దరిద్దరు సహచరులు భిక్షకి వెళ్ళేవారు బాబా కూడా తమతో యిద్దరు సహచరులను తీసుకువెళ్ళేవారు అందరూ మోకాటి తెల్ల కఫ్నీలు ధరించేవారు. అందరూ తలొకజోలి భుజానికి తగిలించుకుని వెళ్ళేవారు. జోలిలో మూడు అరలున్నాయి ఒకటి బియ్యానికి, ఒకటి గోధుమపిండికి, మూడవది చపాతీ అన్నం మొదలయిన వండిన పదార్థాలకి ఏది యిస్తే అది జోలిలో వేసుకునే వారు బాబా తీసుకువెళ్ళే జోలిమీద "ప్రేమ్‌సే భిక్షాదీజియే" అనే అక్షరాలు మెహెరా కుట్టింది భిక్ష ఒక్క యింటివద్దనే అడగాలని బాబా యిదివరకే చెప్పారు. ఆ యింటి వారు లేదంటే యింకోయింటికి వెళ్ళాలి కొంచెం పెట్టేరా చాలా పెట్టేరా అని చూడకూడదు జోలి సాధారణంగా కాషాయి రంగుది అయి ఉంటుంది అంతా తిరిగి

వచ్చాక వారు ఏం భిక్ష తెచ్చారో బాబా చూస్తారు పిండి, బియ్యం మొదలయిన అపక్వాహారాలు వేరే పెట్టేస్తారు తరువాత ఉపయోగించడానికి వీలయిన పదార్థాలయితే బాబా ఒక గిన్నెలో అన్నిటినీ కలుపుతారు పప్పు, కూర, అన్నం, చపాతీలు అన్నీ ఒకటిగా కలిపేస్తారు కలిపేసి సహచరులందరికి పంచుతారు.

మధ్యాహ్నం బాబా హిందూ పంచాంగం తీసుకొని విష్ణుని సదాశివ్‌ని హరిద్వార్‌లో వచ్చే 1950 వ సంవత్సరం నెలరోజుల కుంభమేళాలో ముఖ్యమయిన తేదీలేమిటో చూడమన్నారు. పంచాంగం ప్రకారం ఏప్రిల్ 2, ఏప్రిల్ 13, ఏప్రిల్ 17 వ తేదీలు ముఖ్యమయినవని తేలింది

21, 22, 23 (నవంబరు, 1949) తేదీలు సహచరులకు స్వంతంగా కావలసిన వస్తువులు కొనుక్కునేందుకు కేటాయించబడినవి యీ మూడు రోజులు. సహచరులు అందరూగాని సమూహాలుగాగాని బజారుకి వెళ్ళాలి. 12 గంటలకు ప్రారంభించి 5 గంటలకు అయిపోవాలి కొనుక్కోవడం ఈ బజారుకి వెళ్ళేరోజుల్లో 12 గంటలకే టీ తీసుకోవాలి మామూలుగా 1-30 గంటలకి బదులుగా బజారుకి వెళ్ళాక సహచరులు అక్కడ టీ త్రాగడం గాని తాంబూలం వేసుకోవడం గాని చేయకూడదు. మంచి నీరు తప్ప యింకేదీ త్రాగకూడదు అని బాబా చెప్పారు.

మొదటి రోజున బజారుపని కాకపోతే రెండోరోజు మళ్ళీ వెళ్ళవచ్చు. అవసరమయితే 3 వ రోజు కూడా వెళ్ళవచ్చు. ఇచ్చిన డబ్బులో ఏదీ మిగుల్చుకోనక్కరలేదని ఒకవేళ మిగులుతే ధర్మం చేయాలని బాబా ఆదేశం.

మొదటి రోజున కాకా, గుస్తాద్‌జీ, పెండు తప్ప మిగిలినవారంతా వెళ్ళాలన్నారు బాబా ఈ ముగ్గురు బాబాతో సహవాసంగా ఉండాలి ఈ ముగ్గురికోసము కొనవలసినవి ఆదీ, విష్ణులను చూడమన్నారు బాబా ఇన్నిరోజులు ఎరచ్ అందరికీ కావలసినవన్నీ బజారునుంచి కొని తెస్తున్నాడు బాబాకి గాని స్త్రీలకి గాని కావలసినవి అతడే తెస్తున్నాడు డాన్ తను కొనుక్కోవడానికి ఒక్కడే వెళ్ళాడు చాలామట్టుకు మొదటిరోజే కొనుక్కున్నారు 5 గంటలవకుండానే సాయంకాలం సహచరులంతా తిరిగి వచ్చారు డా॥ గనీకి రొంప పట్టింది ఇన్‌ఫ్లూయెంజా అన్ని చోట్లా ఉంది గనుక డా॥ డాన్‌కిన్, సహచరులందరు పరుండేటపుడు ఒకరు తల ఒక వైపున

పెట్టి పడుంటే ప్రక్కవారు రెండోవైపు తల పెట్టాలని ఆ ప్రక్కవాడు అందుకు వ్యతిరేకంగా అటు యిటు అలా అందరు ఉండాలని సలహాయిచ్చాడు. సైనికుల విహారాలలో జనం ఎక్కువగా ఉంటే అలాగే చేస్తారు

22 వ తేదీ బజారువని చూసుకోవడానికి రెండు రోజుల కావలసిన వారు బజారుకి వెళ్ళారు గుస్తాద్‌జీ జోష్ కొనుక్కోవాలంటే అతనిని బాబా బజారుకి వెళ్ళమన్నారు డా॥ గనీకి జలుబు చేసినందువలన అతనిని వెళ్ళవద్దని అన్నారు బాబా. అతడు విశ్రాంతి తీసుకోవాలని బాబా చెప్పారు.

ఉదయాన్నే బాబా గనీని వేరే ఉంచడంకోసం కొందరి సహచరులను వారి పడకలు వగైరాలు గదిలోంచి వసారాలోకి తీసికెళ్ళి పెట్టుకోమన్నారు. వారి అన్నం తినే కంచాలు, టీ త్రాగే కప్పులుకూడా తీసికెళ్ళారు బాబా సహచరులతో మాట్లాడిన విషయాలు సారనాథ్‌లో బంగళాల గురించి—ఒకటి బాబాకి స్త్రీలకి, మరియొకటి పురుష సహచరులకు 20 వ తేదీన కాన్ సారనాథ్ వెళ్ళి బంగళాలగురించి వివరాలన్నీ కనుక్కొని వచ్చాడు.

ఆదీని డా॥ నాథ్ వద్దకువెళ్ళి బాబా యీ క్రింది సంగతులు చెప్పి రమ్మన్నారు.

(1) పురుషులు (సహచరులు) ఉన్న బంగళాయొక్క యజమానిని ఆదీ కలుసుకొని సారనాథ్‌లో ఆ యింటిలో ఒక భాగం, తోటమాలి చెప్పినట్లు రు 30 లకు అద్దెకు తీసుకోవాలి.

(2) పైన చెప్పిన యింటి యజమాని సారనాథ్‌కి కారులోనో రైలులోనో వెళ్ళి రావడం విషయం ఆదీ డా॥ నాథ్‌తో మాట్లాడాలి

(3) సారనాథ్‌లో స్త్రీలు ఉండబోయే బంగళాకి డా॥ నాథ్ ఏమయినా అద్దె యిచ్చాడేమో కనుక్కోవాలి అలాగే కాశీలో బాబా ఉండే బంగళాకి అద్దె యిచ్చాడేమో అడగాలి అలా యిచ్చిఉంటే అది బాబాకి యిష్టం లేదు సారనాథ్‌లో పురుషసహచరులుండే బసకి అద్దె క్రింద యిచ్చే రు 30 లు ఎద్దులకు ఆవులకు వీపు మీద కప్పేందుకు కావలసిన గుడ్డకొనడానికి కేటాయించిన డబ్బులోనుంచి తీసుకున్నారు

(4) డా॥ నాథ్ బాబా ప్రయాణానికి కావలసిన ఒంటె, ఒంటె బండి కొనడానికి ఏర్పాటు చేసాడేమో కనుక్కోవాలి

ఆ రాత్రి పరుండేముందు డా॥ గనీ తమాషాగా అన్నాడు – "నూతన జీవితం అంటే మామూలు పనులే సమయం కానీ సమయంలో చేయడం లేనిపోని చిక్కులు తెచ్చిపెట్టడం సాఫీగా నడిచిపోతూన్న జీవితంలో ఏదో గభాలున అడ్డు తేవడం, – ఇలాంటివన్నీ కలిసి మనం అంటూన్న నూతన జీవితం అవుతోంది. ఈ మాటలు బాబా విని గనీని వివరించమని కోరారు

గనీ ఉపన్యాస ధోరణిలో యిలా చెప్పాడు –

"చూడండి! మనం టీ తీసుకునే సమయం తెల్లవారకుండా 5 గంటలకి. చీకటితో లేచి మత సంబంధమయిన విధి ఏమన్నా చేస్తున్నామా అంటే అదేం లేదు హారతి లేదు, సంధ్యలేదు, పూజలేదు, కస్తీలేదు, నమాజ్ లేదు ఇంత ఎముకలు కొరికేసే చలిలో కూడా తెల్లవారు ఝామున 4-30 గంటలకు పక్కమీంచి లేచిపోవలసిందే 5 గంటలకు టీ తీసుకోవడానికి, ఉంటే ఒక చపాతీ కూడా తినడానికి"

గనీ మాటలు విని చుట్టూ ఉన్న సహచరులు నవ్వుతున్నారు బాబాకి కూడా నవ్వువచ్చింది రాత్రి పరుండే ముందు బాబా బైదుల్‌తో "రేపటినుంచి టీ 5 గంటలకు కాక 4-45 కే అందరూ తీసుకోవాలి" అని చెప్పి వెళ్ళారు

23 నవంబరు ఉదయాన్నే బాబా గతరాత్రి గనీ చెప్పిన సంగతి జ్ఞాపకం చేస్తూ – "నాకు రాత్రంతా నిద్రపట్టలేదు. గనీ చెప్పిన మాటలు విని అందరూ నవ్వగానే అప్పటినుంచి నేను దానిగురించే ఆలోచిస్తూన్నాను. ఈ మాటలన్నీ ఏదో తమాషాకి అన్నాడని తేలికగా తీసుకోవాలా లేక గంభీరంగా తీసుకోవాలా అని ఆలోచిస్తూన్నాను అవి తమాషాయే అయితే నేను ఆ తమాషాని అలా తీసుకోక పోవడంలో పొరపాటు చేసానేమో అవి గంభీరంగా తీసుకోవాలి అనుకుంటే, ఉదయం టీ గురించిన ఆజ్ఞ అవసరం లేనిది అర్థం లేనిది అని అనుకుంటే అది విమర్శయే గాకుండా నూతన జీవిత నిబంధనను అతిక్రమించినట్లే

బాబా యిలా అనగానే సహచరులందరూ నిర్ఘాంతపోయారు బాబాకి అందుకే కాబోలు రాత్రి నిద్రపట్టలేదు బాబా సహచరులకు ఒక అవకాశం యిచ్చి రాత్రి గనీ చెప్పిన దాని గురించి వారి ఉద్దేశాలేమిటో సరిగా చెప్పాలన్నారు. బాబా ఆజ్ఞలు సులభంగా అర్థంకాక పోయినా అవి అర్థరహితమయినవి అనవసరమయినవి

మాత్రం కాదని సహచరులందరూ అన్నారు. ఇలా అవగానే వెంటనే పరిస్థితి కొంత సడలింది నవే యింక గతరాత్రి గని చేసిన ప్రసంగం ఒక తమాషాగా తీసుకొని దాన్ని గురించి యింక ఆలోచించడం మానేసారు బాబా. అలాంటి తమాషాలకి గనీ పెట్టింది పేరు ఈ తమాషాని శంకించినందుకు బాబా తమ సహచరులను ఆయన చెప్పులు గిల్లమన్నారు ఒక్క రాత్రి నిద్రలేకుండా గడిపితే అది తన సహచరుల మనస్సులలో శంకలేర్చి వారికి తృప్తి నిచ్చింది గనుక గతరాత్రి నిద్రలేమి చాలా విలువగల సంగతి.

సహచరులందరినీ వెళ్ళమని వారిని తమ తమ కర్తవ్య నిర్వహణలో ఉండమన్నారు.

ఖరే కుటుంబం వారు బాబా భిక్షకింద అంగీకరిస్తారని తెలుసుకుని వారికి ఒక మంచి తెల్లగుడ్డం బహూకరించారు

మొదట్లో బెల్గాంలో 31వ డిసెంబరు (1949) (2½ మాసాలు శిక్షణ కాలం) ఉండామని బాబా అనుకున్నారు కాని అక్కడ పని 23 రోజులలోనే ముగించారు కాశీ వచ్చి 25 రోజులుందామని బాబా అనుకున్నారు ఇది కూడా 10 రోజులు తగ్గించి సారనాథ్ వెళ్దామన్నారు బాబా సారనాథ్ కాశీకి 6 మైళ్ళ దూరం ఉంది

1949, నవంబరు 24 వ తేదీన డా॥ నాథ్ యింటికి 25 వ తేదీన డా॥ ఖరే యింటికి భిక్షాటనం వెళ్ళారు బాబా ఈ విధంగా భిక్షాటన ప్రారంభం చేసారు. బాబా భిక్షకై వెళ్ళినపుడు కాళ్ళకు జోళ్ళు లేకుండాను తలమీద ఏమీ లేకుండాను తెల్లటి కఫ్నీ తొడుగుకొని అక్షయపాత్రను కుడిచేతను తీసుకొని ఎడమ భుజానికి జోలి తగిలించుకుని వెళ్ళారు బాబాతో వెళ్ళిన సహచరులు కూడా అలాగే వేషం వేసుకున్నారు. 24 వ తేదీన ఎరచ్, డాన్‌కిన్, బాబాదాస్ బాబాతో డా॥ నాథ్ యింటికి వెళ్ళారు. 25వ తేదీన బాబాతో ఆదీ, గుస్తాద్‌జీ, బాబాదాస్, ఖరే యింటికి వెళ్ళారు. ఈ విధంగా డా॥ నాథ్, ఖరే కుటుంబాలకి యీ మహాపురుషునికి భిక్ష వేసే మహాభాగ్యం కలిగింది

24 వ తేదీన భిక్షకి బయలుదేరే ముందు సహచరులందరినీ పిలిచి బాబా వారి పాదాలను చేతితో స్పృశించి ఆ చేతులను తమ నుదిటికి చేర్చుకున్నారు అలా చేసి డా॥ గనీని యీ దిగువ ప్రార్థనను చదవమన్నారు.

"ఈరోజు (24 నవంబరు) నవ్యజీవితంలో నాకు చాలా విశిష్టమయిన రోజు నన్ను నా సహచరులను మా యెడల కలిగిన లోపాలకు, తెలిసీతెలియక చేసిన తప్పులకు వ్యక్తిగతంగా కాని, సామూహికంగా గాని యీ నవ్యజీవితపు నిబంధనల గురించిగాని యితరములయినవిగాని కామంతోను, కోపంతోను, ఆశతోనూ కూడిన లేక పాత జీవితమునకు సంబంధించిన ఆలోచనలకు కోరికలకు కరుణానిధి యయిన దేవుని మమ్ములను క్షమించమని కోరుతున్నాను

నాకు నా సహచరులకు యీ నవ్యజీవితానికి సంబంధించిన నిబంధనలు ప్రమాణాలు స్ఫూర్తితో నూరుపాళ్ళు ఆచరించడానికి తగిన బలము నివ్వమని దేవుని కోరుతున్నాను. ఎందుచేతనంటే సర్వజ్ఞుడయిన ఆయనకు 1950, జనవరి 1 వ తేదీ నుంచి మా ప్రమాణాలను మేము తిరుగులేకుండా పాటించాలని తెలుసును

నా సహచరులారా! మిమ్ము నేను హృదయపూర్వకంగా క్షమిస్తున్నాను. మీరూ అలాగే నన్ను క్షమించండి మనలనందరను మాటవరసకి కాక నిజంగా క్షమించమని దేవుని కోరుతున్నాను"

ఈ ప్రార్థన చదువుతూంటే వాతావరణం మారిపోయింది. బాబా చాలా గంభీరంగా ఉన్నారు ఆయన ముఖం ప్రేమతోను, కరుణతోను, జాలితోను నిండి పోయింది. నేరస్తుడు, నేరము, న్యాయమూర్తి అంతా శాశ్వతమయిన ఒక్క క్షణంలో ఆయనలో ఐక్యమయినట్లు ఆయన కనుపించారు ఇంగ్లీషు తెలియనివారికి యీ ప్రార్థనను హిందూస్తానీలో తర్జుమాచేసి చెప్పమని బాబా గనీని అడిగారు. అతడు అనువదిస్తూ చదువుతూంటే బాబా చివరవరకు విని క్షమించమని కోరుతూ సైగ చేసారు.

డా॥ నాథ్ యింటికి భిక్షకోసం బాబా వెళ్ళినపుడు ఆ సమయంలో నాథ్ కుటుంబ సభ్యులు తప్ప యితరులెవరూ ఉండడానికి బాబా ఒప్పుకోలేదు. నాథ్ గాని వారి కుటుంబీకులు గాని బాబాకి నమస్కరించకూడదని, వారెవరూ ఆయనకు పూల మాలలు వేయరాదనీ, చేతులు జోడించరాదనీ బాబా అంతకుముందే స్పష్టపరచి యున్నారు వారు ప్రశ్నలు వేయకూడదని కూడా చెప్పారు. మరునాడు ఖరే యింటి వద్ద కూడా యిలాగే భిక్ష జరిపించారు ఈ విధంగా జరిగినందుకు బాబా చాలా సంతోషించారు.

నవంబరు 26 వ తేదీనుంచి బాబా సహచరులు భిక్షకోసం ప్రతిరోజూ ఉదయాన్నే కాశీనగరంలోకి యిద్దరేసి జట్లుగా వెళ్ళారు. భిక్షాటనకి 'వెళ్ళేటప్పుడు వారు తెల్ల కఫ్నీ, ఆకుపచ్చ తలపాగా, వట్టి కాళ్ళకి జోళ్ళు లేకుండా, అక్షయపాత్ర పట్టుకొని జోలె తగిలించుకుని వెళ్ళేవారు. వారు దుకాణాలకి, ఆశ్రమాలకి, సత్రాలకి వెళ్ళకూడదని, గృహస్థుల యిళ్ళకి మాత్రం వెళ్ళాలని బాబా చెప్పారు. మొదటి యింట్లో దొరికిన భిక్ష ఎటువంటిదయినా — ఉడికినదయినా, ఉడకనిదయినా, — బాబాకి తెచ్చిపెట్టాలన్నారు. కాశీ నగరంలో వృత్తిరీత్యా ఉన్న భిక్షువులు, సాధు సన్యాసులు చాలామంది ఉన్నా బాబా సహచరులు భిక్షాటనకు వెళ్ళినప్పుడు వారి దుస్తులు చూసి చాలామంది అనేక ప్రశ్నలడిగేవారు. డా॥ నీలు, కాకా ఒక సారి భిక్షాటనకు ఒక మహమ్మదీయుల యింటికి వెళ్ళారు. ఆ యింటివారు వీరిని పంజాబు నుంచి వచ్చిన పహిల్వానుల్లా ఉన్నారు అన్నారు. బాబా వారితో అప్పుడప్పుడు జ్ఞాపకం చేస్తూనే ఉన్నారు. డిసెంబరు 31 వ తేదీతో శిక్షణకాలం అయిపోతుందని, అంతవరకే తప్పు లేమయినా చేస్తే క్షమింపబడతాయని, తెలియక చేసిన పెద్ద తప్పులు కూడా క్షమింప బడతాయన్నారు.

ఎవరో ఒకరు రోజూ ఏదో తప్పు తెలియక చేస్తూనే ఉండేవారు. జనవరి 1 తరువాత యిప్పటి యీ శిక్షణ ఎంతో ఉపకరిస్తుందన్నారు. బాబాయే తమకు కోపం రాకుండా ప్రయత్నిస్తున్నానని చెప్పేవారు. ఆయనకి కోపం వస్తే సహచరులను వారికి ఆ సంగతి జ్ఞాపకం చేయాలని చెప్పారు. కోపం వచ్చాక బాబా ఏదయినా వారిని కోపపడితే తరువాత సహచరులను బాబా చెప్పులు గిల్లమని చెప్పేవారు, లేక లెంపకాయ కొట్టమనేవారు.

(1) బాబా సన్నిధానంలో ఆధ్యాత్మిక విషయాలు చర్చింపరాదు.

(2) ప్రాంతీయ రాజకీయాలు గాని, విదేశీయ రాజకీయాలు గాని చర్చింపరాదు.

(3) వార్తాపత్రికలు చదువకూడదు.

(4) అసభ్యమయిన విషయాలు చర్చింపరాదు.

(5) బాబా సమక్షంలో పాత జీవిత విషయాలు మాట్లాడరాదు.

ఈ నిబంధనల మూలాన సహచరులకి దైనందిన జీవితం కష్టంగానే ఉంటోంది ఇప్పటి జీవితము బాధాయుతమయినా ఏమీ ఆసక్తికరంగానూ, సంతోష కరంగాను ఉండకపోయినా జనవరి 1 టవ తేదీ తరువాత బాధలున్నా జీవితం ఆనంద కరంగా ఉంటుందని బాబా అన్నారు సూఫీ పరిభాషలో ఆ తేదీ తరువాత నూతన జీవితాన్ని 'రిందీ' అంటారు ఇప్పటి జీవితం సహజంగాను సాధారణంగాను ఉంటోంది. కానీ జనవరి లగాయతు జీవితం ప్రతిరోజు అసాధారణ సంఘ టనలతో కూడి ఉంటుందని బాబా చెప్పారు. ఈ నవ్యజీవన నిబంధనలకి లోబడి నూటికి నూరుపాళ్ళు ఎవరయితే జీవిస్తారో వారికి బాబా తానే బానిసగాను అతడే తన యజమానిగాను ఉంటారని చెప్పారు డిసెంబరు 1 టవ తేదీన సామా నులతో సారనాథ్ వెళ్ళడానికి బాబా నిశ్చయించారు అక్కడ పదిరోజులుందామని బాబా అనుకున్నారు. ఒంటెబండి, ఒంటె, ఆవులు, గాడిదలు బాబా కొనమన్న ప్రకారంకొని బాబాకి సారనాథ్‌లో అప్పగిస్తామని డా॥ నాథ్, ఖరేలు చెప్పారు సవారీ బండితోపాద్రిని కాశీరమ్మన్నారు గాని అతడు దాన్నితెచ్చేసూచనలు కనబడటంలేదు. రోజూ కాశీ రైలుస్టేషన్‌కి మనుష్యులను పంపించి అడిగిస్తున్నారు బాబా ప్రతిరోజూ పత్రిక కోసము, తపాలు కోసము డాన్‌ని రైలుస్టేషన్‌కి పోస్టాఫీసుకె పంపుతున్నారు బాబా. ఇతరులందరిని (పురుషమండలిని) వాదా పత్రికలు చదువరాదన్నారు ఒక్క డాన్‌ని మాత్రం పత్రిక చదివి బాబాకోసం ముఖ్యమయిన వార్తలు గీతలు గీచిగాని, కత్తరించి గాని పెట్టాలి డాన్‌కిన్ ఆ కత్తిరింపులలో హరిద్వార్‌లోని కుంభమేళా గురించిన వార్తలు, 144 వ సెక్షను అమలు గురించిన వార్తలు, సమ్మెలు, తిరుగు బాట్లు, జాడ్యాలు వగయిరాల గుర్తించిన వార్తలు ఉన్నాయి అనుకోని పరిస్థితులలో చట్టము తెలియదని అనకుండా ఉండడం మంచిదని బాబా అవన్నీ తెలుసుకుంటారు డిసెంబరాఖరి వరకూ పరివారం అందరకూ కావలసిన ఆహారపు దినుసులు ఎరచ్ వగైరాలు కొని తెచ్చేవారు జంతువులకు మేతకూడా సమకూర్చేవారు. డిసెంబరు ఆఖరు వరకు నారనాథ్ నుంచి ప్రయాణంలో కావలసిన ఆహారపు సామానులు కొను క్కోడానికి డబ్బు చాలదని తేలింది ఇవన్నీ కొనుక్కునేందుకు కనీసం రు 600 గాని రు 700 గాని అవుతుందని అంచనా వేసారు ఈ మొత్తం ఎలాగయినా సంపాదిం చాలి ఈ విషయం బాబా తమ సహచరులతో చర్చించారు గాని వారు సూచించిన మార్గాలు నవ్యజీవిత నిబంధనలకు లోబడి లేవు ఆఖరికి మెరుపులా బాబా ఒక సూచన చేసారు. సొంత సామానులు - ట్రంకు పెట్టెలు, బట్టలు మొదలయిన

విలువగల సామానులు అమ్మివేయాలని. ఈ ప్రకారం చేసినా రు 400 కంటె ఎక్కువ పోగయేటట్టు లేదు. అప్పటికీ ఆహారసమస్య పరిష్కారం కాదు. ఈ పాత జీవితానికి సంబంధించిన సామానులన్నీ బాబా డా॥ నాథ్‌ని, డా॥ ఖరేకి అందజేయాలని వారి యిష్టప్రకారం యివి జ్ఞాపకార్థం అట్టే పెట్టుకున్నా పెట్టుకోవచ్చు లేకపోతే అమ్మివేయవచ్చు. వాటికి ముందావరి బాబాకు వారు వెయ్యి రూపాయలివ్వాలని యీ సొమ్ము అందరికీ ఆహారపదార్థాల కోసం డిసెంబరు ఆఖరువరకు ఖర్చుపెట్టాలని నిశ్చయించుకున్నారు. డా॥ నాథ్, డా॥ ఖరేలు యిది బాబా కోరికగా తీసుకుని అంగీకరించారు ఆ సమయంలో బాబా —

"మనం మెహెరాబాద్ వదిలినప్పుడే తేలికయిన సామానుతో బయలు దేరాము. ఇప్పుడు మరీ తూలికంత తేలికయాము కాశీలో ఏమో ఎవరు చెప్పగలరు జనవరి, 1950 1 వ తేదీనుంచి మనం గాలిలోనే తేలిపోయేంత తేలికవుతామేమో."

## సారనాథ్‌లో:

కాశీనుంచి బాబా తమ పరివారంతో సారనాథ్ వెళ్ళారు బాబా వారి సహచరులతో సారనాథ్‌లో 12 రోజులున్నారు.—డిసెంబరు 12 వరకు డా॥ నాథ్‌ద్వారా యీ 12 రోజులు అక్కడ ఒక బంగళాలో బాబా వారి స్త్రీ బృందమూ, మరియొక బంగళాలో సహచరులందరూ బస చేసారు రెండింటికీ మధ్య ఒక ఫర్లాంగు దూరం ఉంది. అనుకున్న ప్రకారం ఒంటె, ఒంటె బండి, రెండు ఆవులు, వాటి దూడలు, రెండు గాడిదలు, తెల్ల గుఱ్ఱం ఒకటి తీసుకువచ్చి బాబాకు అప్పజెప్పారు పాద్రికూడా సవారీ బండి, ఎద్దుల బండి తీసుకువచ్చాడు కాశీవరకు అవికూడా సారనాథ్ వచ్చాయి. బాబా పరివారానికి ఆహారం సంపాదించడం కాక యీ జంతువుల ఆహారం యింకో పెద్ద సమస్య అయిందిప్పుడు

నవ్య జీవిత గీతం ప్రతులు అచ్చయి వచ్చాయి డాన్ పోస్టాఫీసుకి వెళ్ళి తీసుకువచ్చాడు.

సారనాథ్‌లో ఒకచోట గౌతమ బుద్ధుడు శిష్యులకు మొట్టమొదట ఉపదేశం చేసాడు అది క్రీస్తు పుట్టుక పూర్వం 600 సంవత్సరాలనాడు జరిగింది. బౌద్ధ

మతం స్వీకరించిన వారిలో సామ్రాట్ అశోకుడు గొప్పవాడు క్రీస్తు పూర్వం 272 మొదలు 232 వరకు అతడు చక్రవర్తిగా ఉండేవాడు విశాలమయిన అతని సామ్రాజ్యంలో అనేక స్థలాల్లో బౌద్ధ స్తూపాలు నిర్మించాడు అశోక చక్రవర్తి. వాటిలో మూడు సారనాథ్‌లోనే ఉన్నాయి. బుద్ధుడు తన మొదటి ఉపదేశం చేసిన స్థలానికి అనతిదూరంలోనే దాని జ్ఞాపకార్థం నిర్మించిన స్తూపం అందులో ఒకటి అశోక స్తంభాల దగ్గరలోనే మౌర్య వంశపు రాజులకాలంలో నిర్మించిన ఇటుక స్తూపం ఒకటి ఉంది ప్రధానమయిన బౌద్ధ విహారంలోని ఒక మందిరం గోడలమీద బుద్ధుని జీవిత చరిత్ర ఒక జపానీయ కళాకారునిచేత రంగులలో లిఖించబడినది. అందులో ఉన్న బుద్ధ విగ్రహానికి బాబా అందరినీ ప్రణామం చేయుమని వారుకూడా ప్రణామం చేసారు సారనాథ్‌లో అనేక విహారాలు, ఆలయాలు మందిరాలు ఉన్నాయి.

అటువంటి శాంతియుతమయిన, చారిత్రాత్మకమయిన స్థలంలో ఆ ఆధ్యాత్మిక వాతావరణంలో బాబా వారి సహచరులతో ఒక భూగర్భ సొరంగంలో ఒక రోజున అందరూ ఆ విపరీతమయిన చలిలో లంగోటీమాత్రం ధరించి కూర్చుని 15 నిమిషాలసేపు యీ ప్రార్థన చేసారు

"దైవమా ! నాకు నిబంధనలన్నీ సూటికి నూరుపాళ్ళు అనుసరించడానికి కావలసిన బలాన్ని యివ్వు. దైవమా ! ఎటువంటి పరిస్థితులలోనయినా అబద్ధము చెప్పకుండా నిజము మాట్లాడేటట్లు నాకు సహాయము చెయ్యి

దైవమా ! కోపాన్ని నిగ్రహించుకోడానికి, కామ వికారమయిన ఆశాపూరితమయిన కోరికలు రాకుండా ఉండేలాగున నాకు సహాయం చెయ్యి

దైవమా ! నేను న్యాయంగాను, నిజాయితీగాను, దయగాను నా సహచరుల యెడల ప్రవర్తించుటకు నాతో సాంగత్యములోకి వచ్చిన వారందరి యెడల దయ గలిగి ఉండుటకు నాకు సహాయం చెయ్యి"

మానసికంగా ఆ ప్రార్థన చదివాక సహచరులను వారి దుస్తులు వేసుకోమని చెప్పారు బాబా వేసుకొని అందరినీ ఒక వరుసలో నిలబడమన్నారు. ఆ సొరంగంలో ఒక చివరను బాబా నిలబడ్డారు అందరినీ వారు చదివిన ఆ ప్రార్థన లిఖించబడిన చీటీని తమ చేతికి అందివ్వమని చెప్పారు ఆ చీటీ తీసుకుంటూ ఆ

సహచరునితో కరచాలనం చేసారు అందరు సహచరులతోను యీ విధంగా కరచాలనం చేస్తూంటే బాబా ముఖం మీద తృప్తితోను ఆనందముతోను కలిగిన ఒక వింత వెలుగు కనిపించింది తమ పని తృప్తిగా నెరవేరిన చిహ్నంగా ఆ సారంగంలో నుంచి బయటకు వచ్చాక బాబా గనిని పిలిచి 'హోగయా' అని ఏడుమార్లు గట్టిగా పలకమని అతడు అలా అనినప్పుడల్లా బాబా తమ కుడిచేతిని ఎత్తేవారు.

అక్కడనుంచి బాబా బంగళాకు వెళ్తూ తమ సహచరులతో "ఈ రోజున మీరు సారంగంలో యీ ప్రార్థన సమయంలో ధరించిన లంగోటీ ఆనవాలుగా ఒక మార్కు పెట్టి దాచుకోండి మీ వద్దనున్న మిగిలిన మూడు లంగోటీలే ఉపయోగించుకోండి నేను చెప్పినప్పుడు" అని చెప్పారు

బాబా తాము స్త్రీలతో ఉన్న బంగళాలో ఉన్న తోటమాలి గురించి అనేక మారులు సహచరులతో చెప్పారు ఇప్పుడు మరల బంగళాకు వెళ్తూ బాబా అతని గురించి అతని మంచితనాన్ని గురించి సహచరులతో చెప్పగా వారంతా అలాగయితే మేము అతన్ని ఒకమాటు చూస్తాము అన్నారు ఈ మాటకు బాబా అంగీకరించి దాదా వారందరినీ వారి బంగళాగేటు వరకూ తీసుకు వెళ్ళారు వారంతా రాగానే తోటమాలి చిరునవ్వుగల మోముతో అందరికీ నమస్కరించాడు. ఇంత పనిచేస్తున్నా యితడు తోటలో తన కుక్కిమంచం మీద ఆరుబయట పడుకుంటాడని వారికి బాబా అతని మంచం చూపించారు దానిమీద ఎక్కువ ఏమీలేదు పరుపు వగైరా అతనికి ఎలా వస్తుంది? తాను స్వయంగా వండుకున్న అన్నమే తింటాడని అన్నంలోకి ఉప్పుతప్ప యింకేమీ వేసుకోడని యిక్కడివాళ్ళు చెప్పారని బాబా వారితో చెప్పారు. తోటలో రోజంతా పని చేస్తాడని ప్రతిరోజూ బాబాకి అయిదు చెల్లింగి దుంపలు యిచ్చి ఆనందిస్తూంటాడని బాబా వారితో అన్నారు ఆ తోటమాలి ఒక ముసలివాడు. అతనికి సహాయంగా అతని కొడుకు ఒక చిన్నవాడుండేవాడు అతడు పెద్ద కుటుంబీకుడు అవడంచేత బాబా అతనికి అన్నం పెట్టేవారు అతడు ఆ అన్నం సంతోషంతో స్వీకరించేవాడు వారి జన్మలో ఆ కుటుంబం చేసిన సంపూర్ణభోజనం అంత తృప్తిగా ఎప్పుడూ చేయలేము ఆ తోటమాలి రోజూ ఉప్పుడు బియ్యం అన్నం వండుకుని తినేవాడు అతనికున్న సామానులే చాలా తక్కువ. చాలా పేద జీవితం గడిపేవాడు బాబా యిచ్చిన అన్నం తాను తినేవాడుకాదు తన కుటుంబానికి పెట్టేవాడు.

ఆ ముసలి తోటమాలి తెల్లవారుఝామున 4 గంటలకు లేచేవాడు లేచి రామ్, రామ్, సీతారామ్ అని భగవన్నామస్మరణ చేసేవాడు ఆ ముసలివానికి ఏదయినా కావాలా అని అడిగి తెలుసుకోమని బాబా డా॥ గోహర్‌ని పంపించారు ఆ ప్రకారం ఆమె వెళ్ళి అడుగగా తనకి అన్నీ ఉన్నాయని ఠాకూర్ అతనికి అన్నీ యిచ్చేడని చెప్పాడు గోహర్ తిరిగి వచ్చి "ఆ యింటి యజమాని ఎంత మంచివాడో ఠాకూర్ అతనికి అన్నం యిచ్చాడట" అని గోహర్ చెప్పింది. బాబా ఆ మాటవిని గోహర్‌తో, ఠాకూర్ కృష్ణభగవానుడు అని అర్థం అని బాబా చెప్పారు గోహర్‌ను మళ్ళీ వెళ్ళమని అతనికేమి కావాలో అడిగిరమ్మన్నారు బాబా ఆమె అన్నిమారులు అడుగుతోంది గనుక తనకొక అగ్గిపెట్టె కావాలన్నాడు ఆ తోటమాలి. దీనివలన భగవంతుని ప్రేమలో అతడు ఎంతో తృప్తిగా జీవిస్తున్నాడని అందరికీ తెలిసింది కొద్దిరోజులయాక బాబా ఆ తోటమాలిని పిలిచి అతడు కప్పుకునేందుకు ఒక శాలువా యిచ్చారు ఆ శాలువ యిచ్చేటప్పుడు ఆ తోటమాలి దానివైపు చూడక బాబా దివ్యముఖారవిందము వైపు తదేక దృష్టితో ఎంతో ప్రేమతో ఎంతో భక్తితో చూసాడు వానికి బాబా ముఖంలో ఆ శ్రీకృష్ణభగవానుడే కనిపించి యుండనోపు ఆ భగవంతుడే నాకు యీ శాలువా యిచ్చాడని అన్నాడు ఆ మాట సహచరులు విని దేవుని సన్నిధానంలో ఉన్నట్లు యీ తోటమాలికి ఎలా తెలిసిందని ఆశ్చర్యపోయారు

మెహరాబాద్‌లో ఒక క్రొత్తవానిని తమ సహచరబృందంలోకి తీసుకుందామా అని బాబా అన్నారు. దానికి కొందరు అలాగే అన్నారు కొందరు వద్దన్నారు ఈ సందర్భంలో బాబా ప్రసంగిస్తూ యిలా చెప్పారు —

"1200 మంది ప్రేమికులు సంతకాలు చేసి యిస్తే అందులో మిమ్మల్ని ఎన్నుకున్నాను ఈ 1200 మందిని 'అంతర్వ్నా' లందాము. మిగిలిన వారంతా 'బహిర్వ్నా'లు ఈ రోజున బహిర్వ్నా లెవరినయినా వారు మాటికి మారుపాళ్ళు తగినవారుగా ఉండి నవ్య జీవితపు నిబంధనలను మాటికి మారుపాళ్ళు అనుసరించేవారుగా ఉన్న వారిని నా సహచర బృందం లోనికి తీసుకోవడమా మానడమా అన్న విషయం చర్చించాము అప్పుడు అనేక అంశాలు తెల్లమయినాయి. నేను నా సహచరులయిన మీరు మన పరస్పర అవగాహన — దురవగాహన అని కొన్ని విషయాలలో తేలింది. "అంతర్వ్నాల"ను నూతన జీవితంలో చేరినపుడు నేను కావాలన్నపుడు ఏమి పేరుపెట్టి పిలవాలో మరిచిపోయాను కొన్ని సంగతులు చెప్పేటప్పుడు తెలిసియో తెలియకయో

అస్పష్టంగా ఉంటూ వచ్చాను. సహచరులు వారి అవగాహన గురించి వారందరూ ఏకీభావం పొంది సరియయిన వ్యక్తిత్వాన్ని తీసుకోవడంలో భేదాభిప్రాయం కలిగి ఉంటున్నారు డా॥ గనీ తాను నా సహచరులలో స్థిరంగా తీసుకొన బడిన ఒకడు అని అర్థం చేసుకున్నాననిచెప్పగా నేను అతనితో అంగీకరించాను కాని ఒక "బహార్వా"ని అతడు అన్నివిధాలా నూటికి నూరుపాళ్ళు తగినవాడని అంగీకరిస్తే నవ్య జీవితపు యొక్క ప్రాధాన్యత చెడిపోతుందన్నారు దానితో నేను ఎంతమాత్రము ఏకీభవించను. నవ్య జీవితపుయొక్క ప్రాధాన్యత మనసుంచి రాదు. అది సజీవంగా ఉంటే వాటి వల్ల నిలబడుతుంది దాని షరతులు మనం సరిగా అనుసరించకపోతే మనం నవ్య జీవితాన్ని అవమాన పరచిన వారమవుతాము. బయటివాడు గనుక ఆ షరతులు నూటికి నూరుపాళ్ళు పాటించ గలిగితే అతడు నవ్యజీవితపు గౌరవాన్ని నిలబెట్టినవాడవుతాడు. ఒకటి మాత్రం నిశ్చయం—అని నేను నిజాయితీగా చెప్పగలను. మీలో ఎవరయినా యీ నిబంధనలు నూటికి నూరుపాళ్ళు అనుసరించినట్లయితే, బహార్వాలెవరయినా ఆ విధంగా నూటికి నూరుపాళ్ళు ఆ నిబంధనలు పాటించినప్పటికి, మీకు ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. ఎందుచేతనంటే మీరు నా పాత జీవితపు శిష్యులు, నూతన జీవితపు సహచరులూను. అందుచేత నేను మీకు ఏ అవగాహన వల్లనూ లేక దురవగాహన వల్లనూ అన్యాయం చేసానని మీరు భావించరాదు. ఇదంతా ఆలోచించి నేను ఒక నిర్ణయానికి వచ్చాను—

(1) నేను సరోష్ మొదలయిన వారికిచ్చిన మాటమీద నిలబడతాను —నా యిష్టం వచ్చినపుడు 'అందర్వాల'లో ఎవరినయినా నేను నవ్య జీవితంలో చేర్చుకోవచ్చును

(2) బహార్వా ఎవరయినా తనంతట తానుగా నవ్య జీవితంలో చేరుతానని వస్తే, అతడు నూటికి నూరుపాళ్ళు అర్హుడని నేను భావిస్తే, సహచరులలో అధిక సంఖ్యాకులు ఒప్పుకుంటే నవ్యజీవితంలో చేర్చుకుంటాను

(3) 1949, అక్టోబరు 16 వ తేదీకి ముందర తెలిసియో తెలియకయో, నేను వాగ్దానం చేసి ఉండినచో గ్యారామగాని, కైకోబాద్‌ని గాని, యింకెవరినయినా గాని "అందర్వా"గా భావించవచ్చును.

నవ్యజీవితంలో "బహార్వా" చేరే విధానం —

(1) మగవారు మాత్రమే చేర్చుకో బడతారు

(2) ఎవరయినా వారంతట వారుగా వచ్చి నవ్యజీవితంలో చేరుతానని అడగాలి

(3) వానిని నవ్యజీవితంలోని నూతన సహచరుడని పిలవాలి

(4) అతడు చేరుతానని వచ్చినపుడు అతడు నూటికి నూరుపాళ్ళ యోగ్యుడని బాబా అనుకోవాలి బాబా అతనిని యిష్టపడాలి.

(5) అప్పుడు అతనికి నవ్య జీవితము యొక్క షరతులు వ్రాయబడిన ప్రతి ఒకటి చదువుకోవడానికి యివ్వాలి.

(6) అతడది చదివి తాను నూటికి నూరుపాళ్ళు ఆ నిబంధనలు పాటిస్తానని నిశ్చయించుకుంటే సహచరులందరి యిష్టా యిష్టాలు ఓటు ద్వారా తెలుసుకోవాలి.

(7) అధిక సంఖ్యాకులు సహచరులు అతనిని అంగీకరిస్తే అవి పాటిస్తానని అతనిచేత నిబంధనల క్రింద సంతకం చేయించుకోవాలి తరువాత అతనిచేత ప్రమాణం వ్రాయించి తీసుకోవాలి.

సారనాథ్ నుంచి బాబా డిసెంబరు 12 న కాలినడకన బయలుదేరేముందు సామానులో చాలా భాగం హరిద్వార్‌కి రైలుమీద కేకిదేశాయ్‌తో పంపించాలని నిశ్చయించారు సామాను ఆ విధంగా పంపడానికి రైలుఖర్చు రు 300/- నుంచి రు 400/- వరకు ఉండవచ్చునని అనుకున్నారు ట్రంకులు బట్టలు యిచ్చి డా॥ నాథ్ వద్దనుంచి తీసుకున్న వెయ్యి రూపాయలలోను ఈ రైలు ఛార్జికి కేటాయించిన సొమ్ము యితర ఖర్చులకి అయిపోయింది ఈ సొమ్ము మళ్ళీ సేకరించాలి ఈ సొమ్ము సంపాదించడానికి బాబా ఒక నూతన పథకం వేసారు — సహచరుల చేతి వాచీలన్నీ అమ్మడం. పురుషుల వాచీలు 12 న్నూ ఆడవారిది 1 న్నీ ఉన్నాయి కేకిదేశాయ్ పేర ఢిల్లీకి ఒక టెలిగ్రాం యిప్పించారు బాబా వరద్ చేత. అందుచే డిసెంబరు 8 వ తేదీన అతడు కాశీ వచ్చినపుడు రు 500 తెమ్మన్నారు కేకి దేశాయికి ఈ వాచీలు యిచ్చి ఢిల్లీలో అమ్మమని చెప్పాలి సహచరులలో డాన్. పెండు, ఆదీ వీరినిమాత్రం వాచీలు

ఉంచుకోవచ్చునని బాబా అనుమతించారు. ఎందుకంటే తరుచుగా వారు బయటికివెళ్ళి పనిచేయవలసి వస్తూంటుంది.

## కాలినడకను ప్రయాణం:

సారనాథ్ నుంచి కాన్‌పూరు కి 38 మైళ్ళ దూరం కాలినడకను వెళ్ళడానికి బాబా శ్రీ బృందం తోను సహచరులతోను డిసెంబరు 12 వ తేదీ ఉదయం 7 గంటలకు బయలుదేరారు. రెండు గంటల తరువాత మిగిలిన వారంతా ఒంటె బండితోను, ఎద్దుల బండితోను, అహమదునగర్ నుంచి పాడ్రీ చెప్పిన ఎద్దులు లాగే సవారీ బండీ, రెండు ఆవులు, రెండు గాడిదలు, ఒక తెల్ల గుఱ్ఱము వీటన్నిటితోను బయలుదేరుతారు. సహచరులయొక్క వేషాలవల్ల — తెల్ల కఫ్నీ, ఆకుపచ్చ తలపాగా, తెల్ల చెప్పులజోళ్ళ ప్రజలు వీళ్ళని మత సంబంధమయిన లేక ఆధ్యాత్మికమయిన బృందం కాబోలునని అనుకున్నారు. స్త్రీలుకూడా కాశీలో కొన్న నూలు చీరలు కట్టుకున్నా.

బాబా అందరితోను ఒక మామిడి తోపుకి నడిచి వెళ్ళారు. త్రోవ చూపడానికి ఒక శిష్యుని ముందు నడవమన్నారు. సారనాథ్ దాటగానే కొందరు పోలీసు అధికార్లు వీరికంటె ముందు వెళ్ళారు. స్త్రీలు ఒక చెట్టుక్రింద నిలబడ్డారు. పోలీసులాఫీసర్లు ఎరచ్‌తో ఏదో మాట్లాడుతున్నారు. వారు అధికార గర్వంతో ఉన్నారు. బాబాను శిష్యులను వారివేషాలు చూసి ఎవరో రాజకీయ ఉద్యమం తాలూకు అనుకొని, ఎవరో కమ్యూనిస్టులు కాబోలని అదిలించి మాట్లాడుతూంటే "మాకు రాజకీయాలతో సంబంధం లేదు. వారు మెహెర్‌బాబా వారు వారి శిష్యులం మేము" అని ఎరచ్ చెప్పాడు. అప్పుడువారు మిక్కిలి వినయులై బాబా దర్శనం చేసుకోవచ్చునా అని అడిగారు. ఎరచ్ వారికి సమాధానం చెప్పి పంపించేసాడు.

పరివారం అందరూ మామిడి తోపులో ఒక చెట్టుక్రింద ఆగారు. డాన్‌కిన్ ఒక అరబ్బీలాగ జీనులేని తెల్లగుఱ్ఱాన్ని ముందు నడిపించుకొని వెళ్తున్నాడు. ఆ గుఱ్ఱం పొడుగుగా ఠీవిగా అందంగా ఉంది. తరువాత ఎడ్లబళ్ళు, తరువాత ఒంటెబండీ, ఒంటె మెడలో ఒక పెద్ద గంట వ్రేలాడుతోంది. అన్నిటికంటె వెనుక రెండెడ్ల బండి వస్తోంది. ఒంటె మెడలోని గంట టంగుటంగున మ్రోగుతూ వెళుతూ ఉంటే యీ బృందాన్ని చూస్తే ఎవరో మఠాధిపతి కాబోలు అనుకునేటట్లుగా ఉంది.

వారిలో గ్రామాలు పట్నాలలోని ప్రజలు యివిచూసి ఆకర్షితులయారు. బాబా పరివారం ఎక్కడయినా ఆగితే ప్రజలంతా వచ్చి మూగేవారు వీరు ఎవరో, ఏ కులంవారో, ఎక్కడినుంచి ఎక్కడికి వెళ్తున్నారో అడిగేవారు హరిద్వార్ వెళ్తున్నారనే మాట తెలియగానే ప్రజలు వారిని ఎంతో గౌరవించేవారు ఇంక ప్రశ్నలేవీ వేయకుండా ఉండేవారు

జంతువులు వీరికి చిక్కులు కలుగజేసేవి ముఖ్యంగా ఆవులు, గాడిదలు. మొదటిరోజున అవి నడవకుండా తిష్ఠవేసాయి. దారి పొడుగునా వాటిని లాగవలసి వచ్చేది. డా॥ గనీకి, గుస్తావ్‌జీకి గాడిదలను అప్పజెప్పారు. వాటిని లాగలేక వారు అలసిపోయారు. అలాగే డా॥ నీలు అలోబాలకు ఆవులను దూడలను అప్పజెప్పారు. డా॥ నీలు ఒక దూడను భుజాలమీద అయిదుమైళ్ళ దూరం మోయవలసి వచ్చింది. మొయ్యడమే కాకుండా ఆవుని లాగవలసి కూడా వచ్చింది ఈ సంగతి ఆలోచించి బాబా ఆదిని బాబాదాస్‌ని జాన్‌పూర్ ముందు బస్సులో వెళ్ళి అక్కడి నుంచి యీ జంతువులను బళ్ళను రైలుమీద హరిద్వారం పంపించే ఏర్పాటు చేయమన్నారు. జంతువులు నడవడం కష్టమని యిలా చేయవలసి వచ్చింది. బండిలాగే ఒక ఎద్దుకి రాజా అనిపేరు. అది ఇంగ్లీషు ఎద్దు దాన్ని చిన్నతనంలో బాబా ఆ కోడెదూడకి సీసాతో పాలుపోసి పెంచారు.

మొదటిరోజున శివపురంలో ఆగారు బాబా గనీని నడవ వద్దనీ ఆడవాళ్ళ బండిమీద బండితోలేవాని స్థలంలో కూర్చోమనిచెప్పారు ఇలా నడవకుండా కూర్చొని వెళ్ళినందున ఊరు రాగానే బాబా గనీని ఊళ్ళోకి యింకొకనితో కలిసి భిక్షాటన చేయడానికి వెళ్ళమని చెప్పారు ఈ అనుభవం వలన మానవ సహజమయిన గుణాలు కొన్ని వారికి బాగా తెలిసాయి కష్టములతో కూడిన కాలమయినా గ్రామీణులు భిక్ష కోసం వచ్చిన వారికి ఒక ముద్ద అన్నం పెట్టకుండా ఉండలేకపోయారు.

నారనాథ్ నుంచి జాన్‌పూరుకి ప్రయాణంలో యీ పరివారానికి జిప్సీ జీవితపు అనుభవాలు కలిగాయి ఒక్కొక్కచోట ఆరుబయట ఆచ్ఛాదన లేకుండా పరుండవలసి వచ్చేది కొన్నిచోట్ల చెట్లక్రింద రాత్రులు గడిపేవారు స్త్రీలు వారి బండిలోనే పరుండేవారు రెహోతా అనే ఊరిలో వారు ఆగినపుడు హరిద్వార్ వెళ్తున్నారని ఆ గ్రామంలోని స్త్రీలు బాబాతో ఉన్న స్త్రీల బృందాన్ని చూడడానికి వచ్చారు

అందరికీ పని బాగా తగిలింది. జంతువులకి నీరు పెట్టి వాటికి గడ్డి వెయ్యాలి. ముందుగానే అవి తినే గడ్డి చిన్నముక్కలుగా కోసి పెట్టుకోవాలి. కాకా అన్నం వండడానికి నియమితుడయ్యాడు. జంతువులతో మండలి పడ్డ బాధ బాబా స్త్రీలకి చెప్పారు. దూడలు అంతదూరం నడవలేక పోయాయి. దూడలుంటే గాని ఆవులు ముందుకు సాగవు. గాడిదలు అసలే కదలవు. హఠం వేసాయి. అవి కదలకుండా నిలబడతాయంతే. అందుకని వాటిని బళ్ళ వెనకాల కట్టేసారు. ఈ ఏర్పాటుతో బళ్ళు వెళ్తుంటే అవి వెనకాల రాక తప్పదు. గుస్తాద్‌జీ బాబా ఆజ్ఞ ప్రకారం మౌనం పాటిస్తున్నాడు. నోటితో అతడేమీ అనడానికి వీలులేదు. జంతువులను అదిలిస్తూ హే హే హే అని కేకలు వేయడానికికూడా వీలులేదు. ఎరచ్ బాబాకి ఒక గుడారం వేసాడు. ఆయన రాత్రి పడుండడానికి పక్కవేసి యింకా బాబాకి ఏమి కావాలో చూసాడు. గుడారంలో రాత్రి చాలా చలిగా ఉంటుందని వెచ్చగా ఉండడానికి స్త్రీలు శాలువలు ఒక సంచిలా కుట్టి ఏర్పాటు చేసారు బాబాకోసం. ఆ సంచిలో కాళ్ళుపెట్టి తొడుగుకొని పడుంటే కాస్త వెచ్చగా ఉంటుంది.

బాబా మరునాడు ఉదయం రెహెతానుంచి పెందరాళే బయల్దేరాలన్నారు. సహచరులు చెట్లక్రింద పడుకున్నారు. స్త్రీలు నలుగురూ బండిలో బల్లలమీద పడుకున్నారు. తెల్లవారుఝామున 4 గంటలకే బాబా వాళ్ళందరిని లేపేసారు. ఎక్కాలు చుట్టుకొని స్త్రీలు బండిలోనుంచి దిగారు. బాబా వారిని రాత్రి నిద్రపట్టిందా అని అడిగారు. బయట ఎంతో చలిగా ఉందని బాబా వారితో చెప్పారు. బాబా స్త్రీలని వెచ్చటి బట్టలు ధరించమన్నారు. వారు వేడినీళ్ళు పెట్టి బాబాకి యిచ్చారు. ఆయన ముఖం కడుక్కొని క్షవరం చేసుకున్నారు. వణికేస్తోందని అంటూ కుంపటిచుట్టూ చేరారు. బండిలో పైన కప్పు దట్టంగా ఉంది గనుక లోపలికి ఎక్కి తలుపు వేసుకుంటే వెచ్చగానే ఉంది.

ఇంక ఉదయం అల్పాహారాలు తీసుకోవాలి. వెచ్చగా టీ త్రాగుతూ ఉంటే స్త్రీలకి సుఖంగా ఉంది. బాబా ప్రతివారికి ఒకటి రెండు చపాతీలు పెట్టారు. అవి క్రితంరోజున భిక్షలో దొరికినవే. టీ కాచుకుందుకు ఆవుపాలు పితుక్కున్నారు. ఆ పాలు సదాశివ్ పటేలు పితికాడు. అతడే టీ కూడా తయారుచేసి అందరికీ యిచ్చాడు.

బాబా సహచరులు అంతా టీ త్రాగారు స్త్రీలు అన్నీ సర్దుకున్నారు బాబా పురుషమండలి వద్దకు వెళ్ళి వారేం చేస్తున్నారో చూశారు. వాళ్ళు జంతువుల సంరక్షణ చూసుకోవాలి తరువాత వారి స్వంతపని చూసుకోవాలి. వాళ్ళు సామానులన్నీ సర్ది బళ్ళలో పెట్టుకున్నారు. జంతువులు తినగా మిగిలిన గడ్డి, వాటి తింటిగింజలు, బియ్యం, ఉల్లిగాయలు లాంతర్లు వగయిరా అన్నీ బళ్ళలో సర్దారు. బాబా ప్రయాణంలో జంతువులకి గడ్డి తప్ప యింకేమీ కొనకూడదన్నారు అందుచేత అన్నీ కూడా తీసుకువెళ్తున్నారు వారణాసిలోను సారనాథ్‌లోను ఉన్నపుడు ఇవన్నీ డా॥ నాథ్, డా॥ ఖరేలు భిక్షగా యిచ్చినవే బాబా ఎవరో తెలియజేయకుండా ఎంత గోప్యంగా ఉంచినా ప్రజలకి బాబా ఫలానా అని తెలిసిపోయింది అందుకే వారు భిక్షవేసారు

స్త్రీలు వెళ్ళి వేడినీళ్ళు పెట్టడానికి కట్టెపుల్లలు పోగు చేస్తున్నారు అది పెద్దతోటయినా కొద్దిగానే పుల్లలు వచ్చాయి చుట్టుప్రక్కల యిళ్ళనుంచి పిల్లలు వచ్చి తీసుకుపోతూంటారని అందుకే తక్కువగా వచ్చాయని తరువాత తెలుసుకున్నారు. పేదవారయినందువలన వాళ్ళు పుల్లలు కొనుక్కోలేరు మణి ఒకే సైజులో పొట్టిగా సన్నగా ఉన్న పుల్లలు కొన్ని పోగుచేసి పట్టుకొచ్చింది. తీసుకొచ్చి గర్వంగా మిగిలిన వారికి చూపించింది అవి చూసి ఒకడు "అవతల పారెయ్యండి" అన్నాడు. అతడెందుకలా అన్నాడో ఆమెకు అర్థం కాలేదు. అవి పళ్ళు తోముకుని పారేసిన వేపపుల్లలని తరువాత తెలియగానే ఆమె వాటన్నిటిని పారేసింది అందుకని అందరు నవ్వుకున్నారు.

బాబా గాడిదలను తీసుకువచ్చి స్త్రీలకి అప్పజెప్పారు. రెండు జంకానాలు కుట్టి అందులో సంచులన్నీ పెట్టి గాడిదలమీద వేసి కట్టారు మణి మెహెరా వాటి బాధ్యత వహించాలని బాబా చెప్పారు త్రాగేందుకు నీరు భిక్షాన్నం వగైరా పెట్టి మూతపెట్టిన ఇత్తడిగిన్నె ఆ సంచులలో ఉంచారు దారిలో ఎవరో ఎదురై అన్నం పెట్టమని అడిగితే గాడిదలను ఆపి మూటలోంచి తీసి వారికి బాబా అన్నం పెట్టారు.

బాబా ఏరచ్ కలిసి అందరికన్నా ముందు నడుస్తున్నారు. కొంచెం దూరంలో వెనకాల మణి, మెహెరా గాడిదలను తోలుతూ వస్తున్నారు అవి బాగానే నడుస్తున్నాయి. ఎండ ఎక్కువైన కొద్దీ ఉన్ని బట్టలు తీసేసారు నలుగురు స్త్రీలు వారి ఉన్ని

బట్టలను గాడిదలమీద ఎక్కించిన సంచుల్లో పెట్టారు. దారిలో కట్టెపుల్లలు కనిపిస్తే పోగుచేసి అవికూడా ఆ గాడిదలమీదే వేసేవారు. పాపం యీ జంతువులకి రోజుకి 10-20 మైళ్ళు నడిచే అలవాటు లేదు. అయిదారు మైళ్ళు నడిచేసరికి వాటికి ఆకలి చేత నీరసం వచ్చేది. గాబోలు వాటినడక మందగించేది. పాశీ, మెహెరా వాటిని త్వరగా నడవమని అదిలించవలసి వచ్చేది. ఒక్కొక్కప్పుడు బాబా వెనక్కి తిరిగి చూసి వాళ్ళు మరీ వెనక్కి ఉంటే వాళ్ళు వచ్చేవరకూ ఆగేవారు. మధ్యాహ్నం పూట నీడని ఒకచోట కొంతసేపు విశ్రాంతి యిచ్చేవారు అందరికీ. పురుషులు కూడా చేదే పనికూడా ఆగేవారు. రాత్రి ఎక్కడో ఆగినప్పుడు ప్రజలు కొందరు వీరి చుట్టూ మూగేవారు. వీరెవరో తెలుసుకుందామనే ఉండేదివారికి. వీరు హిందువులు కారు. సాయిబులూ కారు. మరి వారెవరో వారికి తెలియదేను. విదేశీయులూ కారు. పాకిస్తాన్ నుంచి పారిపోయివచ్చిన కాందిశీకులేమో అనుకున్నారు. హరిద్వార్‌కి వెళ్తున్నామని వారు చెప్పగానే ప్రజలు వీరిని గౌరవభావంతో చూసేవారు. అది హిందువులకి ముఖ్య మయిన పుణ్యక్షేత్రమని అందరికీ తెలుసు. వీరు యాత్రికులని వీరి దర్శనం కోసం జనం పోగయేవారు. పగలంతా నడిచివస్తే సహచరులకి వీరెవరినీ కలుసుకోవాలని ఉండేది కాదు. శుభ్రంగా కాలు చేతులు కడుక్కుని ఆకలి తీర్చుకొని అంటే భోజనం చేసి పక్కలు వేసుకుని పడుకోవాలనుండేది వారికి. 30, 40 మంది చుట్టూ వచ్చి చూస్తూ ఉంటే ఏ పనయినా ఎలా చేసుకోగలరు ఎవరయినా. వచ్చిన వారిలో మగవారిని పురుషమండలి వైపుకి వెళ్ళమని చెప్పి ఆడవారిని స్త్రీలవైపుకి వెళ్ళమంటే వారితో మగవారు కూడా వచ్చేవారు. స్త్రీల సవారీ బండి చూద్దామని ఉండేది వారికి. దానికి బస్సు చక్రాలవంటి చక్రాలే ఉన్నాయి. బండి పెద్దది విశాలంగా బాగుంది. వచ్చిన జనం ఆ బండిక్రింద కూడా వంగి చూసారు. చూసి ఏమిట్రాయిది ఎద్దులు లాగే బస్సులాగుంది ''అనుకున్నారు

## జా న్ పూ ర్ లో :

బాబా పరివారంతో సారనాథ్ నుంచి జాన్‌పూరుకి వెళ్తున్నారు. ప్రతిరోజూ 17 – 20 మైళ్ళు నడిచి సాయంత్రానికి ఏ ఊళ్ళోనో ఏ తోటలోనో బావి ఉన్నచోట రాత్రికి ఆగేవారు. జాన్‌పూరు వెళ్ళిన రోజున అక్కడికి సూర్యాస్తమయ సమయా నికి చేరుకున్నారు. రోజూ కంటె ఆ రోజున నడక ఎక్కువయింది. ఈ జంతువులు యీ బళ్ళు చూసి వీరంతా ఎవరో సర్కసువాళ్ళు గాబోలు అనుకున్నారు ప్రజలు.

పిల్లలు కొందరు ఏరి వెనక పడి కొంతదూరం నడిచారు. ఊరు దాటి పరిసరాలలో బాబా మండలి దారి తప్పారని తెలుసుకున్నారు. జాన్‌పూరుకి ముందరే కుడివైపుగా తిరగవలసి ఉంది మళ్ళీ వచ్చినదారినే వెనక్కి వెళ్ళి సరియయిన మార్గానికి తిరగవలసి ఉంది అప్పటికే ఆ రోజున చాలాదూరం నడిచారు అలసిపోయి ఉన్నారుగనుక బాబా ముఖ్యంగా ఆడవారిని సవారీ బండి ఎక్కమన్నారు అందులో వెళ్ళి ఒక విశాలమైన చోట రాత్రి గడిపారు. బాబా ఆ ఊళ్ళో నాలుగయిదు రోజులుండాలని చెప్పారు. మొదట అందరూ స్నానాలు చేసి బట్టలు ఉతుక్కుని ఆరేసుకున్నారు. బాబా కూడా స్నానం ముగించారు తల ఎండలో ఆరబెట్టుకుంటూ ఉంటే బాబా సుందరతరంగా కనబడుతున్నారు ఎక్కడినుండో బాబా ఆహారం తెప్పించారు.

జాన్‌పూరులో ఒక ప్రత్యేకత ఏమిటంటే పొడుగయిన ముల్లంగి దుంపలు అమ్మకానికి వస్తాయి ఒక్కొక్కప్పుడు చెయ్యంత పొడుగయిన ముల్లంగిదుంపలు వస్తాయని బాబా చెప్పారు. దాని ఆకులు ఒకవైపున ఉంచి ఆ దుంప భుజాన వేసుకుంటారు, బజారునుంచి యింటికి తీసికొని వెళ్తా దుంప అంత పెద్దదిగా ఉన్నా లేతగా బాగా రుచిగా ఉంటుంది.

డిసెంబరు 15 వ తేదీ సాయంకాలానికి అనగా సారనాథ్‌లో బయలుదేరిన నాలుగవరోజున జాన్‌పూర్ చేరుకున్నారు అక్కడ నివాసానికి అనుకూలంగా ఉంటే ఆ ఊరిలో నాలుగు లేక అయిదురోజులు ఆగుదామని బాబా అన్నారు అక్కడ మంచి ఆహారం దొరుకుతుందేమో అని కూడా ఆశించారు

ఆదీ, బాలావాస్, గనీ ముందుగా జాన్‌పూరు చేరినా బాబాకి వారిబృందానికి తగిన నివాసస్థలం చూడలేకపోయారు బాబా అక్కడికి రాగానే మొదట పట్టణంలో ప్రవేశించేచోట ఒక స్థలంలో ఆగారు తరువాత సవారీబండిని ఊళ్ళోకి పోనిచ్చి చూసి మరల ఊరిబయట వారు ఆగిన స్థలానికే వచ్చారు దీనిని కాయిబాగ్ అంటారు. ఇది ఊరికి రెండుమైళ్ళ దూరం ఉంది ఈ స్థలం బాబాకి నచ్చింది అందుచేత అక్కడ ఆగారు ఆ మర్నాడే బాబా ఒంటెని, ఒంటె బండినీ, రెండు ఆవులను త్వరలో అమ్మేసెయ్యాలని ఆజ్ఞాపించారు ఎరచ్, పెండు, డాన్‌లను పంపి రైలు స్టేషన్ వద్ద ఎద్దుబండిని, రెండు గాడిదలను, సవారీని, గుఱ్ఱాన్ని రైలులో హరిద్వార్‌కి పంపడానికి వీలుందేమో అడిగిరమ్మన్నారు ఆవులకి ప్రయాణబాధ కలిగించడం

యిష్టంలేక అమ్మేయ్యమన్నారు. గాడిదలు, సహచరులు చెప్పినట్లు వింటూండడం చేత వాటిని అట్టే పెట్టుకున్నారు తెల్లగుఱ్ఱం శిక్షింప వచ్చింది గనుక బాబా ఉంచుకున్నారు ఒంటె వేగంగా నడువలేకపోతూంది ఒంటెబండి దారిలో విరిగింది. అందుచేత యీ రెండు అమ్మేయ్యమన్నారు

18 వ తేదీ ఉదయాన్నే బాబా సహచరులను సమావేశపరిచి, జాగ్రత్తగా వినమని యిలా చెప్పారు –

“ఇంతవరకు గడిచిన అనుభవాల్ని బట్టి నేనొకపథకం అవలంబించ బోతున్నాను అది మళ్ళీ మార్చడానికి వీలుపడదు ఈ ఉదయం నేను ఎరచ్, గనీల చేత నిబంధనలన్నీ మరల చదివించాను ఇది యింకా ఎవరికీ తెలియదు. ఎరచ్‌కి మాత్రం మావాయనా కొంచెం తెలుసును

మీ అందరికోసము ఒక్కొక్కరికి రు 1,000/॥ చొప్పున మెహెర్‌జీ వద్ద సొమ్ము ఉంచానన్న సంగతి మీకు చెప్పాను మీ తప్పు లేకుండా నేను మిమ్ము పంపివేస్తే ఆ డబ్బు మీకు యివ్వబడుతుంది అదిగాక యింకా రు 10,000 ఉన్నాయి. మీ తప్పు లేకుండా మీరు పంపబడితే ఒక్కొక్కరికి నూరు రూపాయలు ప్రయాణపు ఖర్చులక్రింద యివ్వబడటానికి అందులోంచి తీసుకోవచ్చును ఎవరియెడలనైనా తప్పులుండి వారు పంపబడినట్లయితే ఆ వెయ్యి రూపాయలూ యివ్వబడవు. ప్రయాణపు ఖర్చులక్రింద అదనంగా వచ్చే ఆ నూరు రూపాయిలూ రావు

“కాదుగాళ్ళు” (బాబాతో నూతన జీవితంలోకి వస్తానని సంతకం పెట్టని వాళ్ళు) వస్తావా రావా అని అడుగబడని వాళ్ళు వాళ్ళకి నేను చేసిన వాగ్దానాల నుంచి విముక్తి పొందుటకు కొంత సొమ్ము యిచ్చాను అందుచేత సహజంగా నేను మిమ్ము ఎవరినైనా పంపించివేస్తే మీకు నా చేతనయినంత చేయాలి కదా అని వెయ్యేసి రూపాయి లివ్వడానికి ఏర్పాటు చేసాను ఇదే నేను మీకు చెయ్యగలిగినది.

“తప్పులేకుండా పంపబడితే మీకు ప్రతియొక్కరికి వెయ్యి రూపాయిలు వస్తాయన్నమాట నేను వేసిన ప్రమాణం నూటికి నూరుపాళ్ళు నిలబెట్టుకోడానికి, మన మందరం నిస్సహాయతతో కూడిన యీ నవ్య జీవితము ధైర్యంతోను, బలంతోను గడపడానికి, యీ పథకానికి తుదిరూపం యివ్వడానికి మన ధోరణి సరియయినట్లుండ

దానికి మనకు ఆహారం రావాలి. మనం పెద్దపులినోట్లోకి ప్రవేశించాలంటే మనం ధైర్యంతోను సంతోషంతోను అపని చెయ్యాలి. అంతేగాని గొర్రెలలా జంకుతూ, అరుస్తూ కాదు.

"ఇప్పుడు నేను మిమ్మల్నడుగుతున్నాను మీ సొమ్మే అయిన ఆ వెయ్యి రూపాయిలు ఎవరు మీలో ఐచ్ఛికంగా యివ్వడానికి సిద్ధంగా ఉన్నారు? ఇంతవరకు మీరు యింకా తప్పులేని వాళ్ళేగనుక నా ప్రయాణమునకు యీ నియమాలకు భంగం లేకుండా నేను సహచరులకు చెందిన యీ సొమ్మును యీ పథకం పూర్తి అయేందుకు అంగీకరించగలను సహచరులకు చెందిన యీ సొమ్మే నవ్య జీవితముకోసం ఉపయోగించ బడగలదు. నేను ఎవరినయినా తప్పు లేకుండా పంపిస్తే నేను మీకు వెయ్యి రూపాయిలు యిచ్చినట్లే భావించవచ్చును 'రాముగాళ్ళ'కి, ఇతరులకు, యిలాటిమొత్తం యిదివరకు యివ్వబడింది మీ ప్రయాణపు ఖర్చులకోసం పందరూపాయిలు, మీరు తప్పులేకుండా పంపించివేయబడితే, ఉండనే ఉంటాయి ఎవరయినా నూతన జీవిత సహచరుల కోసం వెయ్యిరూపాయిలు యిచ్చేస్తే ప్రపంచంలోని ఒక్కపైసా కూడా లేకుండా వెళ్ళిపోవలసి వస్తుందేమో అని విచారించకూడదు.

"ఇప్పుడు మీరు బాగా ఆలోచించుకుని యీ మూడు మార్గాలలోను ఏదో ఒకటి అనుసరించండి —

(1) నూతన జీవితం కోసం వెయ్యి రూపాయిల విరాళం యివ్వదలచు కున్నవాడు,

(2) అలా యివ్వలేనివాడు

(3) ఈ మొత్తం దాచుకోవాలనుకున్నవాడు తన తప్పు లేకుండా యీ రోజునే వెళ్ళిపోవచ్చు.

రెండవ మార్గం అవలంభించినవాడు తన సహచరులకంటె ఎంతమాత్రం తక్కువవాడని భావించరాదు అతని మెడల భేదభావం ఏమీ చూపబడదు. డబ్బు విరాళంగా యిచ్చినవానిని కూడా ఏ తప్పూ లేకపోయినా నేను పంపించెయ్య వచ్చును. ఆరోగ్యకారణాలచేత. ఏవయినా అకస్మాత్తుగా ప్రమాదం కలిగినా, ఏ సంఘటనయినా జరిగినా అలా చేయవచ్చు ఈ నవ్య జీవితం మీ అందరికి ఒక

నరకంలా ఉండకూడదని నేను చూస్తున్నాను కానీ అందులో బాధ ఉంటుంది. అయినా అది సంతోషకరమయిన అనుభవంగా ఉంటుంది.

నా పథకం ప్రకారం జరిగితే నాకు నిజంగా సంతోషం కలుగుతుంది మీరు నవ్యజీవితానికి అవసరమయిన సంతోషం కలిగి ఉండాలని మీరు మీశక్తికొలది ప్రయత్నం చేస్తున్నారని నేను చూస్తూనే ఉన్నాను ఇదంతా నేను మెచ్చుకుంటున్నాను. ఇప్పటి కష్టాలు జనవరి 1950 నుంచి ఉండే నవ్యజీవితంతో పోలిస్తే యివేమీ లేవన్నమాట. నేను నూటికి నూరుపాళ్ళు స్వేచ్ఛగా ఉన్నా, – నేనింకా స్వేచ్ఛగా ఉన్నానని అనుకోవడం లేదు ఆహారం తక్కువయితే, ఆహారం లేకపోతే మనలను అది పిరికివాళ్ళను చేస్తుంది సహాయం చేసేకాలం డిసెంబరు 31, (1949) తో అంతమవుతుంది ఇంతవరకు నియమాలకు భంగం లేకుండా మార్పులు కలగవచ్చని అనుకున్నాను జనవరి 1 వ తేదీ తరువాత నేను సంపూర్ణంగా స్వేచ్ఛగా ఉంటాను ”

అప్పుడు బాబా పై మూడింటిలోను ఏదో ఒక మార్గం అవలంబించమని సహచరులతో అన్నారు ఒక్కరు తప్పకుండా, అందరూ కూడా, వెయ్యి రూపాయిలు తీసుకోమన్నారు బాబాని సహచరులందరూ ఏకగ్రీవంగా అలా అనేసరికి బాబా చాలా ఆనందించారు. వారిని చేతులు కాళ్ళు బాగా కడుగుకొని వారి ఎదుటకు ఒకరి తరువాత ఒకరు వచ్చి నిలబడమన్నారు బాబా. బాబా ఒక చెంబుతో నీరు తెప్పించుకొని తాము చేతులు కడుగుకొని వారి చేతిలో కొంచెం నీరు పోసారు తరువాత బాబాకు ఎదుట అందరూ నిలబడగా గనీని యీ క్రింది ప్రార్థన బిగ్గరగా చదవమన్నారు. గనీతో అందరూ కలిసారు.

భగవంతుని ఎదుట, భగవంతుని సాక్షిగా, మా సొమ్ము అయినట్టి వెయ్యి రూపాయిలు యీ నూతన జీవితంలో సహచరులకోసం ఇచ్ఛికంగాను, హృదయపూర్వకంగాను సమర్పిస్తున్నాము భగవంతుడు మా నవ్య జీవితమును జయమొనర్చుగాక. ”

ఈ విధంగా సహచరులు వెయ్యి రూపాయిలు సమర్పించగానే వారు అందరూ దమ్మిడీకూడా లేనివారయారు తరువాత నియమభంగం లేకుండా జాన్‌పూర్‌లో ఆలోచిస్తానని చెప్పిన పథకాన్ని గురించి బాబా వారితో చర్చ చేసారు.

బాబా అన్నారు — "ఈ నవ్య జీవితం కొనసాగడానికి మనవద్ద రు 15,000/- ఉన్నాయి నిబంధనలన్నీ నూటికి నూరుపాళ్ళ భంగం లేకుండా ఉన్నాయి ఒంటె బండి, ఆవుల అమ్మివేయాలి. గాడిదలు గుఱ్ఱం ఉంటాయి. సామాను తీసుకుపోవడం కోసం యింకొక బండయినా కొనాలి

"మనవద్ద యిప్పుడు డబ్బు ఉంది గనుక దారిలో మనం ఆహారం కొనుక్కోనూ వచ్చు, భిక్షాటనమూ చేయవచ్చు భిక్షగా వచ్చిన అపక్వాహారము జనవరి 1 వ తేదీ తరువాత ఉపయోగించడానికి ఉంచుకుందాము. నా మట్టుకు నేను జనవరి 1 వ తేదీనుంచి నవ్యజీవితం గురించి ఆలోచించుకొని, పాట పాడడం, భిక్షమెత్తడం, 'లంగోటీ' మొదలయిన పనులు గురించి ఏర్పాటు చేయడానికి నాకు పూర్తి స్వేచ్ఛ కావాలి. అందుచేత మీరు ఆహారసమస్య తీర్చుకుంటేనూ, ప్రయాణాలు ఎలాచెయ్యాలో రైలు మీదనా, లేక నడిచా, లేక మీకు ఎలా వీలయితే అలా నిర్ణయించుకుంటేను నాకు సంతోషంగా ఉంటుంది మీ నిర్వహణలో నేను కలుగజేసుకోనని మీకు గట్టిగా చెప్తున్నాను నేను మీకు సాధారణంగా ఎలా చెయ్యాలో చెప్తాను అంతే వివరాలన్నీ మీరే చూసుకోవాలి మీకు యిష్టం వచ్చిన విధంగా ఆహారపు ఏర్పాట్లు చెయ్యడానికి మీకు పూర్తి స్వేచ్ఛ ఉంది ఈ రు 15,000/- మనకు మన పనులన్నిటికి చాలు — ఆరునెలల వరకయినా యిబ్బంది ఉండదు. నవ్యజీవితం యీ భాగం నేను చూసుకోనక్కర లేకుండా ఉండాలని ఉంది నాకు. డిసెంబరు ఆఖరివరకూ నా సహాయం మీకు ఉంటుంది "

ఆహారసమస్య సహచరులకు వదిలెయ్యడం వారికి ఆశ్చర్యం కలుగజేసింది. అందరికీ యిష్టమయేలా నిర్వహించడానికి ఎవరూ ముందుకు రావడం లేదు. ఇందులో ఏదో ఉందని బాబా చెప్పడం లేదని కొందరికి అనుమానంగా ఉంది. అప్పుడు బాబా అన్నారు —"ఈ మాట నేను హృదయ పూర్వకంగానే చెప్తున్నాను. నమ్మండి ఈ పని నాకు లేకుండా చేస్తే నా నెత్తిమీద నుంచి ఒక బరువు దింపినట్లు నేను అనుకుంటాను. ఈ నిర్వహణ మీరు తీసేసుకుంటే నేను సంతోషిస్తాను. భోజన సమయాలు గాని కాలి నడకనో రైలుమీదో చేసే ప్రయాణ సమయాలు గానీ అన్నీ మీరే నిర్ణయించుకుంటూ మీ యిష్టం వచ్చినట్లు నిర్వహించండి అంతా మీకే వదిలేస్తున్నాను మీరు ఎందుకు యింకా సంకోచిస్తారు ?"

ఆదీ, ఎరచ్, డాన్‌కిన్, పెండు, సదాశివ్‌లను అడుగగా ఆ బాధ్యత మేము తీసుకోమన్నారు బాబాయే యిదివరకులాగ నిర్వహణాధికారిగా ఉండాలని వారి అభిప్రాయం వారెవరైనా యీ పనిచేస్తే అందరికీ సంతోషం కలిగేలా చేయగలుగుతామని వారు భావించడం లేదు. అప్పుడు క్రమశిక్షణ, పరస్పర సహకారము లోపిస్తాయి.

బాబా గనీవైపు తిరిగి "ఇప్పుడెందుకు వెనక్కు తీస్తారు ? నీవు డాన్‌కిన్ ఆహారవిషయంలో మీరు కష్టపడతారు కదా. ఇది మీకు మంచి అవకాశం మీ యిష్టం వచ్చినట్లుగా చేసుకుతినవచ్చు ఆ భారం ఎందుకుతీసుకోరు ?" గనీకి నాకు సహకారం లభిస్తే నిర్వహించడానికి నాకు అభ్యంతరం లేదన్నాడు బాబాకి సంతోషమయితే నేను నూటికి నూరుపాళ్ళ సహకరిస్తాను గాని నేనుమాత్రం మానేజరుగా ఉండను అన్నాడు ఎరచ్. బాబా గంభీరంగా ఉండడం చూసి కొద్దిమంది సహచరులు గనీ మానేజరు అయితే మేము సహాకరిస్తాము అన్నారు గనీ మానేజరు కావడం ఎవరెవరికి యిష్టం అని సహచరులందరి ఓటు తీసుకుందామని అన్నారు బాబా. మొత్తం బాబాతో కలిసి 16 మంది ఉన్నారు 9 మంది గనీకి అనుకూలంగాను 7 గురు వ్యతిరేకంగాను ఓటు వేసారు బాబా గనీకి అనుకూలంగా ఓటు వేసారు ఇంచుమించుగా సగంమంది వ్యతిరేకించడం బాబాకి యిష్టం కాలేదు. ఏకగ్రీవంగా ఎన్నికవాలి గాని యిదేమిటి అన్నారు. దానిమీద నిర్వాహకవర్గం ఒకటి నియమిస్తే బాగుంటుందని డాన్‌కిన్ సూచిస్తూ పెండు, ఎరచ్, గనీ, విష్ణు, ఆదీ అందులో సభ్యులుగా ఉండాలన్నాడు. ఈ అభిప్రాయంతో కూడా అందరూ ఏకీభవించలేదు అందుచేత యీ సూచన వీగిపోయింది అప్పుడు బాబా చర్చ ఆపేస్తూ—"మీరు నూతన జీవిత విషయాలన్నీ ఆలోచించుకోవడానికి నాకు స్వేచ్ఛ. పూర్తి సమయము, కావాలంటే వినలేదు. ఆహారపు నిర్వహణ మీరు చెయ్యండంటే అలా మీ రంగీకరిస్తే నేను సంతోషిస్తానంటే నమ్మలేదు నా మనసులో వేరే ఏమీ లేదు ఇపుడు నవ్యజీవితంలో మీరు గొణుగుకోవడం, సణుగుకోవడం, ఫిర్యాదు చేయడం యివేమీ పనికిరావు" అని యిదివరకు లాగే బాబాయే ఆహార వ్యవహారాలు చూసుకుంటానన్నారు

డిసెంబరు 18 వ తేదీన బాబా భిక్ష యెత్తడానికి నియమాలు రూపొందించారు.

(1) మనము మొత్తం బృందంలోని 20 మందికే ఆహారం కోసం భిక్షమెత్తాలి ఇంక దేనికీకాదు.

(2) భిక్షమెత్తడంలో మనకు ఏది లభించినా స్వీకరించాలి — గట్టిదయినా, ద్రవమయినా, వండినా, వండని పచ్చిదయినా, శాకమయినా, మాంసాహారమయినా ఏదయినా సరే.

(3) ఫలానా రకం కావాలని ప్రత్యేకమయిన ఆహారంకోసం అడుగరాదు.

(4) భిక్షమెత్తేటప్పుడు వారిని మనం ఒప్పించడానికి ఆధ్యాత్మికమూ నైతికము అయిన ప్రసంగాలు చేయవచ్చును.

(5) కానీ మనం ఆధ్యాత్మికంగా పరిపూర్ణులము కామని, మనకు ఆధ్యాత్మికానుభవం లేదని వారికి చెప్పాలి మేము చెప్పే ఆధ్యాత్మిక నైతిక విషయాలు మాకు సరి అని తోచినవి, సరి అయినవి మేము అర్థం చేసుకున్నవి అని వారికి చెప్పాలి.

(6) బాబాను గురించి ప్రభువు అనిగాని, సద్గురువు అనిగాని అవతార్ అనికాని చెప్పకూడదు. బాబా మా సహచరుడనే అందరూ అనాలి.

(7) మనం అబద్ధం చెప్పకూడదు. నియమ విరుద్ధంగా ఏదీ ఆచరించ కూడదు.

(8) స్త్రీలతోను బాలికలతోను అవసరమయితే భిక్షాటనలోను, ఏవయినా కొనేటప్పుడు, మాత్రం మాట్లాడవచ్చును.

(9) మన ఆకలి అణచుకోవడానికి దొంగతనం చేయరాదు, దేనినీ చంపరాదు.

(10) స్నేహితులు, పరిచయస్థులు, బంధువులు, ముందు ఏర్పాటు లేకుండా, మన దారిని కనబడితే, బాబా చెప్పినట్లు చేస్తూ, అటువంటి సందర్భాలలో వారి ఉనికిని ఉపయోగించుకోవచ్చు.

(11) మనం అడుగకుండా, ఎవరయినా కుట్టని గుడ్డలయినా కుట్టిన బట్టలయినా- నూలువికాని, ఊలువిగాని అన్నిరకాలవస్త్రాలు మనం అంగీకరించవచ్చును

(12) ఎవరయినా యిస్తామన్నా డబ్బు, కాలిజోళ్ళు, బొంతలు, వాట్లు, కలాలు, పాత్రసామానులు, వాచీలు. నగలు. బెల్టులు, సులోచనాలు, నకిలీ దంతాలు, పళ్ళు. మందులు, సౌందర్యపోషణకు వస్తువులు యివేమి తీసుకోకూడదు.

(13) అంగీకారయోగ్యమయిన పైన చెప్పిన సామానులు, పదార్థాలు, ఆహారము, బట్టలు, తీసుకున్నపుడు ముందుగా అవి బాబా వద్దకు తీసుకు రావాలి.

(14) తీసుకునే మీరు, యిచ్చేటటువంటివారు యిది భిక్ష అని స్పష్టంగా తెలుసుకోవాలి.

(15) పశువుల మేత (గడ్డి) తాళ్ళు- ఎద్దులకు నాళాలు. జంతువులకూ బళ్ళకూ సంబంధించిన ప్రతివస్తువు భిక్షగా అడిగి తీసుకోవచ్చును.

(16) ఏ జంతువును యిచ్చినా మనం తీసుకోరాదు.

(17) పొయ్యికిందికి ఏదయినా భిక్షగా అడిగి తీసుకోవచ్చును.

(18) ఇదివరకటి నిబంధనలు లేకుండా యిప్పుడు దుకాణాలలోను, ఆశ్రమాలలోను, సదావర్తి గృహాలు వగయిరాలలోను, గృహస్థుల యిండ్లలోను అన్నిచోట్లా భిక్షమడగవచ్చును

(19) అడుగకుండా యిస్తే ధనాన్ని ఏ రూపంలో నయినా స్వీకరించవచ్చును.

(20) వాహనాల కోసం గాని, నివసించే చోటుకోసం గాని మనం భిక్ష మెత్తవచ్చును

ఈ సమావేశం అయిన తరువాత బాబా మొరాదాబాద్‌లో ఒక నెల రోజులుండడానికి యిళ్ళ ఏర్పాటు చేయడంకోసం హరజీవన్‌లాల్ వకీల్‌ను కలుసుకోవడానికి బాబా ఆదీని ఢిల్లీ పంపించారు

ఆరోజున అప్పటు రు 260 లకు, ఒంటె బండి రు 750 లకు అమ్మడం జరిగింది.

కొందరు బాబా దర్శనంకోసం బాబా ఉన్న మకాంలోకి ప్రవేశించారు.— వారు బాబాను చూడాలని పట్టుపడుతూ ఉంటే బాబా వచ్చి వారితో "మీ దర్శనం చేసుకున్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను" అన్నారు దానితో వారు విభ్రాంతపోయి అక్కడనుంచి చల్లగా జారుకున్నారు.

జాన్‌పూర్‌లో బాబా వారి గుడారంలో తెల్లవారుఝామున కూర్చునిఉండగా సహచరులందరు వచ్చి వారి చూట్టూ కూర్చుని ఉండేవారు ఇంకా అప్పటికి చీకటిగా ఉండేది అందుచేత ఒక హరికేన్ లాంతరు వెలిగించుకొని కూర్చునేవారు. చలి ఎక్కువగానే వేస్తూ ఉండేది. ఆ విధంగా కూర్చుని 19 వ తేదీ ఉదయాన్నే పాత కొత్త జీవితాల గురించి బాబా యీ విధంగా ప్రసంగించారు.—

"మనం పాత జీవితం వదిలేసాము. ఇంక అందులోకి మళ్ళీ మనం యిప్పుడు వెళ్ళం పాత జీవితం మాసిపోయినట్లే ఒక మనిషి పోయినపుడు అతని ఆత్మ 3, 4 రోజులవరకు ఆ శరీరంతో సంబంధం కలిగి ఉంటుందనడం విన్నాను క్రొత్తచోట స్థిరపడేవరకు పాత కొత్త జీవితాలమధ్య ఒక విధమయిన శూన్యావస్థ ఉంటుందని చెప్పవచ్చు అలాగే మన పాత జీవితం అక్టోబరు 16 తో అంతం పొందింది అది లగాయతు డిసెంబరు 21 వరకూ మన నవ్యజీవితం పాతజీవితంతో సంబంధం కలిగి ఉంది.

"ఇప్పుడు అన్నీ వాటంతట అవే సర్దుకుపోతాయి చూడండి మీకు వెల్గామ్‌లోనో ఎక్కడో చెప్పాను మనం నిక్కచ్చిగా క్రొత్త జీవితంలో జనవరి 1 వ తేదీన ప్రవేశించేటందు పది రోజులపాటు పాత కొత్త జీవితాలకి మధ్య ఒక శూన్యస్థితి ఉంటుంది. అది యీ రోజు ఉదయమేనాకు తట్టింది మీరు కూడా నాకు జ్ఞాపకం చేయలేదు

"అందుచేత యీ శూన్యస్థితి 22 వ తేదీ నుంచి 31 (డిసెంబరు) వరకు ఉండాలని నిశ్చయించాను ఈ 10 రోజులలోను శిక్షణకాలము యొక్క తీవ్రమయిన నిబంధనలన్నీ సడలిపోతాయి అది యీ విధంగా ఉంటుంది –

(a) భిక్షమెత్తడం ఉండదు.

(b) కఫ్నీ ధరించడం ఉండదు.

(c) ఏ విధమయిన దేహపరిశ్రమ ఉండదు అవసరమయితే కూలీలను పెట్టుకోవచ్చును.

(d) డబ్బుతో మంచి ఆహారం కొనుక్కుని తిని విశ్రాంతి తీసుకుంటూ ఉండాలి.

అప్పుడు బాబాకి ఆదీ ఢిల్లీ వెళ్ళాడన్నదిజ్ఞాపకం వచ్చింది. అతనికి శూన్యస్థితి తెలియదని అందుచేత యిక్కడ చేయని విషయాల గురించి అతడు చెప్తూ ఉండవచ్చని అనుకున్నారు అందుచేత ఆదీకి యీ క్రింది టెలిగ్రాం యిచ్చారు-

"ఆదీ, కేర్ స్టేషన్ మాస్టర్, మొరాదాబాద్

22 డిసెంబరు మొదలు 31 డిసెంబరు వరకు ఉన్న యీ శూన్యస్థితిలో భిక్షాటనలేదు, కఫ్నీ ధరించడంలేదు, మంచి ఆహారం డబ్బుతో కొనుక్కోవడం, జనవరి 1 నుంచి నూతన జీవితం శ్రద్ధతో ప్రారంభమవుతుంది. హరజీవన్, కేకి వగయిరాలకి చెప్పవలెను మేము 22 వ తేదీన ఉదయాన్నే డూన్ ఎక్స్‌ప్రెస్‌లో వస్తాము. — బాబా."

బాబా మరల తమ పరివారంతో ప్రయాణానికి బయలుదేరారు పొడుగయిన తెల్లటి కఫ్నీలు వేసుకున్నారందరు వారితో కూడా అందమయిన ఒక తెల్లగుఱ్ఱము, ఒక ఎద్దుబండి, ఆడవారు కూర్చున్నసవారీ ఎద్దుబండి, రెండు గాడిదలు, యివన్నీ వరుసగా వారితో బయలుదేరి వెళ్తూంటే యిది ఒక వింత ఊరేగింపులా ఉంది రాత్రికి ఎక్కడో ఒక గ్రామంలో ఆగారు ఆగగానే కొన్ని నిముషాలలో ఆ ఊరంతా అక్కడ పోగయారు వారిని వింతగా చూస్తూ ఎన్నో ప్రశ్నలడిగారు

తెల్లవారకుండానే అక్కడనుంచి మళ్ళీ బయలుదేరారు. బాబా ఎరచ్ ముందు నడుస్తున్నారు. కొంతదూరంలో మళ్ళీ ఒక గ్రామం వచ్చింది. బాబా ఎరచ్‌ని భిక్ష అడిగితెమ్మని పంపించారు ఒక యింటికి వెళ్ళి అడిగాడు ఆ యింటిలో గృహిణి తన యింటిలో తినడానికి ఏమీలేదని చెప్పింది పోనీలే అమ్మా అని ఎరచ్ యింకో యింటికి వెళ్ళబోతూంటే ఉండండి బాబూ వెళ్ళకండి అని అతన్ని ఆపి ఆమె యిరు

గింటికి వెళ్ళి అక్కడనుంచి కొంత గోధుమపిండి అప్పు అడిగి తీసుకువచ్చి త్వరగా రొట్టెలు తయారుచేసి యింతకూర వండి యిచ్చింది ఎరచ్‌కి ఆ రోజున ఆ బీదరాలు యిచ్చిన ఆహారం అవతారపురుషుడు తిన్నారు. నిరక్షరాస్య అయినా ఆమె ఎంత అదృష్ట వంతురాలు !

కాశీలో ఒక రోజున కాకా సీలు భిక్షకోసం వెళ్ళారు వాళ్ళు ఆ రోజున ఉదయం లేచి ఎవరిముఖం చూసారో గాని "ఏదయినా పనిచేసుకు బ్రతకరాదూ. తాడిలా ఉన్నారు ఒక్కొక్కరూను" అని చీవాట్లు వేశాడొక విద్యాధికుడు. కాని వారు ఎవరో తెలిసాక అతడెంత విచారిస్తాడో జీవితం మరల యిలాంటి అవకాశం వస్తుందా అంతటివాళ్ళు వచ్చి తన గుమ్మంముందు నిలబడి భిక్షాందేహి అని అడుగుతున్నారే భిక్షనసలు వెయ్యలేదేమంచు చెప్పనేచెప్పారు బాబా వారి సహచరులకు గౌరవమూ అవమానమూ వెంటింటికి తట్టుకోవాలి ఆ వృత్తిలో అని.

## మొరాదాబాద్‌లో :

కాన్పూరు నుంచి రైలులో ప్రయాణం చేసి డిసెంబరు (1949) 22 వ తేదీ తెల్లవారుఝామున 2 గంటలకు బాబా బృందము మొరాదాబాద్ చేరుకున్నారు. ఆదీ రైలు స్టేషన్‌కి వచ్చాడు వారు ఉండడానికి తగిన బస దొరికిందా అని ఆదీని అడిగారు. ఆఖరి నిముషంలో అన్వేషణ ఫలించిందని రామ్‌సీలా స్థలాలవద్ద ఉండడానికి చోటు దొరికిందని చెప్పాడు హరజీవన్‌లాల్, కేకీలు ఆదీతో మొరాదాబాద్ వచ్చి ఎంత మంచి సహాయం చేసినా ఆఖరివరకూ బస దొరకలేదు. ఆ చోటు చూసాక అందరికీ అది నచ్చింది కాని అది నగరానికి దూరంగా ఉంది.

అక్కడ అర్ధరాత్రి రైలుదిగి బాబా దిగవలసిన చోటుకి యింతదూరమూ టాంగాలో వెళ్ళారు. ఆ టాంగా ప్రయాణానికి అంతముంటుందా అనిపించే అంత దూరముంది స్టేషను ఇంటికి వెళ్ళేసరికి రాత్రి మూడోఝామున మూడుగంటలయింది. ఆ చలిమూలాన మనిషికి ఒంట్లో దాగుండలేదు. ఇల్లు చీకట్లో చేరుకున్నారేమో అక్కడ మనిషిని పడుకోబెట్టేందుకు ఒక పరుపయినా లేదు చివరకు కుర్చీకూడా లేదు నేలమీద గదిలోపల గోడని ఆనుకుని ముడుచుకు కూర్చుంది పాపం ఆమె చలిగాలి వేస్తోందని కిటికీ తలుపులన్నీ మూసేస్తున్నారు మొరాదాబాద్‌లో సహచరులలో చిన్నవాళ్ళ

కూడా చలికి బిగిసిపోయాడు వాళ్ళకి గోళ్ళు నీలిరంగుగా అయ్యాయి పాపం ఒక్కరికీ ఉన్ని బట్టలులేవు. చలికి తట్టుకోలేకపోతున్నారు

బాబా బృందంతో వస్తారని ఆగది అంతా శుభ్రంగా కడిగి ఉంచాడు ఇంకా బాగా ఆరలేదు ఆ గదికి 12 ద్వారాలున్నాయి అంత పెద్దగది అది. కొంత సేపు వేచియున్న తరువాత కొంత సామాను వచ్చింది. వెంటనే సుఖకోసం ఒక పరుపు విప్పివేసారు

మర్నాడు ఉదయం ఎవరో బాపనయ్య వచ్చి "ఇదేమిటి? ఇందులో ఎవరు దిగమన్నారు మిమ్మల్ని!" అంటూ కేకలేసాడు ఆడవారు అతన్ని పురుష మండలి ఉన్నచోటుకి వెళ్ళి మాట్లాడమన్నారు అప్పుడు పురుషమండలి అతనికి మొదటిగా యీ యింటిలో ఉండడానికి అనుమతి తీసుకోబడిందని అ బాపనయ్యకి చెప్పారు ఇది హిందువుల కోసం ఏర్పడిన ధర్మశాల ఆ ఊళ్ళో ఒక తీర్థం జరుగు తుంది ఆ తీర్థానికి వచ్చిన హిందూ యాత్రీకులు ఆ ధర్మశాలలో దిగుతూంటారు. వాడా గదిలో పరుండలేము. వెడల్పయిన ఆ ధర్మశాల వసారాలో అయన చిన్న గుడారం వేసుకుని అందులో పరున్నారు. ఆ ధర్మశాల రెండువైపుల నుంచి ఊళ్ళోకి వెళ్ళడానికి రోడ్లు ఉన్నాయి రాత్రింబగళ్ళు ఆ రోడ్లమీద మనుష్యులు వెళ్తూనే ఉంటారు ఆ యింటిలో ఆడవాళ్ళకి పూర్తిగా మరుగులేదు.

పెండు, డాన్‌కిన్, సదాశివ్‌లు యింకా జాన్‌పూర్‌లోనే ఉన్నారు. వారు సవారీబండిని ఎద్దుబండిని ఎద్దులను గాడిదలను రైలు ఎక్కించడానికి దిగబడిపోయారు. జాన్‌పూర్ వదిలాక భోజనాలు హోటలునుంచే తెప్పించుకు తిన్నారు ఇది శూన్యస్థితి కాలం గనుక, మెహెర్‌జీ నుంచి రు 15,000 తీసుకొని బాబా పాద్రీని తీసుకురమ్మని టెలిగ్రాం యిచ్చారు రెండు టాంగాబళ్ళని ఒక గుర్రాన్ని కొనడానికి మాటలు జరుగు తున్నాయి ఇవి రు 1500/-కి కొనాలని బేరం జరిగింది 25 వ తేదీన రెండు టెలిగ్రాం లు వచ్చాయి — ఒకటి జాన్‌పూర్‌లోని డాన్‌కిన్ వద్దనుంచి వారు జాన్ పూర్. 25 వ తేదీన వదలి మొరాదాబాద్‌కి బయలుదేరుతారని, యింకొకటి పాద్రీ 24 వ తేదీన మొరాదాబాద్‌కి బొంబాయినుంచి బయలుదేరుతున్నాడని

పాద్రీ తెచ్చియిచ్చిన రు 15,000/- నుంచి రెండు టాంగాలు కొన్నారు. శూన్య స్థితిలో ఉండి ఆహారం ఖరీదుచేసి తిన్నారు యీ పదిరోజులు ప్రతి సహచరు

నికి ఒక్కొక్క గుడారం కొనడానికి డబ్బు కేటాయించి ఉంచారు హరిద్వార్ మకాములో సహచరులకు నివాసపు కుటీరాలు కట్టడానికి ఎంత ఖర్చవుతుందో అదికూడా ప్రత్యేకించారు మిగిలిన డబ్బులోంచి కుటీరాలు తయారయ్యేవరకు బంగళా అద్దె యివ్వడానికి సిద్ధం చేసారు యాత్రికుల వస్తువులు, పడవకిరాయి, పంతెన దాపేం మకు వస్తువులు, యితర ఖర్చులకి వెయ్యి రూపాయిలు కేటాయించారు. మిగిలిన దానిలో జంతువులకి మేతకి ఖర్చుచేయాలి.

జనవరి 1 వ తేదీనుంచి ఒక్క పైసాకూడా ఆహారంకోసం ఖర్చు చేయరాదు బట్టలకోసం డబ్బు ఖర్చు చేయకూడదు. హరజీవన్‌లాల్ తినుబండారాలు భిక్షక్రింద యిస్తానన్నాడు. కిషన్‌సింగ్, క్రైన్ ఉన్ని దుస్తులు భిక్షగాయిస్తానన్నారు. జవాబుగా బాబా యీ క్రింది విధంగా హరజీవన్‌లాల్‌కి వ్రాయించారు ——

"(1) ఇదివరకు చర్చించినట్లే జనవరి 1 వ తేదీ నుంచి మొరాదాబాద్‌లో వండిన అన్నం భిక్షలో ఏర్పాటు చేయవద్దు.

(2) బాగా యిష్టమయితేనే మీ అంతట మీరు, ఆధ్యాత్మికంగా గాని యితరవిధంగా గాని ప్రతిఫలాపేక్ష లేకుండా, నజర్, ఆశీస్సుల ఆశ పెట్టుకోకుండా జనవరి 1 వ తేదీలోగా భిక్షగా మాత్రమే తిండి గింజలు, ఎండుపళ్ళు, కిరాణా సరుకులు, నెయ్యి —— వీటి రూపంలో ఎంత పంపగలరో అంత పంపవలెను

(3) పైన చెప్పినవి మీరు భిక్షగా పంపినవో, జనవరి 1 వ తేదీ నుంచి ఉపయోగించ బడతాయి —"శ్రమతోను భిక్షతోను కూడిన నూతన జీవితం జనవరి నుంచి ప్రారంభం అవుతుంది

(4) జనవరిలో ఎప్పుడయినా మొరాదాబాద్ నుంచి మేము బయలుదేరి వెళ్ళవచ్చు, 1 వ తారీఖు తరువాత రోజురావచ్చు లేక 15 రోజులు తరువాత రావచ్చు అందుచేత మీరు తిండి సరుకులు ఏమి పంపదలచినా, నీవు, కిషన్‌సింగ్, క్రైన్, వెచ్చటి బట్టలు భిక్షగా పంపవలచినా జనవరి 1 వ తేదీకి ముందుగానే పంపాలి.

(5) వెచ్చదనానికి బట్టలు, బనియనులు స్వెటర్లు, జాకట్లు, మేజోళ్ళు, గ్లవుస్‌లు రూపంలో ఉండాలి అవి భిక్షగా ఉండాలి.

(6) మీలో ఎవరూ మొరాదాబాద్ వచ్చి బాబాను గాని సహచరులను గాని కలియరాదు. వారితో ఉత్తరాల మూలకంగా సాంగత్యం చేయరాదు పైపెస్తు అనంగోపాల్ ద్వారా యివన్నీ పంపించాలి

ఈ చీటీ ప్రకారం హరజీవన్‌లాల్ మాత్రం (కిషన్‌సింగ్ కాదు, క్రైన్ కాదు) ఈ క్రింది సామానులు పైపెస్తు అనంగోపాల్ ద్వారా పంపించాడు హరజీవన్ లాల్ కొడుకు రెండెడ్ల బళ్ళమీద యీ సామానులన్నీ వేసుకొని మూడుబళ్ళు తోలుకుని వచ్చాడు బండితో అనంగోపాల్ కూడా వచ్చాడు. ఒక బండిలో తినుబండారాలు ఒక బండిలో నూలు బట్టలు, ఒక బండిలో ఉన్ని బట్టలు వచ్చాయి

20 మఫ్లర్‌లు, 40 బనీయలు, 30 జతల నూలు మేజోళ్ళు, 1 ఉలెన్ జాకెట్టు, 2 డబ్బాలు ఎండుపళ్ళు, 1 డబ్బా సోన్‌హల్వా, 1 డబ్బా గజార్కా హల్వా, 1 పెట్టె టీ, పొరబ్బాలు, 1 గంపెడు పళ్ళు, 37 స్వెటర్లు, 58 ఉన్నిజోళ్ళు, ఉన్ని మేజోళ్ళు, 6 టోపీలు (కోతి టోపీలు), 2 డబ్బాలు నెయ్యి, 1 డబ్బా పప్పు, మసాలా దినుసులు, 2 డబ్బాలు మిఠాయిలు, లడ్డూలు 1 పెట్టె ఊరగాయ, పొడబ్బా, సిగరెట్లు 2 ట్రంకు పెట్టెలతో పైసామానులు.

ఈ సామానులు హరజీవన్‌కి రెండువేల రూపాయిలయింది ఇవిగాక 1950 జనవరి 1 వ తేదీ లేక 1949 డిసెంబరు 31 వ తేదీకి పొందుగా 20 శేర్ల పంచదార కూడా భిక్షగా పంపుతున్నాడు. ఇవి అందుకుని బాబా యీ క్రింది సందేశం హరజీవన్‌కి పంపించారు—

లిస్టు ప్రకారం పంపించిన సామాను బాబా హరజీవన్ వద్దనుంచి భిక్షగా అంగీకరించుటకు చాలా సంతోషిస్తున్నారు. 32 నూలు గుడ్డ పైజమాలు పంపడానికి సిద్ధంగా ఉంచినవి జనవరి 1 వవ తేదీలోగా భిక్షగా కేకిదేసాయి ద్వారా దేరాడూన్‌కి బాబాకి పంపించవచ్చును. ఇప్పటినుంచి హరజీవన్‌గాని అతని కుటుంబం గాని బాబాతో గాని ఆయన సహచరులతో గాని ఏ విధమయిన సంబంధము, సాంగత్యము ఉత్తరాలు వ్రాయడము పెట్టుకోకూడదు.

కేకి, హరజీవన్, పాద్రీలను బాబాని గాని వారి సహచరులను గాని చూడనివ్వలేదు వారు ఆదీ, ఎరచ్, లను మాత్రమే చూడటానికి వీలయింది.

ఒక రోజున అబ్దుల్‌గనీని మంచి భోజనానికి మొహం వాచిపోయాడని కావలసిన డబ్బు తీసుకుని ఊళ్ళోకివెళ్ళి సుష్టుగా భోజనం చేసి రమ్మన్నారు గనీ వెళ్ళి భోజనం చేసి చాలా సంతోషంగా వచ్చి మండలి సహచరులందరికి అది తిన్నాను యిది తిన్నానని వర్ణించి చెప్పాడు ఆ రోజంతా అతడు మరచి హుషారుగా ఉన్నాడు ఆ మరునాటి ప్రొద్దున్న బాబా గనీని పిలిచి "నీవు నిన్న భోజనం చేసిన హోటలుకి వెళ్ళి అక్కడ వారిని భిక్ష అడిగి మాకు తినడానికి ఏమిస్తారో అవి తీసుకురా." అన్నారు. ఆ ప్రకారంగా గత్యంతరం లేక నిన్న భోజనం చేసిన హోటలుకే వెళ్ళి యీ రోజు గనీ అక్కడ భిక్షమెత్తాడు ఆ హోటలులో వాళ్ళు "ఇదేమిటి నిన్న బాగా డబ్బు ఖర్చుపెట్టి భోజనం చేసినవాడే యీ వేళొచ్చి బిచ్చమెత్తుతున్నాడేమిటి"? అని ఆశ్చర్యపోయారు గనీ అది తీసుకుని వెళ్ళి బాబాకిచ్చాడు. బాబా చర్య చూసి ఎవరూ అర్థం చేసుకోలేరు కాని యిది మండలి అందరికీ నవ్వు పుట్టించింది

బాబా మెహెరాబాద్‌నుంచి హరిద్వార్‌కి జనవరి 1 వ తేదీన విక్కావిచ్చి అయిన నవ్యజీవితం ప్రారంభం అయే రోజున నడిచి వెళ్ళడానికి నిశ్చయించారు.

ఒకనాటి మధ్యాహ్నం వసారాలో కూర్చుని ఉండగా బాబా – "విశ్రాంతి తీసుకుంటాను నన్ను లేపకండి" అని చెప్పారు అలా ఆయన గుడారంలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా కాషాయగుడ్డలు కట్టుకుని జటతలతో ఉన్న సన్యాసి ఒకడు వచ్చి గుమ్మంలో నిలబడ్డాడు. అతడు గోధుమపిండి కావాలని అడిగాడు. అలాటి దేమీ యింట్లోలేదు క్షమించి వెళ్ళమన్నది గోహర్ అందుకాతడు ఆడవాళ్ళున్నచోట పిండిలేకపోవడమేమిటమ్మా? అని మళ్ళీ అడిగాడు బాబాకి ఎక్కడ మెలకువ వస్తుందో అని అతన్ని త్వరగా పంపించేద్దామని గోహర్ ప్రయత్నం చేసింది. తరువాత యీతని మాటలు వింటూ ఉన్న బాబా అతడు ఒక నిజమయిన అన్వేషకుడని చెప్పారు.

మొరాదాబాద్ లో పురుషులు బయట పడుకున్నప్పుడు చలి ఎక్కువగా వేస్తోం దని వారి అనుభవం మీద చెప్పారు సవారీబండి, గుర్రం, యివన్నీ ముందు పంపిం చేసారు, మొరాదాబాద్‌కి అందుచేత ఆ ఆఖరి రాత్రికి నలుగురు స్త్రీలు 5 అడుగుల వెడల్పు 6 అడుగుల పొడవు ఉన్న చిన్న గుడారంలో పడుకున్నారు. వారు పరుండేం దుకు పక్కలు కూడా అట్టే ఏమీలేవు సామానంతా ముందు పంపించేసారు మరి.

చలి ఎక్కువగా ఉండబట్టి రాత్రి చాలా భాగం మెలకువగానే గడిపారు బాబా గుడారంలో ఎంత చలిగా ఉందో, పురుషమండలికూడా గుడారంలోనే పరుంటారు గనుక, వారికి పెద్ద గుడారం అయినా చలి ఎంత వేస్తుందో స్త్రీలకు యిప్పుడు తెలిసింది

క్రొత్త జీవితంలో బాబా "అలా చెప్పగానే నేను విన్నాను" "ఇలాగే అనుకుంటాను" అని అనేవారు పాత జీవితంలో దీనికి విరుద్ధంగా "అప్పను అది అంతే" "అది జరుగుతుంది" "అది అంతే నాకు తెలుసును" అని సర్వజ్ఞుడుగా పలికేవారు.

22-12-49 నుంచి 31-12-49 వరకు ఒక శూన్యావస్థ కాలం జరిగి పోయింది తరువాత క్రొత్త జీవితంలో రెండవఘట్టం ప్రారంభం అయింది అప్పటి నుంచి (1-1-50) భగవంతుడు మీకు సహాయము చేయుగాక" అనే కాలం ప్రారంభ మాయింది

1949 వ సంవత్సరంలో ఒకనాడు బాబా చెప్పారు—

"ప్రార్థన పూర్వకమయిన జీవితము ఎప్పుడూ అవసరమే". ఆత్మ ద్వారానే ఆత్మను పొందగలము ఆత్మయే ప్రార్థన పూర్వకమయిన కర్మ, కోరిక దాని పూరణమవ్వాడాను. నేను అనే మనసు నాశనం చేయకపోతే మానవుడు తన గమ్యస్థానము చేరలేడు".

డిసెంబరు 25 (1949) తేదీని క్రిస్మస్ పండుగతో బాటు మెహెరా పుట్టినరోజు కూడా ఆరోజే చేసుకున్నారు. మండలి భోజనానికి నగరానికి నడిచి వెళ్ళి రావలసి వచ్చేది మాంసభోజనులయిన వారిలో కొద్దిమందిని మాత్రం బాబా ఆ మిషా హారాన్ని తీసుకోవడానికి అనుమతించారు డా॥ నీలూని బాబా డా॥ గనీతో ఉండి అత డేమితింటే అది తినమని ఆజ్ఞాపించారు. డా॥ గనీ మహమ్మదీయుడు. అతడు మాంస భోజనం మానడు డా॥ నీలు మహారాష్ట్రబ్రాహ్మణుడు అతనికి అయిష్టమయినా బాబా ఆదేశం పాటించక తప్పిందికాదు ప్రియతమ బాబా అలా చెప్పకపోతే అతడు జన్మలో మాంసం ముట్టుకునేవాడు కాదు ఆహారం మీద యిష్టాయిష్టాలు లేకుండా చేయడానికి బాబా నీలూకి యీ విధంగా ప్రత్యేక శిక్షణ యిచ్చినట్లున్నారు.

ఆవుని పెంచడం యీ ప్రయాణాల్లో చాలా శ్రమ అని తెలుసుకున్నారు. ఆవు పోషణభారం అంతా డా॥ నీలు వహించేవాడు. తరుచుగా నీలూ దూడని ఎత్తుకుని తీసుకువెళ్ళవలసి వచ్చేది దాని వెనకాల ఆవు త్వరగా నడిచివెళ్ళేది.

కాశీలో బహూమతిగా వచ్చిన తెల్లగుఱ్ఱం టాంగాకి కట్టి ఉపయోగించేవారు. కానీ ఆ గుఱ్ఱం కదిలేదికాదు. అందుకోసం గుఱ్ఱాలను బాగాతోలే టాంగావాలాను పిలిపించారు అసలు దానిని బండికి కట్టడమే కష్టం అయింది ఇంకో టాంగా గుఱ్ఱం కొన్నారు అమ్మివేసిన ఒంటెబండిస్థానే యింకో ఎద్దుబండి కూడా కొన్నారు బాబా తెల్లగుఱ్ఱం టాంగాలో బజారుకి వెళ్ళి బైదిల్‌ని వంటలకి కావలసిన కిరాణా సరుకులు కొని తెమ్మన్నారు వెనకాల కాకా ఉండేవాడు. వాళ్ళబండి సరుకుతో ముందుకి తోలుకొని వెళ్ళేవాళ్ళు, పరివారం అందరూ వెళ్ళేసరికి, వంటలు చేసిపెట్టడానికి కాని బండిలో ఏ మాత్రం బరువు వేసినా ఆ గుఱ్ఱం కదిలేదికాదు వెళ్తే ఎక్కువ వేగంగా పరిగెత్తేది కాకా కూడా పరిగెత్తవలసి వచ్చేది అందుకే కాబోలు నజీబాబాదు వెళ్ళే సరికి అతనికి గుండెపోటు కూడా వచ్చింది పాపం రెండో టాంగా ఆదీ తోలేవాడు అతనికి డా॥ గనీ సహాయం చేసేవాడు. దారిలో వారు భిక్ష అడిగితేవలసి వచ్చేది.

జనవరి (1950) 1 వ తేదీనాడు మధ్యాహ్నం బాబా మురాదాబాద్ నుంచి బయలుదేరారు అయిదు మైళ్ళు నడిచారు అక్కడ ఒక తోటలో ఉందామని అనుకున్నారు కాని ఆ తోటలోకి ప్రవేశించే ద్వారం చాలా సన్నంగా ఉంది. అందులోకి బళ్ళు వెళ్ళవు అందువేత బళ్ళని బయటే ఉంచేసారు. ఆ రాత్రి వర్షం కురిసి బాబాకి మండలికి కొంత యిబ్బంది కలిగించింది వర్షపునీరు బాబా గుడారంలో నుంచి ప్రవహించింది

డా॥ గనీ వాక్చాతుర్యంవల్ల ఎలాగో భిక్ష సంపాదించుకు వచ్చేవాడు. హరిద్వారం యాత్రకు వెళ్తున్నారని అందులోను నడిచివెళ్తున్నారని తెలిసి కొందరు మేమూకూడా వస్తాం తీసుకెళ్ళండి అన్నారు బాబా ఒప్పుకోరని చెప్పి గనీ తప్పించుకునేవాడు.

ఒకమారు డా॥ నీలు, కాకాలు భిక్షకి వెళ్ళారు. అసలే వాళ్ళు లావుగా బలిసి ఉన్నట్లుండేవారు అందులో కఫ్నీల కింద వారు వేసుకున్న ఉన్ని దుస్తులు మరీ లావుగా కనపడేలా చేసాయి భిక్ష అడిగినపుడు ప్రజలు వాళ్ళని చూసి ' మీకేమయ్యా!

మీ కెందుకు భిక్ష ? సోమరిపోతుల్లారా ! మీరు వస్తాదుల్లా ఉన్నారు ఏదయినా పని చేసుకు బ్రతకరాదూ, అడుక్కుతినకపోతే " అనేవారు. బీదవారే భిక్ష వేసేవారు. ధనికులకు యిలాటి అనుమానాలు వచ్చి భిక్షవేసేవారు కాదు. చదువుతున్న వాళ్ళకు కూడా సంశయాలు కలిగేవి ఒకనాడు బాబా మండలితో ఒక చిన్న పల్లెటూరులో ఆగారు బాబా కొంచెం దూరంలో ఉన్న ఎరచ్‌ని భిక్షకి వెళ్ళమన్నారు సమీపంలో కనిపిస్తున్న కొన్ని గుడిసెల వద్ద అడిగి తెమ్మన్నారు. ఎరచ్ కొన్ని భక్రీలతో తిరిగి వచ్చాడు. (చేతితో చేసిన జొన్నరొట్టెలు) వాటితో ఏవో కూరలు కూడావేసారు. ఆ భిక్షను స్త్రీలతోను ఎరచ్‌తోను బాబాకూడా పంచుకుతిన్నారు మిగిలినది బాబా సహచరులకోసం ఇత్తడి గిన్నెలో దాచి ఉంచారు వారికి ఉదయంనుంచీ నడుస్తున్నందు వల్ల ఆకలి బాగా వేసింది అందుకని ముందు తినేసారు ఆ రోజుకు మరీ చలిగా ఉంది

ఒకనాడు ఒక టాంగా చక్రం విరిగిపోయింది రెండో టాంగాలో బయలుదేరి డా॥ డాన్‌కిన్, బైదుల్ సమీపంలో ఉన్న పట్నానికి చక్రం బాగుచేయిద్దామని వెళ్ళారు. అప్పుడు సూర్యుడు నడినెత్తిన ఉన్నాడు ఎండ తీక్షణంగా ఉంది బైదుల్ తన కోటుకూడా తీసికెళ్ళాడు. డా॥ డాన్‌కిన్ మాత్రం షర్టులోనే ఉన్నాడు ఒక గంటలో అయిపోవలసిన బండి మరమ్మతు చాలాసేపు తీసుకుంది వాళ్ళు రాత్రి పొద్దుపోయి తిరిగి వచ్చారు డాన్‌కిన్ పాపం చలితో వణికిపోతూ బాధ పడుతున్నాడు ఎముకలు కొరికేస్తుంది చలి బైదుల్ కోటు ఉంచుకోవడం మంచిదయింది రాగానే డాన్‌కిన్‌కి మండలి ఉపచారం చేసారు. ఒకమారు అందరూ నడిచి వెళ్తుంటే మణి మోకాలు బెణికింది కాళ్ళు కుంటుతూ నడుస్తోంది దారేవెళ్ళే ఎద్దు బండివాడు చూసి ఆమెను బండి ఎక్కించుకుంటా నన్నాడు మేము హరిద్వార్‌కి నడిచి యాత్రకు వెళ్ళాలి. అందుచేత నేను రాలేను అన్నది బాబా అందరినీ ఆపి వెనకాల సవారీ బండి వచ్చే దాక ఉండి మణిని అందులో ఎక్కమన్నారు దారిలో మళ్ళీ మణిని ఎక్కించుకుంటా నన్న బండివాడు ఎందుకో బండి ఆపుకుని ఉంటే అతడు బండిలో ఎక్కనని సవారీ బండిలో వస్తూన్న మణిని చూసి ఆశ్చర్యపోయాడు

మొరాదాబాద్ నుంచి బయల్దేరే ముందు ఢిల్లీ నుంచి ఒక భక్తుడు అతని కొడుకు వచ్చారు టాంగాలో వాళ్ళు చాలా పెద్దపెద్ద పొట్లాలు అవీ తెచ్చారు బాబాను గురించి విని వారు ఆయనకు 'భిక్ష' తీసుకువచ్చారు కప్పుకుందుకు దుప్పట్లు వగైరా

ఉన్ని బట్టలు అవీ అందరికీ సరిపోయేలా తెచ్చారు. బాబా సమక్షంలోనే సహచరులు అందరికీ పంచి యిచ్చారు మండలిలోని వారికి ఒక్కొక్కరికి మూడు రగులు వచ్చాయి స్త్రీలకి రెండేసి వచ్చాయి ఎంతో ప్రేమతో యివన్నీ తెచ్చి నతన్ని బాబా మెచ్చుకుని సంతోషించారు చిన్న పిల్లవాడు ఒకడు (ఆ వర్తకుని కొడుకు) బాబాకి సంతోషం కలుగజేశాడు

ఒక మామిడితోటలో ఆగి బాబా ఆ మర్నాడు బాబా అక్కడే ఉందా మన్నారు. అందరికీ బాబా ప్రతిపాదించినది నచ్చింది నడకతో వేసారి వేసారిఉన్నారు దరి దగ్గర ఉన్న గ్రామవాసులు తోటలో దిగిన వీరందరినీ విచిత్రంగా చూడ్డానికి వచ్చారు మరునాడు వారు బాబానుచూడా చూసారు. ఆ విషయంలో వారు అదృష్ట వంతులే అనుకోవాలంతా అవతార పురుషుణ్ణి చూడగలిగారు వారికి తెలియకపోయినా. వాని బాబా ఎవరో మహానుభావుడని మాత్రం పసిగట్టారు.

బాబా పరివారంతో అక్కడినుంచి బయలుదేరారు ముందుకు సాగుతూ కొంతదూరం వెళ్ళాక మంచినీళ్ళు కూడా తెచ్చుకోలేదని చూసుకున్నారు బాబా అడిగి నప్పుడు వారు మంచినీళ్ళు యివ్వలేకపోయారు. అదృష్టవశాత్తు సమీపంలోనే ఒక బావి కనిపించింది అక్కడ ఒక వేదతో ఒక మనిషికూడా ఉన్నాడు అతని వద్ద ఎరచ్ వెళ్ళి మంచినీళ్ళు తీసుకువచ్చి బాబాకి యిచ్చాడు బాబా ఆ నీరు తేగానే ఎరచ్ కాళ్ళు స్పృశించారు అతనిని అలాగే ఆ నూతివద్ద మనిషి కాళ్ళు తాకమన్నారు. అంటె ఎరచ్ద్వారా బాబా ఆ మనిషి కాళ్ళు తాకారన్నమాట

సహచరులలో గుస్తాద్‌జీ, పటేల్, అన్నా జక్కల్ నడిచేరేగానీ దారిలో ఏ బండీ ఒక్కమాటు కూడా ఎక్కలేదు అన్నాని 104 అని పిలిచేవారు ఎందుచేతంటే ఒక్కమాటు తన ఒంట్లో జబ్బుచేసినపుడు తనకి జ్వరం 104 డిగ్రీలు వచ్చిందని అందరితో చెప్పేవాడు అప్పటినుంచి బాబా అతనికి '104' అని పేరు పెట్టారు అన్నా (104) కి బాబాను వారు మెహెరాబాద్‌లో ఉంటున్నప్పటి నుంచి తెలుసును పగలు అందరితోపాటు నడచినంత నడిచి రాత్రిళ్ళు బాబా గుడారం బయటకాపలి కాసేవాడు 104 ఆ సాయంత్రం కొంచెం వీలు కలిగితే కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాడు అది నిజంగా విశ్రాంతి అనడానికి వీలులేదు అన్నా అంటాడు బాబాపేరు జపిస్తూ రాత్రిళ్ళా కాపలి కూర్చోడమే విశ్రాంతి అని

ఒకరోజు సుంద ఆదీని గనీని నజీబాబాదు పంపించారు బాబా. అక్కడ బాబా పరివారంతో దిగడానికి తగిన వసతి ఏర్పాటుచెయ్యమని. అక్కడ బాబా కొద్ది రోజులు గడపదలుచుకున్నారు బాబాకి బ్రతకడానికి 'భిక్ష' కూడా అడిగితెచ్చి ఉంచాలి, బాబాపేరు చెప్పకుండా ఒక ధనికుల కుటుంబం అందరికీ కూడా ఆహారం సప్లై చేయడానికి ఒప్పుకున్నారు బాబా యిక్కడ ఉన్నన్నాళ్ళు ఆ యింటి స్త్రీలు శ్రద్ధగా ఆహారం తయారుచేసి పెట్టారు బాబా యీ సంగతి తెలుసుకుని ఆ కుటుంబం వారిని ఒక్కమారు బాబాను వచ్చి చూడడానికి అనుమతి యిచ్చారు వారెంత అదృష్ట వంతులో కదా.

నజీబాబాద్‌లో కాకాకు గుండెజబ్బు చేసింది. బాబా అతన్ని డేరాడూన్‌కి రైలుమీద వెళ్ళమన్నారు మండలిలో కొందరు సహచరులు బళ్ళు తోలుకుంటూ రోడ్డుమీద ప్రయాణం చెయ్యాలి గాడిదలు రెండూ బాబా అమ్మించేశారు ప్రధానమయిన రాజమార్గం గుండా వెళ్ళమన్నారు బాబా కానీ నగం మార్గం వారికి కలిసి వస్తుందని దగ్గిరదారిని వెళ్ళారు. కాని ఆ 'దగ్గిరదారిని' వెళ్ళి నానా అగచాట్లు పడి రాజవీధిని వెళ్ళేదానికన్నా ఎక్కువరోజులు తీసుకున్నారు గమ్యస్థానం చేరడానికి మండలి ఆ ప్రయాణంలో బాబా మాటలు తలుచుకున్నారు ఆయన రాజవీధిని వెళ్ళమంటే విన్నారు కాదు.

డేరాడూన్‌లో కొద్దిరోజులున్నారు మంజరి మాఫీ అనే సమీపగ్రామంలో నివసిస్తున్న బాబా శిష్యుడయిన శత్రుఘ్నకుమార్ బాబాకి పరివారానికి కావలసిన ఆహారం తీసుకువచ్చాడు మంజిరిమాఫి గ్రామాన్ని యిప్పుడు మెహెర్‌మాఫి అంటున్నారు ఆ ఊరు డూన్‌కి నాలుగు మైళ్ళంది కుమార్ భార్య సుభద్ర ఆహారం వండియిస్తే అతడు మోటారు సైకిల్‌మీద తీసుకు వచ్చాడు ఒక రోజున అన్నం మెత్తబడిపోయింది ఈ సంగతి బాబా కుమార్‌కి చెప్తూ "అందుకని నీ భార్యను తిట్టకు సుమా" అని హెచ్చరించారు. తరువాత ఆమె తనభర్త తనను తిట్టినా బాగుండేది. రాత్రంతా ఆయన కళ్ళలోని కోపమే తనకు కన్నులకు కట్టినట్లు కనిపించేది—అని అంది ఆమె చాలా మంచి యువతి. కుమార్ ద్వారా అతని కుటుంబం యావన్మంది బాబా భక్తులయారు.

బాబా పరివారంతో డేరాడూన్ చేరేసరికి చాలా చలిగా ఉంది. అక్కడికి దగ్గరే ముస్సోరిపట్నం ఉంది. అది హిమాలయాల మొదట్లో ఉంది. ఈ కాలం బాగా మంచుతో కప్పబడి ఉంటుంది. మండలి అంతా బస ఏదో తలదాచుకునేందుకు దొరికితే చాలుననుకున్నారు.

కొన్ని రోజులయిన తరువాత బాబా స్త్రీ బృందంతో ఒక బంగళాకు కారులో వెళ్ళారు. ఆ గేటులోంచి చూస్తే లోపల మనోహరమయిన ఉద్యానవనం ఉంది. గులాబీలు అనేకంగా ఆహ్వానిస్తున్నాయి. అక్కడ పళ్ళచెట్ల తోటకూడా ఉంది. అక్కడ నుంచి ముస్సోరి అందంగా కనిపిస్తోంది. అక్కడికి రాగానే అమ్మయ్యా మంచి యింటికి వచ్చాం అని స్త్రీలు సంతోషించారు. ఇంటిలోపల వెచ్చదనానికి పొయ్యిలు, అన్నం వండుకునేందుకు ఎలక్ట్రిక్ పొయ్యిలు ఉన్నాయి. బాబాకి వేడినీరు కాచి తాగడానికి యివ్వొచ్చునని వారెంతో సంతోషించారు. అంత చలిగా ఉంది వాతావరణం. స్త్రీలంతా వేడినీటి స్నానాలు చేయవచ్చునని, బాబా గుడ్డలు ఉతుకవచ్చునని సంతోషించారు. అన్నివిధాలా యీ బంగళా బాగుంది, కొన్నాళ్ళపాటు అందులో హాయిగా ఉండవచ్చును. బాబా పన్నీ అమర్చడానికి అన్ని ఏర్పాట్లు బాగున్నాయి అని మెహెరా, మణి సంతోషిస్తున్నారు. కానీ యింతలో గోహర్ వచ్చి రేపు యిక్కడి నుంచి వెళ్ళిపోతున్నామని బాబా చెప్పారు అంది. ఆ మాటలు వినేటప్పటికి వారికి ఎంతో ఆశాభంగం కలిగింది పాపం.

అలిగర్‌లో గవర్నమెంటు డెయిరీ ఫారమ్ (పాలసరఫరా కేంద్రం) ఉంది. దానికి నిర్వహణాధికారి తోడీసింగ్ అనేఅతడు. బాబా డేరాడూన్‌లో ఉండగా తోడీసింగ్ బాబాను చూడడానికి వచ్చాడు. ఆ రోజులలో ఎవరూ ఒకచోట నుంచి యింకో చోటికి తిండి గింజలు తీసుకుపోకూడదు. అందుకు ప్రభుత్వము వారి అనుమతి ఉండాలి. కానీ అతడు పెద్ద డబ్బాలో నూరు పౌన్లు వెన్న తీసుకు చక్కా వచ్చాడు. తీసుకువచ్చి బాబాకు 'భిక్ష'గా సమర్పించాడు. ఆ వెన్న తాజాగా రుచిగా ఉంది. ఇవన్నీ ఎలా తెచ్చావు అని తోడీసింగుని ఎవరయినా అడిగితే 'బాబా జానే' (బాబాకి తెలుసు) అంటాడు. అప్పటినుంచి అతనిని 'బాబా జానే' అనేవారు. అతడు బాబాను యింకా ఏవయినా ఆహారపదార్థాలు తేవచ్చా అని అడిగాడు. తోడీసింగ్ నిజాయితీ, శ్రద్ధాసక్తులు కలిగిన భక్తుడు గనుక బాబా సరే అన్నారు. బాబా మంత్రిమాఫి వెళ్ళి

నప్పుడు అతను భార్యను పిల్లలను అతని సోదరిని అందరిని పంపించాడు వాళ్ళు ఉండి వంటయింటి పనంతా చూసుకున్నారు. తోడీసింగ్ ప్రతిరోజూ మార్కెట్‌కి వెళ్ళి కావలసిన సరుకులు కూరలు వగైరా అన్నీ తెచ్చేవాడు డేరాడూన్‌లో శీతాకాలంలో మంచి మంచి కూరగాయలు చాలా వస్తాయి బాబా ప్రేమలో కళ్ళవెంట నీరు వస్తూంటే అది చూసినవారికి కూడా అలా వచ్చేవి. వెళ్ళిపోయే రోజున అతడు బాబా కదలిన చోట్లు ఆయన స్పృశించిన స్థలాలన్నీ ముద్దుపెట్టుకున్నాడు బాబా తాకిన ప్రదేశమంతా అతి పవిత్రమయినదే అతని దృష్టిలో. నవారీబండి చక్రాలుకూడా అతడు వంగి స్పృశించాడు బాబా ప్రేమలో అతడొక మస్తులా అయిపోయాడు.

ఆ రోజున వర్షం కురుస్తోంది. చలి బాగా వేస్తోంది. అయినా బాబా తెల్లవారుఝామున 4 గంటలకు లేచారు. తోడీసింగ్ కుటుంబం ఆ రోజున సెలవు పుచ్చుకుని వెళ్ళారు వాళ్ళు వెళ్ళాక మణి, మెహెరా, మెహరూ చపాతీలు చేసి వంట వండారు. 8 గంటలకి బాబా వచ్చి వంట అయిందా అని అడిగారు 'ఒక్క అర గంటలో పెట్టేస్తాము బాబా' అన్నారు వాళ్ళు. 8-30 గంటలకు భోజనాలు అయిపోయేవి మధ్యాహ్నం 12 గంటలకు టీ తీసుకుని సాయంకాలం 5 గంటలకే భోజనం చేసేవారు. 6 గంటలకి ప్లేట్లన్నీ కడుక్కోవడం కూడా అయిపోయేది.

సాయంకాలం బాబా స్త్రీ బృందంతో కూర్చుని కబుర్లు చెప్పేవారు. వాళ్ళని ఏవయినా తమాషాలు చెప్పమనేవారు. లేక ఏవయినా జ్ఞాపకమున్న కథలు చెప్పమనేవారు స్త్రీలు పుస్తకాలు గానీ పత్రికలు గాని చదవడానికి వీలులేకపోయేది.

బాబా వారి సహచరులు అందరు డేరాడూన్‌కి జనవరి (1950) 12వ తేదీన చేరారు 15 వ తేదీన బాబా వారి సహచరులను సమావేశపరచి యిలా చెప్పారు——

ఇంతవరకు జరిగిన 3 నెలలలోను (16-10-49 నుండి 15-1-50 వరకు) నా నవ్యజీవితపు రీతిని చూసారు మీరు మీరంతా దానికి ఎంత తగి ఉన్నారో కూడా చూపించారు అందుచేత మీరూ నేను యీ మూడునెలల అనుభవాలు దృష్టిలో ఉంచుకుని నేను మీముందు ఉంచబోయే మూడు పథకాలను పరిశీలించి ఏవి ఎవరికి తగినవో నిర్ణయించుకోవాలి ఇవన్నీ మీరంతా హృదయ పూర్వకంగా సమగ్రంగా ఆలోచించుకొని నిజాయితీతో మీ నిర్ణయాలు తెలపాలి అవి నా అంతట నేను ఐచ్ఛికంగా

తయారు చేసినవి వాటిలో ఏదో ఒకటి నా అభిలాషగా నా ఆజ్ఞగా మీరు స్వీకరించాలి. ఈ మూడింటిలోను ఒకటి వ్యక్తిగతంగా కాని సామూహికంగాగాని మీరు అంగీకరిస్తే మీరు నూటికి నూరుపాళ్ళు నవ్యజీవితంలో నా సహచరులుగానే ఉంటారు ఈ మూడు పథకాల వలన నవ్యజీవితం నా యిష్టం వచ్చినట్లు జీవించడానికి నాకు స్వేచ్ఛ ఉంటుంది మిమ్మల్ని నవ్యజీవితంలో నూటికి నూరుపాళ్ళు ఉంచుతాయి

"ఈ మూడు పథకాలలో ఏదో ఒకటి మీరు అంగీకరించినందున నాకు స్వేచ్ఛ, సంతోషము కలుగుతాయి. మీరు నూతన జీవితంలో నా సహచరులుగానూ ఉంటారు.

ఆ పథకాలేవి యనగా—

1 (A) సామూహిక మయిన పథకం :—

(1) ఇందులో మీరందరూ పరస్పరం సహకారము చేసుకోవాలి ఒండొరులకు సహాయం చేసుకోవాలి మీ సామర్థ్యాన్ని బట్టి మీ ఆరోగ్యాన్ని బట్టి ప్రతి యొక్కరు యీ పథకం పని జరిగేలా చూడాలి.

(2) మీకు నేను రు 10,000 సొమ్ము, రెండు టాంగాలు, గుఱ్ఱాలు బళ్ళు, ఎడ్లు మీ ఉపయోగానికి యిస్తాను ఇది పెట్టుకుని యీ నూతన పథకాన్ని అభివృద్ధి చేయాలి.

(3) మీరు వ్యవసాయం చేయవచ్చును లేక ఉద్యోగాలు చేయవచ్చును. లేక డేరాడూన్‌లో గాని చుట్టుపట్ల ఊళ్ళలోగాని ఏదయినా వ్యాపారం చేయవచ్చును.

(4) మీరు మన ఆస్థివద్దగాని డేరాడూన్‌లో గాని యీ పథకం ఆచరణలో పెట్టడానికి మరిమే యితర స్థలంలోగాని ఉండవచ్చును

(5) ఈ వ్యాపారంవల్ల గాని, వృత్తులవల్లగాని, వ్యవసాయంవల్లగాని, ఉద్యోగాలవల్లగాని వచ్చిన సహచరుల సంపాదన యీ పథకం కింద అందరికీ చెందాలి ఈ అందరి సంపాదనతోను మీ యిష్టంవచ్చిన భోజనం భుజించవచ్చును. మీ యిష్టంవచ్చిన దుస్తులు ధరించవచ్చును కానీ వ్యక్తిగతంగా ఒక్కొక్కరికి స్వంతంగా ఏదీ ఉండకూడదు.

(6) ఇందులో భిక్షాటనగాని, 'లంగోటీ' గాని, జీ ౹ జీవితంగాని మీ కెవరికీ ఉండదు

(7) నేను హరిద్వార్‌లోగాని డేరాడూన్‌లోగాని ఉన్నప్పుడు మన ఆస్తిమీదే ఉంటాను. నేను భిక్షాటన చేస్తాను కానీ మీరు య్యాగలిగితే నాకు నా వెంట ఉండే స్త్రీలకు మీ సంపాదనమించి భోజనం యిస్వండి దినదినము అయే ఖర్చులు కూడా భరించండి

(8) మీరు ఎప్పుడు పరుండి నిద్రపోయినాసరే మీ యిష్టంవచ్చిన సమయంలో లేవవచ్చు, మీ యిష్టం వచ్చిన చొప్పున పని చేయవచ్చు. నేను మీ జీవితంలో ఏమీ కలుగజేసుకోను. నా జీవితంలో మీరు కలుగజేసుకునేందుకు ఒప్పుకోను ఇదివరకు ఏర్పరచిన నియమాలు తప్ప మీకు ఏ షరతులూ ఉండవు. నా వద్దనుంచి ఏ ఆజ్ఞలూ రావు ఆదిలో ఏర్పరచిన నియమాలు దృష్టిలో ఉంచుకొని నా స్వంత పథకానికి యీ మూడు పధకాలకి తగినట్లు నేను షరతులు ఏర్పరుస్తాను.

(9) డబ్బుతోగాని లెక్కలతోగాని నాకేమీ ప్రమేయం ఉండదు

(10) దేనిగురించీ ఎవరూ నాకు ఫిర్యాదు చేయకూడదు

(11) సహచరులే అంతా నిర్వహించాలి – వారు నిర్వాహక సంఘం పెట్టుకున్నాసరే, వారిలో అధికసంఖ్యాకు లెట్లు యిష్టపడితే అట్లుచేసినాసరే. లేక ఒక నిర్వాహకుని నియమించుకున్నా సరే

(12) నేను మీకు తుది నిర్ణయంగా షరతులు ఏర్పాటు చేస్తాను. మీరు పాటించినా సరే లేకపోయినా సరే అది మీ యిష్టం.

(13) ఆ షరతులు వివరించి మీకు అప్పగిస్తాను, మిమ్మల్ని నమ్మి అవి అచరించినా లేకపోయినా అది మీ బాధ్యత. దానిని గురించి నేనేమీ విచారణ చేయను ఒకరిని సాధించను అసలు దానిని గురించి అడగనే అడగను ఆ షరతులు పాటించనివాడు నన్ను జీవితంలోంచి తొలగినట్లే, అతడు సహచరులతో ఉండినప్పటికీ.

(14) సహచరులు వారి తీరిక సమయాల్లో నాతో కాలక్షేపానికి కబుర్లు చెప్పడంకోసం నన్ను కలుసుకోవచ్చు. లేక నన్ను ఏ వినోద, సంగీత కార్యక్రమంలో నయినా పాల్గొనమని అడుగవచ్చు

(15) నేను ఏర్పాటుచేసిన షరతులకు లోబడి సహచరులు ఎలాజీవించినా ఎలా పనిచేసినా చేయవచ్చు. వారికా స్వేచ్ఛ ఉంది. నా యిష్టమొచ్చిన చోటికి నేను పోవచ్చును. నేను లేకపోయినా సహచరులిక్కడ ఉండవచ్చును.

(16) నేను అందరికీ సర్క్యులర్ లేఖలు పంపుతాను సహచరులకు సహాయపడేలాగ అందులో వ్రాస్తాను కాని డబ్బుగాని భిక్షగాని బహుమతులు గాని స్వీకరించరాదు నా సహచరులలో పాత జీవితంలో వారి సర్వస్వము నాకు అంకితం చేసినా అందుచేత నూతన జీవితంలో ఏ ఎక్కువ ప్రయోజనము కోరనుగాని నా పాత జీవితపు శిష్యులను భక్తులను నేను కోరేది ఏమంటే వారు ఏ పరిస్థితులలోను నూతన జీవిత సహచరుల డబ్బుతో గాని, బట్టలతో గాని, ఆహారంతో గాని సహాయం చేయకూడదు.

(17) సహచరులు కావాలంటే నేను వారికి ధన రూపేణాతప్ప మొదట వారు ప్రారంభించేదానిలో యితరులను ఎవరినయినా సహాయం చేయమని చెప్పిగాని యితర విధంగా గాని సహాయపడతాను

(18) ఈ పథకం నూతన జీవితాన్ని కొనసాగిస్తుంది. సహచరులందరను ఏకంగా ఉంచుతుంది నాకు ఆసక్తి కలిగించి ఉంచుతుంది, నాకు, సహచరులకు స్వేచ్ఛ నిస్తుంది.

(19) ఏ సహచరుడయినా కావాలని పనులను చెయ్యకుండా ఉంటే, ఎవరయినా తన మనోవృత్తి వలనగాని, మూర్ఖత్వంవలన గాని, అందరిపనికి అడ్డం వచ్చినా అందులో తనస్థానాన్ని నిలుపుకోలేక పోయినా సాధారణ నిర్వాహకత్వంలో తగినట్లు నడుచుకోకపోయినా ఆ సమూహంలోంచి సహచరత్వంలో నుంచి అతనిని తొలగించవచ్చును, అధిక సంఖ్యాకులు అట్లు కోరినచో.

## 1–B పథకం (సామూహికము లేదా వ్యక్తిగతము)

అందరూ సామూహికంగా యీ పై పథకానికి అంగీకరించకపోతే ఎంత మంది అంగీకరిస్తారో వారు మాత్రం కలిసి సమూహంగా ఏర్పడినట్లయితే వారికి రు 5000/- సొమ్ము రెండు టాంగాలు, గుఱ్ఱాలు, ఎద్దులు బళ్ళు వారి ఉపయోగానికి

యిస్తాను పై పథకానికి గాని దీనికి గాని అంగీకరించనివారు దిగువ చూపించిన పథకం I–C గాని లేక II వ పథకం గాని ఎన్నుకోవచ్చును.

I–C (వ్యక్తిగతంగా)

(1) నూతన జీవితాన్ని ఆ వ్యక్తి యొక్క స్వంత ఊరులో ఉండి ఉద్యోగం వల్లగాని, వృత్తి వ్యాపారం వల్లగాని సంపాదించవచ్చును. అతడు మెహెరాబాద్‌లో గాని పింపలగామ్‌లో గాని ఉండరాదు.

(2) నేను ఏర్పరచిన షరతులు పాటించాలి.

(3) నేను యిచ్చిన పనులు నిర్వర్తించాలి, వారి వారి స్థలాల్లోనే ఉంటూ. (సరోష్ మొదలయినవారిలాగ)

(4) భౌతికంగా బాబావద్ద ఉండడానికి వీలులేదు.

(5) నేను నూటికి నూరుపాళ్ళ స్వేచ్ఛగా ఉంటాను సహచరులు కూడా షరతులకి లోబడి స్వేచ్ఛగా వారి యిష్టప్రకారం చేయవచ్చును.

(6) ఒక్కొక్కరికి రు 500 సొమ్ము యివ్వబడుతుంది 'కాదుగాళ్ళ' కి వలెనే మీకు ఆధ్యాత్మిక సాంగత్యము గాని భౌతిక సాంగత్యము గానీ ఏదీ ఉండదు. కాని మీరు యింకా నూతన జీవితంలో సహచరులుగానే ఉంటారు నూతన జీవితంతో సంబంధము ఉంటుంది, నూటికి నూరుపాళ్ళూను.

(7) మీరు పాత జీవితంతో వారితో కూడా సంబంధం కలిగిఉండవచ్చును.

(8) ఒక్కొక్కరి సంపాదనలోనూ ప్రతీవారూ తన కుటుంబానికీ తనకీ కావలసిన సొమ్ము తీసుకొని మిగిలిన సొమ్ము నాకు పంపించాలి అది నాకోసము నాతో ఉన్నవారికోసమూ వినియోగం అవుతుంది

(9) సహచరులు నాకు పంపించే సొమ్ము అది నిక్కచ్చిగా వారు సంపాదించిన సొమ్ములోంచే అయి ఉండాలి ఆ డబ్బు అప్పుతీసుకున్నది గాని, భిక్షమెత్తినది

గాని రాకూడదు సహచరులు డబ్బును రానుకగా గాని ఎవరివద్ద నుంచీ సహాయంగా గాని తీసికొనరాదు.

(10) సహచరులు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపకూడదు వారు వాతో ఏ సంబంధమూ ఉంచుకోకూడదు, తరువాత నేను అతనిని ఆజ్ఞాపిస్తే తప్ప కాని, అతని పంపాదనలో నుంచి నాకు డబ్బు పంపుతూ ఉండాలి.

(11) 16 అక్టోబరు ముందు యిదివరకే చేసిన ఏర్పాటులేవీ పాడుచేయరాదు. 'ఏర్పాటుదార్ల' విధులతో వ్యతిరేకంగా కలుగజేసుకోరాదు. డబ్బువిషయంలో ఏర్పాటుదారుల కిచ్చిన ఆజ్ఞలకు వ్యతిరేకంగా ఏదీ చేయడానికి ప్రయత్నించరాదు.

## II వ పథకము

(1) పాత జీవితపు స్థలానికి (మెహెరజాద్, మెహెరాబాద్‌లు) తప్ప ఏ చోటయినా ఎక్కడికయినా వెళ్ళవచ్చు

(2) ఎక్కడయినా ఏ వ్యాపారమయినా చేయవచ్చును, లేక తన కిష్టమయిన ఏ ఉద్యోగమయినా చేయవచ్చును.

(3) బాబాకి భౌతికంగా సన్నిహితంగా ఉండడానికి వీలులేదు.

(4) నవ్యజీవితం నేను విధించిన షరతులతో గడపాలి

(5) నేను నూటికి నూరుపాళ్ళు స్వేచ్ఛగా ఉంటాను, సహచరులు కూడా షరతులకి లోబడి ఏ పని అయినా చేయడానికి స్వేచ్ఛ కలిగి ఉంటారు

(6) I-c పథకంలో 6 వ నెంబరులాగే యిదీను

(7) I-c పథకంలోవలెనే మీకూ ఏ పనులు విధించుటలేదు. షరతులకు లోబడి ఎలాటి జీవితాన్నైనా స్వతంత్రంగా జీవించవచ్చును.

(8) I-c పథకంలో 8 వ నెంబరు లాగే యిదీను.

(9) -do- 9 -do-

(10) -do- 10 -do-

11 I-c పథకంలో 11 వ నెంబరులాగే యిదీను.

గమనిక :— I–c పథకంలోను II వ పథకంలోనుభిక్షాటనము, 'లంగోటీ జిప్సీ జీవితము ఉండవు. సహచరుల తరఫున నేనే యివన్నీ చేస్తాము.

## III వ ప థ క ం

మొదటి షరతులన్నీ నూటికి నూరుపాళ్ళు అనుసరించే వారికోసమే యీ పథకం ఉద్దేశింపబడింది.

I వ పథకం (I–A, I–B, I–C), II వ పథకంలోని ప్రమాణం -

"దేవుని యెదుట, నూతన జీవితం లోని సహచరుడు నయిన నేను యీ ప్రమాణమును తీసుకుంటున్నాను –

"ఈ రోజున నాకు బాబా విధించిన షరతులను నేను నూటికి నూరు పాళ్ళ పాటిస్తాను మొదటనేను 'అవును' అని సంతకంపెట్టిన షరతులమీద ఆధార పడిన షరతులే యివి బాబాను నేను నా స్నేహితుడు గాను నా సోదరుడు గాను భావిస్తాను ఆయన వద్దనుంచి ఆధ్యాత్మికంగా కాని భౌతికంగా కాని ఏ సహాయమూ ఆశించను చివరవరకూ నా యొక్క భౌతిక అవసరాలను చూసుకుంటాను. భౌతికంగా కాని ఆధ్యాత్మికంగా కాని ఏ లాభమూ నేను పొందకపోతే దానికి బాబా బాధ్యుడు అని నేను అనను. నాకు జరిగినదానికి నేనే బాధ్యుడనని నేను దేవుని సాక్షిగా అనుకుంటాను. బాబాతో ఆధ్యాత్మిక సంబంధము గాని భౌతికసంబంధం గాని ఉండదు. కాని నేను నూటికి నూరుపాళ్ళ షరతులను పాటిస్తే నూటికి నూరుపాళ్ళ బాబా యొక్క నూతన జీవితంలో ఉంటాను

ఇప్పుడు బాబా విధించిన షరతులు ఏవిటో చూదాంకి –
పథకాలు I–A, I–B, I–C, II అంగీకరించిన వారికి
బాబా విధించిన షరతులు: —

(1) అన్నిటికంటె మొదట నీవు నా వలన ఏ విధమయిన ఆధ్యాత్మిక లాభంగాని, భౌతిక లాభంగాని లేశమయినా పొందవని నిశ్చయంగా తెలుసుకోవాలి. అంతేగాక, అన్నివిధాలుగాను అశాభంగము కష్టము కలుగుతుందని నీవు సిద్ధముగా ఉండాలి.

(2) బాబా నీ మీద వారి 'నజర్' ఉంచుతారని ఆశించకూడదు. బాబా అద్భుతాలు చేస్తారనిగాని, నిన్ను రక్షించటానికి, నిన్ను జబ్బు, అపాయము, కారాగార శిక్ష, మరణము, చిక్కులు, వినాశముల నుండి కాపాడటానికి ఆయన ఆధ్యాత్మికపు తాళం చెవి తిప్పుతారనిగాని నీవు ఎంతమాత్రము ఆశించకూడదు.

(3) అవసరమయినపుడు నీ తల్లి, భార్య, సోదరి, కుమార్తెను తప్ప, ఏ స్త్రీని ఎప్పుడూ నీవు తాకరాదు. వృత్తిరీత్యా నీవు వైద్యుడవైతే అవసరమయినపుడు తప్ప.

(4) నీవు రాజకీయాలలో ప్రవేశించరాదు.

(5) నీవు నీ మాటలవలన గాని నీ చేతలవలన గాని ఎవరి యెడలా కోపాన్ని వ్యక్తం చేయరాదు. ఎవరినీ అతని యెదుటగాని పరోక్షంగా గాని అక్రమంగా విమర్శించకూడదు. నీ మనసులో కొన్ని వేళలలో కోపం వచ్చినా, నీవు దానిని మాటలలో గాని చేతలలో గాని చూపించరాదు.

(6) నీవు ఏ పరిస్థితులలోను అబద్ధమాడరాదు.

(7) బాబాగాని నీవుగాని ఎవరి వద్దనుంచి జోహారు స్వీకరించ కూడదు. కావాలని నీవు ఎవరయినా నీకుగాని బాబాకి గాని జోహారు చేసే పరిస్థితి కల్పింప కూడదు.

ఆ పరిస్థితిని నీవు కల్పించకుండానే ఎవరయినా బాబాకి గాని నీకు గాని జోహారు చేస్తే ఆ వ్యక్తి నీకు ఏమి చేసాడో అలాగే నీవు అతనికి చేసి బాకీ తీర్చినట్లు చేయాలి.

(8) షరతులు మీ అందరిమీద బంధించేవిగా ఉన్నప్పటికీ బాబా ఏ ఆజ్ఞకి ఏ షరతుకీ లోబడియుండలేదు. ఆయన ఎప్పటికీ స్వేచ్ఛగానే ఉంటారు.

(9) బాబా స్వేచ్ఛగా ఉండక పోవడమే గాక బాబా కావాలని బంధనాలను సృష్టించుకుంటున్న ఒకే ఒక్క షరతు ఏదంటే నీవు ఏ మాత్రము ఏ విధమయిన లాభము పొందకుండా, నీవు ప్రతీరకపు ఆఘాతంగానికీ, కష్టానికీ సిద్ధంగా ఉండాలనే

విషయం ఇంకొకటి కూడా స్పష్టంగా నీవు తెలుసుకోవలసినది ఏమిటంటే, దేవుని యెదుట మీలో ఎవరికీ, ఎటువంటి ఫలితాలు ఎదురయినా సరే నీయొక్క వ్యక్తిగత బాధ్యతను రద్దుపరచే ఆజ్ఞ బాబా ఎప్పుడూ యివ్వరు. అందుచేత నీవు భగవంతుని యెదుట ప్రతీ కార్యానికి బాధ్యత ఎప్పటికీ మొత్తం నీ మీదనే, నీమీద మాత్రమే, ఉంటుందని యీ బాధ్యత లేకుండా చేసేవని, బాబా ఎప్పటికీ చెయ్యరని నీవు నిశ్చయంగా తీసుకోవాలి.

(10) నీవు కామప్రేరితమయినపని స్త్రీతోగాని, పురుషునితోగాని, చిన్న వారితోగాని, పెద్దవారితోగాని చేయకూడదు.

జనవరి 21 వ తేదీన పైన ఉదహరింపబడిన పథకాల పూర్తి పాఠాల ప్రతులు చదివించి, సహచరులు పదిహేను మందికి పంచిపెట్టారు 23 వ తేదీ మధ్యాహ్నం బాబా సహచరులను సమావేశపరచి దేరాడూన్ వద్ద మంజిమాఫీలో, మహంత్ యింటిలో, వారితో చర్చలు కొనసాగించారు విషయంపైన చెప్పిన మూడు పథకాలు. 1–A పథకం ఎవరూ ఒప్పుకోలేదు. దానికి కావలసిన ఏకగ్రీవాభిప్రాయం లేనందున యీ పథకం గురించి ఆలోచించడం మానేసారు

సహచరుల స్వతంత్రాభిప్రాయాలు వ్యక్తిగతంగాను సామూహికంగాను బాబా చేసిన సూచనలు మొదలయినవి ఆలోచించారు పథకం 1–B కూడా త్రోసి పుచ్చబోయేసరికి డా॥ డాన్‌కిన్ దాని క్రింద పనిచెయ్యడానికి సిద్ధమయ్యాడు. రు. 5,000/–, జంతువులు వగైరా, అతనికి యీ పథకం ఆచరణలో పెట్టడానికి యిచ్చారు కాకాకి జబ్బుగా ఉంది గుస్తాద్‌జీ బాలా వృద్ధుడయినందున స్వతంత్రంగా పనిచేయలేడు వారి యిష్టప్రకారం వీరిద్దరినీ డాన్‌తో చేరనిచ్చారు – ఈ I–B పథకం క్రింద వీరు దేరాడూన్‌లో డాన్‌కిన్‌తో ఉంటారు వారు మరొక పోషనయినా ఉండవచ్చును

అబ్దుల్‌గనీ, ఆదీ, అన్నా జక్కల్, బాబాదాస్ I–C పథకం ఎన్నుకున్నారు వారికి ప్రతియొక్కరికి రు 500–– లు యిచ్చి జనవరి 25 తేదీ నుండి ఆ పథకాన్ని ఆచరణలో పెట్టమన్నారు

వీరు నలుగురు యీ పథకం ప్రకారం ఆరోజున పాత జీవితపు స్థలాలకి వెళ్ళారు అక్కడికివెళ్ళి వారు నూతన జీవితంలో బాబా సహచరులుగా కొనసాగుతున్నారు ఆదీ తన మెహెర్ ప్రమురణాల వ్యాపారం యధాపూర్వకంగా చేసుకోవడానికి అనుమతి పొందాడు కానీ వీరు బాబాతో గాని ఆయనతో ఉన్న సహచరులతో గాని సంబంధం పెట్టుకొనరాదు వారికి బాబా అనుమతిస్తేగాని ఉత్తరాలు వ్రాయకూడదు ఈ నలుగురిలోను ఏ ఒకరైనా మిగిలిన ముగ్గురితోను సంబంధం పెట్టుకోవచ్చు ఉత్తరాలూ వ్రాయవచ్చు.

డాన్‌కిన్, కాకా, గుస్తాద్‌జీలు పైన చెప్పిన నలుగురితోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవచ్చు వారు నవ్యజీవితంలో ఉంటూ బాబా యొక్క నవ్యజీవితపు సహచరులుగా కొనసాగగలరు బాబాతోగాని వారితో ఉన్న సహచరులతో గాని సంబంధాలు పెట్టుకోవచ్చు ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాసుకోవచ్చును

నీలు, పెండు, వైమన్, ఎరచ్, మురళీ, విష్ణు, సదాశివ్ పటేల్, ఆలీ అక్బర్ లు బాబాతో ఉండడం కొనసాగిస్తూ ఉంటారు ఇదివరకులాగ నవ్య జీవితంలోని బాబా సహచరులుగా ఉంటారు

బాబా వారి సహచరులతో జనవరి 12 వ తేదీనాటికి డేరాడూన్‌కి వెళ్ళారు. ఈ పథకాల సర్క్యులర్‌లు బాబా డా॥ గనీచేత వ్రాయించారు నీలు, విష్ణు వాటికి నకళ్ళు వ్రాసారు. డా॥ గనీ, ఆదీ (సీ), బాబాదాస్, అన్నాజక్కల్ సెలవు తీసుకొని వెళ్ళేటప్పుడు బాబా ప్రతియొక్కరిని కౌగిలించుకున్నారు. ఆదీ బాబాను ఆలింగనం చేసుకున్నప్పుడు ఆదీ విష్ణుని ఆలింగనం చేసుకున్నపుడు అతనికి (ఆదీకి) కళ్ళ వెంబడి అశ్రువులు రాలాయి

మిగిలిన వారినందరినీ - అనగా III వ విభాగం క్రింద వచ్చేవారిని పిలిచి తమ హృదయాన్ని ఆత్మని పనిలోపెట్టి శాయశక్తులా సందేహాలు లేకుండా, అనుమానాలు లేకుం సంకోచం లేకుండా పనిచేయకోవాలన్నారు. మార్చి 1 వ తేదీనుంచి తీవ్రమయిన క్రమశిక్షణ పాటిస్తానని ఎవరయినా షరతులు ఉల్లంఘించనట్లయితే వారిని పంపించి వేస్తానని, ఎవరియందైనా అవిధేయత కనబరుస్తే వారిని వెంటనే పంపేస్తానని బాబా హెచ్చరించారు.

బాబా విష్ణుని యింటి వ్యవహారాలకి మానేజరుగా నియమించారు సహచరుల భోజనపు ఖర్చులకి అతనికి కొంత మొత్తం యిచ్చారు. అది ఫిబ్రవరి (1950) నెలాఖరు వరకు సరిపోతుంది. స్త్రీలకి పురుష సహచరులకి కావలసిన వస్తువులు బజారునుంచి అతడే తేవాలి ఇప్పుడు యిచ్చిన సొమ్ముగనుక అయిపోతే III వ పథకం క్రింద ఉన్నవారినందరిని భిక్షాటనకి పంపుతానన్నారు అప్పుడు వండిన అన్నం ఫికిలోతెచ్చుకుని తినాలి అన్నారు- కాకా, గుస్తాద్‌జీలు మాత్రం I–B పథకం క్రింద డాన్‌కిన్‌తో ఉంటారు. అతడే (డాన్‌కిన్) వారికి భోజనం పెట్టే బాధ్యత కలిగి ఉన్నాడు. వారికి (కాకా గుస్తాద్‌జీలకి) చివర వరకు వారికి కావలసినవన్ని అతడే సరఫరాచేయాలి

జంతువులను టాంగాలను ఎద్దుబళ్ళను అమ్మడానికి బాబా పెండుని సదాశివ్‌ని నియోగించారు వాళ్ళు డాన్‌కిన్ తరచుగ డేరాడూన్ పట్నంలోకి వెళ్ళి కొనే వాళ్ళను వెతుక్కోవాలి.

ఆలీ అక్బర్, మురళి, బైదుల్ యీ ముగ్గురికి బాబా వంటపని అప్పగించారు

ఆడవాళ్ళకి ఏమికావాలో చూడాలని ఎరచ్‌ని నియమించారు. కాకా ఆరోగ్యం సరిగా ఉండేలా చూడవలసినది డా॥ నీలు వంతు అతడు సవ్యజీవితపు డైరీ కూడా వ్రాయాలి ఆ మధ్యాహ్నం శ్రతుఘ్న యొక్క కుమారుని పరీక్ష చేయమని డా॥ డాన్‌కిన్‌ని, డా॥ నీలుని. డా॥ గోహర్‌ని నియోగించి బాబా వారిని జాగ్రత్తగా చూడమని చెప్పారు డా॥ డాన్‌కిన్‌తో ఆ పిల్లవానికి చేయవలసిన చికిత్స అంతా వివరంగా వ్రాయమన్నారు నీలు గోహర్‌ల సహాయంతో ఆ రిపోర్టు తయారు చేసి అది బాబాకి యిచ్చాడు డాన్‌కిన్.

ఆ సాయంకాలం నీలు, విష్ణు, మురళి, సదాశివ్, పెండు, అలీ అక్బర్, బైదుల్ లను పిలిచి బాబా వారిని వంతులవారీగా రాత్రుళ్ళు ఒక్కొక్కగంట స్త్రీల యింటిదగ్గర కాపాలా కాయాలని నియమించారు

సాయంకాలం పొద్దుపోయాక డేరాడూన్‌లో నివసిస్తున్న నారావాలా, ఎరచ్ మిస్త్రీ, బహ్రామ్ వాడా అనేవాళ్ళు బాబాని చూడడానికి వచ్చారు వాడా వారితో డా॥ డాన్

కిన్ ఉండటానికి ఒక బంగళా ఏర్పాటు గురించి చర్చించారు. (అతడు I-B పథకం అమలు పరచాలి) నారావాలా, ఎరచ్, మిస్త్రీ, బర్జోర్ చాచా, శత్రుఘ్న కుమార్ ఉండగా మహంత్‌జీతో బాబా ఎక్కువ పదార్థాలను భిక్షగా తీసుకోవడం మానివేసానని, తోటిసింగ్, హరజీవన్ లాల్, కిషన్‌సింగ్‌ల వద్దనుంచి యిదివరకు గత 3½ మాసాలలోను పుచ్చుకుంటున్నట్లు యిప్పుడు తీసుకోనని బాబా చెప్పారు బాబాను చూడటానికి వారు ఎప్పుడయినా రావచ్చునని కాని వారితో క్రొత్తవారిని ఎవరినీ బాబా దర్శనం కోసం తీసుకు రావద్దని బాబా అన్నారు. ఈ నవ్య జీవితంలో బాబా దర్శనం యివ్వడం మానేసారు. డా॥ నాథ్ కాశీలో ఉన్నవాడు గాక యింకొకడు, ఆ పేరు గలవాడు, డేరాడూన్‌లో ఉన్నాడు గత సాయంకాలం మినూ ఖరాస్ దూరపు బంధువయిన హోమీ ఖరాస్ అనేవాడు బాబా అనుమతి లేకుండా డేరాడూన్‌నుంచి డా॥నాథ్‌ని కూడా తీసుకువచ్చాడు నాథ్, హోమీని బాబా దర్శనం చేసుకుంటాను తీసుకువెళ్ళమనగా అతనికి తెలియక తనకూడా తీసుకువచ్చాడు హోమిని నూతన జీవితపు గీతాన్ని జాగ్రత్తగా చదవమన్నారు బాబా తనకు కలలో బాబా దర్శనం కలుగుతోందని ప్రసాదంకూడా తీసుకుంటున్నానని, అందుచేత ఆ గీతం యింక చదవక్కర్లేదని హోమీ అన్నాడు వెంటనే బాబా అలాటికలలతో తనకేమీ నిమిత్తంలేదని దానికి తాను ఎంతమాత్రం బాధ్యుడు కాదనీ చెప్పారు.

నారావాలా చక్రాతా అనే కొండలలోని ఊరినుంచి కారులో డేరాడూన్ వస్తూంటే స్టీరింగురాడ్ అకస్మాత్‌గా విరిగిందని ఆ కొండమీద అప్పుడు కారు ఒక అపాయకరమయిన మలుపులోంచి ఎదురుగా ఒక అఘాతం దగ్గరగా వెళ్ళిందని, వెంటనే బ్రేక్ వేసినందున ఆగిందని యింకొక్క అంగుళం ముందుకువెళ్తే అందులో ఉన్న జనం కొన్నివందల అడుగులు లోతున్న లోయలో పడిపోయి నామరూపాలు లేకుండా చనిపోయి ఉందురని నారావాలా చెప్పాడు ఇప్పుడు యీ ప్రమాదంనుంచి రక్షణకు తమకు సంబంధం లేదని బాబా చెప్పారు.

తరువాత జనవరి (1950) 23 వ తేదీన దీని తరువాయి కొన్ని విషయాలు చెప్పి వ్రాయించారు బాబా ఇది ఏర్పాటుదార్లకోసం. ఇవి ప్రేమికులందరకు పంపించాలని పాద్రీని పిలిచి బాబ అతనిచేత ఆదీకి పంపించారు. బాబా అప్పుడు మొరాదాబాద్‌కి వెళ్ళారు సారనాథ్ నుంచి డిసెంబరు ఆఖరివారంలో బాబా ఆజ్ఞప్రకారం పాద్రీ మొరాదాబాద్ వెళ్ళాడు వారితో ముఖ్యావసరమయిన వస్తువులను మాత్రం

తీసుకువెళ్ళారు ఆడవారు కూర్చుని వెళ్ళేందుకు సవారీలాంటి చిన్నబండి ఒకటి డిసెంబరు నెలలో బెల్గామ్‌లో ఏర్పాటు చేయించారు బాబా ఉత్తరదిశగా ప్రయాణం చేయడానికి కాశీనుంచి కొన్ని చతుష్పాత్తులను కూడా తమతో తీసుకువెళ్ళారు. అందులో గుఱ్ఱాలు ఎద్దులు ఒక జత, గాడిదలు, ఆవులు (దూడలతో సహా) ఒక ఒంటె ఉన్నాయి ఆ ఒంటె మెడలో మంచి పెర్షియా దేశపు గంట కూడా ఉంది. వైదుల్‌ని యీ ఒంటెకు సంరక్షకుడుగా నియమించారు బాబా. వైదుల్ పెర్షియా దేశస్థుడు గనుక ఒంటె సంగతి అతనికి మిగిలినవారికంటె బాగా తెలుసును ఈ ఒంటెకు హఠాత్తుగా కలిగే కోపతాపాలు అతనికే అవగాహన అవుతాయి

బాబా అన్నారు - ఈ నూతన జీవితం మొత్తం ప్రయాణాలలో అనుభవించిన వాటి లాంటి కష్టాలు యిబ్బందులు మాత్రమే కాదు అంతకంటె చాలా కష్టమయినది మీ ఉద్వేగాలను భావాలను అణుచుకొని ఏపని చెప్పినా వెంటనే తక్షణమే చేయడానికి సిద్ధంగా ఉండాలి ఈ జీవితంలో మీకు ఉద్వేగాలు రావచ్చు ఉద్రేకాలు కలుగవచ్చు. అవి మీకెవ్వరికీ ఉండవని నేను అనుకోవడం లేదు కానీ ఒక్కటి మాత్రం మీనుండి నేను ఆశించేది ఏమంటే వాటిగురించి మీకు కలిగే భావాలు పరోక్షంగానో అపరోక్షంగానో వ్యక్తం చేయకుండా ఉండడమే, వాటిని అరికట్టడమే.

జనవరి 25 వ తేదీ రాత్రి వర్షం కురిసింది మరల యీ ఉదయం ఆకాశం అంతా నల్లని మబ్బులతో నిండి ఉంది వాతావరణం చాలా చలిగా ఉంది ఉదయాన్నే విష్ణు, పెండు, సదాశివ్, వైదుల్ యీ నలుగురు టాంగాలో దేరాడూన్ వెళ్ళారు, టాంగా బండి ఎవరయినా కొంటారేమో కొనుక్కుందుకు వారికి జయం కలుగలేదు ఆ రోజంతా వర్షం పడుతూనే ఉంది సాయంకాలం వారు వచ్చేసరికి ఆలస్యమయింది.

దత్తువద్దనుంచి వచ్చిన టెలిగ్రాం బాబా ఎరచ్‌ని చదవమన్నారు అందులో ఎలిజబెత్ నోరినానుంచి గత 3 మాసాల్లోను కేబిల్ ఏదీ రాలేదని దత్తు తెలియ పరిచాడు

ఉదయం 10 గంటలకి బాబా సహచరులను హాలులో సమావేశపరచి మార్చి 1 వ తేదీనుంచి తాను చాలా కఠినంగా ఉంటానని అప్పుడు దేరాడూన్‌లో ఉన్న వైదుల్‌తో అతడు వచ్చాక యీ సంగతి చెప్పమన్నారు అందుచేత ఎవరూ

బాబా ఆజ్ఞపాలించడంలో అపేక్షేయత చూపకూడదన్నారు బాబా తమ పనికోసం బయటకువెళ్తే కూడా ఎవరిని తీసుకువెళ్తారో యింకా నిశ్చయించుకోలేదని చెప్పారు

ఆ మధ్యాహ్నం 12 గంటలకు డాన్‌తో బాబా ప్రత్యేకంగా మాట్లాడారు. ఆకాశం నిర్మలంగా అయేసరికి మధ్యాహ్నం చాలా ప్రొద్దుపోయింది బాబా ఉన్న బంగళానుంచి దూరాన ఉన్న ముస్సూరిలోని కొండలు మంచుతో కప్పబడి తెల్లగా కనబడుతున్నాయి నీలాకాశం వెనుక ఉండగా అందమయిన యీ దృశ్యం తిలకించ డానికి బాబా ఎరచ్‌ని, డాన్‌ని, నీలూని, విష్ణుని వెంటబెట్టుకుని డాబా మీదకి వెళ్ళి కొంతసేపు ఆనందంగా గడిపారు.

ఆ రోజు భోజనం అయాక రాత్రి ఒక అరగంట సహచరులతో గడిపారు. అన్నా బక్కల్ డేరాడూన్ నుంచి సెలవు తీసుకుని వెళ్ళేటప్పుడు గుస్తాద్‌జీ యొక్క మూటని పొరపాటున తనతో తీసుకుపోయాడు. అందులో అతని ఉన్నిబట్టలు, అద్దం, దువ్వెన క్షౌరం చేసుకునేసామాను, యింకా యితర సామానులు ఉన్నాయి. గుస్తాద్‌జీ చాలాకాలంనుంచి బాబా ఆజ్ఞప్రకారం మౌనం వహించి ఉంటున్నాడు కదా అతనికి కలిగిన చిరాకు కోపం ముఖకవళిక ఎల్లవేళ సంజ్ఞలవల్ల తెలిపాడు ఇది చూస్తే బాబాకి చాలా వేడుక కలిగింది మిగిలిన సహచరులు అతని మూట పోయినందుకు సానుభూతి వ్యక్తపరిచారు గుస్తాద్‌జీ కోపం ప్రదర్శించడం అందరికీ నవ్వు కలుగ జేసింది.

గుస్తాద్‌జీ యిప్పుడు I-B పథకం క్రింద ఉన్నాడు అతని పాత అల వాటు ప్రకారం, పాత అగ్గిపెట్టెలు (ఖాళీవి) గీసేసిన అగ్గిపుల్లలు, పనికిరాని కాగితం ముక్కలు, ఖాళీ సిగరెట్టు పెట్టెలు, అలాటివి అన్నీ పోగుచేయడం మొదలుపెట్టాడు. వ్యక్తిగతమయిన వారి స్వేచ్ఛతో బాబా ఏమీ కలుగజేసుకోరు.

జనవరి 27 వ తేదీ ఉదయం నిర్మలాకాశం ఎంతో ఆనందాన్ని కలుగ జేసింది ఆ రోజు ఎండ బాగా వచ్చింది ఆ ప్రాతఃకాలం అందరి హృదయాలకి ఉల్లాసం గొల్పింది ఉదయం అల్పాహారాలు అయాక బాబా సహచరులను హాలులోకి పిలిచి బొంబాయినుంచి నజాను పిలిపిస్తానన్నారు ఇక్కడ స్త్రీలకు ఆమె సహాయం చేస్తూ ఉంటుందని అలా అనుకున్నారు. మనీకి మెహ్రాకి సుస్తీగా ఉంది. అందు వేత నజా ఉంటే వారికి సాయం చేస్తుంది ఇక్కడ సరియయిన చోటు సదుపాయాలు

రేపని రానోని కిట్టీని బాబా పిలిపించడం లేదు. నజా మళ్ళీ బాబా ఎప్పుడు వెళ్ళి పొమ్మంటే అప్పుడు వెళ్ళేమాటయితే ఆమెను తీసుకురావడానికి డాన్‌కిన్‌ని పంపుతానన్నారు బాబా. నజా వస్తే యిక్కడివారికి స్త్రీలకి బాబాకి అక్కడ పాత జీవితపువారిని గురించి వారి వ్యవహారాలగురించి ఏమీ చెప్పకూడదు ఆమె మళ్ళీ బొంబాయి వెళ్ళినపుడు యథాప్రకారంగా నారిమన్ ఆమెను అక్కడ ఉండనివ్వాలి అవసరమయినపుడు మణి టైపుచేసి. బట్టలుకుట్టి, స్త్రీలను పోషించగలిగి ఉండాలి బాబా డాన్‌కిన్‌ను మణియొక్క టైపు మిషన్, కుట్టేదారాలు వగైరా డాన్‌కిన్ వచ్చేటప్పుడు తెచ్చిపెట్టాలి. డాన్‌కిన్‌కి బాబా నాలుగు ఉత్తరాలిచ్చి ఒకటి నరోష్‌కి రెండవది మెహెరు వావక్ దమానియాకి, ఒకటి నారిమన్‌కి నాలుగోది మెహెర్‌జీకి యిమ్మని వ్రాయించారు బాబా యింకా యీ ఉత్తరాలు వ్రాయించారు

డేరాడూన్, మంజ్రిమాఫి 27-1-1950

“నరోష్, మెహెర్‌జీ. నారిమన్‌గార్లకి (ఏర్పాటుదార్లకి) మెహెరా దమానియా మెహెరాబాద్‌లో మెహెరా గదిలోంచి, పింపలగామ్‌లో బాబా గదిలో నుంచి, కొన్ని వస్తువులు తీసుకుని ఆమె డా॥ డాన్‌కిన్‌కి యిక్కడికి తేవడానికి యిస్తుంది

.... బాబా

.... .. ... .... .. .... .... ...... ... .... .... . . ...

మంజ్రిమాఫి, డేరాడూన్

నరోష్‌కి, 27-1-50

డాన్‌కిన్‌ను మెహెరాబాద్ కొండమీదకి వెళ్ళి మన్సారికి విషయాలన్నీ చెప్పడానికి అనుమతించవలెను.

— బాబా.

డేరాడూన్ నుంచి ఆ రోజున డాన్‌కిన్ ఒక టాంగాలో పెండు, విష్ణు వైద్యల్‌లతో వెళ్ళాడు. అతడు వెళ్ళేముందు మరల బాబా అతనితో మాట్లాడారు ఆ సాయంకాలం ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌తో డాన్‌కిన్ బొంబాయి ప్రయాణమై వెళ్ళాడు.

ఆ మధ్యాహ్నం 12 గంటలకు బాబా నీలూని గోహార్‌ని యరుపురిని శత్రుఘ్న భార్యను పరీక్ష చేయమని నియమించి ఆమెకు చేయవలసిన చికిత్స వివరంగా వ్రాయమన్నారు.

మంజ్రిమాఫిలో సహచరులు ఉండడానికి నివాసగృహాలు కట్టడం పని ఎంతవరకు వచ్చిందో ఎరచ్‌ని వెళ్ళి శత్రుఘ్న కుమార్‌ను అడిగి రమ్మన్నారు. అక్కడ పాత భవనాలు పెద్దవి చేయడం, క్రొత్తగా ఒక బావి తవ్వడం వగయిరా పనులు చేయిస్తున్నాడు శత్రుఘ్నతో యీ పనులు త్వరగా చేయించమని ఎరచ్‌ని చెప్పమన్నారు బాబా ఎలాగయినా ప్రస్తుతం ఉన్నచోట నుంచి మార్చి 1 వ తేదీన స్త్రీలతోను మిగిలిన సహచరులతోను మంజ్రిమాఫికి మారడానికి ఫిబ్రవరి నెలాఖరుకి పని అన్నివిధాలా పూర్తి అయేలా చూడమని శత్రుఘ్నతో చెప్పమన్నారు బాబా.

బాబా సదాశివ్ పటేల్ ను ఫిబ్రవరి 14 వ తేదీన హరిద్వార్ వెళ్ళి ఒక డబ్బా నిండా నీరు తీసుకొని 15 వ తేదీన తిరిగిరమ్మన్నారు సాయంకాలం సహచరులతో కూర్చుని బాబా వారితో ఆయన వైఖరి మార్చి 1 టవ తేదీనుంచి కఠినంగా మారుతుందని ఆయన ఆజ్ఞలు పరిపాలించడంలో ఏమాత్రం సంకోచమూ సహించేది లేదన్నారు విధేయత కనపరచని వారిని వెంటనే వెళ్ళిపొమ్మంటానని బాబా హెచ్చరించారు. ఆ రాత్రి చాలా చలిగా ఉంది. ఈదురుగాలి వేస్తోంది ఆకాశం మేఘావృతమై ఉంది. బాబా హెచ్చరికలు విని సహచరులు మనసులో అలజడితో ఆ రాత్రి పరున్నారు.

మరునాడు (28 జనవరి 1950) ఉదయం సూర్యరశ్మి బాగా ఉంది. ఆహ్లాదకరంగా ఉంది. చలిగాఉన్నా అందరికీ ఉల్లాసంగా ఉంది

ఉదయం 6-30 గంటలకు బాబా సహచరులందరిని హాలులోకి రమ్మని పిలిచారు. డాన్‌కిన్ బంగళా గురించి చర్చించారు డాన్‌కిన్ వైద్యవృత్తి ప్రారంభించడానికి డేరాడూన్‌లో యింకా యిల్లు కుదరలేదుగనుక బొంబాయిలో మందులుకొనడం కొన్నాళ్ళు వాయిదా వెయ్యమని డాన్‌కిన్‌కి బొంబాయికి ఒక టెలిగ్రాం పంపడం గురించి సహచరుల అభిప్రాయాలు అడిగారు ఏష్టుని పెండుని తిన్నగా వెంటనే జవాబులు యివ్వనందుకు బాబా చివాట్లేశారు వారి పాత అలవాటు యింకా పోగొట్టుకున్నారు కాదని మార్చి 1 టవ తేదీ తరువాత యిలాటి జాప్యం సహించనన్నారు

బాబా ఇలాంటిదానికే నీలునికూడా కూకలేసారు. I-B పథకం క్రింద షరతులను గురించి చర్చించారు. తరువాత నారావాలా, ఎరచ్ మిస్త్రీ, బహ్రోర్ బాబాలకు వారి శాయశక్తులా ప్రయత్నించి డేరాడూన్‌లో తగిన బంగళా ఒకటి త్వరలోనే డాన్‌కిన్‌కి కుదిర్చి పెట్టాలని కబురు చేసారు. ప్రస్తుతం డాన్‌కిన్‌కి టెలిగ్రాం యివ్వడం మాను కున్నారు.

మధ్యాహ్నం ఎండంతాపోయి మేఘాలతో ఆకాశం అంతా ఆవృతమై ఉంది సాయంత్రంవరకు అలాగే ఉంది చలి ఎక్కువయింది. మధ్యాహ్నం టీ అయాక సహచరులతో ఒక గంట కూర్చుని బాబా వారికి మార్చి తరువాత తీవ్రంగా వ్యవహరిస్తానన్న సంగతి జ్ఞాపకం చేసారు. ఎవరివలనా కించిన్మాత్రం అవిధేయతను సహించనని బాబా చెప్పారు.

మహంత్ కోసం ప్రతిరోజున మధ్యాహ్నం, రాత్రి భోజనం వేరే ఉంచ మని బాబా విష్ణుతో చెప్పారు. అతడు బాబా చేతినుంచి యిస్తే తిందామని అనుకుంటు న్నాడు శత్రుఘ్నకుమార్ అతని భార్య బాబా యెడల అతి భక్తిగా ఉంటున్నారు. బాబా ఏది చెప్పినా తు-చ తప్పకుండా చేస్తున్నారు. శత్రుఘ్నకు బాబా యెడల ఎంత ప్రేమ ఉందంటే అతడు నవ్యజీవితంలో చేర్చుకోమనికూడా అడిగాడు. అది చూసి బాబా చాలా సంతోషించి యిప్పటికంటె యికముందు శత్రుఘ్న బాబాకి ఎక్కువ ఉప యోగపడతాడని అన్నారు. శత్రుఘ్న, మహంత్ సహచరులతో కూడా బాబా రాత్రి భోజనం చేసారు.

ఆ సాయంకాలం (28-1-50) బాబా మంత్రిమాఫి వెళ్ళి అక్టోబరు 16 నుంచి అక్కడ ఉంటూ ఉన్న కైకోబాద్‌ని చూసి వచ్చారు. రోజూ యథాప్రకారంగా అతన్ని తన పనిచేసుకుంటూ ఉండమని బాబా చెప్పారు. మార్చి 1 టవ తేదీనుంచి బాదా కైకోబాద్‌కి కొన్ని ఏర్పాట్లు చేస్తానన్నాను. అప్పుడు బాబా స్త్రీలతో దేరాడూన్ నుంచి యితర సహచరులతో సహా మంత్రిమాఫీకి మారతారు.

మరునాడు (29-1-50) పెందరాళే లేచారు సహచరులు వాతావరణం నిన్నటిలాగే మేఘావృతమై చలిగా ఉంది సాయంకాలం వర్షంకూడా పడింది. ఆ రాత్రంతా కురుస్తూనే ఉంది కనుచూపుమేరపరకూ వాతావరణం పొగమంచుతో నిండి

పోయింది ఏదీ బాగా కనిపించడం లేదు దూరాన ఉన్న ముస్సోరీ కొండలు తెర వేసిన ఉన్నట్టున్నాయి.

జంతువులు బాగా అమ్మడంకోసం పళ్ళీ పెండు, బైదుల్ ఊళ్ళోకి వెళ్ళి ప్రయత్నం చేసారు విష్ణు కూడా బజారుపనికోసం వెళ్ళాడు వారంతా మధ్యాహ్నం ఆలస్యంగా వచ్చారు పెండు, బైదుల్‌లకు కొనే వారెవరూ తగలలేదు. సాధ్యమయినంత తొందరలో అవి అమ్మెయ్యాలని బాబా వారితో చెప్పారు. డబ్బు తక్కువవడం వల్ల వాటికి మేత కొనిపెట్టడం కష్టంగా ఉంటోంది. వాటి మేతకోసం కేటాయించిన డబ్బు త్వరగా అయిపోతోంది వాటికి క్రూరత్వం చూపకుండాను, వాటికి తిండిలేకుండా చేయకుండాను ఎవరయినా మంచివాళ్ళని చూసి ఆ జంతువులను అమ్మేసెయ్యమన్నారు బాబా. పెండు, బైదుల్ యిద్దరూకూడా ఆ ప్రయత్నంమీదే ఉన్నారు గాని యింత వరకు వారి ప్రయత్నాలు సఫలం కాలేదు

**I-B** పథకం ప్రకారం బాబా డాన్కిన్‌కి రు 5000/- నగదు నాలుగు ఎద్దులు, రెండు గుర్రాలు, ఒక ఎద్దుబండి, గుర్రబ్బండ్లు ఇవ్వవలసి ఉంది డాన్కిన్ యీ జంతువులను, బళ్ళను అమ్మి పెట్టడంలో బాబాయొక్క సహాయం కోరాడు పెండు, బైదుల్, సదాశివ్‌లను ఆ పని చేసిపెట్టమని బాబా కోరారు కాశీలో ఖరే భిక్షలో కానుకగా యిచ్చిన తెల్లగుర్రాన్ని అమ్మదామనుకోలేదు బాబా కాలి నడకను బయలుదేరి వస్తూంటే మిగతా జంతువులతో పాటు తెల్లగుర్రం కూడా అనేక యిబ్బందులకు గురి అయింది దానిని జాగ్రత్తగా చూడడానికి వీలులేకపోయింది. దాని రొమ్ముమీద పుండు అయి చాలా బాధపడుతోంది. ఆ పుండుతో దానికి బండి కట్టడం క్రూరత్వం అవుతుందని డాన్కిన్ అనేవాడు మంజ్రీమాఫిలోని పరిస్థితుల వల్ల ఆ తెల్లగుర్రాన్ని ఉంచుకుందుకు దాని పోషణకు, వీలయిందికాదు అది ఎవరికయినా ఊరికే యిచ్చేసి 'జాగ్రత్తగా చూసుకోండి' అని చెప్పడానికి బాబా వారికి రుణపడి ఉండాలని వద్దన్నారు అందుచేత దానిని మిగతా జంతువులతోపాటు డాన్కిన్‌కి యిచ్చి అమ్మించుదామనుకున్నారు లేకపోతే డాన్కిన్‌కి యిష్టం వచ్చినట్టు చేసుకోవడానికి **I-B** పథకం క్రింద అతనికి స్వేచ్ఛ ఉంది

ఆ రాత్రి ఈదురుగాలి, చలి, వర్షం వీటన్నిటితో గడిచింది మరునాడు (30-1-50) ఉదయానికి అన్నీపోయి ఎండవచ్చి చాలా బాగా ఉంది నిర్మలాకాశం

సూర్యరశ్మి హృదయానికి ఆహ్లాదము శరీరానికి వెచ్చదనం కలుగజేస్తున్నాయి కాకా యీ మధ్య గుండె జబ్బుతో బాధపడుతున్నా ఆరోజు బాబావద్దకి వచ్చాడు పొద్దున్నే వెచ్చని ఎండలో కూర్చున్నాడు డా॥ నీలు అతనికి మందు యిచ్చి చికిత్స చేస్తున్నాడు. నీలూకి బాబా అప్పుడప్పుడు సలహా యిస్తున్నారు మధ్యాహ్నం మళ్ళీ ఒంటిగంటకే పిలిచినట్లుగా వచ్చాయి మేఘాలు. సూర్యుడు అదృశ్యమయాడు. చలిగాలులు వీస్తున్నాయి. కొంచెంసేపయాక ఉరుములు వచ్చాయి వెంటనే వర్షం కూడా పడింది కొంచెం పెద్దగానే

ఈ వారంలోనే భారతదేశం గణతంత్ర స్వతంత్ర రాజ్యంగా వెలిసింది. దేశమంతటా 26 వ తేదీనుంచి 30 వ తేదీవరకు ఉత్సవాలు జరిగాయి బాబాకి ఆ రోజున ఆరోగ్యం బాగా లేదు ఆహారం మింగినపుడు నీళ్ళు త్రాగినప్పుడు గుటక వేస్తేనూ గొంతుక నొప్పిపెడుతోంది ఒడలంతా నొప్పులుగా ఉంటోంది బాబాకి. మధ్యాహ్నం 3 గంటలకి వర్షం ఆగింది ఖాన్ అహమదనగర్ నుంచి గుస్తాద్‌జీ యొక్క మూట అన్నా ఇక్బాల్ పొరపాటున పట్టుకు వెళ్ళినది సురక్షితంగా ఉందని టెలిగ్రాం యిచ్చాడు గుస్తాద్‌జీకి చాలా సంతోషం కలిగింది చాలామంది జంతువులను కొంటామని వస్తున్నారు గాని యింతవరకు ఒకటీ అమ్ముడు కాలేదు. ఒక వారంలో జంతువులు బళ్ళు అన్నీ అమ్మకపోతే అవన్నీ ఎవరికయినా ఉచితంగా యిచ్చేస్తానని పెండుకి బైదుల్‌కి బాబా చెప్పారు. బాబాకి జనం వాటికోసం రోజూ వచ్చి వెళ్ళడం యిష్టం లేదు.

మధ్యాహ్నం నాలుగు గంటలవుతుంది సహచరులు వారిలో వారు హాస్యోక్తులాడుకుంటున్నారు బాబా కూడా వారితో చేరారు అందరిముందు సదాశివపటేల్‌ని అడిగారు బాబా. అతడి రు 40,000/- నిజంగా మళ్ళీ అతనికి కావాలా? అని 16 అక్టోబరు 49 కి ముందు అతను బాబాకు యిచ్చాడు కావాలంటే బాబా అతనికి యిచ్చేస్తారు గనీకి అలాగే సంవత్సరం తిరగకుండా అతనికి యివ్వవలసిన రు 35,000 బాబా మళ్ళీ యిస్తే గనీ వెంటనే అది తీసుకున్నాడు ఇప్పుడు అలా అడగగానే సదాశివపటేల్ ఆశ్చర్యపోయి "నా డబ్బు మళ్ళీ అడుగుదామని అనుకోలేదు" అన్నాడు అది తనకి అవసరం లేదన్నాడు తను మళ్ళీ అది తీసుకోనన్నాడు దానితో బాబా చాలా సంతోషించారు ఆరాత్రి చాలా పెద్దవర్షం కురిసింది.

మామూలుగానే 31 వ తేదీ ఉదయానికి ఎండ బాగా వచ్చింది అలా హారం తీసుకున్నాక బాబా బైదుల్‌ని తీవ్రంగా మందలించారు, పిలవగానే రాలేదని. తరువాత మధ్యాహ్నం నీలు ఏదో తెలివితక్కువగా, మాట్లాడినందుకు బాబా చీవాట్లే సారు. దాదాసు గురించి "ఆయన ఏం అంటున్నారో ఆయన నాకే తెలియదు" అని నీలు అన్నాడు అమాయకంగా అన్నా యీ తెలివితక్కువ వాగుడు బాబా విన్నారు. అలా అనకూడదని బాబా కోప్పడ్డారు. ఇంకొకమారు అలా అంటే నీలుని పంపించేస్తా నన్నారు బాబా. ఇది అందరికీ చెందుతుందని సహచరులందరికీ చెప్పారు బాబా. ఆ రోజున వారావాలా బాబాకి వచ్చిన ఉత్తరాలు తీసుకువచ్చాడు. పాత జీవితపు శిష్యుడయిన కిషన్‌సింగ్ కేకిదేశాయికి ఉత్తరం వ్రాస్తూ బాబాకి పంపిన భిక్షలో పొరపాట్లు చేసినందుకు క్షమించాలని బాబాను కోరినట్లు వ్రాసాడు. ఈ ఉత్తరం కేకిదేశాయి నారావాలాకి పంపించాడు. అతడు దానిని తీసుకు వచ్చాడు. కిషన్‌సింగ్ వ్రాసిన ఉత్తరంలో బాబా గురించి ఆధ్యాత్మికంగా అనేక బిరుదులు బాబాకి తగిలించాడు. అవన్నీవారు అంగీకరించడంలేదు కాని లేఖలోని అసలుసంగతికి బాబా అంగీరించినట్లు చెప్పారు.

యథాప్రకారంగా సాయంత్రమవుతూంటే నల్లటి మేఘాలువచ్చి ఆకాశాన్ని ఆవరించాయి చలిగాలి వేయసాగింది వర్షం పడుతుందేమో అన్నట్లుంది. బాబా చాలా చిరాకుగా ఉన్నారు. అందరినీ కోప్పడుతున్నారు. ఎరచ్, నీలు, విష్ణు, బైదుల్ వీరిని కేకలేసారు. నీలుతోటి రేపు చెపులు గిల్లడం సంగతి బాబాకి జ్ఞాపకం చెయ్యమని చెప్పారు శత్రుఘ్నకుమార్ భార్య సుభద్రకి డా॥ నీలు, డా॥ గోహార్ యిచ్చిన చీటీ ప్రకారం మందులు కొన్నారు బాబా స్వయంగా ఆమెకు ఆ మందులు యిచ్చారు. అవి సరిగా సమయం ప్రకారం తీసుకోవాలని చెప్పారు. మందులయిపోగానే చెప్తే బాబా మళ్ళీ తెప్పించి యిస్తానన్నారు.

ఫిబ్రవరి (1950) 1 టవ తేదీన ప్రాతఃకాలం చీకటిగాను నల్లటి మేఘాల తోను ఉండి మనసు నిరుత్సాహపరుస్తున్నాయి. ముస్సూరి కొండలు మేఘాలతో కప్పబడి కనపిస్తున్నాయి. అల్పాహారాలు తీసుకుంటూ బాబా సహచరులతో హాస్యోక్తులు మాట్లాడరు. III పథకం క్రింద నీలు మొదటినుంచి బాబాను అంటి పెట్టుకుని ఉన్నందున అతన్ని ఎంతో మెచ్చుకున్నారు బాబా ఇతరులు కొంత మనసు మార్చుకున్నారు గాని నీలు మార్చుకోకుండా ఉన్నాడు అసలు యీ మూడు పథకాల గురించి బాబా చెప్పకముందే నీలు ఆయన్ని అంటిపెట్టుకుని ఉండాలని

నిశ్చయించుకున్నాడు. ఈ పథకాలు ఎన్నుకోవడంలో తరుచుగా మార్పు చేసుకు న్నందుకు పెండును బాబా విమర్శించారు మురళికూడా ఆఖరికి III పథకం ఎన్నుకుని ఉన్నందుకు బాబా మెప్పుకి పాత్రుడయాడు. రెండూ రెండుమార్లు మార్చుకుని I-B పథకంలో విష్ణు చేరాడు. తరువాత అది ఆచరించలేక III పథకంలో చేరాడు. విష్ణు, మురళీ సదాశివ్ అలాగే III పథకంలో చేరారు డాన్‌కిన్, కాకా, గుస్తాద్‌జీ మాత్రం I-B లో ఉన్నారు ఇదంతా జనవరి 24 వ తేదీనే జరిగింది కాని యీ రోజున బాబా యీ సంగతులు చెప్పారు.

ఉదయం 9 గంటలకి శత్రుఘ్న బాబాను చూడడానికి వచ్చాడు. బాబా అతని కుమారునికి ఏవో మందులు యిచ్చారు. ఈ మందులు నీలు, డాన్‌కిన్‌లు యిచ్చిన చీటీప్రకారం కొనబడ్డాయి పిల్లవానికి మందులు జాగ్రత్తగా యివ్వమని బాబా శత్రుఘ్నకు చెప్పారు. ఫిబ్రవరి నెలాఖరులోగా మంజ్రిమాఫిలో కట్టడం పూర్తి కావాలని బాబా మళ్ళీ చెప్పారు శత్రుఘ్నకి. ఆ సాయంకాలం బాబా నీలు, ఎరచ్, మహంత్‌లతో మంజ్రిమాఫీ వెళ్ళి అక్కడ కట్టడం పని ఎంతవరకు వచ్చిందో చూసారు బాబా చెప్పిన ప్రకారం నీలు బాబాకు చెవులు గిల్లడం గురించి జ్ఞాపకం చెసాడు (నిన్న సహచరులను కోపపడినందుకు) బాబా అప్పుడు ఆ సహచరులను రమ్మని నాలుగేసిమారులు ఆయన చెవులు (మెలిపెట్టి) గిల్లమన్నారు. వారు వచ్చి బాబా చెప్పినట్లు చేసారు. శత్రుఘ్న బాబాను సహచరులను తనతో కాఫీ పుచ్చుకుందుకు ఆహ్వానించాడు బాబా యీ ఆహ్వానాన్ని అంగీకరించి ఫిబ్రవరి 6 వ తేదీన వస్తానని చెప్పారు అయిదుగురు సహచరులను తీసుకువస్తానన్నారు.

హరిద్వార్‌కి 3-4 మైళ్ళ దూరంలో ఏదయినా బంగళా దొరుకుతుందా అని మహంతుని బాబా అడిగారు బాబా అక్కడ మార్చి ఏప్రిల్ మాసాలలో కుంభ మేళాలో పని చేయడానికి ఉండాలన్నారు హరిద్వార్ నుంచి నాలుగు మైళ్ళదూరం లోని మోతిచార్ అనే గ్రామంలో దొరకవచ్చును అని మహంతు చెప్పాడు తెల్లవార గట్ల 4 గంటలనుంచి ఉదయం 6 గంటల వరకూ ఆ ఉదయం చలిగాఉంది. ఆకాశం నల్లని మేఘాలతో కప్పబడి ఉంది. అందుచేత చీకటిగా ఉంది. ఆ యింటిలోపల బయట తడిగా ఉంటోంది ఉదయం 8 గంటలకి సూర్యుడు బయటకి వచ్చి బాగా ప్రకాశిస్తున్నాడు ఇవి అందరికి సంతోషాన్ని కలిగించింది

మామూలు ప్రకారం పెంపు డైమిల్ బస్సు, జంతువులను అమ్మడానికి, విష్టు బజారుపనికి, ఊళ్ళోకి వెళ్ళారు రోజా పెత్తాప్పుండడం ఎవరూ కొనకపోవడం, అనేకమంది యింటికి వచ్చి చూడడం. వెళ్ళడం యివి చూసి బాబా యివన్నీ వదిలించు కునేందుకు ఒక పద్ధతి కనిపెట్టి యిలా చెప్పారు డాస్కిన్‌కి వాటి అమ్మకం క్రింద బాబా రు 2,500 యిస్తానన్నారు అది వృష్టిలో పెట్టుకుని యీ ఆలోచన చేసారు –

రెండు గుఱ్ఱాలు బస్సు పెండు, బైదుల్-బయట ఎక్కడయినా రు 1200 కి తక్కువ కాకుండా అమ్మెయ్యాలి మిగిలిన 5 ఎద్దులను రెండు ఎద్దుబళ్ళని ఆడవాళ్ళ కు 3.000 కి కొంటామన్నారు బాబా' సహచరుల యావజ్జీవితం ఉపయోగానికి రు 8 000/-బాబా కేటాయించి ఉంచారు అందులోంచి స్త్రీలు ఆమూడువేలు తీసుకుని యిస్తారు అవి కొనుక్కుని స్త్రీలు వాటిలో ఒక ఇంగ్లీషు ఎద్దుని రెండు బళ్ళని వారి స్వంత ఉపయోగం కోసం ఉంచుకుని మిగతా 4 ఎద్దులను వారి పేరుతో దేరాడూన్‌లో గాని హరిద్వార్‌లో గాని ఏదయినా ధర్మసంస్థకి యిచ్చేస్తారు. ఈ ధర్మసంస్థని కనుగొనేపని శత్రుఘ్న, మహంత్, వీరేంద్ర పండే అనే దేరాడూన్‌లోని డిస్ట్రిక్ట్ ఇన్‌ఫర్మేషన్ ఆఫీసరుకి అప్పజెప్పారు.

శత్రుఘ్న అతని కుటుంబము, బీరేంద్ర అతని కుటుంబము, మహంతు అతని సోదరీలు యితర బంధువులు- వీరిని మాత్రం వారిష్టము వచ్చినపుడు వచ్చి బాబాను చూడడానికి అనుమతించారు. ఇంకా నారావాలా, ఎరచ్ మిస్త్రీ, బర్జోర్ బాచా లను వాళ్ళ యిష్టం వచ్చినపుడు బాబాను చూడవచ్చునని యిదివరకే అనుమతించారు కానీ వారితో వారి కుటుంబంలో యితరులను తీసుకురాకూడదన్నారు. వీరికి తప్ప యింకెవరికీ బాబాను చూడడానికి రావడానికి బాబా అనుమతి లేదు

కుంభమేళా పనికోసం మార్చి ఏప్రెల్‌మాసాలలో ఉండడానికి మోతీవర్‌లో యిల్లు కుదుర్చుకు రావడానికి వెళ్తానని వీరేంద్ర పండే ఒప్పుకున్నాడు అతనితో ఎరచ్ వెళ్ళి బంగళా బాగుందో లేదో చూస్తాడు బాబా ఆ బంగళాకి అద్దె యిస్తా నన్నారు ఎందుకు అక్కర్లేదని పండే అంటే యీ నూతన జీవితంలో ఏ విధమయిన భారం తీసుకోనన్నారు బాబా పండేతో సంభాషిస్తూ తమ డైరీలో అన్ని మాటలు చేతలు వ్రాయబడి ఉండాలని బాబా అన్నారు శత్రుఘ్న, పండే, మహంతు సంపర్కం వచ్చినపుడు వారి ముగ్గురిపేర్లు డైరీలో కనిపిస్తాయని బాబా చెప్పారు.

ఫిబ్రవరి (1950) 3 వ తేదీ ఉదయాన ఆకాశంలో ఒక్క మేఘం కూడా లేదు. చాలా నిర్మలంగా ఉంది ఎండ వెచ్చగా కాస్తోంది అన్నివిధాలా చాలాసుఖంగా ఉంది.

డేరాడూన్‌లో నాఏ దునియా అనే పిల్లల పాఠశాలకి లేఖ్‌రాజ్ అనే అతడు స్థాపకుడు అతనిని ఉప్ షట్ అంటారు శత్రుఘ్న అతన్ని తీసుకుని ఆ రోజు ప్రొద్దున్న వచ్చాడు ఇది ఒక ఆదర్శకరమయిన సంస్థ. దాని ఉద్దేశాలన్నీ మంచివే. బాబా యీ సంస్థకి 4 ఎద్దులను ఉచితంగా యిచ్చేసారు స్త్రీల తరఫున యీ దానం చేయబడింది ఈ సందర్భంలో ప్రొఫెసర్ లేఖ్‌రాజ్ బాబా దర్శనం చేసుకున్నాడు. అతనితో బాబా అన్నారు——

“అమాయకులయిన బాలురకు చేసిన పని భగవంతుని దృష్టిలో ప్రశంస నీయము ఈ పని ధైర్యంతో నిర్వహించి ఫలితాలను దేవుడికి వదిలెయ్యాలి. మామూలు ప్రకారం పెండు దైదుల్ బస్సు అమ్మకానికి, విష్ణు బకారు పనిమీద డెహ్రాకి వెళ్ళారు చివరకు పరిశ్రమ ఫలించింది రెండు టాంగాలు రెండు గుర్రాలు రు 1200 లకు అమ్మేసారు ఇంకా కొంత సమయము ఉంటే పెండు యింకా ఎక్కువ ధరకి అమ్మేవాడేమో. పెండు ద్వారా డాన్ చేసిన అమ్మకం అన్న మాట యింది. డాన్‌కి 4 ఎద్దులకి, బండికి రు 1300 వచ్చిందన్నమాట. నగదు రు 5,000 బస్సు, జంతువులకి రు 2,500 మొత్తం రు 7,500 డాన్‌కి ముట్టింది. మిగిలిన బండి, ఇంగ్లీషు ఎద్దు స్త్రీలు వారికోసం ఉంచుకున్నారు సవారీకూడా వారి క్రిందే ఉంది.

ఫిబ్రవరి 4 వ తేదీ ఉదయం చాలా చలిగా ఉంది ఆకాశం అంతా మేఘాలతో నిండి ఉంది గాలి చాలా చలిగా వీస్తోంది

III పథకం క్రింద వచ్చినవారిని బాబా ఎక్కడికయినా పంపించేస్తామన్నారు బాబా యిచ్చిన ఆజ్ఞల గురించి సందేహాలు, అపోహలు వస్తే అవి సహచరుల మనసులలోని స్వార్థపూరిత ఆలోచనలవల్ల, అపార్థం చేసుకోవడం వల్ల అవుతుంది అప్పుడువారు బాబాకు అవిధేయత కనపరచినట్లు అవుతుంది III పథకంక్రింద సర్వ జీవితంలో బాబా చెప్పిన మాటకి తు.చ. తప్పకుండా విధేయులై ఉండటం అవసరం ఇందులో భౌతికంగా బాబాతో ఉండటం అంత ముఖ్యం కాదు బాబా ఆజ్ఞలు నూటికి నూరుపాళ్ళు పాటించడం అత్యంత ప్రధానం ఈ విధంగా ఎవరివిన తరు

వాత బాబా సహచరులను వారి నిర్ణయాలను మరొకమారు పరీక్షించుకోమని అవకాశం యిచ్చారు బాబా ఎలిజబెత్‌తో ఏదో నిబంధనం చేసుకున్నారని ఆమె బాబా చెప్పినట్లు చేయడానికి అంగీకరించిందని బాబా చెప్పారు. దీని ఆధారంమీద బాబా పాశ్చాత్య దేశాలకి రెండు షరతులమీద వస్తానన్నారు—ఈ నవ్యజీవితం కొనసాగడానికి అడ్డంకులు ఏర్పడరాదని, అమెరికాకి రాకపోకలకు ఖర్చులు ఆమె భరించాలని, బాబాకి ఆయన సహచరులకి అయే ఖర్చులుకూడా ఆమే పెట్టుకోవాలని. అక్టోబరు 16 వ తేదీన ప్రారంభించిన నవ్యజీవనం అనంతంగా కొనసాగాలని బాబా ఆశయం. బాబా పాశ్చాత్య దేశాలలో గాని భారతదేశంలో గాని ఎక్కడ ఉన్నా నూతన జీవితం సాగుతూ ఉండాలి డాన్ తన యింటికి మానేజరుగా వ్యవహరిస్తున్న విష్ణుకి నెలకి రు 150 జీతంగా యిస్తున్నాడు. ఇందులో గుస్తాద్‌జీ, కాకాల పోషణకూడా చేరి ఉంది. వారు ఉండడానికి నివాసగృహం కింద డాన్ బాబాకి రు 500/– యిచ్చాడు, మంత్రిమాఫీలో గుస్తాద్‌జీ, కాకా ఉండడానికి.

ఫిబ్రవరి 6 వ తేదీనాడు కూడా వాతావరణం అలాగే చలిగా మబ్బుగా ఉంది ఆ రోజు 11–30 గంటలకు బిరేంద్రపండే వచ్చాడు తన జీప్‌కారులో అతనితో ఎరచ్‌ని మోతీచల్‌కి తీసుకు వెళ్ళాడు. తన స్నేహితుని యిల్లు ఒకటి చూపించాడు. ఆ యింటివాడు బాబా వద్దనుంచి అద్దె తీసుకోవడానికి నిరాకరిస్తున్నాడు అని పండే చెప్పాడు కానీ బాబా యీ నూతన జీవితంలో యిలాటి 'భోజ' (బరువు) వద్దన్నారు. ఆ బంగళా పాతది గనుక దానికి మరమ్మతు అవసరం గనుక బాబా రు 400 లు యిచ్చి దానికి మరమ్మతు వగయిరాలు చేయించమన్నారు.

బాబా ఆరోజున బైదుల్‌ని రిషీకేశ్‌కి, హరిద్వార్‌కి పంపించి అక్కడి మస్తుల గురించి సాధువుల గురించి తెలుసుకుని రమ్మన్నారు

మంత్రిమాఫీలో కష్టపడి కట్టడం పనిచేయిస్తూన్న శత్రుఘ్న జబ్బుచేసి మంచాన పడ్డాడు ఈ రోజు అతనికి ఎక్కువగా జ్వరం వచ్చిన మూడవరోజు బాబా డా॥ నీలుని, గోహర్‌ని అతనికి మందు యిమ్మని ఆజ్ఞాపించారు. వారు శత్రుఘ్న యింటికి రెండుమార్లు వెళ్ళి అతనికి చికిత్స ప్రారంభించారు శత్రుఘ్నకి బ్రాంకో న్యుమోనియా వచ్చిందని దానితో అతడు బాధపడుతున్నాడని డా॥ నీలు, గోహర్‌లు చెప్పారు.

ఫిబ్రవరి (1950) 6 వ తేదీకి కూడా మంజ్రీమాఫీలో ఉన్న శత్రుఘ్నకి జ్వరం యింకా హెచ్చుగా ఉంది. బాబా నీలుతోను, గోహర్‌తోను అనేకమారులు చాలా జాగ్రత్త తీసుకోమని చెప్పి అతని ఆరోగ్యం గురించి బాబాయొక్క ఆదుర్దా తెలియ జేసారు ఆ సాయంకాలం శత్రుఘ్నకి పెన్సిలిన్ ఇంజక్షన్ యిచ్చారు అతని కుమార్తె శ్రీమన్‌కి కూడా జ్వరం వచ్చింది. అతని భార్యకు ఆరోగ్యం కుదుట పడుతోంది. అతనికి జబ్బుగా ఉన్నా అక్కడ జరుగుతున్న నిర్మాణం గురించి అతడు ఎక్కువగా ఆలోచిస్తున్నాడు. బాబా అతనితో దాని గురించి విచారించవద్దని చెప్పారు. కాని అతని నిజాయితీ, శ్రద్ధ అతనిని ఆలోచించకుండా ఉండనీయటంలేదు.

ఫిబ్రవరి 7 వ తేదీన రోజంతా చక్కగా ఎండ కాసింది. ఆకాశం నిర్మలంగా ఉంది శత్రుఘ్నకి నయం అవుతోంది ఇంకా జ్వరం నార్మల్‌కి దిగలేదు. నీలు దేరాడూన్‌కి పెన్సిలిన్ మందు కొందామని వెళ్ళాడు. అతడు దేరాడూన్‌లో డా॥ నాథ్ యింటికి ఒకమారు వెళ్ళాడు. డా॥ నాథ్ బాబా అంటే చాలా ఆసక్తి కనబరిచాడు. ఆ సాయంత్రం మరల శత్రుఘ్నకి పెన్సిలిన్ ఇంజక్షన్ యిచ్చారు. అతడు చాలా నయంగా కనిపిస్తున్నాడు అతని కుమార్తె శ్రీమన్‌కి 100 డిగ్రీలజ్వరం ఉంది. ఆమెకు పెన్సిలిన్ ఇంజక్షను యిచ్చి సిబజాల్ మందుకూడా యిచ్చారు. సాయంత్రం ప్రొద్దుపోయేసరికి ఆకాశం మేఘావృతం అయింది. చలి ప్రారంభించింది గాలి ఎంతో చలిగా వీస్తోంది. ఆ రాత్రి 11 గంటలకు వర్షం ప్రారంభం అయింది.

ఫిబ్రవరి 8 వ తేదీన గతరాత్రి ప్రారంభం అయిన వర్షం యింకా కురుస్తూనే ఉంది. ఆ రోజంతా ముసురుపట్టి వర్షం పడుతూనే ఉంది. శత్రుఘ్న ఆరోగ్యం రోజు రోజుకీ నయంగా ఉంటోంది అతనికి ఉదయం సాయంకాలంకూడా పెన్సిలిన్ ఇంజక్షను యిస్తున్నారు అతని కూతురికి కూడా అదే మందు ఇంజక్షన్ యిచ్చారు. వీరి ఆరోగ్యం గురించి నివేదిక వినగా బాబాకు సంతోషం కలిగింది

మంజ్రీమాఫీలో స్త్రీల నివాసాలు కట్టిస్తున్న శత్రుఘ్నకి పని ఎక్కువయ్యే జబ్బుచేసింది అందుచేత అతని మందుల కోసం బాబా స్త్రీల డబ్బులోంచే ఖర్చు పెట్టారు. మోతీచర్‌లో యిల్లు మరమ్మతుకోసం బాబా యిచ్చిన రు 400/- కూడా

అతవారి డబ్బులోనుండే యిస్తారు ఆయన ఏప్రెల్ నెలలో వారిని ఇక్కడ ఉంచుదామని అనుకుంటున్నారు అక్కడనుంచి సంఘమేళాకి వెళ్తారు బాబా స్త్రీల బాపతు రు 8,000/- లోను బాబా యీ క్రింది ఖర్చులు వేసారు —

| | |
|---|---|
| నాలుగు ఎద్దులకి బళ్ళకి | రు 1300 |
| మోతిపిల్ యింటి మరమ్మత్తుకి | 400 |
| శత్రుఘ్నుకి అతని భార్య, కుమార్తె చికిత్సకోసం | 100 |
| ఇతర ఖర్చులనిమిత్తం | 200 |
| | రు 2,000 |

మార్చి 1 వ తేదీలోపుగా స్త్రీల డబ్బు రు 8000/- ఖర్చుచేసి వారి డబ్బు వారికే యిస్తామనుకుంటున్నారు బాబా ఇప్పుడు బాబాకి ఉన్న ఆస్తి ఇంగ్లీసు ఎద్దు, రెండు బళ్ళు అక్టోబరు 16 వ తేదీన బయలుదేరినపుడు స్త్రీల కోసం రు 1,000/- తీసుకువెళ్ళారు ఐపోగా రు 7,000/- నారిమన్ వద్ద మెహెర్జీ వద్ద వారికోసం ఉంచారు ఈ రు 7,000/- అదీ (సీ) ద్వారా తెప్పించారు బాబా. ఆదీని ఆ సొమ్ము బాంకుకి యిచ్చి పంపించమన్నారు ఈ విధంగా స్త్రీల రు 8,000/- వారికి మార్చి 1 వ తేదీన యిచ్చేస్తారు లోటుపడిన రు 2,000/- నారిమన్ మెహెర్జీలను పంపించమంటానన్నారు బాబా వారివద్ద అత్యవసరాల నిమిత్తం వేరే రు 7,000/ ఉంచారు. అందులోనుంచి యీ రు 2,000/- తెప్పిస్తే యింక వారివద్ద రు 5,000/- మాత్రం ఉంటుంది III పథకం క్రింద ఉన్న సహచరులకు ఒక్క దమ్మిడీ కూడా లేదు. I-B, I-C సహచరుల వద్దనుంచి ఏదయినా వస్తే అదే ఉంటుంది.

III పథకంలోని సహచరులతో చర్చించిన తరువాత వారికి స్త్రీలకి ఏవిధమయిన ఇబ్బంది కలుగకూడదని నిశ్చయించుకున్నారు. అందుకోసం యీ క్రింది విధంగా ఏర్పాటుచేసుకున్నారు

(1) స్త్రీల యొక్క రు 8,000/- ల్లోను మార్చి 1 వ తేదీనుంచి III పథకం వారికోసం ఒక్క దమ్మిడీ కూడా ఖర్చుపెట్టకూడదు.

(2) III పథకంలో ఉన్నవారు భిక్షాటన చేసిగాని లేక I-B, I-C పథకం వారేమయినా సొమ్ము పంపితే దానితో వారు జీవించాలి.

(3) I-A, I-C పథకాలవారు పంపిన సొమ్ములో నాలుగవ వంతు స్త్రీలకి యిచ్చి మిగిలిన మూడు వంతులు III పథకం వారికి ఖర్చు పెట్టాలి

(4) బాబా వారి ప్రత్యేకమయిన పనికి అవసరమయినప్పుడు పాత జీవితపు పురుషులను, స్త్రీలను పిలిపించవచ్చును పురుషులు వారికి రాను పోను ఖర్చులు యిస్తే రాగలుగుతారు వారికి భోజనానికి కూడా సొమ్ము చూసుకుని III పథకం వారితో నివసించవచ్చును III పథకంవారిని స్త్రీలు పోషిస్తారు.

(5) I-B పథకాన్ని డాన్‌కిన్ జయప్రదంగా అమలు జరిపితే III పథకంలో ఉన్నవారికి కూడా గుస్తాద్‌జీ పోషణ నిమిత్తం కాని అతడు విఫలుడయితే అతనే దానితో జీవించలేకపోతే అతడు యింకా గుస్తాద్‌జీ బాబాలకి నెలకి 150 రూ॥లు యివ్వలేడన్నది స్పష్టం అలాంటప్పుడు నవ్యజీవితం I-B లో ఉండడానికి ఏది మంచిదని తోస్తే అది తన యిష్టమయిన పని చేయవచ్చును. అప్పుడు గుస్తాద్‌జీ బాబాలకు I-C గాని, II గాని III గాని ఏ పథకంలో నయినా చేరే అవకాశం వారికి యివ్వాలి. వారు III పథకంలో చేరితే మొదటి షరతులు వారు పాటించవలసి వస్తుంది – నూటికి నూరుపాళ్ళూను

ఫిబ్రవరి 9 వ తేదీన మరల డా॥ నీలు, డా॥ గోహర్‌లు శత్రుఘ్న యింటికి వెళ్ళి చూసారు ఈ రోజున అతనికి జ్వరం లేకుండా నార్మల్‌కి వచ్చింది. శ్రీమన్‌కె కూడా నార్మల్‌కి వచ్చింది. అతని భార్య ఆరోగ్యం కూడా బాగుపడుతోంది. ఈ సంగతులువిని బాబా సంతోషించారు

నిన్న సాయంకాలం డాన్‌కిన్ వద్ద నుంచి టెలిగ్రాం వచ్చింది. అతడు నజూను తీసుకొని 10 వ తేదీన డేరాడూన్‌కి వస్తున్నాడని కేకిదేశాయి ఎరచ్‌కి ఒక ఉత్తరం కూడా వ్రాసాడు అందులో క్రైన్. దేశాయికి వ్రాసిన ఒక ఉత్తరం ఉంది. క్రైన్ ఉత్తరం, బాబాకి చదివి వినిపించమంటే అది యిలా చదివి వినిపించారు.

న్యూ ఢిల్లీ,
7–2–50

దేశాయి సోదరునికి,

దేరాడూన్‌నుంచి మీరు క్రిందటి నెల తిరిగి వచ్చాక నేను నూలు బట్టలు, సిగరెట్లు, అగ్గిపెట్టెలు, యివ్వవలసి ఉండెను (జనవరి 31 వ తేదీ ముందు) చాలా రోజుల క్రిందటే యీ సామాను సిద్ధంగా ఉన్నా మీకు జనవరి 28 నే యివ్వడం జరిగింది నాకు ఆజ్ఞ పంపించి ఉంటే యివి 25 వ జనవరికి ముందే ప్రియతమ బాబాకి పంపి యుండెడివాడను. అవి మన సద్గురువుగారు అంగీకరించలేదని తెలిసి నాకు ఏమీ తోచలేదు. ఈ వార్త పిడుగులా వచ్చింది. మీరు నాకు 31–1–50 తేదీ ముందు మీకు పంపించాలని వ్రాసారు.

ఇదివరకు హరజీవన్‌లాల్ క్రిందటి డిసెంబరులో ఆయనకి యిచ్చిన బూనిసలు యితర వరుకులతో పంపించకుండా ఉన్నందున కలిగిన ఆశాభంగం యింకా నా మనసులో బాధిస్తోంది ఇప్పటి యీ వార్త నా నరాలను నడిపిస్తుందన దానికి సందేహం లేదు. గౌరవనీయులయిన మన గురువుగారు యీ పేదవాని ప్రార్థన విననందుకు నా వలన ఏ అపచారం జరిగిందో అని బాధపడుతున్నాను ఉదార స్వభావులయిన ఆ మహామహుడు నేను సమర్పించినది అంగీకరించమని ప్రార్థిస్తు న్నాను లేకపోతే యీ పనికిమాలినవానికి నిరాశ కలగడమేగాక నా భార్యకి నా బంధు వులకి కూడా యిది తెలిస్తే గొప్పనిరాశ కలుగుతుంది

నేనింత వ్రాయలేను. శ్రీ బాబా అవతారపురుషుడు. ఆయనకి మన పరిమితులు తెలుసును ఆయన గొప్పవాడు గనుక తెలిసీ తెలియక చేసిన మా పాపాలను మన్నించి యీ వస్తువులు అంగీకరిస్తారని ఆశిస్తున్నాము. నాకు చెప్పిన తారీఖులోపలే నేను సమర్పించుకున్నాను గురువుగారిని క్షమించమని ప్రార్థిస్తున్నాను. ఆయన యెడల అత్యంతమైన ప్రేమతో,

మీ సోదరుడు
వాసుదేవ్/క్లైన్.

ఈ ఉత్తరాలు చదివించుకుని విన్న తరువాత బాబా యీ క్రింది జవాబు వ్రాయించారు — కేకీ దేశాయికి.

"నీ ఉత్తరము క్రైన్ ఉత్తరము బాబాకి చదివి వినిపించినాము. బాబా క్రైన్ ఉత్తరం అంగీకరించారు నీవు, క్రైన్ మీ ఉత్తరాలలో బాబా గురించి ఆధ్యాత్మికంగా వ్రాసిన ఆయన బిరుదులు మాత్రం అంగీకరించలేదు క్రైన్ భిక్ష జనవరి 31 వరకు కొనసాగించదని పొరపాటుగా అర్థం చేసుకుని జనవరి 25 కి ముందే యీ భిక్ష యివ్వడం జరిగింది. గనుక యీ భిక్ష ఆయన అంగీకరిస్తున్నారు నీవు యిక్కడికి వచ్చేటప్పుడు తేవలయును. బాబా యీ సంగతి డైరీద్వారా అందరకు తెలియ పరుస్తారు - ఈ భిక్ష జనవరి 25 లోపలే యివ్వబడినదని యిదివరకే నిశ్చయింప బడినట్లు జనవరి 25 నుంచి భిక్ష తీసుకోవడం ఆపబడిందని."

ఈ ఫిబ్రవరి 9 వ తేదీ సాయంకాలం లగాయతు ఎక్కువ చలిగా ఉంటోంది. అయినా సహచరులు వంతుల ప్రకారం ఒకరి తరువాత ఒకరు రాత్రి స్త్రీల నివాసం దగ్గర కావలికాస్తున్నారు.

డాన్‌కిన్ నజా ఫిబ్రవరి 10 వ తేదీన వచ్చారు ఇది వరకే చెప్పినట్లుగా వారెవరూ పాతజీవితపు మిత్రుల సంగతి ఏమీ మాట్లాడ లేదు. వారు ఆఖరి వరకు దాని గురించి మౌనంగానే ఉంటున్నారు. డాన్ ఏర్పాటుదార్ల చిక్కులు గురించి చెప్పడానికి బాబా అనుమతి కోరాడు ఇది పాత క్రొత్త జీవితాలకి సంబంధించినది. ఏర్పాటుదార్లు డాన్‌కి యీ చిక్కు గురించి చెప్పారు. వారు డాన్‌ని యీ సంగతి బాబాకి చెప్పమనలేదు. బాబా డాన్‌ని యీ విషయంలో ఏమి విన్నాడో బాబాకి చెప్పడానికి అనుమతి యిచ్చారు ఏర్పాటుదార్లు చెప్పినదానిని బట్టి డాన్ తెలుసుకున్న దేమంటే సదాశివ్ పటేల్‌ను పూనా వెళ్ళడానికి అనుమతిస్తేగాని అతని ఆస్తి అమ్మకం కాదు. ఏర్పాటుదార్లకు అప్పజెప్పినా వారు ఆ ఆస్తిని యింకొకరికి అమ్మలేరు ఎందుచేతంటే దస్తావేజులు స్పష్టంగా లేవుట వచ్చిన చిక్కులు ఏమిటంటే ఏర్పాటుదార్లు యీ ఆస్తి అమ్మగలంగదా అని కొంత సొమ్ముకూడా ఖర్చుపెట్టారు ఈ యిల్లు కొందామను కున్న మనుష్యులు ఉన్నారు. కాని పటేల్ వెళ్ళేముందు సంతకం చేసి యిచ్చిన దస్తావేజులు స్పష్టంగా లేవు—అని డాన్ చెప్పాడు.

అప్పుడు బాబా సదాశివ్‌ని యీ విధంగా ఆజ్ఞాపించారు—"నీవు III వథకంలో ఉన్నావు. నిన్ను నేను పూనా వెళ్ళి ఏర్పాటుదార్లు ఏమి ఖర్చు పెట్టారో ఆ డబ్బు యిచ్చేసి నీవు ఆ యిల్లు మళ్ళీ తీసేసుకోమని ఆజ్ఞాపిస్తున్నాను. తరువాత నీవు

ఎప్పుడయితే రెండూ అతనిపేర తిరిగి వ్రాసి యిచ్చారో వెంటనే సదాశివ్ యిదివరకు యిచ్చి వేసిన మొత్తం ఖర్చులతో సహా ఏర్పాటుదార్లకు 15 ఫిబ్రవరి, 1950 నుండి రెండు నెలలలోపున తిరిగి యిచ్చివేయాలి సదాశివ్ ఒకవేళ. రెండూ గాని తణఖా పెట్టిగాని పూర్తిగా అమ్మివేసిగాని ఏ విధంగానో సొమ్ము ఏర్పాటు దార్లకు యిచ్చివేయాలి. 15 ఫిబ్రవరినుంచి రెండు నెలలలోపున ఏర్పాటుదార్లకు ఖర్చులతో సహా సొమ్ము యిస్తానని సదాశివ్ మాట యిచ్చాడు పని అయిపోగానే సదాశివ్ తిరిగి వచ్చేస్తాడు —ఎమ్. ఎస్. ఇరానీ (బాబా)

ఈ మూడూగాక, సదాశివ్, ఏర్పాటుదార్లు యీ మొత్తాలు యివ్వడం గురించి ఒప్పందం కుదుర్చుకుంటే వారి యిష్టప్రకారం చేయవచ్చును అని కూడా చెప్పి ఉంది "—

గత మూడురోజులు మూడు రాత్రులు చాలా తీవ్రంగా ఉంది చలి గ్లాసులో పోసుకున్న నీరు పైపైన మెరుగుతున్న మంచులా తయారవుతోంది చెప్పవచ్చు అన్నమాట ఎక్కువగా చేసు రాత్రింబగళ్ళు ఒకలాగే ఉంది ఏరుచ్, విష్ణు, పెండు, సదాశివ్, మురళి, బైదుల్, ఆలీ అక్బర్ రాత్రిళ్ళు యిలాటి వాతావరణంలో కూర్చుని కాపలా కాయడానికి యాతన పడుతున్నారు వాళ్ళకి చాలినన్ని దుస్తులు లేవు ఉన్నవి చాలడం లేదు.

ఫిబ్రవరి 11 వ తేదీన బాబా యీ క్రిందివిధంగా టెలిగ్రాం యిప్పించాడు—

"రంజూ c/o సరోష్, అహమదునగర్.

సదాశివ్ 13 వ తేదీన బొంబాయికి మెహర్జీ యింటికి వెళ్తున్నాడు. ఏర్పాటుదార్లకి చెప్పవలెను -

బాబా"

ఫిబ్రవరి 12 వ తేదీన కూడా చలి తీవ్రంగా ఉంది దూరాన ఉన్న ముస్సూరీ కొండలు అసలు కనిపించడమే లేదు ఆ ప్రదేశాలలో పొగమంచు దట్టంగాపట్టి పూర్తిగా కమ్మేసింది చీకటితో 5 గంటలకు అల్పాహారాలు తీసుకున్నారు సహచరులంతా అది అయిన తరువాత బాబా వచ్చి మామూలుగా కుశలప్రశ్నలు

వేసారు వారికి గతరాత్రి బాగా నిద్రపట్టిందా అని అడిగారు నీలుని అడిగినప్పుడు అతడు జవాబు యిలా చెప్పాడు- "అంతా చలి! చలి! చలి!"

అప్పుడు బాబా చెప్పారు –

"మనం మొదలివారమూ కాము. పడుచువారమూ కాము. మనది అంతా అమ్ముడయిపోయింది. మనవద్గర బంగారం లేదు వెండిలేదు అంతటా వవ్యజీవితమే ఉంది."

డా॥ డాన్‌కిన్ యిలా దానికి కలిపాడు–

" మార్చి 1 వ తేదీనుంచి తెలుస్తుంది "

బాబా యిలా ముగించారు –

"నిజంగా ధైర్యమున్నవారు
నూటికి నూరుపాళ్ళు షరతులు పాటిస్తారు "

ఈ రోజున స్త్రీలు (12 ఫిబ్రవరి 1950) బాబా 56 వ జన్మదినోత్సవం జరుపుకున్నారు. స్థానిక స్త్రీ పురుషులు 20 మంది సమావేశమయారు దేరాడూన్ నుంచి నారావాలా పిల్లలతోసహాను, బర్జోర్ చాచా తన భార్యతోను, ఎరచ్ మిస్త్రీ హోవెన్ వగైరాలు వచ్చి బాబాకు జన్మదిన శుభాకాంక్షలు తెలిపారు

వెండు సోదరి నజా 'రవ' తయారు చేసింది. టీ తో యింకా భాజ్యాలు కూడా పెట్టారు. వచ్చిన వారికీ బాబా స్వయంగా పెట్టారు. బాబా చాలా సంతోషంగా ఉన్నారు ఆయన ముఖం తేజోవిరాజమానంగా ఉంది ఆయన కళ్ళు సంతోషంతో నాట్యం చేస్తున్నాయి వాతావరణం శాంతితోను నెమ్మదితోను సుఖంతోను నిండిఉంది. ఎంత చలి వేస్తున్నా అంతా సంతోషంగా ఉన్నారు.

బాబా ఒకనాడు మండలిని పిలిచి "ఈ రోజు నుంచి భిక్ష అడగడం మానెయ్యండి. మీరంతా యింటింటికి వెళ్ళి ఉతకవలసిన బట్టలు పోగుచేసి తెచ్చి ధోబీలాగ బట్టలు శుభ్రంచేసి మళ్ళీ ఎవరివి వారికి యిస్తూ ఉండాలి అందుకు వాళ్ళేమి యిస్తారో పుచ్చుకుంటూ ఉండాలి" అని చెప్పారు. ఇలా కొద్దిరోజులే జరిపించారు బాబా.

ఇప్పటికీ వచ్చినవారంతా బాబా జన్మదినం జ్ఞాపకం ఉంచుకుంటారు పదార్థాలు అంత బాగా చేసారు ఆరోజున. బాబా జన్మదినం నాడు మెహెర్‌మాఫి

(మంత్రి మాఫి) సెంటర్‌లో యిప్పటికీ సరిగా యివే వంటకాలు తయారు చేయించి ఆ గ్రామస్తులకి ప్రతీ సంవత్సరము పెడుతూంటారు.

13 వ తారీఖున వాతావరణం ఎక్కువ చలిగానే ఉంది బాబా అల్పాహారాలు ముగించాక ఆయన సహచరుల వద్దకువచ్చారు బాబా ఆయన డైరీ (దినచర్య) వ్రాసినపుడు వెంటనే ఆదీకి పంపించాలని నిశ్చయించారు సదాశివ్ పటేల్ ద్వారా అది పంపి ఆదీని ముద్రణ చేయించ యిచ్చారు. ఇదిగాక డా॥ గనీ వద్ద యింకొకటి ఉంది. అతడు నవ్యజీవనంలో I-c పథకంక్రింద ఉన్నాడు.

పటేల్‌చేత ఒక ఉత్తరం వ్రాయించి ఆదీని / మాణెక్ మెహెతాకి మూడు పథకాల సర్క్యులర్ ఒకప్రతి పంపుతూ బాబా యీ విధంగా ఉత్తరం వ్రాయించారు.

మంత్రిమాఫి, డేరాడూన్, 13–

మాణిక్ మెహెతాకి, —— (అవును గాళ్ళలో ఒకడు)

ఇందుతో పంపిన నవ్య జీవితం లోని మూడు పథకాల సర్క్యులర్‌ను జాగ్రత్తగా చదువు చదివి ఆలోచించుకొని నీవు ఏ పథకం క్రింద ఉండగలవో నిర్ణయించుకో. నూటికి నూరుపాళ్ళు ఆచరించాలి. నిర్ణయించుకొని నీ నిశ్చయం నాకు తెలియజేయాలి ఆ సంగతి నవ్యజీవితపు డైరీతో అందరకు తెలియపరచాలి.

"నిశ్చయించుకునేముందు యీ క్రింది విషయాలు జాగ్రత్తగాగమనించు—

(1) మొదట చేయబడ్డ నిబంధనలకు నీవు 31 ఆగస్టు 1949 నాడు ప్రమాణం తీసుకొని సంతకం పెట్టావు నీవు నవ్యజీవితంలో జనవరి 1, 1951 నుంచి చేరుతావు

(2) నీవు 1951, జనవరి 1 వ తేదీన నవ్యజీవితంలో చేరినపుడు నీవు యీ మూడు పథకాలలో ఏదో ఒకటి ఎన్నుకోవడం ద్వారా, నీవు మెహెర్‌బాబా యొక్క నవ్యజీవిత సహచరుడుగా ఉంటావు.

(3) I పథకం మూడు భాగాలు ఉన్నా (A, B, C) నీవు C పథకం మీదే నీ దృష్టిని ఉంచుకోవాలి A, B లు ఉన్నా C మాత్రమే నీకు వర్తిస్తుందని

నీవే తెలుసుకుంటావు ఇప్పుడు I పథకంలో C భాగము, II, III పథకాలు నీవు ఎన్నుకోవచ్చును.

(4) నీవు III పథకంలో చేరడానికి నిశ్చయించుకుంటే నీవు మొదట షరతులను నూటికి నూరుపాళ్ళు పాటించాలని నీకే తెలుస్తుంది.

నూటికి నూరుపాళ్ళు పాటించడం అంటే యీ క్రిందివి కూడా కలిసి ఉంటాయి.

“(a) నీవు తప్పుచేసినా నిన్ను పంపించేయ్యవచ్చు.

(b) నీవు తప్పు చేయందే కూడా నిన్ను పంపించేయ్యవచ్చు.

(c) నిన్ను నవ్యజీవితం I-B, I-C, II పథకాల క్రింద గడపమని నేను ఆజ్ఞాపించవచ్చు నీకు యీ పథకాల క్రింద ఉన్న ఏమీ యివ్వకుండాను

(d) నిన్ను ఎల్లప్పుడు నా వద్దనే ఉంచుకోవచ్చు లేక నిన్ను ఎక్కడయినా కాలపరిమితి లేకుండా నీకు ప్రత్యేకమయిన ఆజ్ఞలు యిచ్చి ఉండేలా చేయవచ్చును

(e) నీవు ఎప్పుడూ మంచి వైఖరితో సంతోషంగా ఉండాలి.

(f) ఏ పరిస్థితులలోను నీవు ఏ సందేహాలూ పెట్టుకోకూడదు నీవు ఎట్టి పరిస్థితులలోను కోపం వ్యక్తం చేయరాదు.

(g) నీవు ముందు సంతకం పెట్టిన మొదటి షరతుల ప్రకారం ఏ వాదమూ లేకుండా, సంకోచం లేకుండా, నీకు యిచ్చిన ఆజ్ఞలను వెంటనే పరిపాలించాలి – అవి సాధారణమయిన ఆజ్ఞలయినా సరే, విపరీతమయినవయినా సరే.

ఈ విషయాలన్నీ మనసులో పెట్టుకుని నీవు సంతోషంగా నూటికి నూరుపాళ్ళు శ్రద్ధతో I-C, II, III పథకాలలో ఎందులో సరిపోతావో నిర్ణయించుకో.

మొదటి షరతులు గాక I & II పథకాలకి వేరే షరతులున్నాయి. ప్రతిరోజూ నీకు యిచ్చే ఆజ్ఞలేవీ ఉండవు నా వల్ల నీకు ఏ విధమయిన అవరోధము ఉండదు. నేను ఎందులోనూ కలుగజేసుకోను

III పథకంలో మొదటి షరతులు నవ్యజీవితంలో ప్రవేశించు వీమీద ఉంటాయి నీవు బాధ్యతగా ఆచరిస్తూ ఉండాలి.

నీవు III పథకం అంగీకరిస్తే యిదివరకు అనుకున్న ప్రకారం నీ కుటుంబ పోషణకి నీవు III పథకంలో ఉన్నంత కాలము నీవు తప్పుచేసావని పంపబడనంత కాలము యిక్కడనుంచి డబ్బు పంపబడుతుంది.

నీవు I-C పథకం గాని II పథకం గాని అంగీకరిస్తే నిన్ను నీ కుటుంబ మును, పోషించేభారం – నీమీదే ఉంటుంది జనవరి, 1–1954 వ తేదీ నుంచి.

నీవు పథకం I–C లేక II లో చేరిన వెంటనే నీకు, నీ కుటుంబానికి, సరిపోయేడబ్బు తీసుకున్నాక మిగిలిన దానిలో నుంచి ఏది యివ్వగలవో అది నవ్యజీవితం కోసం నాకు పంపుతూ ఉండాలి

నీవు యీ క్రింది చిరునామాకి నాకు జవాబు వ్రాస్తున్నప్పుడు నీ పరిస్థితి గురించి నాకు ఏమీ వివరించ కూడదు ఇంకేదీ వ్రాయకూడదు నీవు ఏ పథకం ఎన్నుకున్నావో అది మాత్రం స్పష్టంగా తెలియపర్చాలి.

నీ జవాబు యీ చిరునామాకు పంపించు -

"మెహెర్ బాబా
C/o కేకి నారావాలా,
38, లిట్టన్ రోడ్, డేరాడూన్.
— ఎమ్. ఎస్ ఇరానీ (బాబా)"

I–B పథకంలో ఉన్న డా॥ డాన్కిన్ సామానుతో సహితంగా వైద్యవృత్తి ప్రారంభించడానికి డేరాడూన్కి వెళ్ళిపోతున్నాడు.

సదాశివ్‌పటేల్ పొరిబాయిలోని ఏర్పాటుదార్లను కలిసేరిందుకు మంత్రిమాఫి నుంచి వెళ్తున్నాడు.

ఇంతవరకు యీ డైరీని బాబా సేవకు (నీలకంఠ్ నారాయణ్ గోడ్సే) చేత వ్రాయించారు నవ్య జీవితం బాబావల్ల ప్రారంభింపబడినప్పటికి దానివల్ల ఆయన

బంధితులు కాలేము. బాబా శరీరంతో ఉన్నంతకాలము I, II, III పథకాలలో నవ్య జీవితపు నాలుగు భాగాలు — పరిశ్రమ, ఫకీరుల, జిప్సీ, లంగోటీ జీవితాలు అమలులో ఉంటాయి కానీ యీ నూతన జీవితం అంతం లేనిది. నేను శరీరం వదిలినతరువాత కూడా ఎవడయితే అసత్యాన్ని, అబద్ధాలనీ, అసహ్యాన్ని, ద్వేషాన్ని, లోభాన్ని, కామాన్ని పూర్తిగా త్యాగం చేస్తాడో, యిదంతా నెరవేర్చడానికి కామప్రేరితమయిన చేతలను చేయడో, ఎవరికీ అపకారం చేయడో, పరోక్షంగా ఎవరినీ నిందించడో, భౌతికమైన ఆస్తులను కోరడో, పదవిని అధికారాన్ని కోరడో, ఎవరయితే తనకు నమస్కారాలు పెట్టించుకోడో, జోహర్లు అంగీకరింపడో, గౌరవం కావాలని ప్రాకు లాడడో. అవమానం కలుగుతూంటే ఎవడయితే వద్దని అనడో, దేనికీ ఎవరికీ భయ పడకుండా ఉంటాడో, ఎవడు సంపూర్ణంగా భగవంతుని మీదే ఆధారపడతాడో, ప్రేమించడం కోసమే భగవంతుని ఎవరు ప్రేమిస్తాడో, భగవంతుని ప్రేమికులను ఎవడు నమ్ముతాడో, అవతార వ్యక్తీకరణ సత్యంలో ఎవరికి నమ్మకం ఉందో, అయినా అతడు ఆధ్యాత్మిక భౌతిక లాభాన్ని ఆశించడో, సత్యము యొక్క సహాయ మును ఎవడు పొందడో, క్లేశాలు కలిగినప్పుడు కలవరపడకుండా ఉంటాడో, అన్ని ఎక్కులము, కష్టాలను, ఇబ్బందులను సూటిగా సూరుపాళ్ళ సంతోషంతో ఎదుర్కొం టాడో, మతానికి, కులానికి, మతసంబంధమయిన కర్మకాండలకి ప్రాధాన్యత ఎవడు యివ్వడో, వానివలన నవ్య జీవితం శాశ్వతంగా సజీవంగా ఉంటుంది.

ఈ నవ్యజీవితంలోని I-A I-B, I-C పథకాలు గాని III పథకం గాని అంగీకరించినవారు యీ షరతులు పాటించాలి

(1) మీకు కొంచెమయినా ఆధ్యాత్మిక లాభంగాని భౌతికలాభం గాని లభించదని నిశ్చయంగా మీరు ముందు తెలుసుకోవాలి పైగా మీరు అన్నివిధాలుగాను ఆశాభంగానికి, కష్టాలకి సిద్ధపడి ఉండాలి

(2) బాబా మీ మీద తమ 'నజర్' పెట్టుకుని ఉంటారని గాని ఆయన అద్భుతాలు చేస్తారని గాని, ఆయన ఆధ్యాత్మికంగా తాళం చెవి తిప్పి మిమ్మల్ని రక్షి స్తారని గాని, జబ్బువలన, అపాయం వలన, కారాగార శిక్షనుండి, మరణము నుండి, కష్టాలు, వినాశాలనుండి మిమ్మల్ని కాపాడతారని గాని ఎంత మాత్రము ఆశించ కూడదు.

(3) మీరు స్త్రీలను అసలు తాకరాదు అవసరమయినపుడు మీ తల్లిని, భార్యని, సోదరిని, కుమార్తెను, లేక నీ ప్రవృత్తిరీత్యా వైద్యుడవయితే నీ రోగులను తప్ప యితర స్త్రీ లెవరినీ తాకరాదు.

(4) నీవు రాజకీయాలలో చేరరాదు

(5) నీవు ఎటువంటి కవ్వింపు కలిగినా నీవు మాటలవలనగాని చేతలవలన గాని కోపమును వ్యక్తపరచరాదు ఎవరినీ అన్యాయముగా అతని సమక్షంలో గాని పరోక్షంలోగాని విమర్శ చేయరాదు. మనసులో నీకు కోపం కలిగినా అది పైకి మాటల్లోగాని చేతల్లోగాని ప్రదర్శించవద్దు

(6) ఏ పరిస్థితులలోను నీవు అబద్ధం చెప్పరాదు

(7) బాబాగాని నీవుగాని ఎవరివద్ద నుంచి జోహారులందుకోరాదు. నీవు బాబాకిగాని నీకుగాని ఎవరూ ప్రణామం చేసే పరిస్థితి కావాలని సృష్టించకూడదు ఒకవేళ నీ ప్రమేయం లేకుండా ఎవరయినా నీకుగాని బాబాకిగాని జోహారు చేస్తే ఎవరు ఎలా చేసారో అలాగే వారికి మరల నీవు చెయ్యాలి (సాష్టాంగ ప్రణామం అయితే నీవుకూడా సాష్టాంగ ప్రణామం చెయ్యాలి ; ఊరికే నమస్కారం అయితే నీవు కూడా అలాగే చేయాలి )

(8) మీ అందరిమీద యీ షరతులన్నీ ఉన్నా బాబా మాత్రం ఏ ఆజ్ఞకీ ఏ షరతుకి బద్ధులు కాలేదు. ఆయన ఎప్పటికీ స్వేచ్ఛగా ఉంటారు.

(9) ఒకే ఒక్క విషయంలో బాబా స్వేచ్ఛగా లేకపోవడమే గాక కావాలనే ఆయన బంధనంలో చిక్కుకున్నారు అదేమంటే మీకు ఏ విధంగాను యిసుమంతయినా లాభం చేకూరదు మీరు అన్ని విధాలా ఆశాభంగానికి కష్టాలకి గురికావడానికి సిద్ధంగా ఉండాలి. నీ చేతలకి ఎటువంటి ప్రతిఫలం కలిగినా, బాబా దేవుని ముందు నీ వ్యక్తిగత బాధ్యతనుండి నిన్ను తొలగిస్తూ ఏ విధమయిన ఆజ్ఞ జారీ చేయరు. నీ కర్మలకి ప్రతీ ఫలితానికి బాధ్యత నీ మీదనే నీ మీద మాత్రమే ఉందని దేవుని యెదుట అది తప్పనిసరియని, అది తప్పించడానికి గాని బాధ్యతను తొలగించుకోడానికి గాని బాబా ఏ విధమయిన ఆజ్ఞ యివ్వరని నిశ్చయంగా తెలుసుకో.

(10) నీవు చిన్నవారితో గాని పెద్దవారితో గాని, ఆడవారితో గాని మగవారితోగాని కామప్రేరితమయిన పనులేవీ చేయరాదు.

—మెహెర్‌బాబా

## III పథకంలో ఉన్న నూతన జీవిత సహచరులు యీ క్రింది షరతులను పాటించాలి.

(1) పూర్తి త్యాగంతో కూడిన యీ నూతన జీవితంలో యితరుల చేతిలో నీకు చెడ్డగాని మంచిగాని కలిగిన ప్రవర్తన నీయందు వారు చూపవచ్చు. వారి దయాదాక్షిణ్యాలమీద నీవు ఆధారపడి ఉండాలి. ఏది జరిగినప్పటికీ దేవునియెదుట నీవే బాధ్యుడ వవుతావు

(2) నీమీద ఆధారపడినవారు గాని, నీ వ్యాపారం గాని, నీ స్వంత పాత జీవితపు వ్యవహారాలు గాని ఏ విధంగానైనా పాడయితే దేవుని యెదుట నీవు మాత్రమే దానికి బాధ్యుడవవుతావు. ఈ బాధ్యతను నీవు మనసులో పెట్టుకుని నీవు, నీమీద ఆధారపడిన వారితోను యితరులతోను, నీరాకపోకల వలన, ఉత్తర ప్రత్యుత్తరాలవలన, టెలిగ్రాముల ద్వారాను నీవు ఏమీ సంబంధం పెట్టుకునే అవకాశం నీకు ఉండదని నీవు బాగా తెలుసుకోవాలి.

(3) శారీరకమైన లేక మానసికమయిన నీరసము వలన, వాతావరణం హెచ్చు తగ్గులకు ఎదురయినందువలన, ఆహారలోపం వలన, ఆహారదోషం వలన, నీటిలో లోపం వలన, నీటి దోషం వలన, ఏ విధమయిన విషస్పర్శవలన, నీవు జబ్బు పడినా, మరణించినా, దేవునియెదుట, నీవే, నీవు మాత్రమే, బాధ్యుడవవుతావు

(4) నాకు నీవు అవిధేయుడవయితే, నేను నిన్ను నావద్దనుంచి పంపించి వేస్తే దేవునియెదుట నీవు నన్ను భవిష్యత్తులో బాధ్యుణ్ణి చేయజాలవు, ఆ భవిష్యత్తు ఏమి తెచ్చినా, నీవల్ల ఏ తప్పూ లేకుండా నేను నిన్ను పంపించివేస్తె అప్పుడుకూడా దేవునియెదుట నన్ను బాధ్యుణ్ణి చేయజాలవు తరువాత చెప్పిన పైవిధంగా జరిగితే నాతో నీ ఆధ్యాత్మిక సంబంధం అలాగే ఉంటుంది. నేను నీవు వెళ్ళేటప్పుడు స్పష్టమయిన మాటలు చెప్తాను నీవు అవి పాటించితీరాలి నూతన జీవితపు **I-B, I-C,**

లేక 11 పథకాల లోకి నీకు ఏమూలధనం యివ్వకుండానే నిన్ను నేను పంపించెయ్య వచ్చును అప్పుడు నీవు హృదయపూర్వకంగా నిజాయితీతో ఆ పథకం ఆచరణలో పెట్టాలి.

(5) నిన్ను నేను పంపించేసిన ఫలితంగా నీవు త్రాగుడుకు గాని లేక ఏ మందుకయినా దాసుడవయితే లేక నీవు నిరాశతో ఆత్మహత్యకు పాల్పడితే లేక శీఘ్రముగానో ఆలస్యముగానో నీ మరణానికి దారితీసే ఏ పనయినా నీవు చేస్తే దేవుని యెదుట నీవే, నీవు మాత్రమే బాధ్యుడవవుతావు.

(6) నీవు కించిత్తయినా ఆధ్యాత్మికమయిన లాభంగాని భౌతిక ప్రయోజనం గాని ఎంతమాత్రము పొందకపోవడం నిశ్చయం అని భావించాలి. ఏ లాభమూ కూడా పొందవని నిశ్చయంగా తెలుసుకో పైగా నీవు ఏ విధమయిన కష్టానికయినా ఆశాభంగానికయినా సిద్ధపడాలి-

(7) నేను కాలినడకను ఒక ఊరినుంచి యింకొక ఊరికి పోవచ్చు- లేక ఒకే చోట కాలపరిమితి లేకుండా ఉండవచ్చు; నేను ఎక్కడ ఉన్నా నీవునాతోనే ఉండాలి నేను వేరే విధంగా ఆజ్ఞాపిస్తే తప్ప

(8) ఈ క్రొత్త జీవితంలో నీకు నేను అనుకూలంగా నిన్ను సంతోష పెట్టగానికి ప్రవర్తిస్తానని గాని నీ బలహీనతల నాలోచించి నీకేవయినా అవసరంగా కల్పిస్తానని గాని నీవు ఆశించరాదు పైగా నీవే నా సంతోషానికి అన్నివిధాలా ప్రయత్నించాలని నేను ఆశిస్తాను.

(9) నా 'నజర్' నీమీద ఉంచుతానని గాని, నేను ఏవో అద్భుతాలు చేస్తానని గాని, లేక నిన్ను రక్షించడానికి, జబ్బునుంచి అపాయమునుంచి, కారాగార వాసము, మరణము, లేక చిక్కుల నుంచి అయినా, లేక ఏ విధమయిన వినాశముల నుంచి అయినా నిన్ను తప్పించడానికి ఆధ్యాత్మికంగా 'కాళంచెవి' తిప్పుతానని నీవు ఆశించరాదు నిజంగా నేను అలాటి సమయాలలో నాకే సహాయం చేసుకోలేని నిస్సహాయుడనుగా ఉండవచ్చు

(10) నీవు నన్ను 'అవతారుని'గా 'దేవుని'గా, దయ్యముగా లేక నీ యిష్టము వచ్చినట్లు ఏవయినా అని నీవు నమ్మవచ్చు, కాని నేను మీ మధ్యను

మీ స్నేహితునిగా, శోవరునిగా జీవిస్తున్నను నిజంగా నేను మీ యజమానుడను. నాకు మీరు మిక్కిలి విధేయులై ఉండాలి

(ఈ మాటలు నూతన జీవితంలో బాబా చెప్తున్నారని జ్ఞాపకముంచుకోవాలి)

(11) నేను మీకు ఎప్పుడయినా ఏ ఆజ్ఞనయినా యివ్వవచ్చును; అది మీరు పాటించాలి. ఈ ఆజ్ఞలు ఆధ్యాత్మికమయినవిగా ఉండవు ధ్యానము వగైరా మీకు ఆధ్యాత్మికంగా ఏదో ఉపదేశం చేస్తానని మీరు ఆశించవద్దు. మంచి అయినా చెడ్డ అయినా నేను మిమ్మ ఏదయినా చేయమని ఆదేశించవచ్చు. నే చెప్పిన వెంటనే దానిని మీరు ఆచరించాలి. నాకు, నా శరీరానికి, ఏదయినా మిమ్మల్ని చేయమని అడుగవచ్చు—నామీద ఉమ్మి వేయమనవచ్చు, నన్ను తన్నమని చెప్పవచ్చు, నన్ను తిట్టమని చెప్పవచ్చు. అటువంటి నా ఆజ్ఞలను సంకోచం లేకుండా మీరు పాటించాలి. ఆచరించాలి. నేను మీ పాదాలమీద నా శిరస్సును ఉంచవచ్చును మీ పాదాలను నేను కడుగవచ్చును. ఇలాంటి పనులు నేను ఏవయినా చేస్తే మీరు సంకోచము చూపరాదు. అభ్యంతరపెట్టరాదు. ఏ విధమయిన ఉద్రేకము కనపరచరాదు మీరు ఏమాత్రము సంకోచము, అభ్యంతరము, ఉద్వేగము కనపరచినా నేను మిమ్మ నా నుండి పంపించెయ్యవచ్చును.

(12) సాధారణమయిన ఆజ్ఞగాని, అసాధారణమయిన ఆజ్ఞగాని నేను ఏది యిచ్చినా మీరు వెంటనే అది పరిపాలించాలి.

(13) నేను ఏమి చెప్పినా వీలి వెంటనే ఆచరిస్తూ, అది నేను గంభీరముగా యిచ్చిన ఆజ్ఞవలె, నిజాయితీతో, శ్రద్ధతో పరిపాలిస్తూ చెప్పినపని ముఖ్యమని భావిస్తూ చేయవలెను గాని, యింత కాలం పడుతుందని ఆలస్యమవుతుందని భావించరాదు. కాని ఆ విషయం నాకు మీరు చెప్పవచ్చును.

(14) III పథకంలో దానిని ఆచరించే విషయంలో ఏ సంగతయినా నాకు మీరు చెప్పవచ్చును

(15) ఒకే సమయంలో ఒకటి కంటె ఎక్కువ ఆజ్ఞలు నేను యిచ్చినచో నీవు ఏది ముఖ్యమని భావిస్తావో అది ముందు చేయవలెను.

(16) ఏ పరిస్థితులలోను మీరు వాతో వాదించరాదు. నేను అడిగినప్పుడు సంగతి వివరించవచ్చును

(17) నేను మీకు చెప్పమని అంటే తప్ప మీకు ఏసూచనా చేయకూడదు.

(18) అన్నివేళలా మీరు సంతోషకరంగా ఉండడానికి ప్రయత్నించాలి.

(19) స్త్రీలను మీరు తాకరాదు. ఎవరితోను—మగ, ఆడ, చిన్న, పెద్ద — కామప్రేరితమయిన పనులు చేయకూడదు. అవసరమయినప్పుడు స్త్రీలతో మీరు మాట్లాడవచ్చును.

(20) మీరు డబ్బును ముట్టరాదు. ఎవరి వద్దనుంచి డబ్బు అంగీకరించకూడదు, ఎవరికీ మీరు డబ్బు యివ్వరాదు, నాకు కూడా ఏపనికోసమయినా నేను మీకు డబ్బు యిస్తే మీరు దానిని III — పథకంలో వారితో-వారికి కూడా నేను డబ్బు ముట్టడానికి అనుమతి యిచ్చి ఉంటే — ఉచితమయినరీతిని చేయవచ్చును.

(21) రాజకీయాలు మీరు చర్చించరాదు.

(22) మీరు ఎవరిమొదల కోపం ప్రదర్శించరాదు. ఎటువంటి కవ్వింపు వచ్చినా వాచా కర్మణా మీరు కోపం వ్యక్తం చేయరాదు.

(23) ఎవరినీ అన్యాయంగా, సమక్షంలో గాని, పరోక్షంలో గాని విమర్శించరాదు. నీ మనసులో నీకు ఎప్పుడయినా కోపం కలిగినా మాట ద్వారాను, చేత ద్వారాను నీవు అది ఎప్పుడూ ప్రదర్శించరాదు.

(24) నీవు అబద్ధాలు చెప్పకూడదు అంతా బిట్టబయలుగా, ఉన్నది ఉన్నట్లుగా, తెలిపినట్లు, ఉంటుంది సత్యం తప్పించుకోవాలని ఉండదు మిమ్ము ఎవరయినా మీరెవరని గాని బాబా యెవరని గాని అడిగితే నిజం చెప్పాలి.

(25) మీరు ఎవరి వద్దనుంచి గౌరవ వందనం స్వీకరించరాదు అలాటి పరిస్థితి మీరు కల్పించి మీకు గౌరవ వందనం ఆహ్వానించరాదు. మీ అజ్ఞానంలేకుండా

అది మీకు ఎవరయినా యిస్తే వారు ఎలా చేసారో అలాగే మీరు వారికి చెయ్యాలి. నేను మీ పాదాల మీద నా చేతిని పెడితే లేక మీ పాదాలు నేను కడిగితే, యిది నా ఆజ్ఞగా భావించాలి గాని పైన చెప్పినట్లు గౌరవ వందనంగా భావించరాదు.

(26) నాకు ఎవరివలన గౌరవ వందనం కలిగేలా మీరు ప్రవర్తించరాదు.

(27) మీకు వంశ పారంపర్యా వచ్చినది III పథకం ప్రకారం నాకు యివ్వాలి సహచరులకోసం

(28) I-B, I-C, II పథకాల సహచరులనుండి నేను III పథకంలో సహచరులకోసం, ధనేతరమయినది అంగీకరించను

(29) నవ్య జీవనం అనంతమయినది. అపారమయినది ఇదే పడమటి దేశాలలో గాని తూర్పుదేశాలలో గాని అనుసరించవచ్చును నవ్య జీవితం నాలుగు భాగాలుగా ఉంది — శ్రమ చేయడం, భిక్ష మెత్తడం, జిప్సీ జీవితం. లంగోటీ జీవితం III పథకంలోని సహచరులు శ్రమజీవితం జీవించనక్కరలేదు. అది I-B, I-C, II పథకాల వారికి మాత్రమే శ్రమ జీవితం అంటే వారి స్వంత జీవన భృతికోసం శ్రమపడి పనిచేయడం III పథకంలో సహచరులు వారి జీవనం కోసం భిక్షమయినా ఎత్తాలి వారి పోషణకి, లేక I-B, I-C, II పథకాలలోని సహచరులు యిచ్చిన దానితో జీవించాలి.

(30) నవ్యజీవితానికి కాలంతో నిమిత్తం లేదు భిక్షాటన జిప్సీ జీవితం, లంగోటీ జీవితం ఎప్పుడయినా చేయవచ్చు – వ్యక్తిగతంగా కాని, సామూహికంగా గాని, లేకపోతే చేయడం మానివేయవచ్చు, నేను చెప్పిన ప్రకారం.

(31) నేను ఆజ్ఞాపిస్తే మీ స్వంత ఆహారం కోసం మీరు భిక్షమెత్తాలి. అది వండిన ఆహారమై ఉండాలి, తినేటందుకు వండుకోవలసిన అవసరం లేకుండాను.

(32) మీ స్వంతానికి కావలసిన ఆహారం తప్ప ఏదీ మీరు భిక్ష మెత్తకూడదు భిక్షగా అంగీకరించకూడదు మీరు భిక్షమెత్తకుండా ఏవీ అంగీకరించకూడదు.

(33) టీ గాని పొగాకు ఏ రూపంలో నయినా గాని వ్యక్తిజీవిత సహచరుల వద్దనే అంగీకరించి స్వీకరించాలి

(34) తెలియకుండా, అలా చేద్దామని అభిప్రాయం లేకుండా, యీ ఆజ్ఞలు ఏవయినా ఉల్లంఘిస్తే లేక ఏ యితర ఆజ్ఞయినా ఉల్లంఘిస్తే నేను మిమ్మల్ని క్షమిస్తాను మీకు కామవికారమయిన ఆలోచనలు, కోపము, ఆశ, వగైరాలు కలిగితే అవి అతిక్రమించిన భావించను.

ఇందులో యీ జాబితాలో చూపించిన ఆజ్ఞలన్నీ మీ మీద బాధ్యత మోపుతున్నాయి అయినా ఏ ఒక్క షరతుగాని, ఆజ్ఞగాని నాకు బంధకము కాదు నేను ఎల్లప్పుడు స్వేచ్ఛగానే ఉంటాను. మీకు నేను ఏ ఆదేశమయినా చేయవచ్చును. ఆ ఆదేశము యీ ఆజ్ఞలను వేటినయినా లేక అన్నిటినీ అయినా రద్దుచేయవచ్చును. ఏ షరతునయినా మార్పు చేయవచ్చును

మీరు వ్యక్తిజీవితంలో ఏ విధమయిన లాభము పొందరన్నది నిశ్చయముగా మీరు తెలుసుకోవాలి ఇదొక్కటే నేను స్వేచ్ఛలేకుండా బంధితుడనయినది మీరు ఏ విధమయిన కష్టానికయినా ఆశాభంగానికయినా సిద్ధంగా ఉండాలన్న షరతు కూడా ఎప్పటికీ ఉంటుంది ఇది మాత్రం నేను మార్చను. నా వల్ల యీ షరతు రద్దు కాబడదు

దేవుని యెదుట నీ వ్యక్తిగత బాధ్యత నుంచి తప్పించడానికి నేను ఎటువంటి ఆజ్ఞ ఎన్నడూ యివ్వను ఇది మీరు స్పష్టంగా తెలుసుకోవాలి. దేవుని యెదుట నీ బాధ్యత అన్నికాలాలకి ప్రతీ ప్రతిఫలానికి నీమీదే ఉంటుంది. ఈ బాధ్యత మార్చడానికి, రద్దు చేయడానికి నేనెట్టి ఆదేశమూ యివ్వను.—

మెహెర్‌బాబా."

ఫిబ్రవరి 13 వ తేదీనే మంజ్రీమాఫి నుంచి డా॥ డాన్కిన్ డేరాడూన్ వెళ్ళాడు. అతనికి వెళ్ళేటప్పుడు అందరు శుభాకాంక్షలు తెలిపారు బాబా కూడా బృందములో కలిసి అతడు వెళ్ళేటప్పుడు కరచాలనం చేసారు.

రెండు రోజులనుండి రాత్రిపూట చలివేస్తోంది ఎక్కువగా. ఫిబ్రవరి 14 వ తేదీ ఉదయం ఆకాశం కారుమేఘాలతో ఆవరించబడి ఉంది. ఏ క్షణాన్నయినా పెద్ద

వర్షం కురుస్తుందేమో అన్నట్లుంది. మధ్యాహ్నం 12 గంటల ప్రాంతాల్లో పెద్ద చినుకులతో వర్షం పడింది సహచరులంతా ఉదయాత్పూర్వమే చీకటితో అల్పాహారం ముగించారు. బాబా టీ, చపాతీ తీసుకున్నారు అందరినీ ఆరోగ్యం ఎలా ఉందో అడిగి తెలుసుకున్నారు. పైనందిన ఆదేశాలను విధేయతతో పాటించాలని మరల సహచరులను హెచ్చరించారు బాబా. బాబా ఒక్కొక్కప్పుడు నవ్వుతూ నవ్విస్తూ ఉంటారు. కొన్ని సమయాలలో చాలా గంభీరంగా ఉంటారు. మాట్లాడించడానికి భయంగా ఉంటుంది బాబాకి సత్యపాల్ అనే పరిచారకుడు ఒకడున్నాడు. ఈ రోజు (14-2-50) ఉదయం 6 గంటలకి బైదుల్‌ని సత్యపాల్‌ని రిషీకేశ్ పంపించారు గంగా జలం తేవడంకోసం హరిద్వార్ నుంచి సదాశివ్‌పటేల్ తెచ్చిన గంగాజలం మిగిలిపోతే అది గంగలో పోసేసి ఆ డబ్బాలతోనే తీసుకురమ్మని పంపించారు బైదుల్‌ని వచ్చేటప్పుడు రెండు చిన్న మేకలను కొని తీసుకురమ్మన్నారు

బాబా విష్ణుచేత నూతన జీవిత పథకాల నిబంధనల ప్రతి ఒకటి డాన్‌కి పంపిస్తూ యీ విధంగా బాబా వ్రాయించారు —

"డాన్‌కి,

నీవు ఒక్కడివే I–B, పథకంలో ఉన్నావు నేనేమీ కలుగజేసుకోకుండా నీకు యీ క్రింది విషయం జ్ఞాపకం చేస్తున్నాను—

నీకు వీలయితేనే నీవు పంపగలిగితేనే నీ సంపాదనలో నుంచి, నీకు నీ వృత్తికి కావలసిన సొమ్ము అట్టే పెట్టుకుని III పథకం కోసం నాకు స్త్రీలకు పంపించాలి. నీకు సాధ్యమయినంతవరకు గుస్తాద్‌జీ కాకాల భోజనం నిమిత్తం ప్రతి నెల రు 150/- యివ్వాలి. 14 వ తేదీన బాబా మంజ్రీమాఫిలో గృహనిర్మాణం జరిగే స్థలానికి మూడు మార్లు వెళ్ళి చూశారు ఈ నెలాఖరుకి పని ఎలాగయినా పూర్తవాలని చూస్తున్నారు మార్చి మొదటివారంలో లందులోకి మారాలని చూస్తున్నారు.

సాయంత్రం వరకు మబ్బుగాను చలిగాను ఉంది. సాయంకాలానికి విష్ణు దేరాడూన్ నుంచి తిరిగివచ్చాడు. ఇంటి స్వంతదారుతో డాన్ చేసుకున్న అద్దె ఖరారునామా బాబాకి చూపించాడు డాన్ వైద్యవృత్తి ప్రారంభించడానికి అక్కడ యిల్లు మాట్లాడుకున్నాడు మర్నాడే డాన్ ఆ క్రొత్తయింటిలో ప్రవేశిస్తాడు నారావాలా

యొక్క కృషివలన యీ బిల్లు దొరికింది. బాబా సురేశ్‌తో జబ్బుగా ఉన్న గ్రామస్తులకు హోమియోపతి మందులు యివ్వడం గురించి మాట్లాడారు

ఫిబ్రవరి 15 వ తేదీన ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యరశ్మి బాగా ప్రకాశిస్తోంది. చలితో బాధపడుతున్నవారికి. కొంత వెచ్చదనం చేకూర్చింది. మంచుపారే కొండల మీదుగా ఉన్న భాగమంతను కొంతవరకు యీ ఎండ తొలగించి వేసింది.

బాబా ఉదయం అల్పాహారం ఏమీ తీసుకోలేదు. సహచరులు కూడా టీ మాత్రమే తీసుకున్నారు. 3 కేశ్ నుంచి వైష్ణవ్ గంగాజలంతో తిరిగి వచ్చాడు. అతనితో రెండు పెద్ద డబ్బాలనిండా గంగాజలం తీసుకువచ్చాడు. బాబా చెప్పిన ప్రకారం అతడు ముందు గంగలో స్నానం చేసి తరువాత డబ్బాలలో నీరు పట్టాడు, డబ్బాలు శుభ్రపరిచాక మధ్యాహ్నం 12-30 గంటలకు బాబా ఒక డబ్బా గంగా జలంతో స్నానం చేసారు. తరువాత రెండో డబ్బా జలం మార్చి 1 వ తేదీన ఉపయోగిస్తానని బాబా చెప్పారు

బాబా మెహెర్‌జీ నారిమన్‌లకి (ఏర్పాటు దార్లకి) ఒక ఉత్తరం విష్ణుకి చెప్పి వ్రాయించారు.

"మెహెర్‌జీ - నారిమన్‌లకు,

అత్యవసరాలకి మీ దగ్గర ఉంచిన రు 7,000/- లోను వెంటనే నాకు రు 2,000/- పంపించండి. ఇది డేరాడూన్‌లో ఇంపీరియల్ బ్యాంకు మీద డ్రాఫ్టు రూపంగా పంపవలెను. అది విష్ణుదేవరుక్షర్ పేరుమీద పంపవలెను. ఇప్పుడు అత్యవసరాలకి మిగిలిన రు 5,000/- యింకా నవ్య జీవిత సంబంధమయిన డబ్బు ఏదయినా ఉంటే అది మీవద్ద ఉంచవన్నమాట. ఏర్పాటుదార్లందరికీ యీ సంగతి తెలియజేయవలెను.

ఎమ్. ఎస్. ఇరానీ (బాబా)."

ఆ సాయంకాలం వరకు వెచ్చగానే ఉంది వాతావరణం. రాత్రి పడేసరికి ఎన్ని దుస్తులు వేసుకున్నా అందరికీ చలిచేత వణుకు పుట్టింది

16 వ తేదీన ఉదయం సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు ఆకాశంలో మేఘాల ఆనవాలయినా లేదు ముస్సూరి కొండలు దూరాన తెరమాటున ఉన్నట్లు కనబడుతున్నాయి ఎందుచేతంటే వాటి మీద ఒక సన్నని మంచుతెర ఉన్నట్లుంది నిన్నటిరోజున బాబాకు మెహెరామీద కోపం వచ్చింది అందుకు యీ రోజున సహచరులను (పురుషులను) పిలిచి ఒక్కొక్కరినే వచ్చి ఆయనను ఒక లెంపకాయ కొట్ట మని చెప్పారు. అందరూ బాబా చెప్పినట్లు చేసారు ఆయన చెప్పినది జవదాటలేరు. ఎంత అసంతోషకరమయిన పనయినా వారికి చేయక తప్పదు అలా చేయడానికి ఏ మాత్రమూ సంకోచము కనపరచకూడదు లేకపోతే అవిధేయత క్రింద వస్తుంది.

శత్రుఘ్న బాబా వద్దకు వచ్చి 18 వ తేదీన బిరేంద్ర పండే మోతీచర్ లోని యిల్లు చూడడానికి బాబాతో మోతీచర్ వస్తాడని చెప్పాడు మోతీచర్ దేరాడూన్‌కి 16 మైళ్ళ దూరం ఉంది బాబా మంజిమాఫి వెళ్ళి వస్తూంటే దారిలో ఒక వృద్ధవనిత బాబాను ఆగమని ఆమె "కుమారుడు జబ్బుగా ఉన్నాడు చూడమని" ప్రార్థించింది బాబా ఆ పిల్లవాని జబ్బుగురించి అడిగి బాబాతో అప్పుడున్న డా॥ నీలుని వానిని పరీక్ష చేసి పిల్లవానికి మందు యిమ్మన్నారు. ఆ పిల్లవానిపేరు ఘసిత అతనికి గతరాత్రి 30 విరేచనాలు వెళ్ళాయి 20 సార్లు వాంతులుకూడా అయాయి వీలయినంతగా నీలు జాగ్రత్తగా అతనికి మందు యిచ్చాడు ఘసిత కుటుంబం వారు చాలా పేదవారు. ఆ చుట్టుప్రక్కల అందరూ అలాంటివారే వారికి ఆహారలోపము వస్త్రలోపము ఉండగా మందులు మాకులు ఎలావస్తాయి ?

మరునాడు (17-2-50) కూడా వాతావరణం చక్కగా ఉంది ఉదయాన సూర్యరశ్మి బాగా ఉంది రోజు రోజుకీ చలి కొంచెం తగ్గుతూ వస్తోంది చల్లని గాలి హాయిగా ఉంది పొగమంచు కూడా తగ్గుతోంది పిచ్చుకలకి చిలకలకి వాతావరణం ఉల్లాసకరంగా ఉంది కాబోలు అవి అటూ యిటూ ఎగురుతూ హాయిగా ఆనందంగా ఆడుతున్నాయి ముస్సూరి కొండలు బాగా కనిపిస్తున్నాయి

బాబా ఆరోజున సోదరుడు జాల్‌కి ఉత్తరం వ్రాయించారు –

మంజిమాఫి,
దేరాడూన్, 17-2-50.

జాల్‌కీ,

నీకు సర్క్యులర్ లేఖలు నూతన జీవిత పథకాలు అంపుతూ ఉన్నాయను

వుంటావు నీవు పాత జీవితంలోనే ఉన్నావు గనుక నీకు యీ పథకాలతో సంబంధం లేదు-

నేను కొందరు నవ్యజీవిత సహచరులతో మోతీచూర్‌లో (హరిద్వార్‌కి 4 మైళ్ళ దూరంలో) కుంభమేళాపనికోసం ఉండబోతున్నాను.

మార్చి 1 నుండి మా నూతన జీవితం (భిక్షాటన వగైరాలతో) నిక్కచ్చిగా ప్రారంభమవుతుంది ఇప్పుడు ఎవరయినా పాత జీవితంవాడు నేను అవసరం ఉండి పిలిచినపుడు వస్తే అతడు III పథకం వాళ్ళతో ఉంటున్నపుడు అతని భోజనం అతనే తెచ్చుకుని తినాలి రాకపోకల ఖర్చులు అతనే పెట్టుకోవాలి కాని నీవు మాతోవచ్చి ఉండవచ్చు నీభోజనం కూడా యిక్కడ దొరుకుతుంది నీకా అనుమానం అక్కరలేదు దానికి నీవు డబ్బు యివ్వక్కరలేదు. నీవు ఆరోగ్యంగా ఉంటే, నీకు రావాలని యిష్టంగా ఉంటే, నీవు వచ్చి మాతో చేరవచ్చు మార్చి 5 వ తేదీనుండి ఒకటి రెండు మాసా లుండవచ్చు

నీవు జ్ఞాపకం ఉంచుకోవలసిన ముఖ్యమయిన విషయం ఏమిటంటే నీవు యిక్కడ ఉన్న రోజులలో పాత జీవితపు మనుష్యుల గురించి ఒక్క మాటయినా ఆడకూడదు నీ గురించయినా పాత జీవితపు మాటలు మాట్లాడరాదు

నీవు వచ్చేమాటయితే మొదట డేరాడూన్‌లో శేఠ్ నారావాలా యింటికి వెళ్ళు అతడు యిక్కడకు నిన్ను పంపిస్తాడు నీవు డేరాడూన్‌కి మార్చి 5 వ తేదీన వచ్చేలాగ యింటివగ్గర బయలుదేరాలి 1వ అక్టోబరు' 49 నుండి నేను వాగ్దానం చేసిన మనిషివి నీవే ఇప్పుడు ఆ వాగ్దానం చెల్లించుకునేందుకే యీ ఉత్తరం వ్రాస్తున్నాను ఈ రెండు నెలల కాలంలోను భోజనం విషయంలో ఏలోటూ రాదు రాను పోను రైలు ఖర్చులు యిస్తారు—నీకు నేను అటువంటి వాగ్దానం చేసి ఉంటే నీవు దీనికి జవాబు యివ్వనక్కరలేదు నీ నిర్ణయం టెలిగ్రాం యివ్వు — మెహెర్‌బాబా C/o నారావాలా, 36 రిట్టన్‌రోడ్, డేరాడూన్ అని వ్రాయాలి

—బాబా''

శత్రుఘ్న నిన్న యిక్కడికి బాబాను చూడటానికి వచ్చాడు బాబాదాస్‌ను డేరాడూన్ రైల్వేస్టేషన్ వద్ద చూసానని బాబాకి చెప్పాడు అతడు తనను అత్యవసర

రంగా నారావాలా యింట్లో ఎరచ్‌తో మాట్లాడాలని బాబాకి చెప్పమన్నాడని చెప్పాడు. అప్పుడు ఎరచ్‌ను పంపకుండా బాబా నారావాలా యింటికి విష్ణుని పంపించారు విష్ణు బాబాదాస్‌ను కలుసుకున్నాడు తనకు శ్రీపత్ సహాయ్ సిఫారసుతో రెండు లక్షల కంట్రాక్టుపని వచ్చేలా ఉందని అది తీసుకోవడానికి తనకు బాబాయొక్క అనుమతి కావాలని బాబాదాస్ విష్ణుతో చెప్పాడు I-C పథకంలో ప్రవేశించక పూర్వము తరువాత కూడా పాతజీవితపు సభ్యులయిన తోకీసింగ్, కిషన్ సింగ్, క్రైన్, హార్‌జీవన్ లాల్, ఖరే, డా॥ నాథ్, శ్రీపత్ సహాయ్‌లను ఏవిధమయిన సహాయమూ కోరకూడదని అనేకమారులు చెప్పానని బాబా అన్నారు అతని కాళ్ళమీద అతడు నిలబడాలని, వ్యాపారం చేయాలి లేక ఏదయినా ఉద్యోగం చేయాలని తన జీవనం ఆ విధంగా చేసుకోవాలని, తన పోషణకు కావలసినంత తీసుకున్నాక నవ్యజీవితానికి యివ్వగలిగితే అప్పుడే మిగిలిన డబ్బు పంపించాలని వ్యాపారానికి అప్పుజేసి ఉంటే అది తన బాధ్యత పైననే చేయాలని, కానుకలు గాని బహుమతులు గాని గ్రహించరాదని బాబా వివరించి చెప్పారు బాబాతో ఉన్నపుడు యీ విషయాలన్నీ అనేకమారులు బాబాదాస్‌కి చెప్పడం జరిగిందన్నారు కొన్ని సమయాలలో ఆదీ (సీ) చేతను డా॥ గనీ చేతను కూడా చెప్పించానన్నారు ఇవన్నీ మళ్ళీ బాబాదాస్‌కి వివరించమని బాబా విష్ణుతో చెప్పారు I-C పథకంలోని షరతులు బాబాదాస్ నూటికి నూరుపాళ్ళు పాటించాలన్నారు బాబా.

ఆ సాయంకాలం డా॥ నీలు వెళ్ళి ఘనీతని చూసివచ్చాడు. అతనికి బాగా నయంగా ఉంది, పేగులు విరేచనాలు కట్టాయి. జ్వరం తగ్గింది. ఇంక అతనికి అపాయం లేదు గతరాత్రి అతనికి బాగా నిద్ర పట్టింది

18 వ తేదీ ఉదయం చాలా ఆహ్లాదకరంగా ఉంది వాతావరణం సూర్య ప్రకాశం బాగా ఉంది. చల్లగా ఉంది గాని చలిగా లేదు ఆ రోజున పొగమంచుకూడా అట్టే లేదు. ముస్సూరీ కొండలు బాగా కనిపిస్తున్నాయి కొండల వెనుక ఆకాశం నీలంగా నిర్మలంగా చక్కని దృశ్యాన్నిస్తోంది. బిరేంద్ర వచ్చి ఉదయాన్నే బాబాను తన కారులో మోతీచర్ తీసుకువెళ్ళాడు బాబాతో కూడా ఎరచ్, శత్రుఘ్న, కేకి, నారావాలా కూడా వెళ్ళారు మోతీచర్ యింటికి చేసిన మరమ్మతు పనులన్నీ బాబా చూసారు. ఆ ఆవరణలో ఒక గుడారం వెయ్యాలని, తమకోసం ఒక చిన్న కుటీరం నిర్మించాలని ఆయా స్థలాలు చూపించి చెప్పారు బాబా తరువాత బిరేంద్ర బాబాని

మిగిలిన పరివారాన్ని హరిద్వార్ తీసుకువెళ్ళాడు హరిద్వార్‌లో పలుకుబడిగల ఒక మంచివాడయిన సంసార్‌చంద్ గోహెర్ అనే వానిని కలిసాడు. మోతీచర్‌లోని యిల్లు అతనిదే. 26 ఫిబ్రవరి నాటికి అక్కడి యింటి ఆవరణలో కుటీర నిర్మాణం చేయించి, మరమ్మతు పనులన్నీ పూర్తి చేయించి ఆవరణ అంతా పరిశుభ్రం చేయిస్తానని సంసార్‌చంద్ చెప్పాడు ఆ ఉదయం మోతీచర్‌యిల్లు చూడడానికి బాబాను తీసుకు వెళ్ళడానికి ఆలస్యం అయిందని బాబాకి కోపం వచ్చింది విరేంద్రమ అందుకు కోపపడ్డారు బాబా. అందుకని మంత్రిమాఫి తిరిగి వెళ్ళాక బాబా సహచరులను పిలిచి ఒక్కొక్కరినే బాబాను చెంపలాయ కొట్టమన్నారు వాళ్ళు బాబా చెప్పినట్లు చేయవలసి వచ్చింది

ఇంతకు ముందు ఒకరోజున డాన్‌ద్వారా బాబా ఎలిజబెత్‌కు ఉత్తరం వ్రాయించారు. అందులో బాబాను ఆమె ఎప్పుడు అమెరికా రమ్మని ఆహ్వానిస్తే అప్పుడు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నారని, యీ సంవత్సరం జూలై నెలలో రమ్మని ఆమె ఆహ్వానిస్తుందా అని అడిగారు బాబా ఏ సంవత్సరం ఏనెలలో ఆమె బాబాని రమ్మనడానికి సిద్ధంగా ఉందో వ్రాయాలని బాబా కోరారు. బాబా నేపాల్, టిబెట్ దేశాల పర్యటన దానినిబట్టి ఏర్పాటు చేసుకుంటామని చెప్పారు అమెరికాలో ఉన్నప్పుడుకూడా బాబా తను నవ్య జీవితాన్ని కొనసాగిస్తానని ఎలిజబెత్‌కి వ్రాయించారు. అంటే దాని అర్థం ఎవరినీ బాబా చూడరు, ఎవరితోను సంభాషించరు, గురుత్వ శిష్యత్వ భావం ఉండదు. ఎవరికీ ఆశీస్సులుండవు అని వివరించారు బాబా. ఈ షరతులమీద బాబాను ఆమె ఎప్పుడు రమ్మంటుందో వ్రాయమన్నారు. జూలై లోపుగా ఆమె ఉత్తరం రావాలి. ఈ లోపుగా మార్చి ఏప్రెల్ మాసాలలో బాబా హరిద్వార్‌లో కుంభమేళా పని చూసుకుంటారు

డా॥ నాథ్‌ను కలుసుకోవడానికి శాకాకి మందు తీసుకురావడానికి, డా॥నీలు దేరాడూన్ వెళ్ళాడు బాబాయొక్క ప్రస్తుత కార్యక్రమం ఏమిటని డా॥ నాథ్ అడిగి తెలుసుకున్నాడు. డా॥ నీలు, నాథ్‌తో బాబాయొక్క నూతన జీవిత పథకాల గురించి దీర్ఘంగా మాటలాడాడు.

ఆ సాయంకాలం చలి ఎక్కువగా ఉంది. నీలు మందిస్తున్న ఘసిత బాగా కోలుకున్నాడు, లేచి తిరుగుతున్నాడు. అతడు అతని తల్లి డా॥ నీలుకి ఎన్నో ధన్య

పాదాలు సమర్పించారు ఆమె తన కండ్లలో నీరు నింపుకుని మాట్లాడింది తన తనయునికి త్వరగా నయం చేసినందుకు కృతజ్ఞత తెలుపుకుంది. అదంతా బాబా దయవలన జరిగిందని నీలు జవాబు చెప్పాడు. ఆ సాయంత్రం మరల వారు బాబా దర్శనం చేసుకునే అవకాశం కల్గింది ఆయన మంత్రిమాఫి యిల్లు కట్టడం చూసి తిరిగి వెళ్తున్నారు. బాబాకు ఎంతగానో వారు తమ కృతజ్ఞత వెలిబుచ్చారు.

19 వ తేదీన ఉదయాన్నే ప్రభాత వాయువులు చల్లగాను మనోల్లాసకరం గాను ఉన్నాయి. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. సాయంకాలం డాన్ దేరాడూన్ నుండి వచ్చాడు బాబాను చూడడానికి దాదా అతడు వచ్చాడని చాలా సంతోషించారు. బాబా అతనిని అనేక ప్రశ్నలు అడిగి సంగతులు తెలుసుకున్నారు తన ఆస్పత్రిలో నర్సులు వగైరా గురించి, యింటికి కావలసిన మరమ్మతులు గురించి అడిగి తెలుసు కున్నారు. సహచరులు కూడా అతనితో ఆనందంగా కొంత సమయం గడిపారు. అతడు సాయంత్రం ప్రొద్దుపోయాక దేరాడూన్ తిరిగి వెళ్ళాడు

20 వ తేదీ ప్రకాశవంతమయిన సూర్యరశ్మితో, నవనవంగా ప్రాతఃకాలం ఆనందం గొలుపుతోంది ఎండ బాగా కాస్తున్నా, గాలి చలిచలిగానే ఉంది అల్పా హారం తీసుకునేటప్పుడు తను మౌనంగా ఉంటూనే గుస్తాద్‌జీ అనేకమయిన నవ్వు వచ్చే కబుర్లు చెప్పాడు. ఏవో కథలు చెప్పాడు, అందరినీ నవ్వించాడు

III పథకం క్రింద షరతులన్నీ దాదా మళ్ళీ సహచరులందరకు నూతన జీవితపు షరతులన్నీ వివరించారు. ఈ షరతులన్నీ చూడగానే తెలిసేలా సహ చరులకోసం ఒక చార్టు తయారుచేసి గోడకు తగిలించారు. ఈ పనికి ఆరోజంతా పట్టింది

ఫిబ్రవరి 21 వ తేదీ ప్రాతస్సమయం చాలా మనోహరంగా ఉంది. సూర్యభగవానుడు అందరికీ ఆ చలికాలంలో వెచ్చదనాన్ని ప్రసాదిస్తున్నాడు ఇంత వరకు వ్రాసిన దినచర్య అంతా ముద్రణ చేయడానికి బాబా ఏర్పాటుదార్లకి పంపించారు. ఈ రోజునుండి I–C పథకంలోని సహచరుడయిన ఆదీ ద్వారా వారికి వెళ్ళేలా ఏర్పాటు చేసారు.

III పథకం ప్రకారం నూతన జీవితం ఎలా ఉండాలో మణేని షరతులన్నీ టైపు చెయ్యమనేవారు ప్రతులు టైపు చేయించి ఆదీ వగైరాలకి పంపించారు. ఇండియా, పాకిస్తాన్, సిలోన్ దేశాలలోని బాబా భక్తులకు పంపించారు.

22 వ తేదీన బాబా మార్చి ఏప్రెల్ నెలలకు కార్యక్రమం స్థిరపరిచారు బాబా విష్ణు, నీలు, కాకా, మహంత్‌లను పురుషసహచరులు ఉండడానికి కొత్తగా మంజ్రీమాఫిలో కట్టిన యింటికి 28 వ తేదీన వెళ్ళనున్నారు బాబా ఈ నూతన గృహం నవ్యజీవితానికి కేంద్ర కార్యాలయంగా ఉంటుంది. స్త్రీలు 2 రోజులు ముందే వారి కోసం నిర్మించిన యింటికి వెళ్ళి ఉంటారు – 26 వ తేదీన. మామూలు ప్రకారంగా స్త్రీలకు బజారులో కావలసిన వస్తువులు – కూరలు వగైరా – విష్ణు తెచ్చిపెడతాడు డా॥ నీలు యింకా స్త్రీలకి కావలసిన యితర అవసరాలు చూసి పెడతాడు అతడు కాకా ఆరోగ్యం గురించి కూడా జాగ్రత్తపడతాడు I-B పథకం క్రింద ఉన్న కాకా, విష్ణు, నీలుంతో వారున్న యింట్లోనే ఉంటాడు

బాబా చెప్పినట్లుగా మార్చి, ఏప్రెల్ రెండు నెలలకు డా॥ డాన్‌కిన్ కు 300/- యిస్తాడు ఇది కాకా గుస్తాద్‌జీల పోషణకోసం – వారి భోజనాల ఖర్చుకి. (I-B పథకంవారున్నారు) ఆ మొత్తంలోనుంచి బాబ స్త్రీలను కాకాకి గుస్తాద్‌జీకి, నీలూకి కూడా ఆ రెండు నెలలకి భోజనం పెట్టమని చెప్పారు టీ కూడా సకాలంలో యిమ్మన్నారు.

హరిద్వార్ నుంచి $4\frac{1}{2}$ మైళ్ళ దూరంలో ఉన్న మోతీచర్ యింటికి ఎరచ్, గుస్తాద్‌జీ, బైధుల్, మురళీ, పెండు, ఆలీ అక్బర్‌లతో బాబా మార్చి 2 వ తేదీన వెళ్తారు. అక్కడి నుంచి వెళ్ళి హరిద్వార్‌లో కుంభమేళాపని చేస్తారు పురుష సహచరులతో యీ రెండు నెలల భిక్షాటనచేసి నెలాఖరుకి మిగిలిన సరుకులతో బాబా జీవిస్తారు.

కుంభమేళా షరతుల ప్రకారం డా॥ గోహర్ బాబాకి ఆయన సహచరులకి టైఫాయిడ్, కలరా వ్యాధులు సోకకుండా, టీకాలు వేసింది. కైకోబాద్ మార్చి, ఏప్రెల్ నెలలలో నీలు విష్ణులతో నివాసం ఉండడానికి మామూలు ప్రకారంగా అతనికి శత్రుఘ్న భోజనం పెట్టడానికి టీ యివ్వడానికి ఏర్పాటు చేసారు. ఇట్లు శత్రుఘ్న మార్చి ఆఖరువరకూ జరుపుతాడు.

వ్యక్తిగతంగా మెహెరాబాద్ లోని పాత జీవితపు శిష్యుల అందరి వ్యవహారాలు బాబా స్థిరపరిచారు. కైకోబాద్ గురించి అతడు చెప్పమన్నది బాబా అంగీకరించారు. కైకోబాద్ నవ్య జీవితంలో ఉండి నూటికి నూరుపాళ్ళు అది పాటించడానికి ఒప్పుకున్నాడు. కానీ అతడు వృద్ధుడు, బలహీనుడు గనుక అతన్ని రిషీకేశ్, హరిద్వార్‌లలో ఎక్కడయినా పెడితే ఆఖరిరోజులు హాయిగా శాంతంగా గడుపుతానని బాబాకి చెప్పుకున్నాడు. అందుచేత అతన్ని వెంటనే (అక్టోబరులోనే) ఢిల్లీ కేకిదేశాయి వద్దకు పంపించి మంత్రిమాపిలో ఉన్న యింటిలో అతన్ని ఉంచమని కేకిదేశాయికి బాబా వ్రాయించారు. ఆ యింటిలో నవంబరు 1 వ తేదీ (1949) నుంచి నివసించమని కైకోబాద్‌కి చెప్పారు. అతని భోజన ఖర్చులకు గాను బాబా కేకీదేశాయికి రు 500/- యిచ్చారు. అది మార్చి 1950 ఆఖరు వరకూ అయిదు నెలలకి సరిపోతుందని శత్రుఘ్నకిచ్చి అతని భోజనం ఏర్పాట్లు శత్రుఘ్నద్వారా చేయించారు. కైకోబాద్ ఏ పథకం క్రింద రాకపోయినా అతడు నవ్యజీవితంలో ఉన్నాడు.

ఉదయం సమావేశం అయాక విష్ణుకి నీలూకి వారి స్వంత అవసరాలకి స్త్రీల డబ్బులోంచి ఒక్కపైసా కూడా (అతనికి స్త్రీలు బజారు ఖర్చులకు యిచ్చిన దానిలో) వాడకూడదని బాబా హెచ్చరించారు. విష్ణు ఏరోజుకారోజు బజారుపని చేసిన తరువాత స్త్రీలకి లెక్కచెప్పి మిగిలిన డబ్బు వారి కిచ్చివేయాలని బాబా అన్నారు.

సాయంకాలం బహ్తార్ వాచా బాబాను చూడడానికి డేరాడూన్ నుంచి వచ్చాడు. బాబా సంతోషంగా ఉన్నారు. అతనితోను సహచరులతోను సరదాగా ఒక గంట గడిపారు. ఆ గంటసేపు వాచా బాబాతోనే ఉన్నాడు. తరువాత ఆ రాత్రి బహ్తార్ వాచాని భోజనానికి ఉండమని అడిగారు.

బాబా వ్రాసినట్లుగా మెహెర్‌జీ వద్దనుంచి విష్ణు పేరుతో రు 2000/- లకి ఇంపీరియల్ బ్యాంకు మీద డ్రాఫ్ట్ వచ్చింది. ఈ మొత్తం స్త్రీలకివ్వవలసిన రు 8,000/- ఖర్చువేసి మార్చి 1 వ తేదీన యిస్తారు. బాబా 28 వ తేదీన ఉదయాన ఢిల్లీ నుంచి వచ్చిన కేకిదేశాయిని నారావాలా తీసుకువచ్చాడు. బాబా వద్దకు బాబా రమ్మంటేనే కేకి వచ్చాడు. ఒక వారంరోజులు దేరాడూన్‌లో ఉంటాడు. ఇదివరకు ఫిబ్రవరి 12 వ తేదీకే అతన్ని రమ్మంటే అప్పుడు కేకి వీలులేక రాలేదు. ఆ మాట బాబాకి వ్రాసాడు. కేకీ దేశాయి అతనికి బాగా వీలు కలిగినప్పుడే రమ్మని అతడు

రావడంవల్ల అతని ఉద్యోగానికి మాట రాకూడదని బాబా చెప్పారు. ఆ ప్రకారంగా కేకి యీ యోజన యిచ్చాడు నారావాలా. అతన్ని అక్కడ దిగవిడచి సాయంత్రం వరకు ఉండి దేరాడూన్ వెళ్ళాడు

బాబా ఆయోజన కేకి దేశాయితోను, నారావాలా, ఎరచ్, నీలు, పెండుల తోపు మంజ్రీమాఫీలో కట్టబడిన యిళ్ళు చూడడానికి వెళ్ళారు. శత్రుఘ్న గృహ నిర్మాణం అనుకున్న ప్రకారం త్వరగా పనిపూర్తి చేయించినందుకు బాబా చాలా సంతోషించారు.

ఆదీ (సీ) I–C పథకంలో ఉన్న పూతన జీవిత సహచరుడు. అతడు ఎరచ్ పేరున రు 1000/- ఇన్సూర్ పోస్టులో పంపించాడు బాబా విష్ణుని నారావాలా యింటికి పంపించి ఆ ఇన్సూరు కవరు తెమ్మని పంపించాడు మనియార్డర్లు వగైరా తనకి వచ్చినవి నారావాలాకి యిమ్మని ఎరచ్ పోస్టువాళ్ళకి అధికారం యిచ్చాడు. విష్ణుకి ఆ కవరు యివ్వజాలమని పోస్టువాళ్ళు అన్నారని అది తీసుకోవడానికి ఎరచ్ స్వయంగా పోస్టాఫీసుకి రావాలన్నారని విష్ణు చెప్పాడు బాబా ఎరచ్‌ని మరునాడు ఉదయం దేరాడూన్‌కి వెళ్ళి ఆ యిన్సూర్డ్ కవరు తీసుకురమ్మని పంపించారు

24 వ తేదీ (ఫిబ్రవరి, 1950) చల్లని వాయువులతో ఆ ప్రభాత సమయం ఎంతో హాయిని గొల్పుతూంది. రాత్రంతా మంచు కురిసింది. చెట్ల ఆకులమీద నుంచి ఆ మంచులోనుంచి సొగలేస్తూంటే చూడడానికి మెచ్చటగా ఉంది. ఆ ఉదయాన ఎరచ్ దేరాడూన్ నుంచి ఇన్సూర్డ్ కవరు తీసుకువచ్చాడు అందులో ఆదీ ఒక ఉత్తరం వ్రాసిపెట్టాడు. అందులో యిలా ఉంది

అహమద్‌నగర్,
20 ఫిబ్రవరి, 1950.

"ప్రియమైన బాబాకి,

నేను యిందులో వెయ్యి రూపాయిలు పంపుతున్నాను. ఇది నా భీమా వ్యాపారపు ఆదాయంలో నుంచి మిగిల్చినవి.

మీ – ఆదీ (సీ)"

ఇది అందగానే బాబా యీ క్రింది ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం ఆదీపేర పంపించారు.

"ఆదీ కె. ఇరానీ,
అహమద్‌నగర్

నీవు పంపిన వెయ్యిరూపాయిలకి చాలా సంతోషించాను. నీ ఉత్తరాన్నిబట్టి అది I-C, పథకం ప్రకారం — 8, 9 పేరాలక్రిందను నేను 6వ తేదీన వ్రాసిన ఉత్తరం ప్రకారమే ఉందని తెలుసుకున్నాను.

—బాబా"

III పథకంలోని సహచరులంతా ఆదీ (సీ) వెయ్యిరూపాయిలు పంపినందుకు సంతోషించారు బాబా యీ పథకాలు తయారు చేశారు. I-C పథకం క్రింద డబ్బు పంపిన మొదటి సహచరుడు ఆదీ.

25వ తేదీన నీలాకాశంలో ఎక్కడా మబ్బుతునకలు మచ్చుకైనా కనబడటం లేదు. ఆ ఉదయసమయం ఎంతో మనోజ్ఞంగాను, నవ్యజీవంతో కళకళలాడుతూను ఉంది. సూర్యుడు అందరికీ కావలసిన వెచ్చదనాన్నిస్తున్నాడు

I-C, I-B పథకాలలో సహచరులెవరయినా ఏమి పంపినా అందులో నూటికి 25 వంతులు స్త్రీలకి యివ్వగా మిగిలిన 75 వంతులు III పథకంలోని సహచరులకివ్వాలి. అందుచేత యీ వెయ్యి రూపాయిలలోను రు 250 స్త్రీలకి, యీ సహచరులకి మిగిలిన రు 750 యివ్వబడింది

26వ ఫిబ్రవరి ఆదివారం అయింది ఆ రోజు ఉదయమే అనుకున్న ప్రకారం స్త్రీలు మండ్రిసూఫీలో వారికోసం ఏర్పాటయిన కొత్త యింటికి మారారు, రెండు రోజులలో పురుష సహచరులు కూడా మారతారు వారికోసం బాబా ఆజ్ఞ ప్రకారం శత్రుఘ్న రాత్రింబగళ్ళు కష్టపడి కట్టించాడు ఆ రెండు యిళ్ళు బాబాకి చాలా తృప్తి కలిగించింది. శత్రుఘ్న నిజాయితీ తోను శ్రద్ధతోను చేయించిన పనికి బాబా చాలా సంతోషించారు.

ఆ సాయంకాలం డాన్ డెహ్రాడూన్ నుంచి బాబాను చూడడానికి వచ్చాడు తన ఆస్పత్రిలో అన్ని ఏర్పాట్లు చేసుకుంటూ ఉన్నాడు డాన్ పనివాళ్ళు సమయానికి త్వరలో యింటి మరమ్మత్తులు చేయలేదని డాన్ ఆదోళా ఉన్నాడు

బాబా కొద్దిరోజుల క్రిందట జాల్‌ని వీలయితే రమ్మని వ్రాసిన దానికి తనకి అనారోగ్యం చేత రానేనని జాల్ జవాబిచ్చాడు ఫిబ్రవరి 27 న బాబా పెండుని వైదుల్‌ని మోహిపన్ పంపించి మరమ్మత్తు పనులు పూర్తయాయో లేదో చూసి రమ్మన్నారు. వారు అక్కడనుంచి ఆనాటి సాయంత్రం వచ్చారు సంసార్‌చంద్‌కి చేయించమని చెప్పిన మరమ్మత్తుల పని యింకా పూర్తి కాలేదని వారు వచ్చి చెప్పారు. 25 వ తేదీనే అన్ని పనులూ పూర్తి చేయించి యిస్తానని అతడు బాబాకు వాగ్దానం చేసాడు కాని అతడు అన్నప్రకారం చేయించ లేకపోయాడు బాబా శత్రుఘ్నతో చెప్పి సంసార్‌చంద్‌కి యీ టెలిగ్రాం యిప్పించారు - "ఇంటిపని అంతా మార్చి 2 వ తేదీనాటికి పూర్తి చెయ్యి బాబా బృందం 3 వ తేదీన యింటిలో ప్రవేశిస్తారు

— కుమార్.

కుంభమేళాపని కోసం బాబా 3 వ తేదీన మోతీచర్ వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

ఈ విధంగా ఉత్తరహిందూస్థాన్‌లో బాబా నవ్యజీవితం గడుపుతూంటే యిక్కడ మెహెరాబాద్‌లో దిగడి ఉన్న ప్రేమికులు ఏం చేసారో కొంచెం తెలుసుకుందాము బాబా వారి ప్రేమికులందరికీ నూతన జీవితపు సర్క్యులర్లు డా॥ గనీ చేతగాని, డా॥ నీలు చేతగాని వ్రాయించి పంపుతూండేవారు

నూతన జీవితం కోసం బయలుదేరే ముందు తమతో బాబా తీసుకుని వెళ్ళిన నలుగురు స్త్రీ మండలిని తప్ప మిగతావారిలో చాలా మందిని బొంబాయికి ఉద్యోగాలు చూసుకోమని బాబా పంపించివేసాడు కదా. అందులో కిట్టీదేవీని, రానో గేలీని మాత్రం రెండు నెలల వరకూ ఏ పనీ చేయవద్దని బాబా ఆదేశించారు. ఈ రెండు నెలలలోనూ బాబా వారిని పనిమీద వారివద్దకు పిలిపించుకోవచ్చు అందుకని వారిని ఉద్యోగాల్లో చేరవద్దన్నారు 2 నెలల తరువాత శాశ్వత ఉద్యోగం గాకుండా తాత్కాలికంగా ఏదయినా పనిలో చేరవచ్చునన్నారు వాళ్ళ ఉద్యోగం మానుకొని చేయవలసి

వస్తుందని కలలో కూడా ఎప్పుడూ అనుకోలేదు. ఆలాగ రెండునెలల తరువాత యిద్దరినో ముగ్గురినో బాబా వారి వద్దకు పిలిపించుకున్నారు. మరల వారికి మెహెరా తోను, మణితోను ఉండే అవకాశం వచ్చిందని ఎంతో సంతోషించారు కొద్దిరోజుల పాటు వారు మహాబలేశ్వర్‌లోను, సతారాలోను తరువాత పింపలగామ్ లోనూ ఉన్నారు. బాబా రానోను కిట్టీని పిలుపునంపినపుడు వారిద్దరూ బొంబాయి మిషన్ స్కూలులో ఉపాధ్యాయ పదవిలో వారు టరమ్ మధ్యలో ఉన్నారు. వారు సెలవుమీద వెళ్తాంటే సెలవు అయిన తరువాత మళ్ళీ వస్తామని వారు అనుకోలేదు అనేక మారులు బాబా తమ ప్రేమికులకు "నన్ను మీరు అసలు చూడకుండా ఉండే రోజు దగ్గరకు వస్తున్నది" అని పదే పదే చెప్తూ వచ్చారు. కానీ యీ వాక్యం ఎవరూ వినిపించుకోలేదు.

పాశ్చాత్యులలో ఒక ప్రేమికుడు అనేక బాబా కేంద్రాలకు న్యూయార్క్ నుంచి 1950 ఫిబ్రవరి 27 వ తేదీని యీ విధంగా ఉత్తరం వ్రాసాడు

"....మనము బాబా సాహచర్యంలో పొందినది మనం బాగా తెలుసుకుని స్వార్థం వదలిపెట్టి ఆయన మనకు చేసిన జ్ఞానబోధ యొక్క ముఖ్యాంశాలు మనం అనుసరిస్తూ యితరులకు మనం చెప్పగలిగినంత చెప్పాలి

"బాబా యొక్క 'నూతన జీవితగీతము' నుండి ఎవరిమట్టుకు వారికి అను సరణ యోగ్యమని భావించిన దానిమీదే మనం ధ్యానం చేస్తూ దానిమీద ఒక వ్యాసం వ్రాసి మన ధ్యానంలో ఆ భావాలే మననం చేసుకోవాలి. వ్రాసిన వ్యాసాలు ఎవరు వ్రాసినదీ తెలియజేయనక్కరలేదు. మన భావాలు స్పష్టపడతాయి ఆ విధంగా వ్రాసినట్లయితే.

.... ఒక సంగతిమట్టుకు నాకు ముఖ్యంగా తోస్తోంది ఆ విషయాలు ధ్యానం చేసినంతమాత్రాన చాలదు. అవి ఆచరణలో పెట్టాలి. ఈ విధంగా ఆచరించే వారి ఒక వలయం ఏర్పడుతుంది అది అందరికీ ఉపయోగపడుతుంది. ఆంతరికంగా కలిగిన అభిప్రాయాలు మనసులోకి తెచ్చుకుని అవి ఆచరణలో పెడతారు.

ఫిబ్రవరి 28 వ తేదీన సహచరులు వారికోసం నిర్మించిన మంజ్రిమాఫి గృహానికి మారవలసి ఉంది కాని బెల్గామ్‌లో లాగే అందులో నేల సిమ్మెంటు వేసి

చిక్కుపోసి పెట్టారు గనుక వారు అందులోకి వెళ్ళడానికి వీలులేకపోయింది అందుచేత బాబా వారిని మార్చి 2 వ తేదీనాడు వెళ్ళమన్నారు. ఆ రోజు మధ్యాహ్నం డాన్కిన్ ఆస్పత్రి ప్రారంభోత్సవానికి వెళ్ళడానికి 2-30 గంటలకి సిద్ధంగా ఉండమన్నారు సహచరులందరినీ బాబా స్త్రీలతోను పురుష సహచరులతోను దేరాడూన్కి సరిగా 2-30 గంటలకు చేరుకున్నారు డాన్కిన్ దేరాడూన్లో ప్రముఖుడయిన వైద్యుడు ప్రకాష్ని రమ్మని పిలిచాడు, తరువాత బిరేంద్రవందే సతీ సమేతంగాను, శత్రుఘ్న అతని భార్య సుభద్ర, మహంతు, హెలెన్ యీ కార్యక్రమానికి వచ్చారు నారావాల్ ఇన్దోర్ వాచా సతీయుక్తంగా వచ్చారు. కేకీ దేశాయి, ఎరచ్ మిస్త్రీ సహాయం చేసారు. అందరూ కలిసి ప్రారంభోత్సవం జయప్రద మొనర్చారు. బాబా స్వయంగా వచ్చిన వారందరికీ స్వీట్లు (రవ్వ, కేక్లు వగైరా) పంచి పెట్టారు. తరువాత టీ కూడా యిచ్చారు నారావాలా వాచాల భార్యలు రవ్వ తయారు చేసారు. వారు డాన్యొక్క క్లినిక్లో అలంకారం చేయడంలో చాలా సహకరించారు అందరి యెదుట డాన్ I-B పథకం ప్రకారంగా నూతన జీవితంలో బాబాకి సహాయం కోసం డాన్ ఆ ఊళ్ళో వైద్యవృత్తి ప్రారంభిస్తున్నాడని బాబా చెప్పారు నారావాలా, ఇన్దోర్ వాచాల భార్యలు బాబాని వాళ్ళ యింటికి ఒక పర్యాయం రావలసిందిగా ప్రార్థించారు. మంత్రిమాఫి వెళ్ళేదారిలో బాబా వారి యిళ్ళకి వెళ్ళి వచ్చారు. మంత్రిమాఫి నుంచి వచ్చి బాబా తమ చేతనైనంత డాన్కి చేసానని బాబా తృప్తితో అన్నారు. ఆ ఉదయాన్నే బాబా, ఎరచ్, పెండు, గుస్తాద్జీ, ఆలీ అక్బర్, మురళి, బైదుల్-వీరు రెండవమారు కలరా టైఫాయిడ్ టీకాలు వేసుకున్నారు

బైదుల్ ఫిబ్రవరి 15 నాడు పట్టుకు వచ్చిన రెండవ డబ్బాలోని గంగా జలంతో మార్చి 1 వ తేదీన బాబా స్నానం చేసారు స్నానం చేసేముందు బాబా ప్రతి సహచరుని తలనుంచి కత్తెరతో కొద్ది వెంట్రుకలు కత్తిరించారు. శత్రుఘ్న యింట్లో ఆ సాయంత్రం బాబా ఉండగా 4 గంటలకు నారావాలా బాబాకి భిక్షక్రింద అన్నం పెట్టాడు- శత్రుఘ్న, అతని భార్య సుభద్ర ఎరచ్ మిస్త్రీ, ఇన్దోర్ వాచా, కేకి దేశాయి ఉన్నారు ఆసమయంలో నారావాలా భార్య వండిన అన్నం అది

నారావాలా దేరాడూన్కి వెళ్ళేముందు మార్చి 3 వ తేదీన [illegible]లో మోతీచూర్కి వెళ్ళేటప్పుడు తమతో కూడా నారావాలాని రమ్మని బాబా చెప్పారు.





సదాశివ్ పటేల్ పూనా నుంచి మరాఠీలో వ్రాసిన ఉత్తరం బాబాకి చదివి వినిపించారు దానికి ఏం జవాబు వ్రాయాలో బాబా విష్ణుకి చెప్పి వ్రాయించారు ఆ జవాబుకి నకలు వ్రాయించి ఏర్పాటుదార్లకి పంపమని చెప్పారు బాబా సదాశివ్ ఉత్తరం దానికి వ్రాసిన జవాబు ఫైలులో పెట్టించారు.

బాబాకి డా॥ నీలు, విష్ణు, ఎరచ్, మురళీ, ఆదీలమీద కోపం రాగా ఆ సాయంకాలం సహచరుల చేత లెంపకాయ కొట్టించుకున్నారు మార్చి 1 వ తేదీనుంచి III వ పథకంలో సహచరుల యింటికి మానేజరుగా విష్ణు పని చేయడం మాని వేసాడు. ఆ రోజున మాణెక్ మెహతాకి జ్ఞాపకం చేస్తూ ఒక ఉత్తరం వ్రాయించారు బాబా—"నవ్యజీవితం గురించి పథకాల మీద నీ నిర్ణయం తెలియజేయవలెను "నీ వేమీ విచారించనక్కరలేదు. నీ నిర్ణయం మాత్రం నాకు C/o నారావాలా, 36 లిట్టన్ రోడ్, దేహాడూన్ అని వ్రాసి తెలియపరచవలెను" అని వ్రాయించారు బాబా.

అది మార్చి 2 వ తేదీ. చీకటితో డా॥ నీలు విష్ణు, కాకా పాలు లేకుండా టీ తీసుకున్నారు. తరువాత 8 గంటలకి మహంతు యింటినుంచి వారి సామానుతో మాం జీసాఫిలో కట్టిన కొత్త యింటికి మారారు సిమెంటు చేసిన నేల యింకా నీళ్ళతోనే ఉంది అది గట్టిపడడానికి నీళ్ళు లేకుండా ఉండడానికి ఒకనెల పడుతుంది. బాబా శత్రుఘ్నకి నేలమీద గడ్డిపరచమని చెప్పారు దానిమీద నీలు, విష్ణు, కాకా, వారి పడకలు విప్పుకోవచ్చు అని అన్నారు ఇల్లంతా తడిగా ఉంది.

ఆ రోజంతా స్త్రీల తాలూకు ఏవో చిక్కులు విడదీస్తూ కూర్చున్నారు బాబా. ఆయన మరునాడు మోతీవర్ వెళ్ళేముందు వారికి కావలసిన ఏర్పాట్లుచేసి వెళ్ళాలని బాబా ఉద్దేశం.

ఆ మధ్యాహ్నం విష్ణు అయిదు నిమిషాలు ఆలస్యంగా వచ్చి బాబా ఆజ్ఞను ఉల్లంఘించాడు అందువల్ల బాబాకి చిరాకు కలిగింది ఈ కారణం చేత శత్రుఘ్న, గోహర్ ఉండగా బాబా విష్ణుని ఆయనను లెంపకాయ కొట్టమన్నారు విధిలేక అతడా విధంగా చేసాడు

మార్చి 3 వ తేదీన III పథకం క్రింద ఉన్న సహచరులను వారి పాదాలను వారినే బాగా కడుగుకొనమన్నారు తరువాత బాబా వారి పాదాలమీద తమ శిరసు

సుంచారు వారి మనస్సు నొప్పించినందుకు బాబా వారిని క్షమార్పణ అడిగారు వారు చేసిన తప్పులకు వారిని బాబా క్షమించారు అప్పుడు బాబా—

"16 అక్టోబరు 1949 నుండి మార్చి 1, 1950 వరకు నేను రావాలని, తెలిసి, ఒక పెద్ద తప్పు చేశాను నా సహచరులందుకోసం భగవంతుడు క్షమించ వారికి నన్ను తన్నాలి." అని బాబా వారందరిచేత తన్ను తన్నించుకున్నారు. సహచరులను నిజాయితీతో పథకం షరతులను నూటికి నూరుపాళ్ళ శ్రద్ధతో పాటించమని చెప్పారు ఈ పనికోసం ప్రయత్నించడానికి ఎల్లవేళల 24 గంటలూ, వారు సావధానంగా ఉండాలి వారు వారియెడల తప్పులు కనుగొంటే సహచరులను బాబా దిద్దారు. రెండు మూడు నెలలవరకు వారు తప్పు చేసారనిఎవరూ బాబా చెప్పరు 2, 3 నెలలు బాబా ఆయన సహచరులు సెలవు తీసుకున్నారు ఈ సెలవు తరువాత బాబా సహచరులను వారి వ్యక్తిగత కృషివల్ల తప్పు చేసారని పంపించనైనా పంపిస్తారు లేక వారిని I-B, I-C, II పథకాలలో ఏదయినా ఎన్నుకుని జీవించమంటారు బాబా వారి ప్రమాణానికి భంగం లేకుండా యీ సెలవుకాలంలో షరతులు నూటికి నూరు పాళ్ళ పాటిస్తారు

మధ్యాహ్నం ఒకటిన్నర గంటలకి ఎరచ్, పెండు, ఆలి, గుస్తాద్‌జీ, బైదుల్, కెకి దేశాయి, నారావాలాలతో బాబా మోతీచర్ వెళ్ళారు. పెండు, మురళి, బైదుల్, ఆలి సామానులు వేసిన ఎద్దుబండిలో వెళ్ళారు బాబా, ఎరచ్, గుస్తాద్‌జీ, నారావాలా, కేకిదేశాయి హరవాలా స్టేషన్‌కి నడిచివెళ్ళి అక్కడినుంచి రైలుమీద వెళ్ళారు పెండు, మురళి సామాను ఉన్న ఎద్దుబండితో తిన్నగా మోతీచర్ యింటికి వెళ్ళారు. బైదుల్ ఆలి సామానుతో ఎద్దుబండిమీద హరవాలా స్టేషన్‌కి వెళ్ళి అక్కడినుండి రైలుమీద మోతీచర్ వెళ్ళారు కాకా, విష్ణు, సేవాలు స్త్రీల సంరక్షణార్థం మంజ్రిమాఫిలో ఉండిపోయారు.

హరవాలా స్టేషన్‌లో రైలు రెండు నిముషాలే ఆగినందువల్ల సగం సామానే ఎక్కించుకుని బైదుల్ తప్ప మిగిలినవారు రైలు ఎక్కారు అది అమృతసర్ పాసెంజరు రైలు రైలు ఎక్కిన అందరూ రాయివాలా స్టేషన్‌కివెళ్ళి అక్కడి నుంచి సామాను ఒక ట్రక్కులో ఎక్కించుకుని వారుకూడా అందులో నిలబడి మోతీచర్ చేరుకున్నారు అప్పటికి సాయంత్రం 4-40 గంటలయింది బైదుల్ మిగిలిన సామానులతో మర్నాడు ఉదయం వస్తాడనుకున్నారు

మోతీచర్‌లో యింటికి మరమ్మత్తులన్నీ పూర్తియాయని బాబా తృప్తిని వెలిబుచ్చారు. ఆ సాయంకాలం సహచరులకు స్వయంగా బాబా చపాతీలను కూరను పెట్టారు. అవి మంత్రిమాఫిలో స్త్రీలు తయారు చేసి యివ్వగా మోతీచర్‌కి తెచ్చు కున్నారు. తరువాత అందరూ టీ త్రాగారు.

మార్చి 4 వ తేదీన శనివారం రోజున ఉదయం అంతా సామానులు తీసి సర్దుకోవడంతో సరిపోయింది బాబా స్వయంగా వారి కుటీరం చీపురుతో తుడుచు కున్నారు తరువాత స్నానం చేసారు. స్నానానంతరం ఆ పూరింట్లో 15 నిమిషాలు ఏకాంతంగా కూర్చున్నారు బాబా సహచరులతో నూతన జీవితపు షరతులను ప్రమా ణాలను దృఢపరచావని చెప్పారు.

హరవాలా స్టేషన్ నుంచి బైదుల్ మిగిలిన సామానుతో వచ్చి చేరాడు. ఆరోజున (4–3–51) కేకి దేశాయి ఢిల్లీకి, కేకి నారావాలా దేరాడూన్‌కి వెళ్ళారు బాబా సహచరులను పిలిచి ఉదయాన్ని అల్పాహారానికి గత సాయంకాలం చేసుకున్న చపాతీలు మిగులుతే అవి తినాలన్నారు టీ కొంచెం పాలతో దొరుకుతుందన్నారు మధ్యాహ్నం ఒక్కపూటే భోజనం చేయాలన్నారు అందులో పప్పు చపాతీలు తినాలని చెప్పారు మధ్యాహ్నం పాలు లేకుండా టీ త్రాగాలన్నారు. ఆరోజున హోలీ పండుగ అయినందువలన రోడ్డు మీద జనం సంగీతాలతోను నాట్యాలతోను ఆడుతూ పాడుతూ సంతోషంగా గడుపుతున్నారు

మార్చి 5 వ తారీఖున ఉదయాన్నే బాబా వారి కుటీరం తుడుచుకున్నారు. సామానులన్నీ సర్దుకున్నారు. బాబా ఆయన బట్టలు ఆయనే ఉతుక్కుని ఆరవేసు కున్నారు ఆయన గిన్నెలు ఆయన తోముకుని కడుక్కున్నారు ఆ సాయంకాలం పెండు, మురళి మంత్రిమాఫి నుంచి ఎద్దుబండిలో మోతీచర్ వచ్చారు 35 మైళ్ళ ఎద్దుబండి మీద ప్రయాణానికి రెండురోజులు పట్టింది

మార్చి 6 వ తేదీన బైదుల్, పెండు, మురళి, ఎద్దుబండిమీద హరిద్వార్ వెళ్ళి జీవిత నిత్యావసరాలయిన పంచదార, కట్టెలు, బొగ్గులు వగైరా కొనుక్కు వచ్చారు మామూలు ప్రకారం ఆరోజు కూడా వారి కుటీరం బాబా తుడుచుకున్నారు పాత్రలు, ప్లేట్లు శుద్ధి పరచుకొని ఆయన కమ్మోడు (దొడ్డికి కూర్చునేది) బాగు

చేసుకున్నారు మధ్యాహ్నం 1-30 గంటలకి పప్పు, చపాతీలతో భోజనం చేసారు సహచరులందరు బాబా గుస్తాద్‌జీలు పప్పు అన్నం తిన్నారు

7 వ తారీఖున ఉదయం టీ అయాక బాబా, ఎరచ్, గుస్తాద్‌జీ, పెండు, హారిద్వార్ నడచి వెళ్ళారు వారు భీమ్‌గోడా దాకానే వెళ్ళి మోతీచర్‌కి తిరిగివచ్చారు. నడచి వెళ్ళేటప్పుడు బాబా సహచరులను అక్కడి సాధువుల, మహాత్ములగురించి వారి పేర్లు వగైరాలు అడిగి తెలుసుకున్నారు వారు ఎక్కడ నివసిస్తారో వారు ఏ తారీఖులలో వస్తారో అడిగారు మార్చి 15 తేదీన హరిద్వార్‌లో సాధుసాంగత్యం పని ప్రారంభిస్తాననీ, యీ లోపుగా, 9,10 తేదీలలో ఏ వేళలో పని ముగిస్తాననీ తరువాత మళ్ళీ 16, 17, 18 (ఏప్రిల్) తేదీలలో సాధుసాంగత్యం కొనసాగిస్తాననీ బాబా చెప్పారు సాయంత్రం వారు మంచి నీరు తెచ్చే ఊటగడ్డ దగ్గరకు ఒక మంచి సాధువు వచ్చాడని పెండు వచ్చి చెప్పాడు. ఆ మాట విని బాబా స్వయంగా అక్కడికి వెళ్ళారు వెళ్ళి ఆ సాధువు పాదాలకి శిరసు వంచి ప్రణామం చేసి వారి బసకి వచ్చి విశ్రాంతి తీసుకోమని బాబా అతనిని ఆహ్వానించారు అక్కడే భోజనం చేయమని కూడా బాబా పిలిచారు. మొదట అతడు బాబా ఆహ్వానాన్ని అంగీకరించలేదు ఒక గంట అయిన తరువాత బాబా ఉన్న యింటికి వచ్చాడు బాబా అతనితో అక్షరఫలకం సహాయంతో ఒక గంట మాట్లాడారు. తరువాత అతడు వెళ్ళిపోయాడు.

8 వ తారీఖు బుధవారం మధ్యాహ్నం మంజ్రిమాఫీ నుంచి శత్రుఘ్న వచ్చి టీకాలు వేయించుకున్నట్లు సర్టిఫికెట్లు తీసుకువచ్చి బాబాకు యిచ్చాడు సర్టిఫికెట్లు కుంభమేళా స్థలంలోకి వెళ్ళడానికి అవసరం ఆ యింటివద్దనుంచి 4 మైళ్ళ దూరంలో ఒక పర్వతం మీద ఒక సాధువు ఉన్నాడని తెలిసి బాబా బైదుల్‌ని అతడు ఉన్నాడో లేదో తెలుసుకు రమ్మని పంపించారు అతడు మోతీచర్‌కి వచ్చిన తరువాత రిషీకేశ్‌కి మర్నాడు బస్సులో వెళ్ళడానికి 5 టిక్కెట్లు తెప్పించారు బాబా.

అది మార్చి 9 వ తారీఖు. ఉదయం 7-30 గంటలకు బాబా ఉన్నచోటికి బస్సు వస్తుందని ఎదురు చూస్తున్నారు. కాని యీ అయిదుగురికి స్థలం ఉంచడం బస్సువాడు మరిచిపోయాడు. బాబాకి వారి సహచరులకి బస్సులో సీట్లు సంపాదించ

టానికి మధ్యాహ్నాం 12 గంటలయింది. 1 గంటకి బాబా బృందంతో రిషికేశ్ చేరారు. బస్సు ఆగినచోటునుంచి స్వర్గాశ్రమ్ వరకు బాబా వారి సహచరులు నడిచివెళ్ళారు. వారు పడవలో నదిని దాటారు. వారు లక్ష్మణ్ ఝూలావరకు నడిచివెళ్ళి సాయంత్రం 5–30 గంటలకు బస్‌స్టాండుకి తిరిగివచ్చారు స్వర్గాశ్రమ్‌కి వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు అనేకమంది సంతలను, సాధువులను, మహాత్ములను బాబా సాంగత్యం చేసారు. బాబా మంగళ్ ఆశ్రమ్ కైలాష్ ఆశ్రమ్ వగైరాలు చూసారు అక్కడ మొత్తం 91 మందిని సాంగత్యం చేసాడు బాబా వారి పాదాలమీద శిరసు ఉంచి మ్రొక్కారు. అనేకసార్లు వారి పాదాలు చేతులతో స్పృశించారు ఇదంతా వారి సహచరులుండగానే జరిగింది పాత జీవితంలో అటువంటి సాధు సాంగత్యం చేసినపుడు బాబా వారి శిష్యులను దూరంగా ఉండమనేవారు.

హరిద్వార్‌లో కుంభమేళా జరిగే సమయం సమీపిస్తోంది ఇంకా రెండు రోజులుండగానే ఇండియా అన్ని వైపులనుండి సాధువులు, సన్యాసులు యాత్రీకులు రావడం మొదలుపెట్టారు. రిషీకేశ్‌కి కూడా చాలామంది వస్తున్నారు బాబా సాధు సాంగత్యానికి యీ సమయం ఎన్నుకున్నారు ఈ పనికోసం మోతీచర్ వెళ్ళి అక్కడినుంచి రిషీకేశ్‌కి నడిచి వెళ్ళేవారు మండలిని ఒక్క గంటయినా విశ్రాంతి తీసుకోనివ్వలేదు బాబా పని ఒత్తిడి అంతగా ఉండేది

కుంభమేళా 12 సంవత్సరాలకొకసారు అలహాబాదు లోను (త్రివేణీ సంగమం) ఉజ్జైన్ (నర్మదానది) నాసిక్ (గోదావరి) హరిద్వార్ (గంగ) నగరాలలో కుంభమేళా మహోత్సవాలు జరుపుతారు 36 సంవత్సరాల కొకసారు మహా కుంభ మేళా జరుగుతుంది డిసెంబరు 41 నుండి జనవరి 1942 వరకు రెండు నెలలలోను మహాకుంభమేళా అలహాబాదులో జరిగింది అనేక లక్షలమంది పవిత్ర గంగా యమునా సంగమంలో స్నానాలు చేసారు

ఒకరోజున మోతీచర్ నుండి మురళీ కాలేని ఎద్దుకి మేత తీసుకురమ్మని రాజా అనే ఎద్దును బండికి కట్టుకుని వెళ్ళమని హరిద్వార్ పంపించారు ఆ రోజునే ఎరచ్ వగైరా కూడా ఏవో పనుండి హరిద్వార్ వెళ్ళవలసివచ్చింది వాళ్ళు బండి వెళ్తోందికదా అని మురళీ కాలే తీసుకువెళ్ళిన బండిలో ఎక్కి వెళ్ళలేదు బాబా చెప్పలేదు మరి ఆయన ఏమన్నా అంటారేమో అని నడిచివెళ్ళి నడిచేవచ్చారు. మురళీ

వాలేదండి తీసుకెళ్ళి తీసుకొచ్చాడు అతడు తోలుకెళ్తుంటే వెనకాల ఏదో ఇంగ్లీషు వాని కారు వస్తుంటే ఆ కారు బూరా చప్పుడుకి ఎద్దు బెదిరి మురళికి కంట్రోలు తప్పింది ఎంత ప్రయత్నించినా ఆ కారుకి దారి యివ్వడానికి ఒక ప్రక్కగా తీద్దా మంటే రాలేదు ఆ ఇంగ్లీషువానికి కోపం వచ్చి "ఏం యిందాకట్నుంచి బండి పక్కకి తీస్తావేమో అని చూస్తున్నాను ఆ మాత్రం చెయ్యలేవా" అని కోప్పడ్డాడు.

అందుకు మురళి – "అయ్యా! నేను హిందూదేశస్థుడను ఎద్దు ఇంగ్లీషు ఎద్దు నేను ఎంత చెప్పినా అది నా భాషను అర్థం చేసుకోవడంలేదు దయచేసి మీరు రోడ్డుమీద ఎలా నడవాలో చెప్పండి. ఎందుకంటే మీరు చెప్పింది అర్థం చేసుకుని అలా నడుస్తుంది" అన్నాడు అది విని ఆ కారులో కూర్చున్న ఆంగ్లేయులు (అతని కుటుంబంవారు) నవ్వుకున్నారు. ఏ రోజున ఎంతమంది సాధువులను ఎక్కడ బాబా సాంగత్యం చేస్తున్నారో పెండు వ్రాసి పెడుతున్నాడు ఈ సాంగత్యం కోసం బాబా వారి కుటీరాలకి వారి అఖాడాలకి ఆవాసాలకి వారు ఎక్కడ ఉంటే అక్కడికి గుహలకి కూడా వెళ్ళి సాంగత్యం చేసి చూసిన సాధువునే మరల చూడకుండా వస్తున్నారు బాబా.

బాబా ఎంత ఓర్పుతో వారి సాంగత్యం చేస్తున్నారో ఆయన పని చూస్తే తెలుస్తుంది 91 మందిని సాంగత్యం చేయడానికి 5 గంటలు పట్టింది. వారిని వెతుక్కుంటూ వెళ్ళేసరికి ఆలస్యం అవుతోంది ఆ రోజు పొద్దుగూకేసరికి ఆశ్రమా లలో భాగీరథి వంతెన వరకు ఉన్న సాధువులను స్వర్గాశ్రమ్ వైపున ఉన్న సాధు వులను సాంగత్యం చేయడం అయింది

లక్ష్మణ్ నుంచి ఝూలానుంచి రిషికేశ్‌కి బాబా వారి సహచరులతో వస్తుంటే ఒక యోగి కనిపించాడు అతడు లక్ష్మణ్ ఝూలాకి వెళ్తున్నాడు అతడు లక్ష్మణ్ ఝూలా వైపు వేసిన ప్రతి అడుగుకి నేలమీద సాష్టాంగ పడుతున్నాడు అతడు ఒడలంతా భస్మం పూసుకున్నాడు. అతడు దిగంబరిగానే ఉన్నాడు. అతని శరీరం దుమ్ముతో నిండి ఉంది చమటపట్టి ఉంది. బాబా అతని పాదాలమీద శిరస్సు ఆనించి ప్రణామం చేసారు బాబా సహచరులతో మోతీవర్ తిరిగి వచ్చేసరికి సాయంకాలం 6–30 గంటలయింది వచ్చి చపాతీ పప్పుతో భోజనం చేసారు ఆ రోజువారు అంత సరిగా భోజనం చెయ్యలేదు

10 వ తారీఖు ఉదయం ఏడుంబావుకి మోతీచర్ నుంచి రిషీకేశ్‌కి బయలు దేరారు. సాధుపులను, మహాత్ములను, సంత్‌లను, నిన్నటిలాగే యీ రోజుకూడా సాంగత్యం చేసారు ఈ పని ముగిసేసరికి మధ్యాహ్నం 1 గంట అయింది. ఈ రోజున 135 మందిని బాబా సాంగత్యం చేసారు. బాబా సహచరులతో మోతీచర్‌కి తిరిగి వచ్చేసరికి సాపుతక్కువ రెండుగంటలయింది

బాబాకి, పెండుకి మర్నాడు ఉదయం డేరాడూన్ వెళ్ళడానికి బస్సులో రెండు టిక్కట్లు కొని సీట్లు రిజర్వుచేయమని బైదుల్‌ని హరిద్వార్ పంపించారు.

11 వ తేదీన బాబా మంజ్రీమాఫ వెళ్ళి 13 వ తేదీన తిరిగి వస్తారు బాబాకి సహచరులకి సత్యపాల్ భోజనం వండిపెడుతున్నాడు. డా॥ నీలు, విష్ణు, కాకా, డా॥ డాన్‌కిన్ లకి స్త్రీలకి శత్రుఘ్న ద్వారా బాబా ఆ రోజున వస్తారని సందేశం అందింది మళ్ళీ 13 వ తేదీన మోతీచర్ వెళ్తారని శత్రుఘ్న చెప్పాడు. బాబా రాక కోసం ఆ రోజున అందరూ ఎదురు చూస్తున్నారు స్త్రీలు బాబా వచ్చేవరకు భోజనం చెయ్యకుండా కూర్చున్నారు ఈ సంగతి తెలుసుకొని సహచరులు కూడా భోజనం చేయలేదు బాబా పెండు వచ్చేసరికి 12-30 గంటలయింది మధ్యాహ్నం. బాబా తిన్నగా మంజ్రీమాఫిలో ఆడవారి గృహానికి వెళ్ళారు పెండు పురుషుల యింటికి వెళ్ళాడు. నీలు, విష్ణు, కాకా సరిగా సమయానికి ఎందుకు భోజనం చెయ్యలేదో కనుక్కురమ్మని బాబా గోహర్‌ని పంపించారు స్త్రీలు బాబా వస్తారని వేచి యున్నారని జవాబు పంపించారు సహచరులుకూడా బాబా రాకకోసమే వేచియున్నారు భోజనం చేయకుండా అని చెప్పారు

మధ్యాహ్నం 2 గంటలకి డేరాడూన్‌నుంచి డా॥ డాన్‌కిన్ బాబాని చూడ డానికి వచ్చాడు. శత్రుఘ్న 3 గంటలకి బాబాని చూడడానికి వచ్చాడు. వారున్నచోటకి శత్రుఘ్న దగ్గరగానే ఉంటున్నాడు మూడుంబావుకి బాబా సహచరుల యింటికి వెళ్ళారు. డాన్‌కిన్ వచ్చినందుకు బాబా సంతోషించారు. మోతీచర్‌నుంచి మంజ్రీమాఫి వచ్చేటప్పుడు డేరాడూన్ నుంచి డాన్‌కిన్‌ను బాబా పిలుద్దామనుకున్నారు 13 వ తేదీన ఆయన మళ్ళీ మోతీచర్ వెళ్ళిపోతారు బాబా అందరి ఆరోగ్యాల గురించి అడిగారు. కాకా కులాసాగా ఉన్నందుకు బాబా సంతోషించారు కాకాకి గుండె జబ్బు వచ్చింది అతన్ని డా॥ నీలూకి అప్పజెప్పారు బాబా అతడే అతనికి చికిత్స చేస్తున్నాడు కాకా

యిప్పుడు బాగా ఆరోగ్యంగా ఉంటున్నాడు తాను ప్రతిరోజూ ఉదయం షికారుకి వెళ్తున్నానని రానుపోను 8 మైళ్ళు నడిచి వస్తున్నానని బాబాతో చెప్పాడు కాకా.

డాన్కిన్ యొక్క వైద్యవృత్తి ఎలా ఉందని బాబా అడిగారు ఆ డాక్టర్ని. డబ్బు సంపాదించాలని ఏమీ తాపత్రయపడవద్దని బాబా అతనికి చెప్పారు రోగులు వస్తూంటే బాగానే ఉంది లేకపోతే డబ్బు రావడం లేదని విచారించవద్దని బాబా చెప్పారు. భోజనం కడుపునిండా తినమని అందులో పొదుపు చేయవద్దని ఆరోగ్యం గాను బలంగాను ఉండాలని బాబా అతనితో చెప్పారు. బాబావద్ద ఉన్న ఆసెరాయిడ్ ఇన్స్ట్రుమెంటు (వైద్యుని ఒక పనిముట్టు) అడగగానే యిదివరకు డాన్కి యిచ్చారు. దానికి బదులు డాన్ క్రొత్తది రక్తపుపోటుకొలిచే ఇన్స్ట్రుమెంటు యిస్తానని చెప్పాడు గాని అది బాబాకి యివ్వనందున ఆయనకి చికాకు కలిగింది. డాన్ అది యిద్దామనుకో లేదని యిప్పుడు యివ్వడానికి సిద్ధంగా ఉన్నానని, కానీ రెండూకూడా అతనికి అవసర మనీ అది అట్టేపెట్టేందుకు బాబాయొక్క అనుమతి కావాలని డాన్ అడిగాడు బాబా డాన్ని అతనిమాట నిలబెట్టుకోలేనందుకు క్షమించారు రెండు పనిముట్లుకూడా డాన్ని ఉంచుకోమని బాబా అనుమతించారు.

విష్ణు బాబా ఆజ్ఞలను సరిగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించ లేదని చీవాట్లువేసారు స్త్రీలకి పంచదార, కిరసనాయిలు, గోధుమలు కావలసినప్పుడల్లా అతనిని శత్రుఘ్నను అవి కొనమని దానికి కావలసిన డబ్బు అతనికి యివ్వమన్నారు విష్ణు యిది అపార్థం చేసుకున్నాడు. అయినా బాబా అతనిని మన్నించారు

సదాశివ్ దగ్గరనుంచి అహమద్నగర్ నుంచి 7 వ తేదీన యీ విధంగా టెలిగ్రాం వచ్చిందని డా॥ నీలుకి, విష్ణుకి, కాకాకి బాబా చెప్పారు

“ఎరచ్ ఉత్తరం మార్చి 1 వ తేదీని అందింది. నారిమన్ మెహెర్జీలకి పూర్తిగా యిచ్చెయ్యడానికి ఏర్పాట్లు చేస్తున్నాను—సదాశివపటేల్”

మాణెక్ మెహతా దగ్గరనుంచి బొంబాయినుంచి మార్చి 8 వ తేదీన యీ క్రింది విధంగా టెలిగ్రాం వచ్చిందన్నారు——

"నైతిక న్యాయం, ఆర్థిక విషయాలన్నీ ఆలోచించకుండా తొందరలో నిశ్చయించుకోలేనందుకు చింతిస్తున్నాము. ఇంకా ఎక్కువ వ్యవధి యివ్వండి. నమస్కారములు —— మాణెక్ మెహతా."

బాబా మాణెక్ మెహతాకి ఏప్రెల్ ఆఖరివరకు సమయం పొడిగించారు. అలా చేస్తూ యిచ్చిన టెలిగ్రాం మాణెక్ మెహతాకి దేరాడూన్ చేరగానే యిమ్మని డాన్‌కిన్‌కి చెప్పారు బాబా. మరునాడు ఆదివారం అయింది ఆదివారంనాడు ఎక్స్‌ప్రెస్ గాని యితర టెలిగ్రాంలు పెట్టరు దానికి డబ్బు ఎక్కువ అవుతుంది. డాన్‌కిన్ బాబాతో యింకో విషయంచెప్పాడు అతనికి డా॥ గనీ ఒక ఉత్తరం రిజిష్టరుపోస్టులో వ్రాసాడు అందులో బాబాకి అతడు వ్రాసిన ఉత్తరం ఒకటి పెట్టాడు ఈ మాట వినగానే బాబాకి గనీ ఎందుకు I-C పథకం షరతు ఉల్లంఘించాడో తెలియడం లేదని ఆశ్చర్యపోయారు. గనీ బాబాకు ఉత్తరం ఏపరిస్థితులలోను వ్రాయకూడదు. అతడు బాబాను చూడకూడదు, సాంగత్యం చేయకూడదు బాబా డాన్‌కిన్‌ని ఆఉత్తరం చదవవద్దన్నారు. కానీ బాబా దయామయుడు గనుక ఆ ఉత్తరంలో సారాంశం చెప్పమని డాన్‌కిన్‌ను అడిగారు. రంజూ రు 35,000/- గురించి సరిగా అర్థం చేసుకోలేదని చెప్పాడు. బాబా డాన్‌కిన్‌ని రంజూకి ఆ రు 35,000/- సొమ్ముతో ఏమీ ప్రమేయం లేదని గనీకి వ్రాయమన్నారు.

మార్చి 12వ తేదీ ఆదివారం ఉదయం టీ తీసుకున్నాక 7 గంటలకి సహచరుల యింటికి వెళ్ళారు బాబా నిన్న డాన్‌కిన్ గనీ సొమ్ముగురించి చెప్పిన దానిమీద బాబా యీ క్రింది విధంగా ఏర్పాటుదార్లకి ఉత్తరం వ్రాయించి దాని నకలు గనీకి పంపించారు——

మంజ్రీమాల్
12-3-50

ఏర్పాటుదార్లకి,

1950 వ సంవత్సరాంతానికి గనీకి యివ్వవలసిన రు 35,000/- సొమ్ముకి చరిత్ర ఏమిటంటే——

మెహెరాబాద్‌లో గనీ 'అప్పు' అని సంతకం పెట్టాక అతని ఆస్తివ్యవహారాలు ఆర్థిక స్థితిగతులు చర్చిస్తూంటే గనీ కంగారుపడ్డాడు అతనికి మనసుకి ఎంత

కష్టం కలిగించడంకంటే బాబాతో రావడం మానేద్దామని కూడా అనుకున్నాడు. నూతన జీవితం గురించి ప్రమాణం తీసుకున్నా అతడు అలా అనుకున్నాడు. కాని ఆ వ్యవహారం ఎలాగో సహజంగానే తేలిపోయింది నూతన జీవితంలో బాబా సమత్వం గురించి చెప్పినప్పుడు గనీ తనకి కుటుంబఏర్పాటుల గురించి అన్యాయం జరిగిందని సూచించాడు.

మంత్రివర్గంలో తన భార్య యొక్క ఆస్తి బాబాకి యివ్వడం జరిగిందని తద్వారా తన కుటుంబవ్యవహారాలు చిక్కుల్లో పడ్డాయని గనీ అన్నాడు. బాబా అతనికి జీవితకాలం యావత్తు నెలకి రు 500 యిస్తానన్నది జూలై 1951 నుంచి ఆపుచేసానన్నారు అందువేత అతని కుటుంబ పరిస్థితి క్లిష్టంగా ఏర్పడుతుందని గనీ అన్నాడు. బాబా అప్పుడు గనీని 'అప్పును' అని వ్రాసి సంతకం పెట్టావని అడిగారు. షరతులు చదివాక అతడు సంతకం పెట్టాడు. బాబా అలా అడగగానే అతడు బాబా మామూలు రీతితో తనకి నష్టంలేకుండా చేస్తారని అనుకున్నానన్నాడు. బాబా గనీని ఎంతమొత్తం ఆశిస్తున్నావని అడిగారు గనీ అందుకు రు 65.000/- అని చెప్పాడు. బాబా వారంతట వారే గనీకి కడుపుమంట లేకుండా చేద్దామని గనీకి రు 35000/- 1950 ఆఖరికి యిస్తానన్నారు బాబా.

విష్ణు ఆ ఆస్తి రు 35,000/- చెయ్యవని బాబాకి జ్ఞాపకం చేసాడు. ఆస్తిలో ఒక భాగం – భూమి – అతని కొడుకుపేరుతో అతనికి మళ్ళీ యిచ్చి వేయడం జరిగింది అయినా బాబా ఆస్తి ఎంత కిమ్మత్తు చేసినా రు 35,000/- గనీకి యిస్తానన్నారు ఏర్పాటుదార్లకి యీ రు 35.000/- లతో సంబంధంలేదు. బాబా అది తిన్నగా గనీకి యిచ్చేస్తారు ఆస్తి కిమ్మతు యివివరకు అనుకున్నట్లు రాబట్టుకోవడం గురించి మొదటి ఏర్పాటుకి కట్టుబడి ఉండాలి ఈ రు 35,000/- గనీకి బాబా ఆయన ఇచ్చిప్రకారం యిస్తున్నారు ఇది నూతన జీవితంలోని గనీ యొక్క స్థానానికి ఏమీ భంగం తేజాలదు ”

ఉదయం టీతో స్త్రీల వద్దనుంచి చపాతీలు రావని నీలు, కాకా, విష్ణులకు బాబా జ్ఞాపకం చేసారు పొద్దున్న మధ్యాహ్నం అల్పాహారం సమయంలో టీ మాత్రమే వారికి లభిస్తుందని రోజుకి రెండుపూట్లు భోజనం లభిస్తుందని చెప్పారు.

మంత్రిమాఫీ యింట్లో ఉన్న బావినీరు త్రాగడం లేదని బయట నుంచి తెచ్చుకుంటున్నామని సహచరులు చెప్పగానే బాబాకి చికాకు కలిగింది. ఈ బావి నీరే స్త్రీలు త్రాగడానికి ఉపయోగిస్తున్నారని బాబా చెప్పారు. బాబాకి చీకాకు కలిగి నీలు విష్ణు షరతులు ఉల్లంఘించారని వారిద్దరిని ముక్కులు నేలను పెట్టి రాయించారు. ఈ పని డా॥ గోహర్, శత్రుఘ్నలు ఉండగా చేయించారు. బాబా III పథకం షరతుల ప్రకారం, దినదినము బాబా యిచ్చే ఆజ్ఞల ప్రకారము బాబా యొక్క యీ ఆజ్ఞ నీలు, విష్ణు పాటించవలసి వచ్చింది. ఒక్కమాట అయినా అడకుండా అవమానకరమయినా బాబా చెప్పినట్లు వారు చేసారు. వారు వాదించడానికి వీలులేదు. వారు చేసినపని సమర్థించుకోవడానికి వీలులేదు బాబా వారిని అలా చేయుకుందుకు అవకాశం యిస్తే తప్ప.

బాబా, యితర సహచరులు మోతీచర్ నుంచి వచ్చేవరకు నాకా యొక్క స్వంత ఉపయోగానికి నీయాని అతనికి నీరు తెచ్చి యిమ్మనమని బాబా చెప్పారు. విష్ణు నూతివద్దనుంచి ఒక బకెట్ నిండా నీరు తెచ్చినందుకు తెలియకుండా షరతు ఉల్లంఘించినందుకు అతన్ని బాబా తిట్టారు తరువాత అతనిని క్షమించారు.

బాబా ఆజ్ఞాప్రకారం రెండు భోజనం చేసాక మోతీచర్ వెళ్ళిపోయాడు. సాయంకాలం బిరేంద్రపండే, డాన్‌కిన్ దేరాడూన్ నుంచి వచ్చారు. శత్రుఘ్న కూడా అక్కడే ఉన్నాడు మామూలు ప్రకారం బాబా వారి ఆరోగ్యం గురించి అడిగారు. డాన్‌కిన్ ఒంట్లో బాగాలేదు గతవారం రోజులుగా అతడు సుస్తీగా ఉన్నాడు డాన్ ముఖం మీద ఆందోళన చూసి బాబా డబ్బుగురించి ఆందోళన పడటం తెలివితక్కువ పని అని అన్నారు I-B పథకం అమలు జరుపడానికి డాన్ చూపెస్తున్న సాహసం, ధైర్యం, ఒక్కడూ అసహాయుడై అలా ఉత్సాహంతో పనిచేయడం ప్రశంశనీయమని బాబా అన్నారు అననుకూల పరిస్థితులలో వాళీవాలని పెట్టుబడితో అతడు వైద్య వృత్తిలో పనిచెయ్యవలసి వచ్చింది ఆంగ్లేయుడవడం వల్ల, యీ ఊరికి క్రొత్తవా డవడం వలన, స్నేహితులెవరూ లేకపోవడం వలన ఎన్నికష్టాలు వచ్చినా అవి యెదుర్కొని తన పనిలో ఆత్మని, హృదయాన్ని చొప్పించి పని చేస్తున్నాడు. ఇందుకు కావలసిన పరికరాలు లోపించాయి. అతని ఏకైకధ్యేయం నవ్యజీవితంలో బాబాకు సహాయం చేద్దామనే ఏప్రెల్ (1950) 4 వ తేదీన అతడు వృత్తి ప్రారం

ఖించాడు మొదట్లో ఉత్సాహకరం గానే ఉంది. బాబా చెప్పినట్లు అతడు యీ విధంగా డబ్బు తీసుకుంటున్నాడు—

తన ఆస్పత్రికి వచ్చి పరీక్ష చేయించుకుంటే రు 7/- వాళ్ళ యింటికి వెళ్ళి పరీక్ష చేసినందుకు రు 12/- లు ఛార్జి తీసుకుంటున్నాడు బిరేంద్రపండే, శత్రుఘ్నలు ఉండగా బాబా డాన్‌తో తన వృత్తిగురించి డాన్‌ని ఏమీ ఆందోళన చెందవద్దనిచెప్పారు. కొన్నాళ్ళు చూసి డబ్బు రాకపోతే సంకోచం లేకుండా ఆస్పత్రి ఎత్తివెయ్య మన్నారు బాబా అప్పుడు III పథకంలో చేరమన్నారు. ఈ విధంగా బాబా ధైర్యం చెప్పగానే డాన్‌కి సంతోషం కలిగింది నాకేమయినా చెప్పాలా అని బాబా డాన్‌ని అడిగారు. అప్పుడు డాన్ ఆదీ (నీ) వద్దనుంచి తనకు ఉత్తరం వచ్చిందని ఆదీ I–C పథకం అమలు జరపడంలో తనకిగల యిబ్బందులు తెలియపర్చాడని చెప్పాడు బాబా అప్పుడు ఆదీయొక్క ఉత్తరానికి సారాంశం తెలియజేయమన్నారు. ఆదీ యింటికి ఎదురుగా ఒక హోటలు అమ్మకానికి వచ్చిందని, దానికి రు 10,000/- పెట్టుబడి కావాలనీ బాబా సహాయంతో యీ మొత్తం అతనికి దొరికితే, పెండుకి III పథకం షరతులనుంచి విముక్తి కలిగితే ఆ హోటలు ఆదీ పెండు సహాయంతో నడుపుకుందా మని చూస్తున్నాడు. I–C పథకంలో 8 వ షరతు అమలులో పెట్టడానికి యిది అవసరమని భావిస్తున్నాడు. అంతట బాబా డాన్‌ని యీ విధంగా జవాబు వ్రాయ మన్నారు. మొదట—పెండుని భాగస్తుడుగా ఉంచుకోవడానికి ఆలోచించడం ఆదీ యొక్క తప్పు. ఎందుచేతంటే III పథకంలో ఎవరూ ఎవరికీ యిలా చెయ్యాలని చెప్పకూడదు. III పథకం లోని వారి భవితవ్యం కేవలం బాబా చేతిలోనేఉంది. రెండ వది—అది తన బాధ్యత మీదనే డబ్బు కావలిస్తే అప్పు చెయ్యాలని యిదివరకే అత నికి తెలియజేయడం జరిగింది ఆ విధంగా ఉత్తరాలు వ్రాయడం, టెలిగ్రాంయివ్వడం జరిగింది. మూడవది–I–C పథకంలో అతడు నూటికి నూరుపాళ్ళు విజాయితీగా ఉన్నాడు గనుక బాబా అతనిని మన్నిస్తున్నారు.

బిరేంద్ర, డాన్ వెళ్ళేముందు దేరాడూన్‌లో పుష్పాలు చెట్లు వగైరా ప్రద ర్శనానికి వెళ్ళి యిద్దరూ చూసివచ్చామని దాని వివరాలు బాబాకు చెప్పారు బాబా తోట పనిలోను పువ్వులలోను ఎంతో ఆసక్తి చూపించారు. వారిద్దరూ పొద్దుపోయాక ఆ సాయంత్రం ఆలస్యంగా దేరాడూన్‌కి బయలుదేరి వెళ్ళారు.

రెండు రోజులనుంచి వాతావరణంలో మార్పు వచ్చింది. ఆకాశం మబ్బులతో నిండి ఉంటోంది విపరీతమయిన చలివేస్తోంది ఉరుములు మెరుపులతో ఆకాశం దద్దరిల్లి పోతోంది ఏదో తుఫాను పట్టుకునేలా ఉంది తరుచుగా వర్షం కూడా పడుతోంది సహచరులున్న యింటిలో నేల యింకా బాగా ఎండలేదు నేలమీద వేసిన గడ్డి తరుచుగా తీసేసి క్రొత్తది వేసినా దాని మీద పరుచుకున్నవారి పరుపులు తడిగా చల్లగా ఉంటున్నాయి

మార్చి 13 వ తేదీ ఉదయం పెందరాళే బాబా స్త్రీల నందరను మోతీచర్ కి తీసుకువెళ్ళారు. వెళ్ళేముందు బాబా శత్రుఘ్నుకి విష్ణుని మోతీచర్ కి అతని మోటారు సైకిల్ మీద తీసుకుని రమ్మని చెప్పారు బాబా స్త్రీలతో వెళ్ళిన తరువాత అరగంటలో బయిలుదేరి రమ్మన్నారు శత్రుఘ్నుని విష్ణుతో.

ఆకాశం యింకా మేఘావృతమై ఉంటోంది- చలి ఎక్కువగానే ఉంది. చుట్టుపట్ల అంతా చెమ్మగా ఉంది బాబా స్త్రీలని తీసుకువెళ్ళడానికి విష్ణు, నారావాలా, ఎరచ్, మిస్త్రీల సహాయంతో ఒక స్టేషన్ వాగన్ తీసుకువచ్చాడు దానికి అడవారు రు 70 యిచ్చారు. ఆ బండి నారావాలా, ఎరచ్, మిస్త్రీలు తీసుకువచ్చారు. మోతీచర్ వెళ్ళినతరువాత బాబా అక్కడి యింటిని నాలుగువైపులా స్త్రీలకి చూపించారు మండ్రిమూషిలోనే వంటచేసి కూడా తెచ్చవన్న ఆహారం మోతీచర్ చేరుకోగానే బాబా, స్త్రీలు భోజనం చేసారు III పథకంలోని సహచరులకి కూడా వారు భోజనం పెట్టారు బాబా తరువాత స్త్రీలను హరిద్వార్ తీసుకువెళ్ళారు ఒక గంట తరువాత వారు మోతీచర్ తిరిగివచ్చారు III పథకం సహచరులు వారికి టీ యిచ్చారు స్త్రీలతోసహా విష్ణు, శత్రుఘ్న మిగిలిన సహచరులు మండ్రిమాఫీ తిరిగి వెళ్ళారు. అక్కడికి అందరు 3-30 గంటలకు చేరుకున్నారు

దేరాడూన్‌లో డా॥ డాన్‌కిన్, డా॥ నాఫ్, డా॥ ((మిస్) గులాబ్ కర్బాజీలను చూడడానికి డా॥ నీలు వెళ్ళాడు. డా॥ గులాబ్ దేరాడూన్‌లోని స్త్రీలపిల్లల ఆస్పత్రిలో పెద్ద డాక్టరు బాబా చెప్పిన ఒక పనికోసం నీలూ వాళ్ళని చూడవలసి వచ్చింది. సాయంకాలం ఆలస్యంగా అతడు మండ్రిమాఫికి తిరిగి వచ్చాడు రోజంతా మబ్బుతో వాతావరణం ఏమీ బాగా లేదు చలిగా ఉండడమే కాకుండా మనసుకి ఆహ్లాదకరంగా లేదు రాత్రంతా ఎవరికీ నిద్రలేదు గాలి ముదిరి పెద్ద తుఫాను గాలిలాగ తెల్లవార్లూ హోరుమని వీచుతూనే ఉంది.

14 వ తేదీ ఉదయం మేఘాలు బాగా క్రిందుగా వచ్చాయి. అంతా చీకటిగా అయింది సూర్యుడు ఆ మేఘాలలో దోబూచులాడు తున్నట్లున్నాడు కాని బయట నుంచి పూర్తిగా తెరుచుకున్నాడు. అతడు ఉదయం వ్యాహ్యాళి నడవడానికి వెళ్ళి వస్తున్నాడు. ఒకేసారి 8–10 మైళ్ళు కూడా తిరిగి వస్తున్నాడు. బాబా మోతీచర్‌లో ఏం జేస్తున్నారో ఎరచ్‌నుంచి మంత్రిమాఫీలోని నీలూకి తెలుస్తూనే ఉంది హరిద్వార్‌లో కుంభమేళా పని ఎలా సాగుతోందో ఎరిచ్ డైరీ వ్రాస్తున్నాడు

బాబా మోతీచర్‌కి వచ్చేసరికి 9 గంటలయింది ఒక గంట తరువాత విష్ణు, శత్రుఘ్న వచ్చారు. బాబా స్త్రీలను హరిద్వార్ తీసుకువెళ్ళారు చూడడానికి. మధ్యాహ్నం స్త్రీలు విష్ణుతో మోతీచర్‌నుంచి మంత్రిమాఫీ వెళ్ళారు హరిద్వార్ వివిధ ఆశ్రమాలు అఖడాలు, సాధువులు ఉండే ఆవాసాలు గురించి వైదుల్, ఎరచ్ బాబాకి ఛోగట్టా యిచ్చాడు. 15 వ తేదీ నుంచి ప్రతిరోజూ బాబా ఆయా స్థలాలకి వెళ్దామను కుంటున్నారు ఆ సాయంకాలం ఒక సాధువు మోతీచర్ యింటికి వచ్చాడు వచ్చి భిక్ష అడిగాడు బాబా అతనికి స్వయంగా గోధుమపిండి యిచ్చి అతని పాదాలకి ప్రణామం చేసారు.

15 వ తేదీన ఆకాశం యింకా మబ్బులతో నిండి ఉంది మేఘాలు ఉత్తర దిశ నుంచి దక్షిణానికి వెళ్తున్నాయి సూర్యుడు మేఘాలలో నుంచి బయటకు రావా లని ప్రయత్నం చేస్తున్నాడు గాని మబ్బులు బాగా కమ్మేశాయి మబ్బులు దట్ట మయాయి. చివరకు వర్షం కురిసింది. మంత్రిమాఫీ నుంచి డేరాడూన్ 5 మైళ్ళుంది. నీలూకి అక్కడ బాబా ఏదో పని యిచ్చారు అక్కడికి వెళ్ళడానికి అతడు ప్రయ త్నాలు చేశాడు గాని అతని సైకిలు బురదలో యిరుక్కుంది. తరువాత వెళ్ళవచ్చులే అని అప్పటికి మానివేశాడు యింటి చుట్టూ నీరు నిలిచింది బురదకూడా ఉంది. ఇలా ఉన్నా విష్ణు బజారుకి వెళ్ళడం తప్పింది కాదు పగలూ రాత్రీ వాన కురుస్తూనే ఉంది.

మోతీచర్‌లో కూడా గాలి తుఫాన్ గాలిలాగే వీస్తోంది వాతావరణం యిలా ఉన్నా బాబా ఉదయం 8 గంటలకి బయలుదేరి వైదుల్, ఎరచ్, పెండులను తీసుకుని వెళ్ళారు హరిద్వార్‌లోను కంఖల్‌లోను సాధువులను మహాత్ములను సాంగత్యం చేయడానికి వారి ఆశ్రమాలు ఊరంతటా ఉన్నాయి. ఆ పని అయాక బాబా సహావరు

లతో సాయంత్రం ఆలస్యంగా తిరిగి వచ్చారు సహచరులు అలిసిపోయారు ఉదయం టీ మాత్రమే తీసుకుని బయలు దేరారు అప్పటినుంచీ నడుస్తూనే ఉన్నారు. 8 గంటలు సాధు సాంగత్యంలో గడిపారు. వారే అంత అలిసిపోతే యింక బాబా ఎలా ఉన్నారో ఊహించవలసిందే.

మార్చి (1950) 10 వ తేదీన తెల్లవారేసరికి మబ్బులు మాయమయాయి. వెచ్చగా ఎండ వచ్చింది. ప్రభాతవాయువులు చల్లగా ముస్సూరీ కొండల నుంచి వీస్తున్నాయి. ఇంటి చుట్టూ ఉన్న బురద, నీరు అంతా ఎండిపోయింది. వాతావరణం సంతోషకరంగా ఉంది. విష్ణు నీలు వారి వారి పనులమీద ఊళ్ళోకి వెళ్ళారు వాతావరణం అనుకూలంగా మారినందువల్ల గోహర్‌కి ఉత్సాహం యినుమడించింది

మోతీచర్‌లో సాధువులతో పని కోసం బాబా సాత్‌సరోవర్‌కి వెళ్దామని నిశ్చయించారు. మోతీచర్ నుంచి అది ఒయిదుమైళ్ళదూరం ఉంది చిన్న గుడిసెలు అనేకం లేచాయి. ఆ స్థలం అంతా వాటితో నిండిపోయింది వాటిల్లో సాధువులు ఉంటున్నారు వారిని సాంగత్యం చేయడం కోసం బాబా వారి సహచరులయిన బైదుల్, పెండు, ఎరచ్, గుస్తాద్‌జీలతో ఉదయం 10 గంటలకి బయలుదేరివెళ్ళారు. సాధ్యమయినంత మందిని బాబా సాంగత్యం చేసారు పెండు వ్రాసినదాన్నిబట్టి 160 మందిని బాబా కలుసుకున్నారని తేలింది. బాబా ఆ స్వాములకు, సాధువులకు, మహాత్ములకు ప్రణామాలు చేసారు. తరుచుగా వారి పాదాలమీద శిరసువుంచి ప్రణామం చేసారు. ఒక తపస్వి మౌనంగా ఉంటున్నాడు. బాబాకి ఆయన సహచరులకి షరబత్ యిచ్చాడు. వారు సంతోషంతో దానిని స్వీకరించారు. మొదట ఆ సాధువు ధ్యాన నిమగ్నుడై ఉండగా బాబా బయట ఒక చెట్టుక్రింద వేచి ఉన్నారు సహచరులతో.

ఆ తపస్వి బయటకు వస్తాడేమో అని చూస్తూ వేచియున్న సమయంలో పాతజీవితంలో శిష్యులతో మస్త ప్రయాణాలు చేసినపుడు అనేకమంది మస్తులను సాధువులను, యోగులను, వలీలను బాబా సాంగత్యం చేశారని. ఈ పని రెండు కారణాలవలన చేసారని—ఒకటి వారి దర్శనంచేయాలని అంటే వారికి శిరసువంచి ప్రణామం చేయడానికి, రెండవది తమ ప్రత్యేకమయిన పనికోసం అన్నారు అంతేగాని ఆ పనియేమిటో బాబా వివరించలేదు ఆయనకు తృప్తి కలిగే వరకు పాత జీవితంలో సాంగత్యం చేసేవారు ఇప్పుడు యీ నూతన జీవితంలో పెద్ద చిన్న అనే భేదంలేదు.

ఈ విషయంలో వదిలు పుస్తులు సాక్ష్యులు సంతలు — వీరిలో తారతమ్యాలు చెప్ప- వీరితో ప్రత్యేకంగా చేయవలసిన పనిలేదు పాత జీవితంలోలాగ ఇప్పుడు కేవలం వారి దర్శనంకోసమే యీ సాంగత్యం చేస్తున్నారు. ఇంతమందిని కలిసాను అని పెండుచేత వ్రాయించడం ఆయన స్వంత తృప్తికోసమే అయినా బాబా చేసే యీ పనికి లెక్క వ్రాయమనడానికి కారణం లేకపోలేదు

అపరాహ్నం 4 గంటలకు బాబా వారి సహచరులు మోటారులో తిరిగి వచ్చారు. బాబా వచ్చేసరికి వారికి అన్నంపంక్తి సిద్ధంగా ఉంచలేదని పరివారకుడయిన సత్యపాల్‌ను కోపపడ్డారు కొంతసేపయాక ఎందుకు అన్నం వండలేదో సత్యపాల్ వివరించి చెప్పాడు బాబాకి కోపంవచ్చిందని సహచరులను పిలిచి ఆయన చెవులను గిల్లించుకున్నారు. ఇంతవరకు ఆ రోజున బాబా 334 సాధువులతో సాంగత్యం చేసారు.

మార్చి 17 వ తేదీన ఉదయం వాతావరణం బాగా ఉంది ఇంట్లోంచి చూస్తూంటే దూరాన పర్వత పంక్తులు వాటి సుందర అవి ఎంతపొడుగున ఉన్నాయో అంత పొడుగునా అరణ్యాలు కనిపిస్తోంది. పురుషుల గృహానికి 100 గజాలదూరంలో స్త్రీల గృహం ఉంది. ఈ యిళ్ళకి చుట్టూ చెరుకు తోటలున్నాయి అక్కడినుంచి ఆ తోటలగుండా సన్నని రోడ్డు ఉంది. అది రైల్వే పట్టాలు దాటి పెద్ద రోడ్డును కలుస్తుంది అది డేరాడూన్ నుంచి హరిద్వార్‌కు వెళ్ళేరోడ్డు రెండో చివర ఆ చిన్నరోడ్డు మంజీమాఫి ఊరిలోకి వెళ్తుంది ఇది చాలా చిన్నగ్రామం అక్కడి జనాభా 600 మంది ఉంటారు. పురుషుల యింటి సమీపాన యీ సన్నరోడ్డుకి అవతలివైపున శత్రుఘ్న కుమార్ యిల్లుంది స్త్రీల యింటి గేటువద్ద డా॥ గోహర్ బజారుకి వెళ్ళి కొనవలసిన జాబితా విష్ణుకి యిచ్చింది విష్ణు కుంటుతూ సైకిల్‌మీదకి ఎక్కి వెళ్ళిపోయాడు సాయంకాలం విష్ణు వచ్చేటప్పుడు ఒక వార్త మోసుకువచ్చాడు బాబాదాస్, I-C పథకంలోని సహచరుడు రెండువందల రూపాయల మనియార్డరు పంపుతూ బాబాకు సహచరులకు ప్రణామాలతో I-C పథకంక్రింద అందరి షరతుల ప్రకారం సమర్పించుకున్నానని వ్రాసాడు అనారోగ్యమయిన తన శరీరంతో బాబాదాస్ సంపాదించి యింత త్వరలో అంత మొత్తం మిగుల్చుకుని పంపించడంటే ఆశ్చర్యంగానే

ఉంది. ఇది నిజంగా మెచ్చుకోదగినదే. ఇంతవరకు అదీ (స్త్రీ) తప్ప మరెవ్వరూ పంపలేదు.

మార్చి 17 వ తేదీన కూడా బాబా మోతీచర్‌నుంచి వైమల్, ఎరచ్, పెండు, గుస్తాద్‌జీలతో సప్త సరోవర్‌కి వెళ్ళారు. నిన్న వెళ్ళినపుడు బాబా అక్కడ ఉన్న సాధువు లందరినీ సాంగత్యం చేయలేదు. అందుచేత మిగిలిన వారిని యీ రోజున దర్శనం చేసారు ఈ ఒక్క రోజున సాయంత్రం వరకు 400 మంది సాధువులను సాంగత్యం చేసారు మొత్తం యింతవరకు సాంగత్యం చేసిన సాధువుల సంఖ్య 794 అయింది.

ఈ రోజున సూర్యోదయం నీలాకాశంలో అనేక రంగులతో ఎంతో మనోహరంగా ఉంది . చెట్లమీద పక్షుల కలకలారావాలతో వీధిలో కుక్కలు పోటీ చేస్తున్నాయి కాని ఎప్పటికయినా కుక్కలే ఓడిపోతున్నాయి నీలు డా॥ నాథ్‌ను కలిసేందుకు డా॥ (శ్రీమతి) ధీర్‌తో కొంచెం బాబా తరఫున పని ఉండి డేహాడూన్ వెళ్ళి సాయంత్రం ఆలస్యంగా తిరిగి వచ్చాడు విష్ణు ఊళ్ళోకి వెళ్ళి ఒక టెలిగ్రాం తీసుకు వచ్చాడు అది బాబా యిచ్చారు అందులో 20 వ తేదీన మంత్రిమాఫి మధ్యాహ్నం 2 గంటలకు వస్తున్నానని యిచ్చారు టెలిగ్రాం స్త్రీలకి కూడా తెలియాలని గోహర్ పేరుతో యివ్వడం జరిగింది.

బాబా మోతీచర్ నుంచి మామూలుగా తీసికెళ్ళే సహచరులతో బయలుదేరి కంఖల్ వెళ్ళారు చైతన్యదేవ్ ఆశ్రమ్‌లోని సాధువులను ఆయన మొదట సాంగత్యం చేసారు కంఖల్ స్మశానభూమి వద్ద ఉన్న ఉదాసీమహాత్ముల అఖాడాకి తరువాత వెళ్ళారు. ఆ పరిసరాలన్నీ వెదకి అక్కడ ఉన్న సాధువులందరిని సాంగత్యం చేసారు బాబా – ఆరోజు కలిసిన సాధువుల సంఖ్య 412 మొత్తం యిప్పటికి 1212 బాబా సహచరులతో మోతీచర్ తిరిగి వచ్చేసరికి సాయంత్రం పొద్దుపోయింది. కుంభమేళావని ఒక విధంగా ఆధ్యాత్మికమయినదే. కాని కంఖల్ హరిద్వార్ అంతా తిరిగి చూస్తే యీనాడు మునుపటివలె గాక ఆధ్యాత్మిక వాతావరణం వ్యంగ్యం అయింది

మార్చి 19 వ తేదీన ఆకాశం కారుమేఘాలతో నిండి ఉంది సూర్యుడు వెలవెల బోతున్నాడు ఏ క్షణంలోనయిన వర్షం పడవచ్చునన్నట్లుంది ఈ రోజున

స్త్రీలకు కావాలని డా॥ గోహర్ విష్ణుకి పెద్ద జాబితా ఇచ్చింది చాలా కూరలు అవీ కావాలనివ్రాసింది బాబా రేపు వస్తారని కావలసినవన్నీ తెప్పించుకుందామని. ఉదయం 10 గంటలకి ఒక్క జడివాన పడింది మధ్యాహ్నం 12 గంటలకు విష్ణు బజారు పనికోసం ఊళ్ళోకి వెళ్ళి వస్తువులన్నీ కొనుక్కొని సాయంత్రానికి తీసుకు వచ్చాడు

మధ్యాహ్నం డా॥ డాన్‌కిన్ మంజ్రిమాఫి వచ్చాడు. నీలు, కాకా, కైకోబాద్ అతనితో చాలాసేపు మాట్లాడారు. అతడు వచ్చాడని అందరికీ సంతోషం కలిగింది. సాయంకాలం శత్రుఘ్న తన భార్య సుమిత్ర తయారుచేసిన కాఫీ డాన్‌కిన్‌కి యిచ్చాడు ఆమె కాఫీ తయారు చేయడంలో మంచి నేర్పరి శత్రుఘ్న విష్ణుని, నీలూని, కాకాని కూడా కాఫీ త్రాగేందుకు పిలిచాడు బాబా ఆజ్ఞలవల్ల III పథకం షరతులవల్ల వారు నెమ్మదిగా మర్యాదగా రాజాలమని చెప్పారు సాయంకాలం ఆలస్యంగా డాన్ డెహ్రాడూన్ వెళ్ళాడు ఆ రాత్రి వాతావరణం బాగా లేనందున, తుఫాను గాలుల వలన, చాలా సేపటివరకు ఎవరికీ నిద్దురపట్టలేదు.

మోతీచర్‌లో బాబాకి ఆరోగ్యం అంత బాగా ఉండడంలేదు సాధు సాంగత్యం చేస్తూ తిరిగినందువల్ల కాబోలు రెండుమూడు రోజులుగా వేళకు భోజనం లేదు అందుకనే బాబా చాలా అలసినట్లు, బలహీనంగా ఉన్నారు. కళ్ళు మండుతూ యిసుక పడినట్లున్నాయి ఉదయాన్నే ఆయన ఖార్‌ఖేడీ నదికి వెళ్ళారు. అది భీమ్ గోదాకి ఒకమైలు ఉంది బాబా సహచరులతో ఎద్దుబండిలో వెళ్ళారు.

కంఖల్‌లో బాబా మళ్ళీ 113 మంది సాధువులను సాంగత్యం చేసారు. వారిలో కొద్దిమంది ఉదాసీలు, నిర్మలీలు ఉన్నారు ఇంతవరకు మొత్తం 1325 మంది సాధువులను బాబా కలుసుకున్నారు బాబా సహచరులతో మధ్యాహ్నం ఆలస్యంగా మోతీచర్‌కి తిరిగి వచ్చారు బాబా పెండువి తీసుకొని మర్నాడు మంజ్రిమాఫికి వెళ్ళి మళ్ళీ 22 వ తేదీ ఉదయాన వస్తానని చెప్పారు-

మార్చి 20 వ తేదీన ఆకాశం మేఘావృతమై ఉన్నా సూర్యుడు మబ్బుల్లోంచి తొంగి చూస్తున్నాడు. బాబా వస్తారని స్త్రీలు పురుషులు కూడా యిల్లు శుభ్రపరచడం మొదలయిన పనుల హడావిడిలో ఉన్నారు అందరు బాబా రాకకోసం ఎదురుచూస్తున్నారు బాబామధ్యాహ్నం 2 గంటలకు వస్తానన్నారు. 12 గంటలయింది. ఇంకా బాబా కోసం ఆతురతగా ఎదురు చూడడం ప్రారంభించారు ఆయన వచ్చే

వరకు ఎవరూ భోజనాలు చేయలేదు, స్త్రీలు పురుషులు కూడా. బాబా, పెండు వచ్చేసరికి ఒంటి గంటయింది. బాబా రాగానే స్త్రీల యింటికి వెళ్ళారు. పెండు సహచరులుండే యింటికి వెళ్ళాడు అందరూ భోజనాలు చేసారు. మధ్యాహ్నం 2-30 గంటలకే టీ తీసుకున్నారు. సహచరులంతా బాబా వారి యింటికి వస్తారని కనిపెట్టుకు కూర్చున్నారు.

బాబా అక్కడికి 3 గంటలకు వచ్చారు బాబా లోపల అడుగుపెట్టగానే డా॥ నీలు వెంటనే బాబాచేస్తున్న సాధు సాంగత్యంవని ఆయన ఆరోగ్యం మీద ఎలాటి దెబ్బ తీసిందో కనిపెట్టాడు సుఖంమాత్ర నీరసం కనిపిస్తున్నా ఆయన దేహం శక్తి వసుస్ఫూర్తమై ప్రకాశవంతమైన నేత్రాలతో సహజమైన తేజస్సుతో కూడిన వదనంతో ఉన్నారు బాబా. నీలు వరుపుమీద కూర్చుని బాబా అందరిని ఎవరి ఆరోగ్యం ఎలా ఉందో కుశల ప్రశ్నలు వేసి అడిగారు కాకావైపు తిరిగి ఎలా ఉంది అని అడిగారు కాకా ఆరోగ్యం బాగా ఉన్నందువల్ల బాబా తృప్తి పడ్డారు తరువాత నీలు, మిస్టు గోహర్, శత్రుఘ్నవగైరాలకు బాబా తలొకపని చెప్పారు మోతీచర్‌లో పని ఒత్తిడి వలన తమకు శరీరారోగ్యం అంత బాగా లేకపోయినా వావా అంతరంగం లో అమితానందం పొందుతున్నారు. మోతీచర్ లో ప్రకృతి ఆయన పనికి ఎదురు తిరిగిందన్నారు – తుఫానుగాలులూ, వర్షం వగైరా చుట్టుప్రక్కల ఎక్కడా చెట్లు లేనందువల్ల నీడయినాలేదు బాబా కోసంవేసిన పూరిల్లు సహచరులు గుడారం యీ మాదిరి వాతావరణంలో అంతసుఖంగా లేవన్నారు రోజుకి ఒక్కపూటే భోజనము, అదయినా పప్పు చపాతీలు మాత్రమే. ఉదయం అల్పాహారంలో పాలతో కలిపిన టీ చపాతీ తీసుకుంటారు మధ్యాహ్నం పాలు లేకుండానే టీ తీసుకుంటున్నారు. పని ఉన్నప్పుడు యిలాటి యిబ్బందులను ఏమీ పాటించను అని బాబా చెప్పారు. తరువాత కైకోబాద్ వైపు తిరిగి అతని ఆరోగ్యం ఎలా ఉందని అడిగారు. అతడు బాగా ఉన్నానని చెప్పాడు. తరువాత బాబా నీలుని డాన్‌కిన్ ఆరోగ్యం బాగా ఉందాఅని అతని ప్రాక్టీసు ఎలా ఉందని అడిగారు బాబా ఆరోజున అక్కడికి వస్తున్నట్టు డాన్‌కిన్‌కి తెలుసునా అని అడిగారు డాన్‌కిన్ బాగానే ఉన్నాడని బాబా ఆ రోజు వస్తున్నట్లు అతనికి తెలుసునని నీలు చెప్పాడు. మరునాడు నవరోజ్ ముబారక్ చెప్పడానికి డాన్ వస్తాడని చెప్పాడు.

ఆదీ రిజిస్టరు బుక్‌పోస్టు పార్సిలు ద్వారా కొత్త జీవితం సర్క్యులర్లు 4,5 నెంబర్లు అచ్చువేయించి పంపించాడని బాబాకి యిచ్చారు. ఆ పార్సిల్ బాబా

చెప్పిన ప్రకారం ఎరచ్ పేరుతో పంపించిన 4వ నెంబరు సర్క్యులర్ నీలు వ్రాసిన బాబా క్రొత్త జీవితపు డైరీ. 5వ నెంబరులో బాబా నవ్యజీవితపు పథకాలు I-A, B, C, II, తరువాత III పథకం యొక్క షరతులు ఉన్నాయి. వీటి ప్రతులు బాబా నీలుకి యిచ్చారు. అవి త్వరగా చదివి అందులో ఏవయినా వదిలేసారేమో చెప్ప మన్నారు. నీలు ఆ ప్రకారం చదివి గనీ తాలుకు రు 35,000/- విషయం బాబా చెప్పి వ్రాయించింది నాలుగో నెంబరు దాంట్లో పడలేదన్నాడు. అది వెంటనే దానిని గురించి ఆదీకి ఉత్తరం వ్రాయమన్నారు బాబా. ఈవిధంగా వ్రాసాడు నీలు -

మంజ్రీమాఫీ, దేరాడూన్
సోమవారం, 20 మార్చి, 1950.

ప్రియమైన ఆదీకి,

నీవు ఎరచ్ పేరుతో పంపిన 4,5 నెంబరు సర్క్యులర్ కాపీల రిజిస్టర్డు పార్శిలు అందినది. ఈ రోజున మోతీచర్ నుంచి రెండు రోజులుందామని బాబా వచ్చారు, పెండుతో. ఆయనకి అవి అందజేసాను.

ఎరచ్ పేర 13వ తేదీన నీలు వ్రాసిన క్రొత్త జీవితం డైరీ ఎందుకు వేరే అచ్చు వేయబడిందో విష్ణుచేత బాబాకు చదివి వినిపించబడింది. తరువాత బాబా సర్క్యులర్‌కి నకలు నాకు యిచ్చారు. అవి నన్ను త్వరగా చదవమని చెప్పారు. గనీ బాపతు రు 35,000/- ల చరిత్ర అందులో అచ్చు కాబడలేదని చూసాను. బాబాయే అది వివరంగా చెప్పగా విష్ణు వ్రాసాడు. విష్ణు వ్రాసిన యీ పేజీ కూడా నీకు అచ్చు వేయవలసిన కాగితాలతో సదాశివపటేల్ ద్వారా పంపించాము. అందుచేత బాబా నీకు దాని విషయమై వ్రాయమన్నారు. డైరీలో ఏదీ యికముందున వదలిపెట్టవద్దని బాబా చెప్పారు. బాబా చెప్పిన మాటలు, చెప్పి వ్రాయించినవి, సహచరులకి యిచ్చిన ఆజ్ఞలు ఒక్కమాట కూడా డైరీలోంచి వదలకుండా అన్నీ అచ్చువేయించమని బాబా కఠినంగా చెప్పారు. ఒకే రోజున ఒకే సంగతి గురించి రెండుమార్లు చెప్పితే రెండో సారి చెప్పినది వదిలిపెట్టవచ్చుననీ, వ్యాకరణం దోషాలుంటే దిద్దవచ్చునని బాబా చెప్పారు.

అందుచేత యీ మాట అచ్చు చేయించేటప్పుడు ఇప్పుడు వదిలేసినది అందులో చేర్చి ముద్రణ చేయించమన్నారు.

(గనీగురించిన విషయం)

నూతన జీవిత పధకాలు సహచరుల ముందు పెట్టిన రోజున గనీ తన నిశ్చయం చెప్పకముందు యీ దిగువ ప్రకారంగా చెప్పాడు

" ఈ కుటుంబం మూలాన నేను చిక్కు స్థితిలో పడ్డాను పాత జీవితంలో నా భార్య ఆస్తి, నా కుటుంబాన్ని చివరి వరకు పోషిస్తారని, మీకు యిచ్చేసాను. మొదట్లో నూతన జీవితం అంత యిదిగా నేను పట్టించుకోలేదు. అందుకని 'అవును' అని నేను సంతకం చేసాను ఆ విధంగా నూతన జీవితపు షరతులన్నీ ఒప్పుకున్నాను నేను తప్పకుండా పరిస్థితులు మారతాయి అనుకున్నాను ఈ నూతన జీవితం అనంతంగా ఉంది నేను యిప్పుడు చిక్కులో పడ్డాను పథకం I-A లో గాని I-B లో గాని నేను చేరలేను కాని నూటికి నూరుపాళ్ళు I-C లో చేరి ఉండే వాడను, నా కుటుంబాన్ని పోషించే నిమిత్తం నా మీద ఉండే భారం వల్లగాని. సరే అని సంతకం చేసాక మీ వద్దనుంచి ఆధ్యాత్మికంగా కాని భౌతికంగా గాని ఏదీ నేను ఇప్పుడు ఆశించలేను " బాబా యింకా యిలా అన్నారు

"గనీ యిప్పుడు యీ చిక్కులోంచి యీవల పడేందుకు బాబా సహాయం చేస్తారని ఆశిస్తున్నాడు ఎలాగో గనీకి యీ (1950) సంవత్సరం ఆఖరికి అతని భార్య ఆస్తి కిమ్మతు (రు 35,000/-) యిచ్చివేస్తానని నేను అతనికి మాట యిచ్చాను.

"(నూతన జీవిత నిబంధనల ప్రకారం ఎవరి వద్ద నుంచి బాబా ఎవరికీ ఏమీ యివ్వలేము, పుచ్చుకోనూలేదు. కాని గనీ యిదివరకే నూతన జీవితంలో ఉన్నవాడు గనుక అతడు నూతన జీవితంలో ఉండడానికి సహాయం చేయడంకోసం బాబా ఎలాగో యీ మొత్తం అతనికి యిస్తారు నూతన జీవితపు షరతులు ఉల్లంఘించకుండానే యిస్తారు)

"గనీ వెంటనే చాలా సంతోషించి III పథకంలోకి గంతువేసి చేరాడు "

ఈ పైవిషయం 4 వ నెంబరు నూతన జీవిత సర్క్యులర్లో అచ్చువేయించవలసింది. ఈ వదిలివేతకు చింతిస్తూ యిప్పుడు చేరుస్తున్నాము, అచ్చులో ఉన్న

గనీ డైరీ పుస్తకంలో చేర్చారేమో అని పొరపాటున అనుకున్నాను ( గనీ డైరీ 16-10-49 నుండి 21-1-50 వరకు )— ఆదే (సీ)

బాబా తరుచుగా నేను డైరీలో ఏమి వ్రాసానో చదివిస్తూ ఉంటారు ఆయన స్వంతంగా యీ డైరీలు వ్రాయడంలో ఆసక్తి చూపుతారు కొన్ని సమయాలలో ఆయనే స్వయంగా వ్రాయిస్తారు బాబా ఆజ్ఞ ప్రకారం యీ వివరం వ్రాస్తున్నాను. ఈ ఉత్తరానికి జవాబు వ్రాయనవసరం లేదన్నారు బాబా.

సర్క్యులర్లు ముద్రించినపుడు కొన్ని కాపీలు యిదివరలో వలెనే పంపించ వలెను

ఇట్లు నీ సోదరుడు
నీలు

ఈ ఉత్తరం వ్రాస్తూంటే బాబా స్త్రీల యింటికి ఏవో మరమ్మతులు అవసరం అని అవి చేయించమని విష్ణుకి శత్రుఘ్నకి చెప్పారు శత్రుఘ్న ఆ మరమ్మతులకి అయిన ఖర్చుకి లెక్క వ్రాయవలెనని బాబా చెప్పారు ఈ సొమ్ము స్త్రీలు యిచ్చుకుంటారు నీలు ఆదికి వ్రాసిన పై ఉత్తరం బాబాకి చదివి వినిపించగా అందులో అక్కడక్కడ దిద్దుబాట్లు చేయించాడు బాబా.

అప్పటికి చీకటి పడుతోంది గాలికూడా చలిగానే వేస్తోంది బాబా సాయంకాలం 7 గంటలకు మోతీచర్ వెళ్ళారు పెండు భోజనం చేసాక దాదాతో కలిసి వెళ్ళాడు. వెళ్ళి మోతీచర్‌లోని సహచరులందరియొక్క నమస్కారాలు అందచేసాడు ఆ రాత్రంతా బలమయిన గాలి హోరుమని చెట్లలోంచి రొదచేస్తూవీస్తోంది. రాత్రంతా చెట్ల ఆకులు ఆ వాయువులన చప్పుడవుతూనే ఉన్నాయి. రాత్రి చలి ఎక్కువగా ఉన్నందున ఎవరికీ నిద్ర బాగా పట్టలేదు

21 వ తేదీ ఉదయం తేచేసరికి ఆ రోజు మబ్బులలో ఆకాశం నిండి చీకటిగా ఉంది. ముస్సూరి కొండలమీదనుంచి చలిగాలి మంజ్రిమాళీమీద వీస్తోంది ఈ రోజున పార్సీవారి సంవత్సరాదినవరోజ్ పండుగ. అందుకని సహచరులంతా తెల్లవారగట్ల 4 గంటలకే లేచారు ఒకరికొకరు ముబారక్ అని శుభాకాంక్షలు చెప్తు

కున్నారు. అయిదు గంటలకు అందరూ టీ తీసుకున్నారు ఆరు గంటలకి ఆ చలి లోనే బాబా సహచరుల యింటికివచ్చారు. పెండు, విష్ణు, నీలు, కాకా, క్రైకోబాద్ లు బాబాకి నవ్‌రోజ్ ముబారక్ చెప్పారు (నూతన సంవత్సర శుభాకాంక్షలు) నీలు పడకమీద కూర్చున్నాడు బాబా ఆయన పంట్లో బాగా లేదని కళ్ళు గరగర లాడు తున్నాయనీ చెప్పారు. డా॥ గోహర్‌ని పిలిపించి ఆమెను, డా॥ నీలూని తమ కళ్ళు పరీక్ష చేయమన్నారు వెంటనే వారు బాబా కళ్ళు పరీక్ష చేసి ఏదో మందు వ్రాసి యిచ్చారు. తరువాత బాబా విష్ణుని పిలిచి ఏర్పాటుదార్లలో ఒకడయిన రంజూకి ఉత్తరం వ్రాయమని నీలూని దానికి ఒక నకలుతీసి డైరీలో పెట్టమన్నారు ఆ ఉత్తరం యీ విధంగా వ్రాయించారు—

మంద్రిమాఫి

21-3-50

ఏర్పాటుదార్లలో ఒకడయిన రంజూకి,

నవ్యజీవితం I-C పథకంలో సహచరుడయిన ఆదీ సహాయంతో 350 మంది స్నేహితులను ఎన్నుకుని వారికి ఒక్కొక్కరికి యీ క్రింది సర్క్యులర్ యొక్క నకలును పంపించాలి అది నా పేరుతోను నీ చిరునామాతోను పంపించాలి.

—బాబా చెప్పి వ్రాయించినది—

ఈ 350 మందిలో పాశ్చాత్యులలో ఎవరినీ చేర్చకూడదు.

## సర్క్యులర్

డా॥ అబ్దుల్ ఘని మున్సిఫ్ "పాత జీవితం 'భోజా'నిధి"

"కొత్త జీవితపు మొదటి నిబంధనలు ఘనీ సరే అని సంతకం పెట్టి నప్పుడు యిదివరకటి వాగ్దానాలన్నిటినుంచి నన్ను విముక్తుణ్ణి చేసాడని స్పష్టంఅయింది. కానీ అతడు ఏదో అపార్థం చేసుకుని బాధపడుతున్నట్లు కనిపించాడు

క్రొత్తజీవితపు ప్రమాణానికి కట్టుబడేటట్లు అతనికి సహాయం చేయడానికి అతడు I-C పథకంలో ప్రవేశించకముందే అతనికి రు 35,000/- నేను-అతనిభార్య ఆస్తి నాకు యిచ్చాడు గనుక ఈ సంవత్సరాంతానికి ముందే యిస్తానని చెప్పాను.

క్రొత్త జీవితం నిబంధనల ప్రకారం, నేను ఎవరికీ డబ్బు యివ్వకూడదు; ఎవరి వద్దనుంచీ పుచ్చుకోనూ కూడదు. III పథకం ప్రకారం ఆహారం తప్ప ఏదీ భిక్ష అడుగరాదు కాని దీనిని ప్రత్యేకరంగా క్రొత్తజీవితంలో తీర్చే పాతజీవితపు భారంగా తీసుకుని నేను యీ క్రింది విధంగా ఆచరించడానికి నిశ్చయించాను. - నేను నా పాత జీవితపు స్నేహితులను 350 మందిని నాకు ఒక స్నేహితునిగా తలొక వందరూపాయిలు యిచ్చి మొత్తం రు 35,000/- యీ నిధికి పోగయేటట్టు చేయమని కోరుతున్నాను. ప్రతివారు ఏర్పాటుదార్లలో ఒకడయిన రంజూకి పంపించవలెను. రంజూ యీ సొమ్ములు తీసుకుని మొత్తం రు 35,000/- ఘనీకి అందజేయవలెను.

ఒక నూతన జీవితపు సహచరునికి సంబంధించిన యిది ఒక ప్రత్యేక మయినదని అందరూ అర్థం చేసుకోవాలని కోరుతున్నాను. నా నూతన జీవితంలో యిదే మొదటిది ఆఖరిదీ కూడాను ఎటువంటి ఆధ్యాత్మిక లాభం ఆశించకుండా యీ 350 మంది మిత్రులు నాకు సహాయం చేస్తున్నారు గాని ఘనీకి కాదు. ఎందు చేతంటే యీ క్రొత్త జీవితంలో నేను ఆధ్యాత్మిక గురువుగా ఉండే ప్రశ్నే ఉదయించదు. నా క్రొత్తజీవితంలో ఘనీ ఒక సహచరుడుగా ఉండడానికి దీనికీ ఏమీ సంబంధంలేదు

ఎమ్. ఎస్. ఇరానీ (బాబా) "

ఈ ఉత్తరం వ్రాయడం అయేసరికి ఆకాశంలో మేఘాలు అలుముకుని బలమయిన గాలి చెట్ల నందులలోంచి పెద్ద ధ్వనితో వీస్తోంది ఉరుములు, మెరుపులు సాగా ఉన్నాయి. ఉదయం 9-30 గంటలకు డేరాడూన్ నుంచి డాన్‌కిన్, నారావాలా, ఎరచ్ మిస్త్రీ, శత్రుఘ్న సైకిళ్ళమీద వచ్చారు వారందరిని చూడడానికి బాబాకు ఎంతో సంతోషం కల్గింది. వారందరూ బాబాకి 'నవరోజ్ ముబారక్' చెప్పారు. బాబా ప్రతి ఒక్కరిని కౌగిలించుకున్నారు డాన్ బాబా కోసం కొన్ని పళ్ళు పట్టుకొచ్చి యిచ్చాడు.

శత్రుఘ్నతో బాబా యీ సంవత్సరం వాతావరణం తమాషాగా ఉందని అది యిలాగే విపరీతంగా ఉంటూ ఉంటే యీ వూరినుంచి మకాం ఎత్తేస్తానన్నారు. అప్పుడు శత్రుఘ్న అలాంటిది యిక్కడే కాదని ప్రపంచంలో అనేక చోట్ల యీ

సంవత్సరం యిలాగే విపరీతంగా ఉంటోందని అన్నాడు బాబా డాన్ యొక్క ఆరోగ్యం గురించి అతని ప్రాక్టీసు గురించి అడిగి తిండిలో పొదుపు చేయవద్దని. తన ప్రాక్టీసు గురించి ఏమీ విచారించవద్దని బాబా అన్నారు అతనికి తగినంతమంది రోగులు రాకపోతే ప్రాక్టీసు మూసేసి డాన్‌ని తమ వద్దకు వచ్చెయ్యమన్నారు.

బాబా నారావాలా తోను, ఎరచ్ మిస్త్రీతోను, శత్రుఘ్నతోను, సిలుతోను, కై కోబాద్ తోను, విష్ణుతోను, డాన్‌తోను, కూర్చుని హాస్యపూరితమైన మాటలు చెప్పి అందరిని నవ్వించారు ఆయన చాలా సంతోషకరంగాను ఉల్లాసంగాను ఉన్నారు. బాబా నారావాలాను ఎరచ్‌ను టాంగా గాని టాక్సీ గాని మరునాడు ఉదయం సరిగా 6 గంటలకు తీసుకువస్తే బాబా మోతీచర్‌కి వెళ్తానని చెప్పారు పెండుని వారికి ఆ బండి అద్దె యిమ్మనమని చెప్పారు తరువాత నారావాలా ఎరచ్ దేరాడూన్‌కి వెళ్ళారు బాబా డాన్‌ని భోజనానికి, తరువాత టీ కి ఉండమని అన్నారు అందరూ కలిసి భోజనం చేసారు బాబా వారికి స్వయంగా వడ్డించారు సాయంకాలం ప్రొద్దు గూకుతూంటే డాన్ దేరాడూన్‌కి వెళ్ళాడు సాయంకాలం బాబా శత్రుఘ్నతో డ్రాట్స్ రెండు ఆటలు ఆడారు మొదటి ఆట శత్రుఘ్న నెగ్గాడు రెండవది బాబా గెలిచి సరిచేసుకున్నారు తరువాత బాబా స్త్రీల యింటికి వెళ్ళారు. ఆ సాయంత్రం గాలితో కూడిన వర్షం కురిసింది ఉరుములు మెరుపులు కూడా వచ్చాయి. నల్లటి మేఘాలు ఆవరించాయి. త్వరగా చీకటి పడింది ముస్సూరి కొండలమీద ఆకాశం ఉరుములతో దద్దరిల్లిపోయింది సహచరులు రాత్రి భోజనం చేస్తూంటే పెండు మోతీచర్ విశేషాలు ఎన్నో కథలక్రింద చెప్పాడు.

ఆ రాత్రి చాలా పెద్ద వర్షం కురిసింది గంభీరమయిన మేఘ ఘర్జనలతో ఎవరికీ రాత్రి బాగా నిద్ర పట్టలేదు గాలి చాలా బలంగాను వడిగాను వీచి కిటికీలు వగైరా ఊపేసింది. తెల్లవారిన తరువాతకూడా ఆకాశం కారుమేఘాలతో నిండిపోయి కనిపించింది. గాలివల్ల కొట్టుకొచ్చిన చెట్ల కొమ్మలు ఆకులు రోడ్డంతా పడిఉన్నాయి చుట్టుప్రక్కల నీరు బాగా నిలిచింది.

తెల్లవారి 6 గంటలకు (22 మార్చి, బుధవారంనాడు) నారావాలా, ఎరచ్ మిస్త్రీ ఒక టాక్సీ తీసుకు వచ్చారు చాదాను పెండును దేరాడూన్ రైల్వేస్టేషన్‌కి తీసుకు

వెళ్ళడానికి వారు అక్కడినుంచి రైలుమీద మోతీచర్ వెళ్ళారు రైలుకి వెళ్ళేముందు బాబా మరల ఏప్రెల్ 9 న తేదీన మంత్రీకూటి వస్తానని చెప్పివెళ్ళారు.

బాబా వెళ్ళారని సహచరులు – పురుషులు స్త్రీలు, బాబా వియోగంతో బెంగ పెట్టుకున్నారు తరువాత పెద్ద తుఫాను వచ్చింది. ఆ గాలిలో అనేకచెట్లు అవీ తుడిచి పెట్టుకు పోయాయి. మసూరీ కొండలమీద చూస్తే, నల్లటిమేఘాలు గోడకట్టినట్లు కనిపిస్తున్నాయి మాటి మాటికీ పెద్ద పెద్ద ఉరుములు కళ్ళు మిరుమిట్లు గొలిపే మెరుపులు, ప్రకృతి విలయతాండవం చేస్తోంది రెండు గంటలు ఉరుములతో వర్షం పడింది కొంచెంసేపు ఏమీ లేకుండా అంతా శాంతంగా ఉంచి తరువాత పెద్ద వడగళ్ళ వాన కురిసింది. ఉదయానికి వర్షం లేదు గనుక మామూలుగా కాకా ప్రొద్దున్న ఆరుం పావుకి బయలుదేరి షికారు వెళ్ళాడు ఒక మైలు వెళ్ళేసరికి వర్షం పడింది. అతడు అక్ట్రాయిస్టేషన్‌లో తలదాచుకున్నాడు. నీలు, విష్ణు అయ్యో కాకా యింకా రాలేదే అని అతనిగూర్చి ఆందోళన చెందారు. కొంతసేపటికి వర్షం తగ్గింది 11 గంటలకి శాంతి కలిగింది అప్పుడు కాకా కులాసాగా తిరిగివచ్చాడు. అతనిని చూసి నీలు విష్ణు సంతోషించారు

ఆ మధ్యాహ్నం డాక్టర్ గోహర్ స్త్రీలందరికీ, సుభద్రకి కూడా కలరా టీకాలు వేసింది వారి తరువాత కాకా, నీలు, విష్ణు, శత్రుఘ్న, మహంతు, డాన్‌కిన్ లకు కూడా టీకాలు వేసింది డాన్ యిక్కడికి ప్రత్యేకంగా అందుకే వచ్చాడు అతడు కుంభమేళా చూడడానికి 13 ఏప్రెల్‌ని వెళ్దామనుకుంటున్నాడు.

అహమదాబాద్ నుంచి బాబాను చూడడానికి వీరేంద్రప్రసాద్ జయంతిలాల్ మెహెతా అనేవాడు సాయంకాలం వచ్చాడు, కానీ బాబా ఆరోజు ఉదయమే మోతీ చర్‌కి వెళ్ళిపోయారు సాయంత్రం వరకు వాతావరణం అలాగే ఉంది రాత్రి మరల వర్షం పడింది తుఫాను గాలులు అలాగే ఉన్నాయి బాబా పెందుతో రైలులో హరిద్వార్ స్టేషన్‌కి 9 గంటలకు చేరుకున్నారు ఎరచ్, గుస్తాద్‌జీ, బైదుల్‌లు బాబాను పెండును స్టేషన్ వద్ద కలిసారు అందరు కలిసి కంఖల్ వెళ్ళారు, సాధుసాంగత్యం కోసం వర్షం వస్తున్నా తుఫానుగా ఉన్నా బాబా యీ రోజున 225 మంది సాధువులను మహాత్ములను సాంగత్యం చేసారు అందరు కలిసి మోతీచర్‌కి వెళ్ళారు బాబా పెండుల సామానులు సంసార్‌చంద్ హోటలులో

హరిద్వార్‌లో ఉంచారు. ఆ సాయంకాలం ఆకాశం నిర్మలంగా ఉంది. మేఘాలు ఎక్కడివక్కడికి పోయాయి కొంచెంసేపే లయినా ఎండకాసి ఆనందాన్ని గొలిపింది.

ప్రకాశ్‌పతి ఆమె బిడ్డతో ఢిల్లీనుంచి బాబా దర్శనంకోసం వచ్చింది. బాబా ఆమెకు నూతన జీవితంలో దర్శనం యివ్వడం లేదని వివరించారు. ఆమెను యితరులకికూడా చెప్పమన్నారు యీ సంగతి ఎవరినీ బాబాని చూడడానికి రావద్దన్నారు. అయినా ప్రకాశ్‌పతి ఆమెను ఆశీర్వదించమని బాబాను అడిగింది వెళ్ళేటప్పుడు. బాబా ఆమెకు, ఆయన ప్రేమనే గాని ఆశీస్సులను యివ్వడం లేదని చెప్పారు ఇతరుల వద్దనుంచి కూడా ఆయన ప్రేమను ఆశిస్తున్నారు తెల్లవారుజామున 4 గంటలకి కాస్త తెరిపి యిచ్చి నక్షత్రాలు ఆకాశంలో అక్కడక్కడ కనిపిస్తున్నాయి. ఉత్తరాన ముస్సూరీ కొండలలో నల్లని మేఘాలు బాగా ఆవరించి ఉన్నాయి. తెల్లవారాక (23-3-50) ఎండ వచ్చింది కాని, అది బాగా కాయడానికి భయపడుతూన్నట్లుంది. ఉత్తరాన్నుంచి నల్లమేఘాలు ఆకాశం అంతా అన్ని దిక్కులా ఆవరించాయి తరువాత ఉత్తరం నుంచి దక్షిణాన పెద్ద మెరుపువచ్చి దాని వెంటనే పెద్ద ఉరుము ఉరిమింది వర్షం భయంవల్ల నీలు విష్ణు దేరాడూన్ వెళ్ళడం మానేసారు. సాయంకాలం ఆకాశంలో పెద్ద ఇంద్రధనుస్సు కనిపించింది.

మార్చి (1950) 23 వ తేదీన ప్రాతఃకాలం సూర్యరశ్మి ప్రకాశవంతంగా ఉంది రోజంతా ఎండ కాసింది మోతీచర్ నుంచి బాబా ఉదయాన్నే బయలుదేరి గుస్తాద్‌జీ, ఎరచ్, పెండు, బైదుల్‌లతో కన్‌ఖల్ వెళ్ళారు అక్కడ అనేకమంది సాధువుల సాంగత్యం చేసారు. ఆ రోజున బాబా 678 మంది సాధువులకు ప్రణామాలు చేసారు ఇంతవరకు మొత్తం 2,226 మంది అయారు బాబా పరివారంతో మోతీచర్ మధ్యాహ్నం ఆలస్యంగా చేరుకున్నారు 24 వ తేదీ ఉదయం ఆకాశం చక్కగా నీలంగా ఉంది ఈ రోజున ప్రకృతి అంతా అనుకూలంగానే ఉంది నిన్న రాని పక్షిజాతులు యీ రోజున ధైర్యంగా చెట్లనుండి యీవలకి వచ్చి ఆడుతున్నాయి. నీలు, విష్ణు, దేరాడూన్ వెళ్ళారు నీలు డాన్‌కిన్ ఆస్పత్రికి వెళ్ళాడు డాన్‌కిన్ తన వృత్తిలో సంపాదించి బాబాకి సహాయం చేద్దామని నిజాయితీతో ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు. నీలు అతనికి తన ప్రాక్టీసు గురించి ఏమీ ఆందోళన చెందవద్దని బాబా చెప్పిన మాటలు జ్ఞాపకం చేసాడు తన క్లినిక్‌కి తగినంతమంది రోగులు రాకపోతే అసలు ఆస్పత్రి మూసెయ్యమని బాబా చెప్పారుగదా అన్నదికూడా నీలు అతనితో

అన్నాడు. విష్ణు నీలు ఆలస్యంగా యింటికి తిరిగివచ్చారు సాయంకాలం. మోతీచర్‌లో మర్నాడు బాబా మామూలు ప్రకారం గుస్తాద్‌జీ, ఎరచ్, పెండు, బైదుల్‌లతో ఉదయాన్నే బయలుదేరి కంఖల్ వెళ్ళి వివిధ ఆశ్రమాలకి అఖాడాలకి వెళ్ళారు. అక్కడ యీ రోజున 568 మంది సాధువులను బాబా దర్శించారు. దానితో మొత్తం సంఖ్య 2794 అయింది. ఆ మరునాడు యీ సంఖ్య 2961 అయింది. ఆ రోజున (25, మార్చి 1) 167 మంది సాధువులను మహాత్ములను బాబా దర్శించారు అన్నమాట.

మార్చి 25 వ తేదీన సూర్యుడు సౌమ్యంగా ఉన్నాడు. ఎంతమాత్రం తీక్ష్ణంగా లేడు. ఉత్తరాన ముస్సూరీ కొండలమీద తప్ప యింకెక్కడా మేఘాలు కనబడటం లేదు ఆకాశంలో ఆ కొండలమీద గతరాత్రి పడిన మంచు యీ రోజున ఆ కొద్ది ఎండలోనే రంగురంగులతో మెరుస్తోంది ఇలాంటి రోజునే ఒకరోజున బాబా సాధు సందర్శనార్థం బయలుదేరారు ఆ రోజున ఒక సాధువుని దర్శించాక అతడు గంగానది పైన ఉన్న వంతెనమీదనుంచి ఆవలిఒడ్డుకి బాబా మోటునుంచి దృక్కులు మరల్చలేక వెనుకకు తిరిగి తిరిగి ఆయనవైపు చూస్తున్నాడు. ఆ విధంగా వంతెనచివరి వరకు వెనక్కి తిరిగి బాబా వైపు చూస్తూనే ఉన్నాడు, ఎవరూ యింత స్ఫురద్రూపి అని. బాబా వదనం అంత ఆకర్షణీయంగా ఉండేది పుంసాం మోహన రూపా అనే వర్ణన ఆయనకి తగింది

25 వ తేదీ ప్రొద్దున్నే పెందరాళే బయలుదేరి విష్ణు మంజ్రిమాఫి నుంచి రైలుమీద మోతీచర్ వెళ్ళాడు ఎందుచేతంటే బాబా క్రిందటిమాటు వచ్చినప్పుడు కొన్ని బట్టలు యిక్కడ ఉంచేసారు. అవి యిప్పుడు స్త్రీలు విష్ణుచేత బాబాకి పంపించారు విష్ణు తిరిగి వచ్చేసరికి రాత్రి చాలా ఆలస్యం అయింది. అతడు మోతీచర్‌కి ఉదయం 9 గంటలకు చేరుకున్నాడు. బాబా అప్పుడు సాధు సాంగత్యం కోసం కంఖల్ వెళ్ళి యున్నారు. ఆయన వచ్చేవరకు అతడు వేచియున్నాడు. బాబా వచ్చేసరికి మధ్యాహ్నం 12-30 గంటలయింది. బాబా చాలా అలిసిపోయి వచ్చారు ఇంత అలసట కలిగించే పనిచేసినా బాబా చాలా సంతోషంగాను చాలా ఉల్లాసంగాను కనిపించారు. విష్ణుని మంజ్రిమాఫి విశేషాలన్నీ అడిగారు బాబా అక్కడ స్త్రీ పురుష సహచరులను అందరిని అడిగి ఎలా ఉన్నారో తెలుసుకున్నారు మాట్లాడినంతసేపు ఆయన మాటలలో హాస్యరసం తొణికిసలాడుతోంది విష్ణు వెళ్ళేముందు అక్కడి సహచరుల గురించి బాబా అనేక విషయాలు చెప్పారు

మరునాడు ఆదివారం 26 వ తేదీ రోజంతా సూర్యుడు చాలా బాగా ప్రకాశిస్తున్నాడు పలచటి మేఘాలు ఆకాశం అంతా విస్తరించి కప్పేసాయి దూరాన ఉన్న ముస్సూరి కొండలు నీలంగా కనిపించాయి అవి పొగమంచులో ఉండబట్టి స్పష్టంగా కనిపించడం లేదు రోజంతా వెచ్చగానే ఉంది సాయంత్రం పడేసరికి మొదట చల్లగా హాయిగా తగిలిన గాలి తరువాత చలిచలిగా మారింది ఉత్తరాన్నుంచి దక్షిణానికి వీచిన గాలి చాలా తీవ్రమయిన చలితో కూడుకుని ఉంది. నీలు, గోహర్, మణి ఏదో పనిమీద దేరాడూన్ వెళ్ళారు తరువాత డా॥ నాథ్ దగ్గరకు వెళ్ళగా అతనితో బాబాగురించి చాలాసేపు మాట్లాడారు బాబా యొక్క హరిద్వార్, కంఖల్, రిషికేశ్ కార్యక్రమాలగురించి డా॥ నాథ్ ఎంతో ఆసక్తి కనపరిచాడు డాన్‌కిన్ మధ్యాహ్నం మంజ్రిమాఫి వచ్చి విష్ణు, కాకా, కైకోబాద్‌లతో అనేక విషయాల గురించి మాట్లాడి సాయంకాలం ఆలస్యంగా డెహ్రాడూన్ తిరిగి వెళ్ళాడు.

ఈ రోజున మోతీచర్‌నుంచి బాబా పెందరాళే సహచరులతో బయలు దేరారు. వారంతా మాయాపూర్ వెళ్ళారు ఇక్కడ బాబా అనేకమంది మహాత్ములను నిరంజని అఖాడాలలో కలిసారు కాశీ నుంచి వచ్చిన కొందరు సాధువులను కూడా దర్శించారు తరువాత బాబా వివిధ ఆశ్రమాలు అఖాడాలు తిరిగి ఒకరి తరువాత ఒకరిని దర్శించి ప్రణామాలు చేసారు అనేక చోట్ల ఆశ్రమాధిపతులు వారి ఆశ్రమాలలోని దేవాలయాలు దర్శించమని బాబాను కోరారు బాబా వారి మాట తీసెయ్యలేక వారి సహచరులతో వెళ్ళి దేవతా దర్శనం చేసారు ఒక వృద్ధమహాత్మునికి దూరాన్నుంచే తలవంచి ప్రణామం చేసారు అతడు గంగకి అవ్వలివడ్డున ఒకచెట్టు పైన చిటారు కొమ్మమీద నిలబడి ఉన్నాడు ఈ రోజున బాబా 937 మందిని దర్శించారు బాబా వారి సహచరులతో కలిసి మోతీచర్‌కి మధ్యాహ్నం తిరిగి వచ్చారు. ఆయన పని కుంభమేళాతో ఏమీ సంబంధం కలిగిలేదని యీ మేళాలో అనేక వందల మంది సాధువులు లభ్యమవుతారు గనుక వారిని దర్శించాలని వెళ్తున్నారు అంతే.

మార్చి 27 వ తేదీన చలిగా ఉన్నా అది అంత బాధాకరంగా లేదు సూర్యరశ్మి బాగా ఉంది ఉదయం చల్లగా హాయిగానే ఉంది రాను రాను రోజు రోజుకీ ఆకాశం నిర్మలంగా ఉంటోంది మనోహరమయిన ఆ నీలపు రంగు దినదినము ఎక్కువ అందంగా కనిపిస్తోంది ఆకాశంలో విహంగ విహారం ఎక్కువయింది

దాన్ వద్దకు అమెరికాలోని ఎలిజబెత్ నుంచి బాబాకి ఒక కేబుల్ వచ్చింది. బాబా చెప్పిన ప్రకారం ఆ కేబుల్‌ను విష్ణు శత్రుఘ్న యీ రోజున మోతీచూర్ బాబా వద్దకు తీసుకువెళ్ళి ఉండవలసినది కానీ వారిద్దరూ కూడా ఏదో పనివల్ల ఉండిపోయి బాబావద్దకు వెళ్ళడం మర్నాటికి వాయిదా వేసారు సీలు గోహర్‌తోను పజీతోను డేరాడూన్‌కి వెళ్ళాడు. వారు ముగ్గురు సాయంత్రం ఆలస్యంగా తిరిగి వచ్చారు ఆ సాయంకాలం ఎక్కడో వర్షం కురుస్తే అక్కడినుంచి వేసిన గాలిలాగ చల్లగా వేసింది గాలి అది వర్షపుగాలే. లేకపోతే అంత చల్లగా ఉండదు ఈ రోజున కుంభ మేళాలో చాలా ముఖ్యమయిన రోజు. ఈ వేళ సాధువులు మహాత్ములు, సంత్‌లు అందరు ఊరేగింపుగా వచ్చి గంగలో స్నానం చేసారు అనేక మార్లు వారా పవిత్ర తోయలలో మునకలిడి వారు కూడా పవిత్రులయారు. ఈ రోజున బాబా మోతీచూర్ నుంచి ఎక్కడికీ కదలలేదు- ఆయన స్వంతబట్టలు ఉతికి ఆరవేసుకున్నారు. ఇంకా స్వంత పనులేవో చేసుకున్నారు

28 వ తారీఖు (మార్చి, 1950) ఉదయం సూర్యరశ్మి బాగా ఉంది. ఎండ కాస్తున్నా చలి ఎక్కువగా ఉంది. పెందరాళే భోజనం అయాక శత్రుఘ్న తన మోటారు సైకిల్‌మీద విష్ణుని వెనకాల కూర్చోబెట్టుకుని మంజిమాఫీ నుంచి మోతీచూర్ తీసుకు వెళ్ళాడు. వాళ్ళు 11-30 కి బయలుదేరి వెళ్ళారు. మళ్ళీ వాళ్ళు తిరిగి వచ్చే సరికి సాయంత్రం ప్రొద్దుపోయింది మోతీచూర్ చేరుకునేసరికి 1-30 అయింది మధ్యాహ్నం. అప్పుడే బాబా హరిద్వార్‌నుంచి టాంగాలో వస్తున్నారు. బాబా తిన్నగా వెళ్ళి భోజనంచేసి వచ్చారు తరువాత అందరు ఎలా ఉన్నారని విష్ణుని అడిగారు. బాబా పనివల్ల అలసిపోయినా చాలా సంతోషంగానే ఉన్నారు సహచరులు కష్టపడి పనిచేస్తూఉన్నా ఉల్లాసంగానే కనిపించారు.

ఆ రోజున బాబా ఉదయాన్నే హరిద్వార్ వెళ్ళారు. బాబానాథ్ వంటి నిర్మాలి మహాత్ములను ఆ రోజున యింకా 612 గురు సాధువులను బాబా సాంగత్యం చేసారు. నిర్మాలి అఖడాలో ఒక మహాత్ముడు యిచ్చే ఉపన్యాసం బాబా చాలాసేపు నిల బడి విన్నారు సాధు సందర్శనం వల్ల కలిగిన మేలు గురించి ఆ ఉపన్యాసంలో చెప్పాడు ఆ మహాత్ములు యింకా ఆధ్యాత్మిక విషయాలు ఎన్నో చెప్పారు బాబా స్త్రీ సాధువులను 70 మందిని కలుసుకున్నారు ఆయన యీ మాతాజీలకి వంగి పాదా లకు నమస్కారం చేసారు అప్పటివరకు పెండు లెక్క వ్రాసిన దానినిబట్టి, ఆ 1[illegible]

మందివి బాబా దర్శనం చేసుకున్నారు 29 మార్చి ఉదయం ఆకాశం నిర్మలంగా ఉంది ఎండ బాగా కాసింది ఉదయం ఎండకాస్తూ సాయంకాలం చలివేస్తూ ఉంది. వర్షాలు వెనుక పట్టాయి. ముస్సూరీ కొండలు బాగా కనిపిస్తున్నాయి నీలు డాన్‌ను కలిసేందుకు విష్ణు బజారుపనికి డేరాడూన్ ఊళ్ళోకి వెళ్ళారు డాన్‌కి ఒక ధనికుడయిన రోగి ఉన్నాడు అతడు బాబా గురించి తెలుసుకొని ఆయనకు కొంత భూమిని సమర్పిస్తానన్నాడు. దానిమీద ఒక ఆరోగ్యాశ్రమం – శానిటోరియం – నెలకొల్పాలని అతని ఉద్దేశం బాబాయొక్క నూతన జీవితంలో ఎవరి దగ్గరనుంచి ఏమీపుచ్చుకోరని డాన్ వివరించి చెప్పినా అతడు యింకా భూమి యిస్తానన్నమాట వదలలేదు బాబా మోతీచర్‌లో ఉంటే నీకోరిక ఎలా నెరవేరుతుంది. అని డాన్ అతన్ని అడిగాడు.

రామనవమి నాడు చాలా బాంది క్రొత్త సాధువులు మహాత్ములు హరిద్వార్ వచ్చారని కబురు తెలిసింది కొందరు సప్తసరోవర్‌లో ఉన్నారని అన్నారు. మామూలుగా బాబా తమ సహచరులతో మోతీచర్ నుండి సాత్‌సరోవర్‌కి బయలు దేరారు, ఆనాడు ప్రాతఃకాలముననే దారిలోనే రాజవీధిలో చాలామందిని బాబా దర్శించారు సాత్‌సరోవర్‌లో ఉన్నవారినందరినీ దర్శించారు చెట్లక్రింద కూర్చున్న వారిని, గంగలో స్నానం చేస్తున్నవారిని కూడా బాబా కలుసుకున్నారు. నిరంతరము వారి పాదాలకి వంగి నమస్కారంచేయడం లేవడం మైళ్ళకొలది నడవడము సాధు అన్వేషణలో రోజుకొక్కపూటే భోజనం చెయ్యడం యివన్నీ బాబా ఆరోగ్యం మీద దెబ్బతీస్తున్నాయి. బాబా చిక్కి అలిసి పోయి ఉన్నారు. ఏమయినా సరే పని పూర్తి కావాలన్న పట్టుదలతో ఉన్నారు బాబా ఆ రోజున 472 మందిని సందర్శించారు.

30 మార్చి ఉదయం నవజీవంతో ప్రాతఃకాల వాయువులు వీచాయి. ప్రతి చోటా మంచు కురిసింది. ఉదయ సూర్యకాంతిలో ఆ మంచు మెరుస్తూ కనిపిస్తోంది. ఆ మెరుపులో అనేక రంగులు కనిపిస్తున్నాయి. 9 వ ఏప్రెల్ బదులు బాబా 8 వ తేదీనే మంత్రిమాఫి వెళ్ళామనుకుంటున్నారు ఈ వార్త మంత్రిమాఫిలో స్త్రీలకి విందొనర్చింది. విష్ణు తనకి బజారు సరుకులు తెమ్మని పెద్దలిస్టు యిస్తారని అనుకుంటున్నాడు.

తెల్లవార్లూ మంచు కురిసినందువలన అంతటా తడిగా ఉంది. నేలమీద మొలిచిన గడ్డిమీద కూడా జాడుతోంది రోడ్డుమీద నడిచే సాధువులను మహాత్ములను

దర్శనం చేసుకోవడానికి, వచ్చేపోయే టాంగాలను కార్లని బస్సులను తప్పించుకోవలసి వస్తోంది బాబా అది డేరాడూన్‌నుండి హరిద్వార్ వెళ్ళే రోడ్డు బాబా అనేకాశ్రమాలు అఖడాలు తిరిగి సాధు సందర్శనం చేసారు. బాబా తిరిగివచ్చేసరికి మధ్యాహ్నం చాలా ఆలస్యమయింది. ఈ రోజున 921 మందిని దర్శించారు దీనితో బాబా దర్శించిన సాధువుల సంఖ్య 5.903 అయింది. ఈ రోజున పని ఎక్కువయినందున బాబా చాలా అలిసిపోయారు అడుగులు బరువుగా వేస్తున్నారు.

మార్చి 1 వ తేదీ ఉదయం సూర్యుడు అంత తీక్షణంగా లేడు. సౌమ్యంగా ఉన్నాడు ప్రాతర్వాయువులు చల్లగా ఉన్నాయి. విష్ణు బజారుపనికి ఊళ్ళోకి వెళ్ళి వచ్చాడు. రాత్రి భోజనం చేస్తూ బాబా యిచ్చిన పనిమీద ఆ రోజున నిరంజన్‌పూర్ వెళ్ళి వచ్చానని చెప్పాడు నిరంజన్‌పూర్ డేరాడూన్‌కి 3 మైళ్ళదూరం ఉంది. ఆ గ్రామం సహరన్‌పూర్ వెళ్ళే రోడ్డుమీద ఉంది. 4 ఏళ్ళ క్రిందట విష్ణు అక్కడికి బాబాతో మస్త్ అన్వేషణార్థం వెళ్ళాడు. అక్కడి వారు అతన్ని ఆనవాలు పట్టారు. వారు బాబా గురించి గౌరవంగా కుశలం అడిగారు వారు బాబా దర్శనం చేసుకోవాలని అన్నారు డాన్ బాగా ఉన్నాడని విష్ణు చెప్పాడు – డాన్‌కి ఒక తీవ్రమయిన జబ్బుగల రోగి వచ్చాడని అతడు చెప్పిన రోగనిర్ణయం ప్రఖ్యాత పెథాలజిస్టు అయిన డా॥ మిస్త్రీ అంగీకరించాడని క్రమంగా డాన్‌కి మంచిపేరు వస్తోందని విష్ణు తెలియపరచాడు

ఈ రోజు బాబా సోదరుడు జాల్‌కి పూనాకి యీ ఉత్తరం వ్రాయించారు –

“ప్రియమయిన జాల్‌కి,

నేను యిదివరకు వ్రాసిన ఉత్తరానికి జవాబుగా నీ ఆరోగ్యం బాగాలేదని అందుచేత రాలేనని వ్రాసావు నీవు యిప్పుడు ఆరోగ్యం బాగుంటే నీవు వచ్చేవంటే హరిద్వార్‌లో కుంభమేళా చూడవచ్చు ఈ సంవత్సరం అద్వితీయంగా ఉంటుంది. డేరాడూన్‌కి ఏప్రెల్ 8 వ తేదీని చేరుకునేలా కేకి నారావాలా నిన్ను మంజ్రి మాషికి తీసుకువస్తాడు నీ భోజనం గురించి నీవేమీ విచారించకు నీవు నాతో 15 మొదలు 25 రోజుల వరకు ఉండవచ్చు. నీవు వచ్చిన తరువాత పాత జీవితపు సంగతులేవీ నాతోగాని నా సహచరులతో గాని చెప్పకూడదు. నా పాతమిత్రుల గురించి ఏమీ చెప్పకూడదు. నీవు ఎప్పుడు బయలుదేరేది టెలిగ్రాం యివ్వవలెను - బాబా.”

ఆ రోజున బాబా వారి సహచరులతో పెందరాళే హరిద్వార్ వెళ్ళారు. అక్కడ కేకి దేశాయి కలిసాడు. అతనిని బాబా ఢిల్లీ నుంచి రమ్మని వ్రాసారు మళ్ళీ బాబా యీ రోజున 532 సాధువులను దర్శించారు. మోతీచర్‌కి తిరిగి మధ్యాహ్నం ఆలస్యంగా వచ్చారు.

ఏప్రెల్ 1 వ తేదీ సూర్యుడు పర్వతాలమీదనుంచి పైకి లేద్దామా వద్దా అని అనుమానిస్తూ లేస్తున్నట్లున్నాడు, పైకి రావడానికి సిగ్గుపడుతున్నట్లు సూర్యోదయ సమయానికి ఆకాశం ఎఱ్ఱబారింది అందులో యింకా అనేక రంగుల కలయిక లున్నాయి దాదా ఉన్న యింటిచుట్టూ పచ్చని తివాసీ పరచినట్లు పచ్చగడ్డి కాలిక్రింద మెత్తగా ఉండేలా మొలిచింది దూరాన కొండలుకూడా నున్నగా పచ్చగడ్డితో మెరుస్తున్నాయి. చెట్లు క్రొత్త ఆకులతో చిగిర్చి కలకలలాడుతున్నాయి దూరానఉన్న అరణ్యాలు ముదురు ఆకుపచ్చ రంగుతో విలసిల్లుతున్నాయి ఉత్తర దిశనున్న కొండల మీదనుంచి చల్లని వాయువులు వీస్తున్నాయి అనేక రకాల పక్షులు ఆకాశంలో ఎగిరి వాటి కూజితాలతో వాతావరణం నింపుతున్నాయి అనేక రంగుల అడవి పువ్వులు సువాసనలు వెదజల్లుతున్నాయి ప్రకృతి అన్నివిధాలా హాయిగా ఉంది వసంతశోభ ఎక్కడ జూచినా వెల్లివిరుస్తోంది

నీలు, విష్ణు వారిపనులమీద దేరాడూన్‌కి వెళ్ళారు నీలు అతనిపని అయాక డాన్ ఆస్పత్రిక వెళ్ళాడు. డాన్‌తో మాట్లాడుతున్నంతసేపు బాబా యెడల అతనికిఉన్న అపారమయిన ప్రేమ, ఆయనకి ఏ విధంగా యీ నూతన జీవితంలో సహాయపడతామా అనే ఆదుర్దా వెల్లడి అవుతోంది అతడు క్రమంగా ప్రాక్టీసు బాగుపడి వృద్ధిలోకి వస్తున్నాడు. అతడు ప్రాక్టీసు పెట్టి 3 వారాలే అయింది వంద రూపాయలుపైగా సంపాదించాడు. రెండు మారులు ఊళ్ళోని పెద్దడాక్టర్లు అతనిని పిలిచి సంప్రదించారు ఏవో కేసుల్లో కొంతకాలం యింకా వెళ్ళేసరికి 1-B పథకం క్రింద బాబాకి చాలా సహాయంగా ఉంటాడు బాబా ఎంత చెప్పినా డాన్‌కి ప్రాక్టీసులో నిలదొక్కుకుని డబ్బు సంపాదించాలని ఉంది బజారు పని ముగించుకొని విష్ణు నారావాలా యింటికి వెళ్ళాడు అక్కడ బాబాకి ఏదో టెలిగ్రాం వచ్చి ఉంది అని విష్ణుకి యిచ్చాడు మధ్యాహ్నం ఎండ తీక్షణంగా ఉంది నీలు, విష్ణు యింటికి వచ్చేసరికి సాయంత్రం ప్రొద్దుపోయింది మర్నాడు ప్రొద్దున్న విష్ణు శత్రుఘ్నతో మోతీచర్ వెళ్ళి బాబాకి టెలిగ్రాం యిద్దామనుకున్నాడు

బాబా సహచరులతోను రేకిచేశాయి తోను మోతీచర్ నుంచి పెందరాళే బయలుదేరారు. తిరిగి వచ్చేవరికి మామూలు సమయం అయింది. 262 మంది సాధువులను దర్శించారు మొత్తం సంఖ్య యిప్పటికి 6697 అయింది. మొత్తం 7000 అయితే బాబా తృప్తి పడతానన్నారు 7000 కి మించితే సంతోషిస్తానన్నారు.

రోజురోజుకీ యీ పవిష్ల బాబా బలహీనంగా అవుతున్నారు. సులభంగా పనితో అలిసిపోతున్నారు ముఖం పలచన అవుతోంది. కాళ్ళు బరువెక్కుతున్నాయి.

ఏప్రెల్ 2 వ తేదీ ఉదయాన అన్ని వైపుల నుంచి మేఘాలు వచ్చి ఆకాశంలో చేరుతున్నాయి వాతావరణం ఆహ్లాదకరంగా లేదు మధ్యాహ్నం అయే సరికి మేఘాలు దట్టంగాను నల్లగాను తయారవుతున్నాయి. కానీ వాతావరణంలో చల్లదనం లేదు. ఉక్కగా ఉంది

11_30 గంటలకు శత్రుఘ్న తన మోటారు సైకిల్ మీద విష్ణుని కూచో పెట్టుకుని మోతీచర్ కి బయలుదేరాడు. 12 దాటేసరికి పెద్దగాలి ప్రారంభం అయి మళ్ళీ తుఫాను వస్తుందేమో అన్నట్టుంది దూరాన దక్షిణాకాశాన ఉరుములు వస్తున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. వాయు గమనం శీఘ్రం అయింది. కొంచెం సేపయేసరికి వర్షం ప్రారంభించింది గుంటల్లో నీళ్ళు నిలిచాయి. నడిచే దారులన్నీ బురదగా అయాయి. మోతీచర్ నుంచి విష్ణు శత్రుఘ్న సాయంకాలం ఆలస్యంగా వచ్చారు బాబా 6 వ తేదీనే మండ్లికాకి వస్తున్నారనే సంతోషవార్త అందరికి చెప్పారు ఆ రోజు మధ్యాహ్నం పెండుతో కలిసి వస్తున్నారని చెప్పారు. బాబా మోతీచర్ వదిలేస్తున్నారని మిగిలిన వారంతా 7,8 తేదీలలో వచ్చేస్తారని చెప్పారు. కుంభమేళాని బాబా 4 వ తేదీనే ముగిస్తున్నారని విష్ణు చెప్పాడు. బాబాకి ఆరోగ్యం బాగాలేదని అలసిపోయినట్లు నీరసంగాను కనిపిస్తున్నారని విష్ణు చెప్పాడు.

ఆరోజు సాయంత్రం పూర్ణచంద్రుడు పర్వతాల వెనుకనుంచి వస్తూంటే ఆ దృశ్యం చాలా మనోహరంగా ఉంది అంతటా త్వరలోనే వెన్నెలతో నిండి పోయింది ఈ రోజు పౌర్ణమి, చంద్రగ్రహణం కూడాను చంద్రగ్రహణం గనుక సాధువులంతా గంగా స్నానానికి పెద్ద ఊరేగింపుగా బయలుదేరారు. వారు గంగలో స్నానం చేసారు. ఇంకా ఏవేవో కర్మకాండలు జరిపారు వైదల్ తీసుకువచ్చిన గంగాజలంతో బాబా స్నానం చేసారు.

అహమదాబాద్ నుంచి మెహెతా అనే ఒకడు వచ్చి బాబా దర్శనం చేసుకోవాలన్నాడు నూతన జీవితంలో బాబా దర్శనం యివ్వటం లేదు అని చెప్పినా వినటం లేదు అందుకే తాను అంత దూరం వచ్చానని దూరాన్నుంచి ఒక్కమారు చూస్తే చాలునని ప్రాధేయపడ్డాడు. దానిమీద సహచరులను మెహెతాను తమ వద్దకు తీసుకురమ్మన్నారు బాబా. రాగానే బాబా అతని పాదాలకు ప్రణామం చేసారు.

మార్చి 31 వ తేదీన బాబా రమ్మనగా వచ్చిన కేకిదేశాయితో బాబా మాట్లాడారు. ఏం మాట్లాడారో బాబా తరువాత చెప్తానన్నారు మరునాడు కేకిదేశాయిని బాబా ఢిల్లీ వెళ్ళమని చెప్పారు. ఆ సాయంకాలం (2–4–50) బాబా సహచరుల నందరను పిలిచారు. అందరూ వచ్చి అర్థచంద్రాకారంగా కూర్చున్నారు అప్పుడు బాబా ఒక గంట వారికి ప్రవచనం చేసారు బాబా చాలా సంతోషంగాను ఉల్లాసంగాను ఉన్నారు. బాబచేసే పనులలో అలసట నిరసను ద్యోతకమవుతూనే ఉంది

ఏప్రెల్ 3 వ తేదీన ఉదయం ఆకాశంలో మబ్బులు మాయమవుతున్నాయి. సూర్యుడు ఆకాశానికంతటికీ రాజునని తన సార్వభౌమత్వాన్ని నిరూపించుకుంటున్నాడు. అయినా ఉత్తరంగా దూరంగా ఒక నల్లని మేఘం ముస్సోరీ కొండలమీద కనిపిస్తోంది. ఆ మేఘంలోనుంచి సూర్యకిరణాలు చీల్చుకుని ఆ కొండమీద పడుతున్నాయి మధ్యాహ్నానికి ఎండ తీక్షణమయి యింకా వేడెక్కుతోంది. ఇంకా పొద్దెక్కేసరికి యింకా వేడిగా అయింది వాతావరణం అప్పుడు ఏదో పనిమీద నీలు, డా॥ గోహర్‌లు సైకిళ్ళమీద డేరాడూన్ వెళ్తున్నారు. వాళ్ళకి ఎండవేడి బాగా తెలిసింది బర్జోర్ దాదా భార్యని గోహార్ పరీక్ష చేసింది బాబా ఆజ్ఞ ప్రకారం, డాన్ ఆస్పత్రిలో ఆమె చాలాకాలంగా దేనివల్లనో బాధపడుతోంది ఇప్పుడు ఆమెకు డా॥ గోహర్ ఔషధం యిచ్చి చికిత్స చేసింది. పొద్దువాలకుండా డాక్టర్లిద్దరూ మంజ్రీ మాఫి తిరిగి వచ్చారు

తెల్లవారకుండానే చీకటిలో గతరాత్రి గ్రహణం గనుక, ఎక్కడలేని సాధువులు వచ్చి గంగలో స్నానం చేసారు. తరువాత వారివారి ఆశ్రమాలకు నివాసాలకు అఖాడాలకి వెళ్ళారు. గంగాస్నానం కోసం ప్రజలు వెళ్ళడానికి తొక్కిడి అయింది తెల్లవారి 6 గంటలకే సాధువులంతా స్నానాలు ముగించుకుని వెళ్ళిపోయారు. బాబా యీ అవకాశం తీసుకుందామని తెల్లవారు జామున 3 గంటలకే లేచి సహచరు

లతో హరిద్వార్‌కి నడక ప్రారంభించారు బాబాతోకూడా పెండు, ఎరచ్, బైదుల్, గుస్తాప్ జీలు ఉన్నారు గంగకు ఆవలిగట్టున పీల్‌వారా వద్ద వేంకొద్దీ మహాత్ములు సాధువులు వారి మకాంలో కూర్చుని ఉన్నారు. అక్కడ అనేకమంది యోగులు త్యాగులు బైరాగులు ఉన్నారు ఒకరి తరువాత ఒకరిని బాబా వారి పాదాలకు ప్రణామం చేస్తూ పని ప్రారంభించారు నీల్‌వారాకి వెళ్ళి అక్కడ కొందరు మహా త్యాగులుండే వారిని బాబా దర్శించారు ఈ రోజున బాబా 2965 మంది సాధువుల దర్శనం చేసుకున్నారు దగ్గరగా 3,000 మందిని దర్శనం చేసుకోవడంలో ఒక్కొక్క రికి వంగి వారి పాదాలకి నమస్కరించి లేవడం మరల యింకొకరికి వంగి ప్రణామం చేయడం, యీ విధంగా 3 000 మందికి చేసేసరికి బాబా పూర్తిగా అలిసిపోయారు. ఈ రోజున 11 గంటలపాటు బాబా పనిచేసారు. ఈ పనిలో 20 మైళ్ళు నడిచారు మొత్తం. విశ్రాంతి లేకుండా బాబా పని చేసేసరికి ఆయనకి నీరసం వచ్చేసింది. లేచి నిలబడలేకపోయారు బాబా. వారి శరీరం అంతా నొప్పి పెడుతోంది. అందుచేత రాత్రి బాగా విశ్రాంతి పొందారు.

3 వ తేదీన యింతపని చేసినా 4 వ తేదీ ఉదయం మరల బేల్‌వాలా అనే చోటకి వెళ్ళి అక్కడ యింకా కొందరు సాధువులను మహాత్ములను దర్శించారుబాబా. కొత్తగా వచ్చిన 388 మందిని సాంగత్యం చేసారు దీనితో 10,000 మందిని దర్శించినట్లయింది. ఈ మాట పెండు చెప్పగానే బాబాకి చాలా తృప్తి కలిగింది. నాకు చాలా సంతోషంగా ఉందన్నారు బాబా. మోతీచర్‌కి వచ్చి బాబా మామూలుగా భోజనం చేసారు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు.

మంజిమాఫీలో స్త్రీలు విష్ణుకి పొడుగయిన ఒక జాబితా యిచ్చి సరుకులు అన్నీ బజారునుంచి తేవాలన్నారు ఆ మరునాడే బాబా వచ్చేరోజు. అందుకోసం కావల సినవన్నీ వ్రాసారు. నీలు ఊళ్ళోకి వెళ్ళి డా॥ నాథ్‌ని కలుసుకున్నాడు నాథ్ దంత వైద్యుడు అతడు మామూలు వైద్యం, శస్త్రవైద్యం కూడా చేస్తాడు. రాజపూర్ రోడ్డులో అతని స్వంత యిల్లుంది. సి ఐ. డి వాళ్ళు నాథ్ యింటికివచ్చి బాబా ఆయన సహచరులను గురించి అనేక ప్రశ్నలు వేసారుట. వాళ్ళ తెలివితక్కువ ప్రశ్నలు వింటే నాథ్‌కి నవ్వొచ్చిందని చెప్పాడు. సి ఐ డి లు బాబా గురించి చాలా రోజులుగా అడుగు తున్నారన్నాడు ఈ మాట బాబాకి చెప్పేసరికి సి ఐ డీ లు వారి

కర్తవ్యం వారు నెరవేరుస్తున్నారని వారి ప్రశ్నలకి మరియాదగా జవాబులు చెప్పాలని వారికర్తవ్య నిర్వహణలో సహాయం చెయ్యాలని బాబా చెప్పారు.

కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాక బాబా లేచి వారి స్వంత సామానులన్నీ సర్దుకున్నారు. బాబా కుంభమేళాపని పూర్తి చేసానని అన్నారు బాబా తన సహచరులను మోతీచర్ నుంచి 7 వ తేదీన సామానులతో బయలుదేరి మంత్రిమాఫి రమ్మన్నారు

హరిద్వార్ రిషికేశ్‌లలో సాధువుని నిజం సాధువయినా, కాకపోయినా మామూలు వాడయినా ఎవరయినా మహాత్మాజీ అని పిలుస్తారు విశాలమైన మైదానాలు నదులు పర్వతాలు గల యిలాంటి ప్రదేశం లోనే ప్రకృతి దాని రామణీయకతను కనపరుస్తుంది అలాటి స్థలంలోనే సూర్యోదయ సూర్యాస్తమయాలు ప్రత్యేకంగా నేత్రపర్వంగా ఉండి వింతశోభను వెలయిస్తాయి. బాబా మంత్రిమాఫీలో నిర్మాణం చేయించిన కుటీరాలు అలాంటి అందమయిన పరిసరాల్లోనే ఉన్నాయి.

5 వ తేదీ ఉదయాన్నుంచి మంత్రిమాఫీలో బాబా రాక కోసం స్త్రీలు పురుష సహచరులు కనిపెట్టుకుని ఉన్నారు బాబా కోసం విష్ణు ఒక టాంగా తీసుకుని హరవాలా రైలుస్టేషన్‌కి వెళ్ళాడు. హరవాలా స్టేషన్ దేరాడూన్‌కి ఒక క్రోసు దూరముంది అక్కడ ప్రయాణీకులకు బళ్ళు దొరకవు మోతీచర్ నుంచి హరవాలా వరకు బాబాతో వెండు వచ్చాడు. హరవాలా నుంచి మంత్రిమాఫీ వరకు బాబాతో విష్ణు ఉన్నాడు హరవాలా నుంచి వెండు మోతీచర్‌కి వెళ్ళి మిగిలిన సహచరులతో 7 వ తేదీన మంత్రిమాఫీ వస్తాడు బాబా, విష్ణు మంత్రిమాఫీ యింటికి వచ్చేసరికి 12 గంటలయింది

బాబా తిన్నగా స్త్రీల యింటికి వెళ్ళారు బాబా చాలా అలసిపోయి ఉన్నారని, బలహీనంగా ఉన్నారని, ఆయనకి వంట్లో బాగాలేదని విష్ణువచ్చి సహచరుల యింటిలో చెప్పాడు మధ్యాహ్నం సహచరుల యింటికి కొంత ఆలస్యంగా వస్తానని చాలా అలసిపోయి నీరసంగా ఉన్నందున కొంతసేపు విశ్రాంతి తీసుకుంటానని బాబా కబురు చేసారు. కైకోవాద్, కాకా, విష్ణు, సీలు బాబాకోసం మధ్యాహ్నం నుంచి కనిపెట్టుకుని ఉన్నారు.

బాబా వచ్చేసరికి ఆ మధ్యాహ్నం 4-30 గంటలయింది బాబాను చూసీ చూడగానే నీలూ బాబాయొక్క దేహ పరిస్థితి గ్రహించేశాడు బాబా పని ఒత్తిడివలన చాలా శ్రమపడి ఉన్నారు. కాళ్ళీడుస్తూ నడుస్తున్నారు బాబా నీలు పరుపుమీద కూర్చొని రానాని, విష్ణుని, కైకోబాద్‌ని వారి వారి ఆరోగ్యాలగురించి ప్రశ్నించారు. ఇలా కనుక్కుంటూనే బాబా తరచుగా దగ్గుతున్నారు బాబా దేహస్థితి యింత నీరసంగా ఉన్నా ఆయన ముఖం తేజోవిరాజమానంగానూ ఆయన నేత్రాలు ఎంతో ప్రకాశవంతంగానూ ఉన్నాయి. సహచరులు వారి కళ్ళను బాబా ముఖం మీదనుంచి తప్పించలేకుండా ఉన్నారు ఆయన వదనం అంత అందంగా చూడ ముచ్చటగా ఆధ్యాత్మిక తేజస్సుతో వెలిగిపోతూ ఉంది కుశలాలడగడం అయాక బాబా విష్ణుని, శత్రుఘ్నని, నీలూని, గోహర్‌ని, వారివారికి అప్పగించిన పనుంగురించి కనుక్కున్నారు తరువాత యింకా వారు చేయవలసిన పనులు వివరంగా ఒకరొకరికీ చెప్పారు

బాబా డాన్‌కిన్ ఆరోగ్యం ఎలా ఉందని అతని ప్రాక్టీసు బాగా ఉందా అని వివరంగా చెప్పమని నీలూని అడిగారు డాన్‌ని మరునాడు మధ్యాహ్నానికి 3 గంటలకి రమ్మని చెప్పమని విష్ణుతో చెప్పారు బాబా శత్రుఘ్నతో బాబా చాలాసేపు మాట్లాడారు. తరువాత అతన్ని 12 వ తేదీన (ఏప్రెల్, 1950) త్రీలతోను, ఎరచ్‌తోను హరిద్వార్ వెళ్ళమని వారికి 13 వ తేదీన జరిగే పూర్ణ కుంభమేళా ఊరేగింపు చూపించాలని చెప్పారు. III పథకంలోని సహచరులయిన దాస్ కాకా, గుస్తాద్‌జీ మంజ్రిమాఫీ నుంచి 13 వ తేదీన బాగా పెందరాళే బయలుదేరి ఆ ఊరేగింపు చూడడం కోసం హరిద్వార్ వెళ్ళాలని, చూసిన తరువాత ఆ సాయంత్రానికే మంజ్రిమాఫీకి తిరిగి రావాలని చెప్పారు. బాబా మాత్రం ఏప్రెల్ 14 వ తేదీ మధ్యాహ్నం వస్తామన్నారు.

చీకటి పడుతూంటే బాబా అలసట మూలాన వారి యింట్లోకి వెళ్ళారు. రాత్రి 7-30 గంటలకు సహచరులంతా భోజనాలు చేసారు. ఎవరి ఆలోచనలలో వాళ్ళున్నారు బయట చీకటి బాగా అలుముకుని ఉంది తూర్పు ఆకాశంలో ఒక నక్షత్రం బాగా కాంతిగా కనిపిస్తోంది పాంథులు ఆ నక్షత్రం వెలుతురే ఆధారంగా తీసుకుని వారి దారిని వాళ్ళు వెళ్తున్నారు

ఏప్రిల్ 6 వ తేదీన తెల్లవారుజామున 4 గంటలకి సహచరులంతా లేచారు. అప్పటికి బయట చూస్తే చంద్రోదయం అయి వెన్నెల కాస్తోంది తూర్పు ఆకాశంలో

నక్షత్రం మిణుకు మిణుకు మంటోంది. కొద్ది సేపట్లోనే అరుణోదయకాంతులు ప్రసారమయ్యాయి పర్వతపంక్తుల వెనుక ఆకాశం ఎర్రబారుతోంది ప్రాతర్వాయువులు చల్లగా వీస్తున్నాయి పక్షులు చెట్లలో కలకలారావాలు చేస్తున్నాయి.

తెల్లవారి 6-30 గంటలకు సహచరుల యింటికి వచ్చారు బాబా రాత్రి ఆయనకు బాగా నిద్రపట్టలేదని నీలూతో చెప్పారు బాబాకి జ్వరం వచ్చిందని దగ్గు వచ్చిందని అదే నిద్రరాకపోవానికి కారణ మనీ చెప్పారు. విష్ణుతో ఏవో చేయవలసిన పనులు చెప్పారు నీలు, విష్ణు, కాకా, కైకోబాద్, శత్రుఘ్నులతో బాబా యింకా మంద్రజిమాఫీలో ఉండడం గురించి, వర్షాకాలంలో వర్షాలు అక్కడ చాలా ఎక్కువుగా కురుస్తాయని అక్కడనుంచి మకాం మార్చడం విషయం చర్చించారు. ఈ మధ్యను వర్షాలుకురిసి నూతిలో నీరు కొంతకలగి పాడయింది శత్రుఘ్న మారే వర్షాకాలంలో బాబాకు వారి స్త్రీ పురుష సహచరులకు మంద్రజిమాఫీలో చాలా యిబ్బందిగా ఉంటుందని ఒప్పుకున్నాడు బాబా మధ్యాహ్నం 3 గంటలకి మరల వస్తానని చెప్పి 10-30 గంటలకి వెళ్ళారు.

మార్చి 31 వ తేదీన బాబా జాల్‌కి రమ్మని వ్రాసిన రెండో ఉత్తరానికి కూడా ఒంట్లో బాగాలేదు రాలేనని జవాబు వ్రాసాడు, జాల్‌భాయి అన్న ప్రకారం బాబా మధ్యాహ్నం మూడు గంటలకి కొంచెం ముందే వచ్చారు. రాగానే డాన్‌కిన్ వచ్చాడా అని అడిగారు బాబాకి 100 డిగ్రీల జ్వరం ఉంటోందని దగ్గు వస్తోందని చెప్పారు. వళ్ళంతా నొప్పులుగా ఉందని నీరసంగా ఉందనీ కూడా అన్నారు. ఆయన డాన్ రాకకై ఎదురుచూస్తున్నారు. 3 గంటలయేసరికి డాన్ వచ్చాడు. డాన్ రాగానే బాబా మోములో సంతోషం కనిపించింది. డాన్‌ని బాబా అతని ఆరోగ్యం, వైద్యవృత్తి మొదలయిన సంగతులన్నీ అడిగారు. ఒక కేసులో రు 150 సంపాదించానని చెప్పాడు. ప్రాక్టీసు పెట్టి యిది రెండోనెల జరుగుతోంది.

డాన్ వెళ్ళి పూర్తి విశ్రాంతి తీసుకుంటా నని రేపు మళ్ళీ వస్తాననీ చెప్పాడు. డాన్ తో బాబా మళ్ళీ 11 వ తేదీన రమ్మని చెప్పారు డాన్ రాత్రి భోజనం చేసి దేరాడూన్ వెళ్ళిపోయాడు బాబాకు సుస్తీగా ఉన్నందున రాత్రి బాగా పొద్దుపోయే వరకు సహచరులు దాని గురించే ఏదో మాట్లాడుతూ కూర్చున్నారు. వారికి రాత్రి బాగా నిద్రపట్టలేదు అందరూ నాలుగు గంటలకే మళ్ళీ లేచారు.

చంద్రుడు నెమ్మదిగా పడమటి దిశకి వెళ్తున్నాడు. వెన్నెల ఆకాశంలో నిండి ప్రకాశిస్తోంది. అతెల్లవారుజామున చల్లనివాయువులు హాయిగా ప్రసరిస్తున్నాయి. వాతావరణం ప్రశాంతంగా ఉంది ఆ సమయంలో కలిగే ఆనందం అనిర్వచనీయం. వెలుతురు రావటంతోనే సహచరులంతా టీ తీసుకున్నారు ఉదయం కాగానే 6-30 గంటలకి విష్ణు, నీలు బాబా యింటికివెళ్ళి బాబాకి ఎలాఉందని అడిగారు జ్వరం, దగ్గు కొంచెం తగ్గినా బాబాకి రాత్రి నిద్ర అంత బాగా పట్టలేదని చెప్పారు. నీరసంగా ఉందని, ఒళ్ళు నొప్పులు ఎక్కువగా ఉన్నాయని బాబా అన్నారు. మూడు రోజులు బాగా పూర్తి విశ్రాంతి తీసుకుంటే బాబాకి నయంగా ఉంటుందని ఒక్కవారంలో బాబా మామూలుగా ఉంటారని నీలు అన్నాడు.

ప్రొద్దెక్కిన కొద్దీ ఎండ తీవ్రం కాజొచ్చింది. అయినా బాబా సహచరులకి చేయవలసిన పనులు తప్పవు కదా. బజారుపని కోసం విష్ణు ఊళ్ళోకి వెళ్ళాడు. నీలు డా॥ నాథ్‌ని, దాన్‌ని చూడడానికి అతడుకూడా వెళ్ళాడు. ఆ మరునాడు మధ్యాహ్నం (8-4-50 వ తేదీన) మోతీచర్‌లో దిగడిన మిగిలిన సహచరులు కూడా వచ్చారు. పెండు, మురళి మాత్రం 10 వ తేదీకి వస్తామని చెప్పారు వాళ్ళు అక్కడ నుంచి ఎద్దుబండిలో బయలుదేరారు ఈ రోజున గుస్తాద్‌జీ, ఎరచ్, బైదుల్, ఆలీ వచ్చారు.

నీలూని, విష్ణుని, ఎరచ్‌ని బాబా రమ్మని కబురంపించారు. బాబా రాగానే నీలూ ఆయనను చూసి జ్వరం తగ్గి ఆరోగ్యంగా ఉన్నట్టు కనిపెట్టాడు. కానీ బాబా కళ్ళలో ఆ నీరసం యింకా పోయినట్టు లేదు. జ్వరం తగ్గిపోయినా బాబా కళ్ళు బరువు, కడుపునొప్పితో బాధపడుతున్నారు. బాబా ఆరోగ్యం సంగతి డా॥ గోహెర్, డా॥ నీలూని డా॥ డాన్‌కిన్‌ని సంప్రదించి బాబాకి మందులు యిస్తోంది.

మధ్యాహ్నం అయ్యేసరికి ఎండ తీక్షణం బాగా ఎక్కువయి వాతావరణం వేడెక్కిపోతోంది. అంత ఎండలోను నీలూ విష్ణు బాబా చెప్పిన ప్రకారం ఊళ్ళోకి వెళ్ళి సాయంత్రానికి మంత్రిమాఫీ తిరిగివచ్చారు. ఆ సాయంత్రం బాబా ఎరచ్‌ని, విష్ణుని, నీలూని మరల పిలిచారు వారి యింటికి. బాబాకి నఖశిఖ పర్యంతము ఒళ్ళు నొప్పిగా ఉందనీ, వంట్లో బాగాలేదనీ చెప్పారు డా॥ నీలు, డా॥ గోహెర్ బాబాకి మందు మార్చి యిచ్చారు

ఉదయాన్నే అల్పాహారంలో సహచరులను టీతో బాటు రెండు చపాతీలు తీసుకోమని బాబా చెప్పారు మధ్యాహ్నం 2 గంటలకి చపాతీలు పప్పు మామూలు భోజనం చేసాక సాయంత్రం 5 గంటలకి పాలు లేకుండా టీ తీసుకోమన్నారు బాబా. చపాతీలలో నెయ్యి వెయ్యటం లేదు. ఒక్కొక్కరోజున పప్పుకి బదులు బావా కూర చేయిస్తారు. సరియయిన ఆహారము, బట్టలు లేనందున సహచరుల ఆరోగ్యంకూడా చెడుతోంది వాళ్ళు వేసుకునేందుకు కావలసిన మందులుకూడా దొరకవు అక్కడ. ఇన్ని యిబ్బందులు కలుగుతున్నా వారు సంతోషంగా అన్నీ యెదుర్కొంటూ బాబా సాహచర్యంలో ఉత్సాహంగా హాయిగా గడుపుతున్నారు రోజులు, III వ పథకంలో నియమాలన్నీ జాగ్రత్తగా పాటిస్తూ రాత్రిపడితే వీధిలో దీపాలు లేనందువల్ల ఆకాశంలోని నక్షత్రాల గుడ్డివెలుతురే దిక్కు.

ఏప్రెల్ 9 వ తేదీన ఉదయాన సహచరులు లేచేసరికి వారికి తలొక అస్వస్థత తయారయింది ప్రొద్దునే బాబా, నీలూ, విష్ణు, ఎరచ్‌లను రమ్మని కబురు చేసారు బాబా మట్టుకి బాబాకి ఒళ్ళు నొప్పులు ఎక్కువయాయి అందుచేత రాత్రి నిద్రపట్టలేదని బాబా నీలుతో అన్నారు రెండు సోనాల్జిన్ బిళ్ళలు వేసుకున్నా లాభం లేకపోయింది నిన్నటి కంటె ఒళ్ళు నొప్పులు ఎక్కువగా ఉన్నాయన్నారు బాబా దగ్గు తగ్గింది, జ్వరం పూర్తిగా పోయింది నొప్పులున్నా బాబా ఆరోగ్యం ఆరోజుకారోజు మెరుగవుతోంది మెహెరా బాబాకి ఆవిరిపట్టి ఒడలు మర్దనా చేస్తే బాగుంటుందంటే డా॥ నీలూ, డా॥ గోహర్ అవును అలాచేస్తే చాలా మంచిదని అంగీకరించారు. అలా చేయించుకుని బాబా ఒక్కగంట పరుండి విశ్రాంతి తీసుకున్నారు ఎరచ్ బాబాకి బచ్చలికూర పులుసు వండిపెడితే మంచిదంటే బాబా అది చేయించుకుని దానితో తిన్నారు.

ఉదయం 10 గంటలకి నారావాలా, ఎరచ్‌మిస్త్రీ, బల్దోర్ చావా దేరాడూన్ నుంచి బాబాను చూడడానికి వచ్చారు శత్రుఘ్న కూడా అందుకోసమే వచ్చాడు. కొంతసేపు చర్చ అయిన తరువాత బాబా 12 వ తేదీన హరిద్వార్ రైలుమీద వెళ్ళి అక్కడ పూర్ణకుంభమేళా ఊరేగింపుటుత్సవం ఆ మధ్యాహ్నం చూడడానికి నిశ్చయించారు 13 వ తేదీన ఉత్సవం చూడడానికి స్త్రీలకి అవకాశమివ్వాలని బాబా అనుకున్నారు ఎందుచేతంటే వారెప్పుడూ యిలాంటి ఊరేగింపూ, ఉత్సవమూ చూడలేదు కొందరు పురుష సహచరులు కూడా చూడలేదన్నారు. ఈ సంవత్సరం వచ్చిన మేళా

లాటిది 36 సంవత్సరాలకి ఒకసారి వస్తుంది గనుక దీనికి ప్రాముఖ్యత చాలా ఎక్కువ అయింది బాబా నారావాలాతో స్త్రీలకి, ఎరచ్‌కి, తమకి రైలు ప్రయాణానికి ఏర్పాట్లు చేయమని చెప్పారు

మధ్యాహ్నం 12 గంటలకి డాన్‌కిన్ బాబాని చూడడానికి వచ్చాడు. అతడు వెళ్ళాక కొంతసేపు విశ్రమించి బాబా 4 గంటలకి సహచరుల యింటికి వెళ్ళారు. అప్పుడే అంతకు ముందు మోతీచర్ నుంచి ఎద్దుబండిలో బయలుదేరిన పెండు, మురళి వచ్చారు 'రాజా' అనే ఇంగ్లీషు ఎద్దు బాగా పనికి వస్తోంది. డా॥ నీలూకి, డా॥ డాన్‌కిన్‌కి బాబా తమ శరీరంలోని నొప్పులు ఏమీ తగ్గలేదని చెప్పారు ఈసారి ఏదో యింకొక మందు యివ్వాలని ఆ డాక్టర్లిద్దరు సంప్రదించుకుని నిశ్చయించగా బాబా అంగీకరించారు బాబా తరువాత పెండుని పిలిచి అతని ఆరోగ్యం విషయమై అడిగి తెలుసుకుని తన దగ్గరనుంచి ఏ జబ్బు యితరులకి అంటకుండా తీసుకో వలసిన జాగ్రత్త గురించి చెప్పారు.

## మిస్ మీరాబెన్ :—

మోతీచర్‌లో ఉండగా బాబా 'రాజా' అనే ఎద్దుని ఏదయినా జంతువులను పెంచే సంస్థకి బహూకరించాలని అనుకున్నారు మహాత్మాగాంధీగారి ఇంగ్లీషు శిష్యురాలయిన మిస్ మీరాబెన్ (మిస్‌మాడెలీన్‌స్లేడ్) కి ఆ ఎద్దుని కానుకగా యిస్తే బాగుంటుందని శత్రుఘ్న సూచించాడు భారతదేశం వచ్చాక ఆమెపేరు మీరాబెన్ అని మార్చుకుంది

ఈమె గాంధీజీతో వార్ధా మగన్‌వాడి ఆశ్రమంలో ఉండి ప్రతిరోజు అతని పర్యవేక్షణలో బీద గ్రామస్థులకు ప్రత్యక్షసేవజేసి ఆరోగ్య జీవనాన్ని నేర్పుతూండేది. సంఘసేవలో అస్పృశ్యత అనేది లేదని ఆమె ఆచరణ ద్వారా చూపించింది. ఈమె ఇంగ్లండులో ఒక నావికాదళాధికారి యొక్క కుమార్తె ఈమె గురించి చెప్తూంటే యిలాగే అమెరికా అధ్యక్షుడయిన ఉడ్రోవిల్సన్ అనునతని కుమార్తె మిస్ మార్గరెట్ అనునామె ఇండియాకి వచ్చి అరవిందాశ్రమంలో (పుదుచ్చేరిలో) ఉండిన సంగతి జ్ఞాపకం వస్తుంది స్లేడ్ గాంధీజీని ఆశ్రయించినట్లే మార్గరెట్ అరవిందుని సేవలో అతని ఆశ్రమంలో అయిదేళ్ళ క్రమశిక్షణతో ఉండేది మీరాబెన్ అంతకంటె

యెక్కువ కాలమే, 1925 వ సంవత్సరంలో ఇండియా వచ్చి అప్పటినుంచి గాంధీజీతో గడిపింది ఆమె యిప్పుడు రిషీకేశ్‌కి మూడు మైళ్ళ దూరంలో "పశులోక్" అనే జంతు సంక్షేమ సంస్థ నడుపుతోంది.

అంతట పెండుని మోతీచర్ నుంచి మంత్రిమాఫీ వస్తూ మీరాబెన్‌ను చూసి రమ్మని బాబా కోరారు. ఆమె 'రాజా' ను ఉచితంగా తీసుకుంటుందేమో కనుక్కొని రమ్మన్నారు అలా తీసుకునే మాటయితే ఒక మనిషిని మంత్రిమాఫీ పంపించి ఎద్దును తోలుకుని వెళ్ళమని చెప్పమన్నారు

మంత్రిమాఫీ రాగానే పెండు బాబా చెప్పిన ప్రకారం పశులోక్‌కి వెళ్ళాడు. వెళ్ళి తాను వచ్చినపని గురించి పశులోక్ కార్యదర్శికి చెప్పాడు కాని ఆ కార్యదర్శి ఇంగ్లీషు ఎద్దులను పశులోక్ యింక తీసుకుని మేపజాలదని చెప్పాడు. అయినా పెండు ఒకసారి తాను మిస్ మీరాబెన్‌ను చూస్తాననీ ఆ ఎద్దు ఏ పనికయినా బాగా ఉపయోగిస్తుందని చెప్పాడు. అప్పుడు ఆ కార్యదర్శి మీరాబెన్ యింటికి వెళ్ళి ఆమెతో యీ సంగతి చెప్పింది. మీరాబెన్ అప్పుడు వచ్చి పెండుతో మాట్లాడింది మీరాబెన్ ఒక సన్యాసినిలాగ కాషాయాంబరాలు ధరించి ఉంది ఆమె ఒక కఫ్నీ తొడుగుకుంది. ఆ రంగుదే తలమీద టోపీ పెట్టుకుంది. చెప్పులు వేసుకుని చేతిలో ఒక పొడుగాటి కర్ర పట్టుకుని ఉంది కర్రపూసల పేరు ఒకటి ఆమె మెడలో ధరించింది ఆమె ముఖంలో శాంతము ఉట్టిపడుతోంది పెండుతో ఆమె హిందీలో బాగా మాట్లాడింది వెళ్ళేటప్పుడు పెండు 'రాజా'ను తోలుకునే వెళ్ళాడు. ఆమె ఆ ఎద్దును చూసి అంగీకరించి తీసుకుంటానని చెప్పింది రాజా వీపుమీద చేతితో నిమిరి "ఇది లాగే బండి యిస్తే నేను కొనుక్కొంటాను" అంది. అప్పుడు పెండు అలాగే అని దాని ఖరీదు రు 250 లు చెప్పాడు. ఆమె సరే అని చెప్పి 10 వ తేదీన బండిని ఎద్దును తీసుకురావడానికి మనిషిని పంపిస్తానని చెప్పింది బండి సంగతి తాను యింకా నిశ్చయించుకోలేదంది జరిగిన సంగతి పెండు పశులోక్ నుంచి తిరిగి వచ్చి బాబాకు నివేదించాడు బాబా అప్పుడు 12 వ తేదీలోపుగా మీరాబెన్ వద్దనుంచి మనిషి రాకపోతే శత్రుఘ్న యీ ఎద్దును ఏ సంస్థకయినా ఉచితంగా నలుగురు స్త్రీల పేర్లతోను ధర్మం చేసి, బండిని దాన్ని కొనేవాడెవరికయినా యిచ్చెయ్యాలి అన్నారు.

మధ్యాహ్నం ఎండ చాలా తీవ్రంగా ఉంది బాబా ఢిల్లీనుంచి పిలిపించిన కేకీ దేశాయిని యింకా కొద్దిరోజులు అక్కడ ఉండమన్నారు బాబా ఆ సహచరుల

యింటికి ఆ మధ్యాహ్నం వచ్చారు నీలూతో బాబా తమ ఒళ్ళు నొప్పులు పూర్తిగా పోయాయని అన్నారు మణికి జ్వరం వస్తోందని బాబా నీలూతో చెప్పారు నీలూ ఆమెకు వెంటనే పెన్సిలిన్ ఇంజక్షనులు యివ్వాలన్నాడు బాబా సరే అనగానే మణికి ఆ యింజక్షన్ యిచ్చింది డా॥ గోహెర్. ఒక గంట తరువాత బాబా అక్కడ నుంచి తమ యింటికి వెళ్ళారు

ఆ సాయంకాలం మసూరీ కొండలమీదనుంచి చల్లనిగాలి వీచి హాయిని గొలిపింది. రోజంతా వేడిగా ఉందేమో యీ గాలి అందరికి సుఖాన్నిచ్చింది. బాబా సహచరులందరు సమావేశమై మరునాడు ఉదయం కొన్ని అంశాలు చర్చించాలని తీర్మానించుకున్నారు ఈ సంగతి వారందరితోను చెప్పారు

ఏప్రెల్ 11వ తేదీన సహచరులందరు లేచేసరికి ఒక్కడికి కూడా ఒంట్లో ఉత్సాహం లేదు చల్లని ప్రభాతవాయువులు కూడా వానిలో సజీవం పోయలేదు. సూర్యోదయ సమయంలో ఆకాశంలో కనబడిన పంచరంగుల దృశ్యం కూడా వారికి నవ చైతన్యం ప్రసాదించలేదు. వారు మనస్సులలో ఏదో విచారం అలుముకున్నట్లు కనిపించింది. వారి మనస్సులో ఎందుకో సందేహ మేఘాలు ఆవరించాయి. అందరు ఉదయం 7 గంటలకు జరిగే సమావేశమే మనసులో పెట్టుకుని దానికోసం ఎదురు చూస్తున్నారు.

బాబా 7 గంటలకు సరిగా సహచరుల ఆవాసానికి వచ్చారు వారి నందరను రమ్మని పిలిచారు డాన్ కూడా సమయానికి వచ్చాడు. వాతావరణం గంభీరంగా ఉంది. అందరు బాబాచుట్టూ చేరి కూర్చున్నారు. బాబా గంభీరంగా సహచరులను తమను అందరను విమర్శిస్తూ ఏం చేస్తే బాగుంటుందో చెప్పారు. నాలుగు గంటలు చర్చసాగిన మీదట ఒక నిర్ణయానికి వచ్చారు ఈ నిర్ణయం సహచరుల యొక్క భవితవ్యాన్ని గురించి. వివరాలన్నీ ఏప్రెల్ 30 వ తేదీన తెలుప బడతాయన్నారు బాబా సమావేశాంతమున బాబా మురళీకేసి తిరిగి అతని ఆదర్శమైన ప్రవర్తనను మెచ్చుకుంటూ అతనిని ఎంతో శ్లాఘించారు ఈ ఆరునెలల నవ్యజీవితం లోను అతని ప్రవర్తన ప్రశంసనీయంగా ఉందన్నారు సహచరులందరకు కూడా మురళి యొక్క ఉల్లాసకరమయిన వైఖరి వారి అందరి నవ్యజీవితాలలోను వచ్చే ఒడుదుడుకులను ఎదుర్కోడానికి తగినశక్తి రావడానికి దోహదం కలుగజేసిందన్నారు. ఎటువంటి పరిస్థితిలోను మురళి తన సంతోషకరమయిన మనోవృత్తిని వదలలేదని

బాబా అన్నారు. అందరికీ అతడు ప్రేమాస్పదుడయాడని బాబా చెప్పారు తరువాత బాబా 11 గంటలకు సహచరుల యింటినుంచి వారి యింటికి వెళ్ళారు

బాబా ఆరోజు మధ్యాహ్నం తిరిగి 2 గంటలకు సహచరుల యింటికి వెళ్ళి వారితో హాస్యరస పూరితమయిన సంభాషణలో గడిపారు

దినదినము బాబా యిచ్చే ఆజ్ఞలను అప్రమత్తతతో పాలించే ప్రయత్నంలో ఎరచ్ నిమగ్నుడై ఉండినందున, III పథకంలోని నిబంధనలను తు, చ తప్పకుండా పాటిస్తున్నందు వలన ఎరచ్ దైనందిన వ్యవహారాలలో ఏదో ఒక గొడవకి లోనౌ తున్నాడు. అందుచేత బాబా యొక్క తీవ్రమయిన విమర్శకి చీవాట్లకి గురి అవు తున్నాడు. ఎరచ్ యిలా యంత్రవత్‌గా పనిచెయ్యడానికి వీల్లేదని బాబా అతన్ని భయపెట్టారు దీనివల్ల సహచరుల మనస్సులలో ఒక్కొక్కరిలో ఒక రకమయిన కలవరానికి ఆస్కారం కలిగింది

ఏప్రెల్ (1950) 11 వ తేదీన బాబా ఈ సహచరులందరిని పిలిచి యిలా చెప్పారు –

"III పథకంలోని మీరందరు దాని నియమాలను పాటించాలని నూటికి నూరుపాళ్ళు ప్రయత్నం చేస్తున్నారు పాత జీవితపు అలవాట్లు నాకు 60 పాళ్ళు పోయాయని నాకు బాగా నమ్మకం ఉంది, 40 పాళ్ళు యింకా ఉన్నట్లు తోస్తుంది

అందుచేత మిమ్మల్నెవరినీ మీరు కోరకుండా పంపించేయలేను మీతప్పుతో నయినా I, II పథకాలకి పంపించెయ్యలేను III పథకం అమలు జరపడం యీ పరిస్థితులలో అసాధ్యమవుతోంది- ఏప్రెల్ 1 తేదీన జరిగిన సంఘటనవల్ల నేను చెప్పే దేమిటో తెలుస్తుంది మోతీచర్ హరిద్వార్‌లో ఉన్నప్పుడు ఏప్రెల్ 1 వ తేదీన జరిగిన విషయం గురించి బాబా ఆజ్ఞాపించగా ఎరచ్ యిలా చెప్పాడు—

"మోతీచర్ నుంచి ఏప్రెల్ 1 వ తేదీ ఉదయం బాబా వారి సహచరులతో బయలుదేరారు మామూలు ప్రకారం పెందరాళే వెళ్ళారు. కేకీ దేశాయి కూడా వెళ్ళాడు. ఇంకా చూడవలసిన కొన్ని ఆశ్రమాలను అఖాడాలను చూడడానికి వెళ్ళారు బాబా ఈ ఆశ్రమాలు అఖాడాలు నిండుతాయని యిప్పటి వరకూ వీటిని బాబా వది

చేసారు బాబాని యీ అఖాడాలకి తీసుకువెళ్ళే పని బైదుల్‌ది. అతడు బాబాని ఒక అఖాడాలోకి తీసుక వెళ్ళాడు అక్కడ చాలామంది సాధువులు లేరని మళ్ళీ రావచ్చుని మళ్ళీ బైదుల్ బయటకు వెళ్ళిపోవోయాడు. కానీ బాబా అక్కడ ఒక సాధువు చెప్పి నట్లు యితర గుడారాలను సాధువులకోసం వెతికారు పాత జీవితంలోలాగ యీ క్రొత్త పద్ధతి ఎందుకు అవలంభించాలో బాబా బైదుల్‌కి చెప్తూండగా బైదుల్ పెండుతో "ఈ ఉదయం నుంచి బాబ నన్ను ఏడిపించేస్తున్నారనుకో" అన్నాడు. ఈ మాటలు బాబా విని బైదుల్‌ని యిది బాబాని విమర్శించడం అవునా, కాదా అని అడిగారు "ఈ ఉదయం బాబా వైఖరి బాగాలేదని పెండూతో చెప్తున్నాను." అన్నాడు బైదుల్ అప్పుడు బాబా ఎరచ్‌ని అడిగారు "ఇది విమర్శించడం అవునా కాదా" అని అందుకు ఎరచ్—"ఈ ఉదయం బాబా వైఖరి గురించి బైదుల్ పెండుకి ఏదో చెప్తున్నాడు విమర్శ అనడం కంటె అది సమాచారం చెప్పడం అంతే సరిపోతుందేమో" అన్నాడు. బాబా యిది విని పూర్తిగా వికలమనస్కులయారు." "బైదుల్ పెండూతో బాబాను విమర్శిస్తూ చెప్పాడు. బైదుల్ చేసింది తప్పు అప్పుడు బాబాకి కోపం రాలేదు. తరువాత పూర్తిగా బాబా వైఖరి మారిపోయింది III పథకం లోని వారు పాటించవలసిన నియమాలను ఎవరూ అర్థం చేసుకోలేదు. బైదుల్ అన్నమాటే సమాచారం యివ్వడమయితే ఘనిని, ఆదీని, నీలకంఠ్‌ని, డాన్‌కిన్‌ని బాబాని విమర్శించారని అనుకోవడ మెందుకు ? ఇది అర్థం చేసుకోడంలో లోపమని తెలుస్తూనే ఉంది ఇది సహించడానికి వీలులేదు పాత జీవితపు అలవాట్లన్నీ పూర్తిగా పోవాలి. ఇలాంటి మాటలు క్రొత్త జీవితంలో అన్నపుడు పాత జీవితం జ్ఞాపకం చేస్తాయి అది గర్హించవలసినది.

నేను చెప్పినది తప్పు కావచ్చు నా సహచరులు చెప్పినదే సరికావచ్చు. కానీ ఎక్కడయితే అభిప్రాయభేదం వచ్చిందో అది ఉద్వేగాలు హెచ్చడానికి కారణ మవుతుంది అప్పుడు నేను మాట్లాడకుండా ఊరుకుంటే నా ప్రమాణాలకి విరుద్ధం అవుతుంది ఏదయినా అంటే నా కోపం వ్యక్తం చేసినట్లవుతుంది. అది నూతన జీవిత నిబంధనలకి విరుద్ధం అందుచేత నాకు III పథకం ఎత్తెయ్యడమే మార్గం అని తోస్తోంది ఇంక రోజురోజుకి బాబా ఆజ్ఞలిస్తూ ఉండడం ఆయన కలుగజేసు కోవడమూ ఉండదు III పథకం వారు నూటికి నూరుపాళ్ళు ప్రయత్నిస్తూ ఉండవచ్చు అయినా ఒక వైపున బాబాని సరిగా అర్థంచేసుకోలేక రెండవవైపున సహచరులను

షరిగా అర్థం చేసుకోలేకపోతే ఎవరిమీదో ఒకరిమీద కోపం రావడానికి అవకాశం ఉంది. III పథకం సహచరులు అర్థం చేసుకున్న ప్రకారం మార్చి 1 వ తేదీనుంచి బైదుల్ బాబాని విమర్శించినా లేకపోయినా బాబాకి కోపం రాకూడదు. బాబా వైఖరి పాడుచేసుకో కూడదు ఈ కారణాలన్నిటి వల్లా III పథకం కొనసాగించడం దుస్సాధ్యం, నా ప్రమాణం నూటికి నూరుపాళ్ళు భంగం లేకుండా పాటించాలంటే ''— అందుకని బాబా III పథకం తాత్కాలికంగా నిలుపుచేసేసారు దాన్ని రద్దు చేయలేదు. ముందు ముందు ఆ పథకంలోకి బాబా ఎవరినయినా తీసుకోవచ్చును.

షరచ్ చెప్పిన యీ కథ అంతా విని బాబా ''నేను మళ్ళీ చెప్తున్నాను. మీలో ఎవరిలోనయినా తప్పు చూస్తే — అది మీ మీ అభిప్రాయం ప్రకారం తప్పు కాకపోవచ్చు —నేను దానికి ఉదాసీనంగా ఉంటే నా ప్రమాణానికి విరుద్ధం, లేకపోతే మిమ్మల్ని పంపించెయ్యాలి. అదికూడా తప్పే అవుతుంది నేనే నా పాత జీవితపు అలవాట్లు అతిక్రమించ లేకుండా ఉన్నాను నూటికి నూరుపాళ్ళూను అందుకని మార్చి 1 వ తేదీవరకు ఒక మోస్తరుగా పోనిచ్చాను, మధ్యమార్గ మవలంభించి. దానివల్ల నా ప్రమాణాలకి భంగం వచ్చింది.

నా సహచరులందరు నన్ను వదలిపోయినా సరే నా ప్రమాణాలు కాపాడు కోవాలి అందుచేత 1950 మే 1 వ తేదీనుంచి మీరెవ్వరూ కూడా III పథకంలో ఉండరాదని నిశ్చయించాను నే నొక్కడినే నవ్యజీవిత పథకం, III యొక్క 3 భాగాలు ఆచరిస్తాను. III పథకంలోని వారిని, I–B పథకంలోని వారిని నా సహచరులను యింకో క్రొత్త పథకంలో చేరమని ఆజ్ఞాపిస్తున్నాను దీని వలన మీ బ్రతుకు మీరు బ్రతకవచ్చు అయినాకూడా ఒక బృందంగా నా దగ్గర ఉండవచ్చు ఈ బృందానికి కొంత మూలధనం అప్పుగా యిస్తాను, యీ క్రొత్త పథకం ప్రారంభించ డానికి, వారి వ్యాపారానికి.

ఈ క్రొత్త పథకం తాత్కాలిక మయినది, కొన్ని నిబంధనలతో కూడు కున్నది. నా అప్పు తీర్చేస్తే మొదటి పథకం I–B లా మారుతుంది అందుచేత మొదటి I–B పథకంలో సహచరులు యీ క్రొత్త పథకంలో చేరుతారు దానికి నా సహకారం ఉంటూనే ఉంటుంది. అది జయం కావడానికి నేను సహాయం చేస్తూనే ఉంటాను అవసరమయితే అందరికీ నివాసాలు కుదరడానికి వ్యాపారం జరగడానికి కొందరు సహచరులకి ఉద్యోగాలు దొరకడానికి నేను సహాయం చేస్తాను'' అన్నారు.



1899.



1907



1913



1922



1960



1925



1935



1936



1941

Meherbaba

అవతార్ మెహెర్ బాబా

బాబా. ఇంక మంత్రిమాఫిలో ఉండడం కుదరదని బాబా ఢిల్లీకి వెళ్లాలనుకుంటున్నారని అన్నారు. అందుకే కేకిదేశాయిని కూడా ఢిల్లీకి పంపించాలన్నారు కేకి దేశాయికి బాబా యీ క్రింది విధంగా చెప్పి పంపించారు.

"కిషన్‌సింగ్, హరజీవన్‌లాల్, క్రైన్, తోడీసింగ్‌లను పిలిచి వారికి బాబాకి ఢిల్లీలో ఒక నివాసం కావాలని చెప్పు వాళ్ళు యీ విషయంలో కేకీకి సహాయం చెయ్యాలి. ఈ పనిచేసేటప్పుడు వారు బాబాకి ఏదోసేవ చేస్తున్నామనే అభిప్రాయం పడకూడదు ఎవరో వారిని ప్రేమించేవారికి సహాయం చేస్తున్నామనుకోవాలి, అంతే. ఈ విధంగా బాబాను చూడగల మనుకోవడం కూడా పొరపాటే. బాబాతో సంబంధం పెట్టుకోగలమని గాని ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవచ్చునని గాని తలచరాదు వారి ఎన్నిన బంగళాకి వారెవరయినా స్వంతదారులయితే దానికి ఎంత అద్దె యిస్తే న్యాయమని అనుకుంటారో అంత అద్దె యిస్తారు. ఈ నవ్యజీవితంలో బాబాకి ఏ విధమయిన బోజా (బరువు) ఉండకూడదు బంగళా కుదరగానే యింకో విధంగా కూడా బాబాకు సహాయపడదామని అనుకోకూడదు, బాబా ఏదయినా మరో విధంగా చెప్తే తప్ప. బాబాని చూడడానికి వీలులేదు. ఆయనతో ఏ సంబంధమూ ఉండకూడదు ఢిల్లీలో ఉండగా ఆయినతో ఉత్తర ప్రత్యుత్తరాలు పనికిరావు బాబాతో ఉండే సహచరులతో మాత్రం సంబంధం ఉంచవచ్చు. వారిని చూడవచ్చు ఉత్తరాలు వ్రాయవచ్చు"

బాబా చెప్పినది వినగానే డాన్‌కిన్, కాకా, గుస్తాద్‌జీలు మిగిలిన పథకం III లోని సహచరులందరు క్రొత్త పథకంలో చేరడానికి అంగీకరించారు- వారంతా బాబాకి విధేయులమై ఉంటామన్నారు డాన్‌కిన్ తనతో నీలకంఠ్ డాక్టరుగాను, పెండు, మురళి సహాయకులుగాను చేరినట్లయితే ఢిల్లీలో పెద్ద యెత్తున వైద్యవృత్తి ప్రారంభించి సహచరులను పోషించడానికి వీలవుతుందన్నాడు. ఈ మాట బాబాకి నచ్చింది. అలాటి ఆస్పత్రి ప్రారంభించేవరకు వారికి కావలసిన డబ్బు చేకూరే వరకు యిదే అభిప్రాయం కలిగి ఉండడం మంచిదన్నారు. అది అందరికీ బ్రతుకుతెరువు ఏర్పరచి పోషణ కలుగజేస్తుందన్నారు.

ఈ విషయం మీద కొంత చర్చ చేసి బాబా అప్పటికే ముగించారు. మళ్ళీ 15 వ ఏప్రెల్‌నాడు యీ విషయం పునరాలోచించాలన్నారు పాశ్చాత్య దేశాలకి వెళ్ళడము కొందరిని తమతో తీసుకు వెళ్ళడము కూడా నిశ్చయించుకోవచ్చు నన్నారు.

మామూలుగా 4-30 గంటలకి మ్రోగే అలారమ్ గడియారం ఏదో కారణం వలన 12 వ తేదీ తెల్లవారగట్ల మ్రోగలేదు విష్ణు 4-45 గంటలకి లేచి అందరినీ లేపేసాడు బాబా గత సాయంకాలం సరిగా 5 గంటలకే టీ తీసుకోవాలని ఆజ్ఞాపించారు అందుకోసం బాబా ఆజ్ఞ ప్రకారం నడుచుకోవాలని ఆదుర్దా కొద్దీ అలజడి ప్రారంభమయింది కాలకృత్యాలు తీర్చుకుని గబగబా తయారవడానికి అందరూ పరుగులు తీస్తున్నారు. కానీ అందరూ టీ కి ఆలస్యంగానే వెళ్ళారు టీ తీసుకోవడం అయ్యాక 5-15 గంటలకి బాబా సహచరుల యింటికి వచ్చి అందరినీ పలకరించారు స్త్రీలతో బాబా మంజిమాఫి నుంచి 5-30 గంటలకు బయలుదేరి ఒకస్టేషన్‌వాగెన్‌లో డేరాడూన్ రైలుస్టేషన్‌కి వెళ్ళారు. ఎరచ్ దిలీప్‌తో కలిసి స్టేషన్‌కి నడిచి వెళ్ళాడు

రైలు చాలా క్రిక్కిరిసి ఉంది ప్రతీరైలు అలాగే వెళ్తుంది స్త్రీలను మాత్రం స్త్రీల పెట్టెలో ఎక్కించారు పురుషమండలితో బాబా ఎలాగో రైలులో పడ్డారు శత్రుఘ్న భార్య సుభద్ర అయిదు నెలల పసిపిల్లతో కూడా వారి పరివారంతో వెళ్ళింది అందరూ రైలెక్కి హరిద్వార్ వెళ్ళారు.

హరిద్వార్‌లో ప్లాట్‌ఫామ్ యిసుకేస్తే రాలకుండా జనంతో నిండిపోయింది. ఆడవాళ్ళని జాగ్రత్తగా అందరిని కలిసి ఉండమని చెప్పారు బాబా డేరాడూన్ నుంచి ఫ్రెనీవాలా కూడా వచ్చారు.

వీరంతా నదీ తీరాన ఒక యింటిలో దిగారు అక్కడినుంచి రేవులన్నీ బాగా చూడవచ్చు మంచులా జిల్లని ఉండే గంగా నీటిలో అసంఖ్యాకంగా యాత్రీకులు మునగడం చూడవచ్చు బాబా పరివారం ఎవరూ నదిలో స్నానంచేయలేదు. గంగనుంచి రెండు వార్చీలతో నీరు తెప్పించారు బాబా. ఆయన ఆ నీటితో స్నానం చేసారు ఊరేగింపు వీరి యింటిముందునుంచే వెళ్ళింది గాని ఆ ప్రజల ఒత్తిడిలో దుమ్మురేగి బాగా కనపడకుండా చేసింది తిరుగు ప్రయాణానికి ఎలాగోరైలులో సీట్లు సంపాదించారు.

ఆనాడు 12 గంటలకు మధ్యాహ్నము, సాయంకాలము కూడా సహచరులు సమావేశమై నిన్నటి సభా విశేషాల గురించి చర్చించుకున్నారు అనేక

విషాల ఉద్వేగంతో కూడిన వివాదాలు పడ్డారు మరునాడు ఉదయం మళ్ళీ 7 గంటలకి డేరాడూన్ రైలుస్టేషన్‌లో బయలుదేరే రైలుకి నడిచి వెళ్ళాలని అందరూ త్వరగానే రాత్రి పడుకున్నారు ఆ రోజున (ఏప్రెల్ 13, 1950) జరిగే కుంభమేళా ఊరేగింపు ఉత్సవాన్ని చూడడంకోసం పెందరాళే బయలుదేరదామని త్వరగా లేచి కాలకృత్యాలు తీర్చుకుని చపాతీ తిని టీ త్రాగి బయలుదేరి డేరాడూన్ స్టేషన్‌కి అయిదుమైళ్ళు నడిచి వెళ్ళారు. స్టేషన్‌దగ్గర సహచరులు వారికోసం నారావాలా, బర్జోర్ చాచా, ఎరచ్ మిస్త్రీ, డాన్‌లు వేచియుండడం చూసారు. జనం ఎక్కువగా ఉన్నందున తోసుకుని ఎలాగో రైలులో పడ్డారు రైలు కిటకిట లాడు తోంది ప్రతీ పెట్టెలోను జనం క్రిక్కిరిసి కూర్చున్నారు రైలు హరిద్వార్ చేరేసరికి 11 గంటలయింది సహచరులు వారి మిత్రులుదిగి సంసార్‌చంద్ గోహెల్ యింటికి వెళ్ళారు అక్కడే బాబా స్త్రీలతో బస చేసారు అక్కడికి చేరుకోగానే బాబా ఎక్కడున్నారో చెప్పి తీసుకువెళ్ళడానికి ఎరచ్, శత్రుఘ్నవారందరి కోసము వేచియున్నారు. వారిని కలిసాక బాబా ఆ రాత్రి తమకు, స్త్రీలకి నిద్రలేదని వివరించారు బయట ప్రజాసమూహం యొక్క రణగొణ ధ్వని తెల్లవార్లూ వారిని మేలుకొనేలా చేసింది.

ఆ ఉదయాన్ని ఎరచ్‌ని నీలధారకి వెళ్ళి గంగాజలం తీసుకు రమ్మని తెప్పించి బాబా ఆ జలంతో స్నానం చేసారు. బాబా అందరి సహచరులను తమ యెదుటకు పిలిచి డాన్‌ని యీ క్రింది ప్రార్థన చదవమని చెప్పారు. డాన్ యిలా చదివాడు—

"నవ్యజీవితపు సహచరులందరు వారు తెలిసీ తెలియక వారి యెడంగాని, దేవుని యెడల గాని చేసిన తప్పులకు వారిని భగవంతుడు క్షమించుగాక!

నా యెడల నా సహచరులయిన మీరు చేసిన తప్పులకు మిమ్ము క్షమిస్తున్నాను నా సహచరులారా! మీ మనసును నేను ఏ విధంగా నయినా నొప్పించి ఉంటే నన్ను క్షమించమని మిమ్ములను కోరుతున్నాను

నా తరఫున నా సహచరులయిన మీ తరఫున నవ్యజీవితపు షరతులను తెలిసయినా తెలియకా అయినా ఉల్లఘించి ఉంటే మనలను క్షమించమని భగవంతుని కోరుతున్నాను నా మట్టుకు నేను చివరివరకు నా ప్రమాణాన్ని నిలబెట్టుకునేందుకు నాకు శక్తిని ప్రసాదించమని భగవంతుని వేడుతున్నాను.

నవ్యజీవితపు షరతులను అన్నిటినీ నూటికి నూరుపాళ్ళు దేవుని సహాయంతో పాటించాలని కోరుతున్నాను.—బాబా"

డాన్ చదవడం పూర్తి చెయ్యగానే సహచరులందరి పాదాలను బాబా తమ చేతితో స్పృశించారు బాబాయొక్క ముఖం శాంతంగాను గంభీరంగాను ఉంది- వాతావరణంఅంతా గంభీరంగా మారిపోయింది బాబాముఖం తేజస్సుతో వెలిగిపోతోంది. ఆయన నేత్రాలు రెండూ రెండు నక్షత్రాల్లా ప్రకాశిస్తున్నాయి తరువాత సహచరులందరిని బాబా డాబామీదకి తీసుకువెళ్ళారు ఆ యిల్లు గంగానదీతీరాన్నే ఉంది గనుక అక్కడినుంచి చూస్తే నదిలో ఉన్నట్లే ఉంది ఆ డాబామీదనుంచి దృశ్యం ఎంతోరమణీయంగా ఉంది దూరాన పర్వతపంక్తులు కనిపిస్తున్నాయి. కుడివైపున గంగానది ఎడతెరపి లేకుండా ప్రవహిస్తోంది. ఎడమవైపున చాలాదూరాన నదిమీద మిలిటరీవారి పడవలతో తయారుచేసిన అయిదారు వంతెనలు కనిపిస్తున్నాయి వాటిమీద జనప్రవాహం నిరంతరం అటూ యిటూ సాగుతూనే ఉంది నదికి రెండువైపుల ప్రజలు ఒక మహాసముద్రంలా కనిపిస్తున్నారు పరిశీలించిచూస్తే యీ ప్రజల అనంతమయిన కదలికలు బాగా దృగ్గోచరమవుతాయి ఇదంతా చూపించి బయటకు వెళ్ళి కుంభమేళా ఊరేగింపును చూడమన్నారు. అందరినీ చీలిపోకుండా ఒకటిగానే ఉండమన్నారు. లేకపోతే ఆ మానవ సముద్రంలో తప్పిపోతారని హెచ్చరించారు

అప్పుడు సహచరులు బాబాని వదలి రోడ్డుమీదకి వచ్చి రాజమార్గానికి వెళ్దామని బయలుదేరారు అది ప్రజలతో క్రిక్కిరిసి ఉంది ఎక్కడచూసినా నడుస్తున్న ప్రజలే. చెట్లమీద, కిటికీలలోను, ద్వారాలలోను, వసారాలలోను, డాబాలమీద, పెంకుటిళ్ళ కప్పులమీద. అంతటా ప్రజలతో నిండిపోయింది. స్త్రీలు, పురుషులు, పిల్లలు అన్నిచోట్లా ఉన్నారు అలాంటి జనంలో నడవడం చాలా కష్టం పండుగ చేసుకునే యీ ప్రజలు తోరణాలు, జెండాలు, పువ్వులు, ఆకులు అన్నిచోట్లా కట్టారు. అకస్మాత్తుగా ప్రజలు పిచ్చివాళ్ళలాగ త్రోసుకుని కుంభమేళా ఊరేగింపు చూద్దామని ముందుకి కదిలారు ఎట్టకేలకు ఊరేగింపు వచ్చింది ఊరేగింపుకి ముందు నాగా (నగ్న) సాధువులు ఉన్నారు. చివర మహంతులు కాషాయాంబరధారులు ఉన్నారు. అనేకమంది కార్లలో బయలుదేరారు. ప్రతీ అఖాడాలోని సాధువులు ఉన్నారు. వారి వారి ధ్వజాలతో ఆనవాళ్ళతో ఒక్కరయినావచ్చి ఊరేగింపులో చేరారు. మేళతాళాలతో

ఊరేగింపు నడుస్తోంది ఇంకా అందులో సన్నాయి మేళాలు, గుఱ్ఱాలు, ఏను గులు, వెండి పల్లకీలు ఎన్నో ఉన్నాయి.

గంగానదికి రెండువైపులా రేవులలో ప్రజలు – స్త్రీలు, పురుషులు పిల్లలతో స్నానాలు చేస్తున్నారు. అనేక లక్షలమందికి ఆ తీరప్రదేశాలే తాత్కాలిక నివాస స్థలాలయాయి. భారతదేశం అన్నివైపుల నుంచి 15 లక్షలమంది యాత్రికులు వచ్చారు అనేకమంది స్త్రీలు ఆ సమూహాలలో నలిగిపోయారు. ఆ రద్దీలో అనేక మంది తల్లులనుండి పిల్లలు విడిపోయారు. ఎండ తీక్షణంగా ఉంది. లక్షలమంది ప్రజల కాలిక్రింద నుంచి లేచిన ధూళి ఒక పెద్ద మేఘంలా వాతావరణం అంతా ఆవరించినట్లు కనిపిస్తోంది.

సహచరు లందరు రైలుస్టేషన్ ప్లాట్‌ఫామ్ చేరుకునే సరికి బాబా అక్కడ వారికి కనిపించారు. బాబాను చూసి ఆయన తేజస్సుకి, వారు రోజూ చూసే వారయినా మిక్కిలి ఆశ్చర్యపోయారు బాబా సహచరులతో ఆ మరునాడు మంత్రి మాఫికి వెళ్ళవలసి ఉంది కాని బాబా మనసు మార్చుకున్నారు బాబా వారి స్త్రీ బృందంతో వారు బసచేసిన చోటునుంచి ఊరేగింపు చూడలేకపోయామని చెప్పారు. అందుచేత ఆరాత్రే హరిద్వారం నుంచి వెళ్ళిపోదామని బాబా అన్నారు. వెళ్ళేముందు సంసార్‌చంద్‌ని అతని తమ్ముని కలుసుకున్నారు బాబా వారితో బాబా తమ మాట నిలబెట్టుకోలేకపోయారని అన్నారు వారికి ఆశాభంగం కలిగించినందుకు బాబా వారి పాదాలు చేతితో స్పృశించి క్షమించమని కోరారు బాబా వారి స్త్రీ పురుష పరివారంతో మంత్రిమాఫికి చేరేసరికి అర్థరాత్రి అయింది

మరునాడు ఏప్రెల్ 14 వ తేదీ తెల్లవారి చల్లగా ఆహ్లాదకరంగా ఆ ప్రభాతం అందరికీ ఉత్సాహాన్నిస్తోంది. సూర్యభగవానుడు ప్రాచ్యవిభాగంలో ఆకాశం మీదికి ఎక్కుతూ సహస్రదివ్యప్రభలతో వెలిగిపోతూ తన వైభవాన్ని చాటుతున్నాడు. ఆ ప్రభాత సమయంలో ప్రకృతి పుష్ప, సుగంధాలతో ఆ వసంతపు వెలుగులో ఝంఝుమ్మనే తుమ్మెదల ఝుంకారాలతో అలరారుతోంది

బాబా ఉదయం 7 గంటలకి సహచరుల నివాసానికి వెళ్ళారు ఎటువంటి పరిస్థితులలోనయినా నవ్వుతూ ఆనందంగా ఉండాలని సహచరులను బాబా హెచ్చ

రించారు వారికి కోపతాపాలు కలుగరాదనీ అవి ఎవరూ ప్రదర్శించకూడదనీ బాబా కఠినంగా చెప్పారు ఎరచ్‌వైపు తిరిగి యీ నవ్యజీవితంలో నీ తల్లి చనిపోయిందని నీకు తెలిస్తే విచారిస్తావా అని అడిగారు నవ్యజీవన పథకం III ప్రకారం తాను విచారించకూడదని విచారించనని ఎరచ్ జవాబిచ్చాడు. బాబా అప్పుడు సురేశ్‌వైపు తిరిగి "నీ తండ్రి మరణించాడని తెలిస్తే నీవు విచారిస్తావా? "అని అడిగారు అతడు కూడా విచారించనని జవాబిచ్చాడు విష్ణువైపు తిరిగి "అసలు నీ తల్లి పోయిందని తెలిస్తే నీవు విచారిస్తావా ?' అని అడిగారు. అతడు కూడా నేను విచారించనని చెప్పాడు బాబా అతనిని "నీవు నిజం చెప్తున్నావా ! యీ నవ్యజీవితంలో అబద్దాలు పనికిరావు. సందేహాస్పదమయిన సమాధానాలు పనికిరావు సుమా !" అని హెచ్చరించారు బాబా. నూతన జీవితంలో మాతృ మరణం గురించి దుఃఖించనని మళ్ళీ విష్ణు అన్నాడు దానిమీద నెమ్మదిగా విన్నటిరోజున డాన్‌కి ఆదీ (సీనియర్) వద్దనుంచి తాకు (విష్ణుతల్లి) చనిపోయిందని టెలిగ్రాం వచ్చిందని చెప్పారు బాబా – విష్ణు యీ వార్తను నెమ్మదిగా గంభీరంగా స్వీకరించాడు బాబాతో అతడు గొంతుక గాద్గదికం లేకుండా, విచారం సూచించకుండా, ఎక్కడా వణుకు లేకుండా మాట్లాడాడు విష్ణు ముఖము నెమ్మదిగా, శాంతంగా ఉంది. అతని నేత్రాలు జలపూరితాలు కాకుండా స్వచ్ఛంగా ఉన్నాయి. అందరూ అతని ధైర్యానికి హృదయ స్థైర్యానికి విష్ణుని మెచ్చుకున్నారు విష్ణు తన తల్లిని గాఢంగా ప్రేమించాడు కాని ఆ ప్రేమను అతడు అందరికీ తెలిసేలా ప్రదర్శించలేదు ఈ విషాదవార్త విన్నప్పటినుంచీ అతని మనస్సులో ఎంతదుఃఖం అలుముకుందో దేవుడికే తెలియాలి. కాని అతని ముఖం మీద మాత్రం ఎక్కడా మనోవికారం గోచరం కాలేదు నూతన జీవిత నిబంధనల ప్రకారం చిత్తక్షోభం ప్రదర్శించరాదు డాన్‌కిన్ అసలు పాత జీవితపు వ్యక్తుల గురించిన వార్తలేవీ చెప్పకుండా ఉండవలసిందని బాబా అన్నారు ఇంత బాగా మాతృ వియోగం చేసుకున్నారు నూతన జీవితంలో సంతకం పెట్టి - చేరినప్పటికే విష్ణు తల్లి వృద్ధురాలై చాలా జబ్బుస్థితిలో ఉందని తెలిసికూడా అతడు బాబాని వదిలి ఉండలేక వచ్చేసాడని బాబా చెప్పారు

మామూలుగా స్త్రీలు చెప్పిన వస్తువులు తేవడానికి విష్ణు బజారుకి వెళ్ళాడు దేరాడూన్ పట్నంలోకి ఆ రోజంతా ఏ విధంగానూ అతడు విచారం వ్యక్తం చేయలేదు. ఆ మధ్యాహ్నం బాబా తమ సహచరుల నివాసానికి వచ్చి సాయంకాలం

ప్రొద్దుపోయేవరకు అక్కడే ఉన్నారు మధ్యాహ్నం బాబా వచ్చేసరికి వారి సహచరులు ఒక్కపూటే తీసుకునే భోజనం తీసుకుంటున్నారు. చపాతీలు తింటున్నారు. అందులో వారికి ఒకటే కూర ఉంటుంది. శత్రుఘ్నను పిలిచి బాబా 'పశులోక్' సంస్థకి వెళ్ళి మీరాబెన్ ఇంగ్లీషు ఎద్దు అయిన 'రాజా'ని ఉచితంగా గ్రహిస్తుందేమో కనుక్కున్నావా అని అడిగారు ఆమె అంగీకరించలేదని పశులోక్ సంస్థ నియమాల ప్రకారం అది తీసుకోజాలనని చెప్పిందని శత్రుఘ్న అన్నాడు వెంటనే శత్రుఘ్న డేరాడూన్‌లోని గోశాలకి వెళ్ళి వారు తీసుకుంటామని చెప్పగా ఆ సాయంత్రమే రాజాని తోలుకువెళ్ళి గోశాలాధికారులకి అప్పజెప్పి వచ్చాడు స్త్రీల నలుగురి పేర్లతోను ఆ ఎద్దును గోశాలకు ధర్మం చేసారు

పగలల్లా ఎండకాసి ఆ సాయంకాలానికయినా చల్లబడక చాలా ఉక్కగా ఉంది ముస్సూరీ కొండలమీద మేఘాలు దట్టంగా ఉన్నాయి నెమ్మదిగా అవి దక్షిణాకాశానికంతా వ్యాపించాయి చీకటిపడినా నక్షత్రాలు ఆ మేఘాలమాటున ఉండిపోయాయి ఉక్కచాలా ఎక్కువగా ఉంది అసలు గాలి అన్నమాట లేదు ఆ సాయంత్రం మెహెర్‌జీకి, బాబా యీ దిగువ ప్రకారం టెలిగ్రాం యిప్పించారు ——

"నీవు, నారిమన్, మీవద్ద నవ్యజీవితపు డబ్బు ఏ బాపతు అయినా సరే ఉన్నదంతా విష్ణుపేర ఇంపీరియల్ బ్యాంకు, డేరాడూన్, మీద డ్రాఫ్ట్ తీసుకుని వెంటనే పంపించవలెను. అత్యవసర పరిస్థితులకోసం ఉంచిన డబ్బుకూడా యిందులో చేర్చవలెను నారావాలా చిరునామాకు పంపించాలి. ఈ సంగతి ఏర్పాటుదార్లందరికీ తెలియజేయాలి——బాబా."

ఏప్రెల్ 15 వ తేదీన తెల్లవారుతూనే వెచ్చదనం ప్రారంభించింది మబ్బు దట్టంగా పట్టింది ఒకటి రెండు నిముషాలు మాత్రం పెద్ద పెద్ద చినుకులు పడ్డాయి. దూరాన అడవులలోను మబ్బుల మాటున సూర్యుడు దాగుడుమూత లాడుతున్నాడు. పక్షులు అదేపనిగా ధ్వని చేస్తున్నాయి. ప్రొద్దున్నే 7 గంటలకి బాబా సహచరుల యింటికి వెళ్ళారు. అప్పుడే డాన్‌కూడా డేరాడూన్‌నుంచి వచ్చాడు మామూలు ప్రకారం బాబా అతని ఆరోగ్యం గురించి ప్రాక్టీసు గురించి అడిగారు. తన ఆరోగ్యం బాగానే ఉందిగాని ప్రాక్టీసే అంతంతమాత్రంగా ఉందనీ ఆశాజనకంగా లేదనీ డాన్ చెప్పాడు ఇంకా ఎన్నో విషయాలు బాబా అతనితో చర్చించారు.

బాబా అడిగితే గాని డాన్ ఆయనకి తన పాత జీవితానికి సంబంధించిన వారెవరయినా మరణిస్తే ఆ వార్త చెప్పకూడదు.

రంజూ అబ్దుల్లాకి బాబా యీ క్రింది విధంగా డాన్‌కిన్‌చేత టెలిగ్రాం యిప్పించారు. "మనీ యిల్లు అతనికి గాని ఎవరికి గాని అమ్మినా అమ్మకపోయినా 350 మంది స్నేహితుల వద్దనుంచి ఒక్కొక్కరినుంచి నూరు రూపాయల చొప్పున గాని, 233 మంది దగ్గర రూ 150/- చొప్పున గాని లేక 175 మంది స్నేహితులవద్ద నుంచి రు 200/- చొ॥న గాని వసూలుచేసి మనీకి రు 35,000/- యిచ్చెయ్యాలి. ఎంతమందినైనా రు 50/- లకి తక్కువగాని రు 500/- లకి ఎక్కువ గాని అడుగకుండా ఎంతయినా అడిగి పుచ్చుకోవచ్చును. ఈ సంగతి ఏర్పాటుదార్లందరకు చెప్పవలెను అని బాబా కోరుతున్నారు—డాన్‌కిన్"

బాబా మరల విష్ణు తల్లి మరణం గురించి డాన్‌తో మాట్లాడారు. అందరి ముఖట బాబా యిలా చెప్పారు "విష్ణు తన తల్లిని బాగా యెక్కువగా ప్రేమించాడు. ఆవే (సీ) కూడా తన తల్లిని ఎక్కువగానే ప్రేమించాడు కానీ యిద్దరి ప్రేమకి తేడా ఉంది ఈ భేదం ఏమిటంటే విష్ణు నావద్ద ఉండడానికి నిశ్చయించుకున్నాడు. ఆదీ వరకు I-C ఎన్నుకున్నాడు నావద్ద ఉండక్కరలేకుండా తనతల్లి వద్దనే ఉంటున్నాడు. విష్ణుయొక్క స్థైర్యానికి బాబా మెచ్చుకున్నారు బాబా డాన్‌ని భోజనం చేసి వెళ్ళమన్నారు భోజనానంతరం డాన్ తన యింటికి వెళ్ళాడు.

ఒక ఎద్దుల బండి రు 200/- లకి అమ్మేసి బాబా ఆ డబ్బు స్త్రీలకి యిప్పించారు, బండి వాళ్ళది గనుక.

సహచరులందరు చేరి నవ్యజీవితంలో ఎవరి జీవితం భవిష్యత్తులో ఎలా ఉంటుందో చర్చించుకున్నారు వాదనలు ప్రతివాదనలుచేసి నవ్యజీవితాంశాలన్నీ చర్చించారు ప్రతీ సహచరుడు తన అభిప్రాయం తెలిపాడు.

ఏప్రెల్ 15 వ తేదీ ఉదయాన్ని మరల సహచరులను సమావేశపరిచి యీ చర్చ మరల లేవదీసారు బాబా "ఏ రోజునయినా ఎలిజబెత్ నుంచి కేబిల్ వస్తుందనుకుంటున్నాను, నన్ను పాశ్చాత్యదేశాలకు రమ్మని ఆహ్వానిస్తూ యీ సంవత్సరం" అన్నారు బాబా. "కాని ఎలిజబెత్ 1950 కి బదులు జూలై 1951

ప్రాంతాలలో రమ్మనవచ్చు" అన్నారు. "ఒకవేళ నేను యీ సంవత్సరం అమెరికాకు వెళ్తే మీలో కొందరిని నాతో తీసుకు వెళ్ళవలసి వస్తుంది. అక్కడి నుంచి మళ్ళీ వచ్చాక నాతో వచ్చినవారు యిక్కడ క్రొత్తపథకంలో దిగడిన సహచరులను చేరవలసి ఉంటుంది.

నేను ఎవరినయినా పడమట దేశాలకి తీసుకువెళ్తే మీ అంగీకారంతోనే తీసుకువెళ్తాను. మీ పనికి అంతరాయం కల్పించకూడదని మీకు ఏ ఆజ్ఞలు యివ్వకూడదని నేను నిశ్చయించుకున్నాను. మీరు నాతో పడమట దేశాలకి వచ్చినపుడు అన్ని విధాలా నాకు విధేయులుగా ఉంటారని మీ వద్దనుంచి మీ అంగీకారంతో మాట కూడా తీసుకుంటాను.

"జూలై 1950 లో నేను పడమటకి వెళ్ళాలని నిశ్చయిస్తే, నాతో కూడా రావాలని కొందరు సహచరులను మే నెలలో కోరుతాను. వారు రావడం అక్కడికి వెళ్ళిన తరువాత నాకు విధేయులుగా ఉంటామని వారు వాగ్దానం చేయడం మీద ఆధారపడి ఉంటుంది.

"ఇక్కడ ఉండిపోయిన వారికి ఉద్యోగాలు చూసుకోవడంలోను వారు నివాసాలు కుదుర్చుకోవడంలోను నేను సహాయం చేస్తాను" రోజంతా మబ్బుగానే ఉంది. సాయంత్రానికి చల్లనిగాలి తిరిగింది. మధ్యాహ్నం యీ చర్చలవల్ల వేడెక్కిపోయినవారి బుర్రలకి యీ చల్లగాలి ఎంతో హాయిని సమకూర్చింది.

మరునాడు (16-4-50) కూడా ఆ రోజు మబ్బుగానే మొదలు పెట్టింది. చలిగాలి కూడా వేస్తోంది. మెహెరాబాద్‌లో బయలుదేరింది మొదలు వాతావరణం ఏదో విధంగా బాధ కలిగిస్తూనే ఉందని (వర్షమో, చలిగాలో, తుఫానో, విపరీతమయిన ఎండో) బాబా అన్నారు. బాబా ఆరోగ్యం మళ్ళీ బాగా ఉండడం లేదు. ఒళ్ళు నొప్పులుగా ఉందని రొంప పట్టిందని దగ్గు వస్తోందని అన్నారు.

ఉదయాన్నే 7 గంటలకు నారావాలా, చాచాలు బాబాని చూడడానికి వచ్చారు. మే 1 వ తేదీనుంచి అమలు జరిగే క్రొత్త ఏర్పాట్లు బాబా వారికి తెలియజెప్తూ వారికి శత్రుఘ్నకి కూడా యీ క్రొత్త విషయాలు చెప్పేనన్నారు. ఆ రోజు ఉదయాన్నే కేకి

దేశాయిని, ఎరచ్‌ని బస్సులో ఢిల్లీకి వెళ్ళమన్నారు వాళ్ళు మంజ్రీనుంచి 8 గంటల బస్సులో వెళ్ళారు.

క్రొత్త పథకం అన్ని ప్రయోజనాలకి, బాబా స్త్రీలతో నివాసం ఉండడానికి, ఢిల్లీలో తగిన వసతులు చూడమని న్యాయమయిన అద్దెలో కుదర్చమని ఎరచ్ తోను కేకీ దేశాయితోను చెప్పారు. 14 వ తేదీన డబ్బు పంపమని బాబా మెహెర్‌జీకి యిచ్చిన టెలిగ్రాంకిబదులుగా మెహెర్‌జీ ఇంపీరియల్ బ్యాంకు ద్వారా రు 15,000/- బాబాకు పంపినట్లు, టెలిగ్రాం యిచ్చాడు. అది అందగానే బాబా మెహెర్‌జీ నారిమన్ లకి యీ తంతి సందేశం పంపించారు.

"మీరు వెంటనే పంపినందుకు సంతోషం—నేను అయిదువేలే మిగిలాయని అనుకున్నాను. ఈ అదనం పదివేలు ఎలా వచ్చాయి? సదాశివ్ ఘనీల ఆస్తుల బాపతు సొమ్ము ఏర్పాటుదార్లు వసూలు చేస్తారని ఆశిస్తాను. రు 15,000/- గురించీ ఆస్తుల గురించీ వివరిస్తూ ఉత్తరం వ్రాయండి ఏర్పాటుదార్లకి చెప్పండి—బాబా."

బాబాకి సుస్తీగా ఉన్నా మధ్యాహ్నం మళ్ళా సహచరుల యింటికివెళ్ళారు. ఏమయినా టెలిగ్రాం తెచ్చావా అని బాబా విష్ణుని అడిగారు అంతసేపూ బాబా దగ్గుతూనే ఉన్నారు. ఆయిన ఒడలంతా నొప్పిగా ఉంది. బాబా చాలా అలిసిపోయి నట్లున్నారు నెల్లాళ్ళు ప్రతిరోజు హరిద్వార్ ఆ పరిసర స్థలాల్లోను కుంభమేళాలో పని చేసినందువల్ల బాబా దేహానికి చాలా అలసట, బలహీనత, నీరసం కలిగింది. ఆయన నరాలకి చాలా ఒత్తిడి కలిగింది ఏదయినా కొంచెం పనిచేస్తే సులభంగా అలసట కలుగుతుంది. మోతీచర్‌లో ఉన్న నెలరోజులూ బాబా ఆయన సహచరులూ రోజూ ఒక్కపూటే భోజనం చేసేవారు. వర్షమూ, చలి, తుఫాను, భోజన సదుపాయం లేక పోవడము, అస్తమానూ బయటగాలిలో తిరగడము వీనివల్ల బాబా దేహారోగ్యం బాగా దెబ్బతింది. మంజ్రీమాఫికి వచ్చాక బాబాని రెండుపూట్లా తినమని ఆయన సహచరులు కోరారు వారినంత డబ్బు లేకపోబట్టి సహచరులు రోజుకొక్క పూటే భుజించేవారు రేషన్‌షాపులో దొరికే గోధుమపిండి చెత్తలా ఉండేవి అదె చపాతీలుచేసుకుని పప్పుతోనో లేక కూరతోనో తినేవారు, యింక గత్యంతరం లేక కొందరు బొత్తిగా నీరసంగా ఉండబట్టి భిక్షాటనకు వెళ్ళడానికి శక్తిలేక పోయేది మిగిలినవారు వారికి చెప్పిన పనులు ఎలాగో లాగు చేసేవారు

ఏప్రెల్ 17 వ తేదీన కూడా చల్లగా ఉండడమేగాక వాతావరణం అంతా పొగమంచుతో నిండిపోయినందువల్ల పగలయినా చీకటిగా ఉంది. బాబా ఉదయం 7 గంటలకి సహచరుల యింటికి వెళ్ళారు నజా, మెహెరా, మణి, గోహర్ వీళ్ళెవరికి ఒంట్లో బాగాలేదు ఇన్‌ఫ్లూయెంజా జ్వరంతో బాధపడుతున్నారు వీరికోసం డాక్టరు రావడానికి రోగులను పరీక్ష చేయడానికి స్త్రీలు ఉండే యింట్లో బొత్తిగా చోటులేదు. ఆ యింటిలో చిన్న చిన్న గదులు. వంటయిల్లుగాక మూడే ఉన్నాయి. ఒక గదిలో వారి సామానులన్నీ పడేశారు ఇద్దరు వాళ్ళ పడకలతో ఒక చిన్నగదిలో ఉన్నారు. ఇంకోగదిలో ముగ్గురున్నారు మంచాల మధ్యనుంచి మసలడానికై చోటు చాలడం లేదు అందుచేతనే రాబోలు జ్వరం ఒకరికి వస్తే అందరికీ సోకింది పురుషుల యింటిలో కూడా యిలాగే ఉంది పరిస్థితి

బాబాకి యింకా దగ్గు వస్తోంది ఆయన యింకా నీరసంగాను నిరుత్సాహంగాను కనిపిస్తున్నారు బాబాకి జ్వరం 100 డిగ్రీలు ఉండడంచేత విష్ణుని ఊళ్ళోకి వెళ్ళవద్దన్నారు. ఆయనకు దగ్గు, ఒళ్ళునొప్పులుకూడా ఉన్నాయి. విష్ణు యీ రోజున యీదురోపంటూ ఉన్నాడు. అతని పనులను బాబా నీలూని చెయ్యమన్నారు. పొద్దెక్కిన కొద్దీ ఆ రోజు ఎండ వేడెక్కువవుతోంది నూతిలోని నీరు ఏదో కంపు కొడుతోంది అరమైలు దూరం నుంచి త్రాగడానికి మాత్రం నీరు తెచ్చుకుంటున్నారు మిగతా వాడకానికి యీ నూతి నీరే వాడుతున్నారు నీరు యిలా ఉండబట్టే అందరి ఆరోగ్యాలు యిలా అధ్వాన్నంగా ఉన్నాయన్నాడు నీలూ. సరియైన ఆహారం లేకపోవడం, చాలినన్ని మంచి బట్టలు, మంచినీరు లేకపోవడం, శారీరకమైన కష్టాలు, మానసిక వేదన, అలసట, నిరంతరం చలిగాలి వీసుతూ ఉండడం, తరుచుగా వర్షాలు పడడమువల్ల యీ ఆరునెలల నూతన జీవితములో బాబాయొక్క, సహచరులయొక్క ఆరోగ్యాలు పాడయిపోయాయి రాత్రికి విష్ణుకి 102 డిగ్రీలుపైగా జ్వరం వచ్చింది. అందరూ బెంగపెట్టుకున్నారు ఎవరూ ఉత్సాహంగా లేరు

18 వ తేదీ (ఏప్రెల్, 1950) ఉదయానికి విష్ణుకి 103 5 డిగ్రీల జ్వరం ఉంది. రాత్రంతా అతడు దగ్గువలన నిద్రపోలేదు ఉన్న పరిస్థితులలో నీలూకి అతని మందు యిచ్చి వైద్యం చెయ్యడానికి వీలులేకపోతోంది. అయినా అతడు తంటాలు పడుతున్నాడు. విష్ణుకి జబ్బుగా ఉండబట్టి కూరలు వగైరా కొని తెచ్చే పని బాబా నీలూకి అప్పజెప్పారు ప్రొద్దున్న చలిగాలి వేస్తూనే ఉంది ఆకాశం అంతా

మేఘావృతంగానే ఉంది తరువాత బాగా ఎండకాసింది మబ్బులు చెదిరిపోయాయి. కానీ గాలి ఆడడం లేదు ఉక్కపోత ఎక్కువగా ఉంది దూరాన ఉన్న కొండలు చెట్లు కనిపించడమే లేదు

గుస్తాత్ జీ సోదరుని కుమారుడు ఆర్ ఎస్ హంసోటియా నూతన జీవితంలో చేరుదామని ఉదయం 9 గంటలకు బాబావద్దకు వచ్చాడు అతడు రైల్వే డిపార్టుమెంటులో రట్లమ్‌లో ఒక ఉద్యోగం చేస్తూండేవాడు అతడు బాబాయొక్క నూతన జీవితపు సర్క్యులర్‌లను అందుకుని చదువుతూ యీ ప్రపంచపు జీవితాన్ని వదిలేద్దామని అనుకుంటూ ఉండేవాడు. ఆ ఆలోచన బలమయిన కొద్దీ అతనికి ఏమీ తోచేదికాదు. ఈ ప్రపంచపు జీవితాన్ని కొనసాగించడం అతనికి ఒకయాతన అయింది అందుచేత అతని తల్లిదండ్రులతో చెప్పకుండానే ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసాడు. ఇచ్చేసి మోర్టక్కా గ్రామానికి వాళ్ళ నాన్నని చూడటానికి వెళ్ళాడు వెళ్ళి అతడెందుకు ఉద్యోగం మానుకున్నాడో వివరాలు చెప్పాడు తన దగ్గర మూడు నాలుగు మాసాలుండి తరువాత హంసోటియాని బాబా దగ్గరకు వెళ్ళమన్నాడు అతని తండ్రి బాబా నవ్యజీవితపు పత్రాలన్నీ చదివి కంఠస్థం చేసాడు హంసోటియా. బాబా మోతీచర్ వెళ్ళారని తెలుసుకుని అతని సామానులతో సహితంగా హరిద్వార్ రైలుమీద వెళ్ళి అక్కడి నుంచి నడిచి మోతీచర్ వెళ్ళాడు అక్కడికి వెళ్ళాక అక్కడి వాళ్ళు బాబా చాలాకాలం క్రిందటే మంజ్రీమాఫి వెళ్ళారని చెప్పారు అందుచేత పాపం అతడు హరిద్వార్‌కు మళ్ళీ నడిచివెళ్ళి తన సామాను దేరాడూన్‌లో ఒక హోటలులో వదేసి మంజ్రీమాఫీకి ఒక సైకిల్‌మీద వెళ్ళాడు వెళ్ళి అక్కడ యింటి ఆవరణలో పెండుని కలుసుకున్నాడు అతడు నవ్యజీవితంలో చేరే నిశ్చయంతో వచ్చాడని పెండు తెలుసుకున్నాడు అందుకోసం బాబాను చూడాలని వచ్చాడని పెండుకి తెలిసింది నవ్య జీవితంలో బాబా ఎవరినీ చూడడం లేదనీ ఎవరికీ దర్శనం యివ్వడం లేదనీ హంసోటియాకి పెండు చెప్పాడు రుస్తుం హంసోటియా తనకా సంగతి తెలుసునని, నవ్యజీవితపు పత్రాలన్నీ బాగా చదివానని పెండుతో చెప్పాడు. బాబా ఆజ్ఞ ప్రకారం తాను వర్తిస్తానని నూటికి నూరుపాళ్ళు నవ్యజీవిత నిబంధనలన్నీ పాటిస్తానని చెప్పాడు. కానీ బాబా ఆజ్ఞకి ఒక్కదానికే భయపడుతున్నానని, అదేమిటంటే బాబా అతన్ని తిరిగి వెళ్ళిపొమ్మంటారేమో అని తన భయమని అన్నాడు అలాగయితే తనసామాను పెట్టుకొని బాబా యింటి కెదురుగా రోడ్డుమీద ఉంటానని రుస్తుం హంసోటియా చెప్పాడు. ఈ విషయాలన్నీ యథాతథంగా పెండు బాబాకి నివేదించాడు బాబా యీ ఏప్రెల్

వెలాఖరుకి సహచరులందరితోను సమావేశం పెడతారనీ అప్పుడు పరిస్థితులన్నీ చర్చించబడతాయని హంసోటియా విషయంకూడా అప్పుడు నిశ్చయిస్తామని యిప్పటి మట్టుకు యింటికి వెళ్ళిపొమ్మనీ, తరువాత పోస్టుద్వారా అతని గురించి బాబా తీసు కున్న నిశ్చయం తెలియపరుస్తామని హంసోటియాకి పెండుద్వారా చెప్పించారు. ఇలాంటి జవాబువస్తుందని తను అనుకుంటూనే ఉన్నానన్నాడు రుస్తుం హంసోటియా బాబా చెప్పిన ప్రకారం విని అలా చేయడం మంచిదని పెండు మరీ మరీ చెప్పాడు. దూరాన్నుంచయినా బాబాని ఒక్కమారు చూడాలని రుస్తుం తన కోరిక తెలిపాడు. పెండు మరల బాబా ఎవరినీ మాడరని మరల చెప్పినా యిస్తుం వినలేదు 4, 5 గంటల సేపు సహచరుల యింటిలో వేచి ఉన్నాడు. ఈ లోపుగా బాబా పెండుని పిలిపిగా యీ సంగతి బాబాతో పెండు విన్నవించాడు తన పూర్తి చిరునామా యిచ్చి అతన్ని వెళ్ళ మని చెప్పమని బాబా యింకోమారు చెప్పారు డైరీలో తన కేసు అంతా వ్రాయబడు తుందని మే నెలలో బాబా తీసుకున్న నిర్ణయం అతనికి తెలుపుడు చేయబడుతుందని పెండుచేత చెప్పించారు బాబా. దూరాన్నుంచి చూడడానికి బాబా ఒప్పుకున్నారని పెండు చెప్పగా రుస్తుం పెండుతో బాబా యింటివద్దకు వెళ్ళగా బాబా కళ్ళు పడగానే బాబా అతనివైపు చెయ్యి ఊపారు. తరువాత రుస్తుం వెళ్ళిపోయాడు. అతని చిరునామా యీ విధంగా వ్రాసియిచ్చాడు.

ఆర్. ఎస్. హంసోటియా, C/o సొరాబ్జీ ఎస్ హంసోటియా,
పోస్ట్ — మోర్‌టక్కా, జిల్లా - నేమాడ్,
వయా ఖాండ్వా.

రుస్తుం వెళ్ళిన అరగంటకి బాబా సహచరుల యింటికి వెళ్ళి సీలూని విష్ణు యొక్క జ్వరం గురించి అడిగారు మందు తీసుకోగా విష్ణు జ్వరం 99 డిగ్రీలకి తగ్గిందని తెలిసింది బాబా అడుగగా విష్ణు తనకి కొంత నయంగానే ఉందన్నాడు. బాబా సంతోషించి అక్కడినుంచి వెళ్ళారు.

ఏప్రెల్ 19 వ తేదీన తెల్లవారకముందే ఆకాశం నిర్మలంగా ఉంది. ఆకాశం అంతటా నక్షత్రాలు చక్కగా కనిపిస్తునాయి దీపాలు లేని ఆ ఊరి వీధులలో తెల్లవారకముందు నక్షత్రకాంతే కాస్త వెలుగు నిస్తోంది సూర్యుని ఉదయరాగం అంతటా వ్యాపించింది చల్లనిగాలులు సుగంధయుతంగా ఉత్తర దిక్కునుంచి వీచు

తున్నాయి. దూరాన పర్వతాలు నల్లగా కనిపిస్తున్నాయి. వాతావరణం శాంతితో కూడుకుని ఉంది. మానవుని హృదయాలలో ఏవో భావాలు చెలరేగుతున్నాయి. విష్ణుకి జ్వరం నార్మల్‌గా ఉందని, విష్ణు శత్రుఘ్నుని డేరాడూన్‌కి తనను మోటారు బైక్ మీద తీసుకు వెళ్ళమని కోరాడు. డేరాడూన్‌కి విష్ణు వెళ్ళవలసి వచ్చింది. వాతావరణం స్తంభించి నట్లయింది. మెహెర్‌జీకి 16 వ తేదీన యిచ్చిన టెలిగ్రాంకి జవాబు వచ్చింది బాబాకి. మెహెర్‌జీ యీ విధంగా జవాబిచ్చాడు.

147, కంబాలా హిల్,

బొంబాయి, 16 ఏప్రెల్, 1950.

ప్రియమయిన బాబాకి,

ఈ సాయంత్రం 5-30 గంటలకి మీరు నాకు నాశిక్‌కి యిచ్చిన యీ క్రింది టెలిగ్రాం అందినది.

"మీరు వెంటనే పంపినందుకు సంతోషం నేను అయిదువేలే మిగిలాయని అనుకున్నాను. ఈ అదనం పదివేలు ఎలా వచ్చాయి? సదాశివ్, ఘనీల బాపతు సొమ్ము వసూలు చేస్తారని ఆశిస్తాను రు 15,000/- గురించి, ఆస్తుల గురించి వివరిస్తూ ఉత్తరం వ్రాయండి ఏర్పాటుదార్లకి చెప్పండి —— బాబా."

రు 15,000/— పైవు వేయించి మీరు నాకు 13-10-49 తేదీన యిచ్చిన చీటీ ప్రకారం మీరు నా వద్ద రు 42,000 యీ వివరాలతో ఉంచారు

(a) రు 27,000/- లిస్టు ప్రకారం ఉపయోగించవలసినది—— రు 4,000/- మెహెరాకి, రు 3,000/- మణికి, కొత్త జీవితపు సహచరులకి ఒక్కొక్కరికి వెయ్యి చొప్పున రు 20,000/-

(b) రు 5000/- ప్రత్యేకమయిన వారికోసం ప్రత్యేకమయిన ఆజ్ఞలతో వచ్చిన వారికి

(c) రు 10,000/- అత్యవసర పాతకానికి.

ఈ రు 42,000/- కాక మీరు ఆఖరి నిమిషంలో నాకు దానితో కలిపి ఉంచమని వెయ్యి రూపాయిలిచ్చారు. మొత్తం నాకు యిచ్చిన రు 43,000 వేలకి యీ క్రింది ఖర్చు చేయడమైనది

| | |
|---|---|
| దౌలత్ సింగ్‌కి యిచ్చింది | రు 1,000 |
| పాద్రికి యిచ్చి పంపింది | 15,000 |
| ఆదీ (సీ) ద్వారా పంపించి | 10,000 |
| విష్ణుపేర ఇంపీరియల్ బ్యాంకు డ్రాఫ్టు ద్వారా పంపింది | 2,000 |
| టెలిగ్రాం ద్వారా పంపింది | 15,000 |
| మొత్తం | 43,000 |

పటేల్ :— మనం ఖర్చుపెట్టిన రు 43,000/- అతని పెద్ద ఆస్తిమీద బ్యాంకులో అప్పు తీసుకుని యిస్తానన్నాడు కానీ యింతవరకు అతడేమీ చేయలేదు. చిన్న ఆస్తిని అమ్మినందువల్ల వచ్చిన డిపాజిట్ రు 2,000/- అతడు యిమ్మంటే యిచ్చేసాము ఆ అమ్మకం మరల అతడు యిప్పుడు రద్దుపరిచాడు కొంతకాలం క్రిందట పాపాకి ఇంగ్లీషులో ఉత్తరం వ్రాసాను. అది పటేల్‌కి చదివి వినిపించి చెప్పమని వ్రాసాను అతడు రాడని జవాబు యివ్వడం తప్పించుకుంటున్నాడని జవాబు వ్రాసాడు

జా॥ ఘనీ:— ఇంతవరకు యీ ఆస్తులు అమ్మడానికి సరోష్ రంజూలు చేస్తున్న ప్రయత్నాలు ఫలించలేదు అందుచేత ఘనీవచ్చాక అతనిసహాయం కోరాము. మొదట అతడు రు 26,000 కి కొంటానన్నాడు గాని తరువాత అక్కర్లేదన్నాడు. ఈ పరిస్థితులలో ఆ ఆస్తులున్న స్థలాలని బట్టి అవి అమ్మగా వస్తుందనుకున్న మొత్తం యిప్పుడు రాదు ఈ మధ్య ఘనీ ఆస్తి అద్దె పెట్టుకోవడానికి యిష్టం కనపరుస్తున్నాడు. అందుకని రంజూ సరోష్‌లు, అతనికి రు 20,000 కే యిస్తామన్నారు కాని యింకా నిశ్చయమయిన సంగతేదీ తెలియలేదు సరోష్ 1, 2 రోజుల్లో బొంబాయి వస్తున్నాడు వచ్చినప్పుడు అన్నీ చెబుతానని వ్రాసాడు 350 మంది పాత

జీవితపు మిత్రుల వద్దనుంచి రు 35,000 వసూలు చేయడం గురించి ఆదీ జాబితాలు తయారు చేస్తున్నాడు. అది త్వరలోనే అవుతుందని అనుకుంటాను.

ఇట్లు మీ
మెహెర్‌జీ.

డేరాడూన్ నుంచి తిరిగ వచ్చాక విష్ణు చాలా అలిసిపోయినట్లున్నాడు. భోజనం చేసి విశ్రాంతి తీసుకోమని కదలవద్దని బాబా విష్ణుతో చెప్పారు.

సాయంత్రం అయేసరికి వాతావరణంలో కొంచెం మార్పు కలిగింది. ఉత్తరాన్నుంచి చల్లని వాయువులు వీచుతున్నాయి ఆ చల్లగాలిలో యింటి బయట కూర్చున్నారు సహచరులు. నవ్యజీవితంలో వారి భావి పరిస్థితి గురించి మాట్లాడు కున్నారు.

ఏప్రెల్ 20 వ తేదీ ఉదయం కొంచెం మబ్బుగా ఉంది. గాలి లేదు ఉక్క పోస్తోంది ఎండలేకపోయినా వేడి యెక్కువగా ఉంది చెట్లు సెమ్మాలల్లా నిలబడ్డాయి ఎక్కడా ఆకు కదలడం లేదు. పక్షులు అరవకుండా నిశ్శబ్దం పాటిస్తున్నాయి ప్రకృతి ఏ జీవికి ఉత్సాహాన్నివ్వడంలేదన్నమాట.

విష్ణుకి జ్వరం తగ్గి మామూలుగా ఉంది రాత్రి బాగా నిద్రపోయాడు. సహచరుల యింటికి ఉదయం 6–30 గంటలకే బాబా వచ్చారు వచ్చి యీ క్రింది టెలిగ్రాం మెహెర్‌జీకి, ఘనీకి, సదాశివ్ పటేల్‌కి, నారిమన్‌కి పంపించమని విష్ణుతో చెప్పారు

I (1) మెహెర్‌జీ C/o ఇరంశోజ్జర్, బొంబాయి

(2) నారిమన్ దాదాచాన్ జీ,

ఆషియానా, 69–c. వార్డన్ రోడ్, బొంబాయి.

"రు 15000 గురించి నీవు చేసిన ఏర్పాటుకి సంతోషము. పూనా లోనవలా ఆస్తి విషయమై పని తొందరగా చేయమని సదాశివ్‌కి ఘనీకి తంతి యిస్తున్నాను. ఈ విషయం ఏర్పాటుదార్లకి చెప్పవలెను—బాబా".

II సదాశివ్ షెల్కే,
301, నానాపేట, పూనాసిటీ

"మెహెర్‌జీ నాతిమన్న సొమ్ము రు 43,000/- యీరోజు లగాయతు ఒక నెలలోపున చెల్లించమని నిన్ను III పథకంలోని సహచరునిగా ఆజ్ఞాపిస్తున్నాను —బాబా.

III అబ్దుల్ ఘనీ
C/o కాజీ మునిరుద్దీన్, మోతీ మాన్‌షన్
విల్సన్ గార్డెన్‌వద్ద. పూనా.

"నీకు ప్రత్యేకంగా రు 35,000/- వస్తున్నాయి గనుక లోనావలా ఆస్తి సాధ్యమయినంత త్వరలో అమ్మబడి వారికి రావలసిన పైకం చుట్టడానికి నీవు ఏర్పాటుదార్లకి చేతనైన సహాయం చేయవలెను.

జవాబు పంపవద్దు—బాబా".

బాబా ఆర్డరు ప్రకారం విష్ణు మళ్ళీ ఉదయాన్నే సైకిల్‌మీద అడపాళ్ళకోసం బజారు పనికి డేరాడూన్ వెళ్ళాడని అతనికి జ్వరం తగ్గి నార్మల్‌కి (మామూలు స్థాయికి) వచ్చిందని తెలిసింది. అతనికి నీరసంగా ఉన్నా ప్రతిరోజు బాబా యిచ్చే ఆజ్ఞలు పాటించవలసి వచ్చేది III పథకం అనుసరించడం చాలా కష్టంగా ఉండేది.

తరువాత ఆ ఉదయం శత్రుఘ్న మహంతులు బాబాని చూడడానికి వచ్చారు మహంతు బాబాకోసం ఒక అందమయిన పుష్పగుచ్ఛం తీసుకువచ్చాడు. మహంతుకి శత్రుఘ్నకి బాబా తమకు వారి యెడల ఒక ప్రేమ బాధ్యత ఉందని చెప్పారు ఈ నవ్యజీవితంలో, వారు—బిరేంద్ర, నారావాలా, ఎరచ్ మిస్త్రీ, కేకిదేశాయి, బుర్జోర్ వాచా — నిరంతరము బాబాని చూడడానికి అనుమతి కలిగిన వారు వారేనని వారితోనే సాంగత్యం పెట్టుకుంటున్నానని బాబా చెప్పారు తరువాత మహంతుని తమ రెండు ఆజ్ఞలు సరిగా పాటిస్తావా అని బాబా అడిగారు మహంతు వెంటనే పాటిస్తానని జవాబు చెప్పాడు. అతడు ఆందోళన పడకూడదని జూన్ 17 వ తేదీన

మరల షైదుకి వెళ్ళే ఆఖరి నిమిషం వరకూ విచారించరాదని, ప్రతి రాత్రి పరుండే ముందు నమ్మకంతోను నిజాయితీతోను దేవుని ప్రార్థించవలెనని, తన విధిని దేవుని చేతిలో వదిలేస్తున్నానని బాబా చెప్పారు మహంతు యీ రెండు ఆజ్ఞలను పాటించడానికి అంగీకరించాడు. విశ్వాసంతోను నిజాయితీతోను యీ రెండు ఆజ్ఞలను పాటిస్తే దేవుడు మహంతుయొక్క కోరిక నెరవేర్చకుండా ఉండడని తమకు అంతరంగంలో తోస్తోందని బాబా అన్నారు మహంతుతో బాబాకి నవ్యజీవితంలో సంబంధం యింక ఉండదని తెలియజెప్పి బాబా అతనిని వెళ్ళమన్నారు.

శత్రుఘ్నుకి అప్పజెప్పిన పనులు గురించి నీ భవిష్యత్తులో బాబాతో అతడు నవ్యజీవితంలో చివరివరకూ సంబంధం పెట్టుకోవచ్చునని బాబా చెప్పారు కానీ ఆ విధంగా బాబా అతనికి వాగ్దానం చెయ్యలేదు.

నవ్యజీవితంలో కొన్ని నూతనమయిన మార్పులు మే 1 వ తేదీనుంచి కలుగుతాయని వీటి వివరాలు ఏప్రెల్ 30 వ తేదీన యిస్తానని బాబా చెప్పారు. ఈ మార్పులు అమలులో పెట్టడానికి బాబా మెహెర్‌జీ నారిమన్‌లకు ఒక టెలిగ్రాం ఏప్రెల్ 14 వ తేదీన పంపించారు. ఆ ప్రకారంగా వారు విష్ణు పేరుతో రు 15000/- టెలిగ్రాం ద్వారా పంపించారు ఈ సొమ్ము బాబా యీ విధంగా ఖర్చుపెట్టారు

(1) అవసరనిధిగా స్త్రీల కాతాలో జమచేసినది రు 5000/- బాబా, మెహెరాల మరణం సంభవిస్తే కొన్ని అత్యవసరమయిన ఏర్పాట్లు చేయడానికి.

(2) I-B పథకం క్రింద ఉన్న సహచరులకు అప్పుగా యివ్వాలని రు 10,000/- ఉంచారు. ఇందులో యిదివరకే ఖర్చు పెట్టినది -

(a) రు 300 దేరాడూన్‌లో వైద్యవృత్తి మానేయమని చెప్పి డాన్‌కిన్‌కి యివ్వినది.

(b) I-B పథకం ఢిల్లీ బృందంవారు గురించి కొంత ముందు పని చేయడానికి ఎరచ్‌కి యిచ్చినది రు 200/-

(c) మంత్రీమాఫీలో యిళ్ళ స్థలం అమ్మడానికి శత్రుఘ్నుకి ఖర్చులు క్రింద యిచ్చినది రు 100/-

(d) టెలిగ్రాములకి చిల్లర ఖర్చులకి, వత్స్యపాల్ వెలజీతానికి అయినది రు 100/-

(e) మిగిలిన రు 9.300/- మే 1 వ తేదీనుంచి I–B పథకం వాళ్ళకోసం వాడేందుకు కాకాకు యివ్వడమయినది.

మే 1 వ తేదీనుంచి ఉండే ఆస్తులు – I–B పథకం దార్లకి

నగదు రు 9,360/-
మంత్రిమాఫీ ఆస్తి అమ్మగా వచ్చేనగదు.
I–C పథకంలో వాళ్ళు పంపితే వచ్చేది.

దీని క్రింద అప్పులు :—

రు 10,000/- అప్పు మళ్ళీ బాబాకి వీలయినపుడు తీర్చి వెయ్యవలసినది. అమ్మకం చేయగా వచ్చిన డబ్బు వీలయినపుడు బాబాకి యివ్వాలి. నూటికి 25 చొ॥న వారి సంపాదన స్త్రీలకి యివ్వాలి. ఆ మధ్యాహ్నం కూడా బాబా పురుష సహచరుల యింటికి వచ్చి విష్ణు ఆరోగ్యం గురించి అడిగారు అతను నీరసము అలసట తప్ప యింకేమీ లేదన్నాడు

ఏప్రెల్ 21, 22 తేదీలలో ఆకాశం మబ్బులు లేకుండా నిర్మలంగా ఉంది. అయితే మేం వేడి ఎక్కువ కాజొచ్చింది గాలి తక్కువగా వీస్తోంది సహచరుల సమావేశాలు రోజుకోమారు చేసి బాబా వారితో మే 1 తేదీనుంచి అమలులోకి వచ్చే మార్పుల గురించి చర్చచేసారు వారి అభిప్రాయాలు అనేకమార్లు అడుగుతూవచ్చారు. వారుకూడా స్వేచ్ఛగా అరమరిక లేకుండా చెప్పేవారు

బాబా ఆరోగ్యం బాగుపడినా ఆయనకు దగ్గు వదిలిపెట్టలేదు యింకా. ఈ సంగతి నీలూతో చెప్పారు. నీలు బాబాకి మందువ్రాసి యిచ్చాడు. దాని ప్రకారం డేరా డూన్‌లో మందు యిప్పించాడు సాయంత్రం కూడా చల్లగా లేదు. రాత్రిళ్ళు ఉదయాన్ని మాత్రం చల్లని గాలి వేసేది విష్ణుకి దగ్గు యింకా బాధిస్తూనే ఉంది. కాని అతని నీరసం తగ్గుతోంది.

ఏప్రెల్ 23 వ తేదీన తెల్లవారుతూనే చలి ప్రారంభమైంది. సూర్యుడు ఉదయించినా వెచ్చదనం యివ్వటం లేదు

ఈ చరిత్రలో వాతావరణ సంగతులు ఎందుకు వ్రాస్తున్నామంటే మండ్లి మాసి ప్రాంతంలో వాతావరణ స్థితి రోజుకొకరీతిగా మారుతూ ఉంటుంది నవ్య జీవితంలో బాబా వారి సహచరులు ఎన్నిబాధలు పడ్డారో తెలుస్తుంది. అంతేగాక యీకష్ట సుఖాల్లో ప్రేమికులు పాలుపంచుకోవాలి ఇది చదివితే బాబాతో పాటు చదువరులు కూడా అనుభవిస్తూన్నట్లు ఉంటుంది రాత్రంతా మంచు కురిసి వర్షం పడ్డట్లు నేల అంతా తడిసిపోయింది పచ్చగడ్డి నేలకూడా మంచుతో తడిసి జారుతోంది ఎక్కడ చూసినా తడే. గాలి వీచటం తగ్గిపోయింది

ఉదయాన్నే బాబా 6–30 గంటలకి సహచరుల వద్దకు వచ్చారు "చలి మనని వదిలిపెట్టడం లేదు నా ఆరోగ్యం కూడా అదుపులోకి రాలేదు" అన్నారు బాబా. అందరినీ కుశలప్రశ్నలు వేసారు విష్ణు వంట్లో ఎలాఉందని అడిగారు కొంచెం దగ్గు బలహీనత తప్ప బాగానే ఉందన్నాడతడు బాబా శత్రుఘ్నుకి కబురంపించి అతని ద్వారా ఆరోజు మధ్యాహ్నం చెఱకురసం అందరికీ యిప్పించారు. ఈ విందు కోసం నారావాలా, ఎరచ్ మిస్త్రీ, బస్తోర్‌వాలా, డాన్‌కిన్‌లు ఆహ్వానించబడ్డారు సంయుక్త పరగణాలలో చెఱకుపంట ఎక్కువగా ఉంది అయినా ప్రజలకి పంచదార కరువయింది బాబా ఉత్సాహంగా అందరికి స్వయంగా చెఱకురసం యిచ్చారు బాబా చిరునవ్వులతో చాలా ఆనందంగా ఉన్నారు ఒక గంట అయినతరువాత బాబా వారి కుటీరానికి వెళ్ళారు వచ్చిన అతిథులు కూడా సెలవు తీసుకున్నారు.

ఏప్రెల్ 24 వ తేదీ ఉదయం చలి చలిగా ఉంది. మంచు ఎక్కువగా కురిసింది మరునాడు ఆడడం కోసం శత్రుఘ్నుని బాబా బాడ్‌మింటన్ ఆడుటనే పరికరాలన్నీ సిద్ధంగా ఉంచమని బాబా కబురంపారు ఎరచ్ ఢిల్లీ వెళ్ళి ఒకవారం రోజులయింది అతనెవద్ద నుంచి ఉత్తరంగాని టెలిగ్రాం గాని రాలేదు.

25 వ తేదీ ఉదయం చల్లగా హాయిగా ఉంది సూర్యుడు ఉదయించినా వెన్నెల కాస్తున్నట్టుంది కాని అంతకంటె ఎక్కువ వెలుతురు గాని, వేడిగాని లేదు. అరణ్యాల చెట్లలోంచి సూర్యుడు మబ్బులో చంద్రుడులాగ దోబూచులాడుతున్నాడు. 7 గంటలకి సహచరుల యింటికి వచ్చారు బాబా. నీలూతోనూ, శత్రుఘ్నుతోను

బాడ్‌మింటన్ ఆడారు కొంతసేపు. 4 గంటలయేసరికి ఢిల్లీనుంచి ఎరచ్ వచ్చాడు. వచ్చి తను చేసిన పనంతా సవిస్తరంగా బాబాకి నివేదించాడు. బాబా మెహెర్‌జీ నారిమన్‌లకి యీ క్రింది టెలిగ్రాం యిప్పించారు – “సదాశివ్ పేరుకి ఆస్తులు బదలాయించవద్దు. ఒక నెల రోజుల్లో రెండు యిళ్ళ అమ్మితే రు 43000/- పసూలు కాకపోతే, యిళ్ళ వేలం వేసిగాని యితర విధంగా గాని అమ్మి సొమ్ము రాబట్టవలెను ఏర్పాటు దార్లకు చెప్పవలెను — బాబా ”

నారిమన్ 21 తేదీన వ్రాసిన ఉత్తరానికి బాబా యీ క్రింది విధంగా సమాధానం యిచ్చారు

“మెహెర్‌జీ నారిమన్‌లకు,

నారిమన్ ఉత్తరం అందింది మీకు యిచ్చిన యీ టెలిగ్రాం నకలు సదాశివ్‌కు పంపడమయింది సదాశివ్‌కి నేను 24 వ తేదీన మరాఠీలో వ్రాసిన ఉత్తరానికి నకలు నీకు అందియుండును పూనాయిళ్ళ అమ్మడానికి సదాశివ్ ఉండాలన్నారు కదా. అవి అమ్మడంలో పేచీ ఏమిటో నాకు అర్థం కాలేదు. ఇప్పుడు అతని పేరుకి యిళ్ళ మార్పించవద్దు అవసరమయితే సదాశివ్ సహాయం తీసుకుని ఆ యిళ్ళ రు 43000/- కి అమ్మివేయవలెను అతడు సహాయం చేయకపోతే అప్పుడు మీ యిష్టం వచ్చినట్లు చేసి మీ డబ్బు రాబట్టుకోవడానికి మీకు స్వేచ్ఛయిస్తున్నాను ” మీకూ నాకూ సదాశివ్‌కి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, టెలిగ్రాములు అన్నీ డైరీలో వ్రాయించడం ఆ విశేషాలు అందరికీ సర్క్యులర్ల ద్వారా పంపడం జరుగుతుంది

ఈ ఉత్తరం నకలు కూడా సదాశివ్‌కి పంపిస్తున్నాను ఈ ప్రకారం ఏర్పాటుదార్లకు చెప్పవలెను — బాబా”

మరునాడు ప్రొద్దున్న 7–30 గంటలకు ఎరచ్ ఢిల్లీలో చేసినపని గురించి చర్చించడానికి సహచరులందరూ సమావేశం కావాలని బాబా చెప్పారు ఈ సమావేశానికి డేరాడూన్ నుంచి డాన్‌కిన్‌ని కూడా రప్పించారు. ఈ సమావేశం ఉంది గనుక మరునాడు ప్రొద్దున్న ఆటలేదని శత్రుఘ్నకి బాబా కబురంపించారు.

26 వ తేదీ ఉదయాన్నే వాతావరణం చాలా ఉత్సాహజనకంగా ఉంది. క్రితంరోజున బాబా ఆటలేదని చెప్పినా యీ ఉదయం 6-30 గంటలకి క్రికెట్

లడడానికి అందరిని సిద్ధంగా ఉండమని చెప్పారు మంజ్రీమాఫ్ ఆస్తిలో సమతల ప్రదేశం లేదు ఎక్కువాను కాని ఎలాగోలాగు బాబా సహచరులతో ఒక గంట క్రికెట్ ఆడారు.

సరిగా 7–30 గంటలకి అందరూ సమావేశమయినారు బాబా ఎన్నో క్రొత్త మార్పులు, క్రొత్త సంగతులు చెప్పారు సహచరులంతా క్రొత్త పథకంలో షిర్డీనగరంలో ఏర్పాట్ల విషయంలో సహా అన్ని సంగతులు అందులో చర్చించారు. బాబా ఈ క్రింది తీర్మానాలు చేసారు –

(1) మే 1 వ తేదీన దేరాడూన్‌లో ఆఖరిసారిగా III పథకం ఎత్తేస్తే ముందు మంజ్రీమాఫ నుంచి నేను, నా సహచరులు భిక్షాటన చేస్తాము

(2) మే 1 వ తేదీ సాయంత్రానికి పథకాలు III, I–B సహచరులను క్రొత్త పథకంలో ఒక బృందంగా చేరమని ఆజ్ఞాపిస్తాను అందుచేత మే 1 వ తేది నుంచి డాన్ తన ఆస్పత్రిని మూసి వేస్తాడు.

(3) I, II పథకాలు ప్రకారం నిర్ణయించిన షరతులకు లోబడి సహచరులందరు క్రొత్త పథకంలో అన్ని కాలాలు ఉంటారు. ఇంక రోజూ ఆజ్ఞలేవీ యివ్వబడవు. అందులోని నిబంధనలు తప్ప నేను ఏ విషయంలోను కలుగ జేసుకోను.

(4) తాత్కాలికంగా ఏర్పాటు చేసిన బి.గ్రూప్‌లో వారి తరఫున మొదటి పథకాలు I–B, I–C, II సహచరుల తరుఫున భిక్షాటన, లంగోటీ, జిప్సీ జీవితాలు నేను గడుపుతాను నా తరఫున క్రొత్తజీవిత సహచరులందరు శ్రమపడతారు

(5) కైకోబాద్ దస్తూర్ నూతన జీవితంలో ఉన్నాడు అలా ఉంటూ క్రొత్త పథకం బృందంతో ఉండి భోజనం చేస్తూ ఉంటాడు. తనకి కావలసిన చిల్లర ఖర్చులకి డబ్బుకూడా అతనికి యివ్వబడుతుంది సహచరులు అతనిని ఏ పనీ చెయ్యమని కోరరు అతడు అతని మామూలు పని చేసుకుంటూ ఉంటాడు

(6) సదాశివ్‌పటేల్ క్రొత్త పథకం బృందంలో ఉంటాడు కాని అతన్ని అతని యింటిలో పూనాలో ఉండడానికి అనుమతిస్తున్నాను కాని క్రొత్త పథకం బృందం వారినుంచి అతని పోషణకి చిల్లర ఖర్చుకి పైకం ఏమీ తీసుకోడు.

అతనికి యిష్టం వచ్చినపుడు వచ్చి అతడు క్రొత్తపథకం బృందంవారితో చేరవచ్చును. అతడు వారికి దూరంగా ఉన్నంతవరకు మొదట్లో I-B పథానికి ఏర్పాటుచేసిన నియమాలు పాటిస్తూ ఉంటాడు.

(7) క్రొత్త పథకంలో యీ క్రింది 11 మంది ఉంటారు_కాకా, గుస్తాద్ జీ, ఎరచ్, పెండు, బైదుల్, నీలకంఠ్, విష్ణు, మురళి, డాన్కిన్, ఆలి, సదాశివ్‌పటేల్.

(8) క్రొత్త పథకం వ్యాపారంలో కేకిదేశాయి కూడా ఉంటాడు. అతడు చేసిన పనికి అతనికి నెలకి రు 300/- జూన్ 1 (1950) తేదీనుంచి యివ్వాలి అతడు మిగిలిన వాళ్ళతో కలిసి నివసించేదీ లేనిదీ అతని యిష్టం.

(9) మే 1, 1950 తేదీన క్రొత్త పథకం బృందం వారికి నేను రు 16,000/- అప్పుగా యిస్తాను అది సాధ్యమయినంత త్వరలో తీర్చెయ్యాలి

(10) ఈ రు 16,000/- మొత్తం నూతన జీవితపు సొమ్ములో మెహెర్ జీ నారిమన్‌ల వద్ద మిగిలిన దాంట్లోంచి, మంత్రిమాఫి అస్తులమ్మగా వచ్చిన డబ్బు లోంచి యివ్వబడుతుంది.

(11) ఈ 16,000/- తోను క్రొత్త పథకం వాళ్ళు బ్రతకాలి నేను యీ క్రింద చెప్పిన విధంగా వారివ్యాపారానికి పోషణకి ఏర్పాటు చేసుకోవాలి. ఈ నిబంధనలన్నీ రు 16,000 అప్పు పూర్తిగా తీర్చేస్తే రద్దు అయిపోతాయి తరువాత సహచరులు ఏ వ్యాపారం కావలిస్తే అది స్వతంత్రంగా స్వేచ్ఛగా చేసుకోవచ్చు; వారి పోషణ జరిగించుకోవచ్చు; వారి యింటి వ్యవహారాలన్నీ దిద్దుకోవచ్చు, అధిక సంఖ్యాకులు ఎలా చెప్తే అలాగ నడుచుకోవచ్చు.

(12) ఈ డబ్బు అంతా కాకావద్ద ఉంచుకుని దానికి ఖర్చుకి ఆదాయానికి లెక్కలు వ్రాస్తూ ఉండాలి అతడే యింటికి వ్యవహర్తగా (మానేజరుగా) ఉంటాడు.

(13) ఆలి వంటయింటి పని తీసుకుని కాకాకి సహాయం చేస్తూండాలి.

(14) గుస్తాద్ జీ ఎప్పుడూ ఏపనీ చేయనక్కర లేదు.

(15) ఎరచ్, బైదుల్ బాబా స్వంతపనిలోను స్త్రీల యొక్క పనిలోను ఉంటారన్నమాట వాళ్ళిద్దరికి నెలకి రు 50/- చొప్పున యివ్వాలి వాళ్ళకి ఎవరికయినా

పని లేనప్పుడు వ్యాపారం చెయ్యడంలో పెండు, సీలు, డాన్, మురళికి సహాయం చెయ్యాలి.

(16) నెలకి రు 50/- చొప్పున యిచ్చి ఆడవాళ్ళు తమ పనికోసం విష్ణుని పెట్టుకుంటారు.

(17) రు 16,000 అప్పులోనుంచి వ్యాపారానికి ప్రత్యేకంగా రు 5,000 మాత్రమే తీసుకోవాలి

(18) క్రొత్త పథకం వ్యాపారంలో నికరలాభంలో నూటికి రు 25/- లు ఆడవారికివ్వాలి మిగిలిన రు 75 లు అప్పు తీర్చే నిమిత్తం తప్ప యింక దేనికీ వాడకుండా పక్కని పెట్టెయ్యాలి. అప్పు తీర్చేయగానే నికర లాభంలో ఆడవారికి నూటికి రు 25 లు యివ్వనక్కరలేదు. లాభం అంతాకూడా మొదటి పథకం I-B సహచరులకే ఉంటుంది.

(19) I-C, II పథకాల సహచరులు నాకు పంపిన మొత్తాలలో నుంచి నేను నూటికి రు 25 లు ఆడవారికి యిస్తాను మిగతా రు 75 లు క్రొత్త పథకం నికరలాభం మొత్తానికి కలుపుతాను. ఇది అప్పు తీరేవరకు యిలా జరుగుతుంది అప్పు తీరిపోగానే యీ రు 75 లు మీకు యివ్వబడదు ఎందుచేతంటే అప్పుడు తాత్కాలికమయిన B గ్రూప్ పథకం మొదటి I-B పథకం క్రింద మారిపోతుంది.

(20) ఎరచ్, విష్ణు, బైదుల్ ఏరి జీతాలు, డాన్ ఆస్పత్రిలో సామాను అమ్మగా వచ్చిన మొత్తం కొత్త పథకం బృందం వారి వ్యాపార నికర లాభానికి అప్పు తీర్చేవరకు కలుపుతూ ఉండాలి.

(21) నాకు డబ్బు కావలసినపుడల్లా స్త్రీల వద్ద నుంచో లేక క్రొత్త పథకం బృందంవారివద్ద నుంచో ఎవరు సులభంగా యివ్వగలరో వారి దగ్గరనుంచి తీసుకుంటాను.

(22) మీరెవరూ పాత జీవితపు పారెవరితోను లేక I-C, II పథకాల కొత్త జీవితపు సహచరులతోను నా అనుమతి లేనిదే మాట్లాడటానికి వీలులేదు. వారిని కలుసుకో కూడదు, వారితో తిన్నగా గాని పరోక్షంగా గాని సంబంధం ఏదీ ఉంచుకో

కూడదు- ఈ క్రొత్త పథకం బృందం దానంతటది మొదటి I–B పథకంగా మారే అంతవరకు, అంటే రు 16,000/- అప్పు తీరేవరకు, ఈ ఆజ్ఞ ఢిల్లీ, డేరాడూన్ నివాసులకి, అలిగఢ్‌నివాసి అయిన తోడీసింగ్‌కి వర్తించదు.

(23) క్రొత్త పథకం వాళ్ళు మంజ్రీమాఫీ నుంచి మే 10 వ తేదీన ఢిల్లీకి వెళ్ళిపోవాలి. అయిదువేల రూపాయిలు పెట్టి నెయ్యి వ్యాపారం ప్రారంభించాలి. దానికి నవజీవన్ నెయ్యి వ్యాపారం అనే పేరుపెట్టాలి. దానికి తోడీసింగ్, ఢిల్లీ బృందంవారు (క్రైన్, కిషన్‌సింగ్, హరజీవన్ వగైరా) సహాయం చేస్తారు. ఈ వ్యాపారం కాకుండా మీరంతా ఏదయినా పెట్టుబడి అక్కర్లేని వ్యాపారాలు, నూతన జీవిత నిబంధనలకు లోబడి, చేసుకోవచ్చును.

(24) మే 10 వ తేదీ నుంచి మొదటి 3 నెలలకు క్రొత్త పథకం బృందం కేకి దేశాయి యింట్లో సర్దుకుని నివసిస్తారు.

(25) మే 10 వ తేదీనుంచి మొదటి 3 నెలలు నేను, స్త్రీలు, డేరాడూన్‌లో డాన్‌కిన్ ఖాళీచేసిన యింటిలో ఉంటాము.

(26) మే 10 వ తేదీన డాన్ తన సామానులన్నీ ఆస్పత్రి సామగ్రి సహితంగా ఢిల్లీ తీసుకుని వెళ్ళిపోవాలి

(27) నా పనికోసము బైదుల్, ఆడవారి పనికోసం విష్ణు, డేరాడూన్‌లో నా వద్దనే ఉంటారు ఒక నెల అయిన తరువాత బైదుల్ ఢిల్లీకి వెళ్తాడు. అప్పుడు అతని బదులు ఎరచ్ వచ్చి నా పని చేస్తూ ఉంటాడు

(28) ఆగస్టు 1, (1950) తేదీనుంచి స్త్రీలు నేను ఢిల్లీనుంచి వచ్చి రోటక్ రోడ్‌లో యింటిలో ఉంటాము అప్పటికి ఆ యింటిపని పూర్తవుతుంది. మా అందరి నివాసం కోసం అద్దె క్రొత్త పథకం సహచరులు యివ్వాలి ఆడవారు వారి భాగం క్రింద నెలకి రు 100 యిస్తారు.

(29) ఇంటికోసం, ఆడవారి యింట్లో గాని, పురుషుల యింట్లోగాని అవసరం వచ్చి నెయ్యి వెన్న వగైరా వాడితే దానికి మొహమాటం లేకుండా అందుకు అయిన డబ్బు ఖచ్చితంగా యిచ్చేస్తూ ఉండాలి.

(30) సహచరుల స్వంత చిల్లర ఖర్చులకి మే నెలనుంచి నెలకి రు 10లు చొప్పున ఒక్కొక్కరికి యివ్వాలి

(31) మే 1 వ తేదీనుంచి దినదినము డైరీ వ్రాయడం ఆపెయ్యాలి

(32) క్రొత్త పథకం సహచరుల స్వంత సామానులన్నీ మే 15 వ తేదీ నాటికి ఢిల్లీకి తీసుకురమ్మని పాడికి ఉత్తరం వ్రాస్తాను

(33) అపరోక్షంగా వచ్చినా, పరోక్షంగా వచ్చినా మీ బంధువులు స్నేహితుల ద్వారా మీకు సంక్రమించే వారసత్వాలు నాకు మీరు యిస్తారని ఆశిస్తాను. తెలియక మీకు వచ్చేవన్నీ కూడా మీరు నాకు యిచ్చెయ్యాలి.

(34) క్రొత్త పథకం సహచరులకు అప్పు తిరిగి సులభంగా యిచ్చెయ్యడానికి మొదటి ఆరు నెలలకి మొదటి ఖర్చు, తరువాత అయే నెలనెలా ఖర్చు యీ విధంగా నిర్ణయిస్తున్నాను—

రు 16,000/- అప్పు మొత్తం మే 1 వ తేదీన కొరాకి యిచ్చినది యీ విధంగా ఖర్చు పెట్టాలి—

| | |
|---|---|
| (1) మే 1 వ తేదీనుంచి అక్టోబరు నెలాఖరువరకు భోజనం ఖర్చు 6 నెలలకి | రు 2,585 |
| (2) విష్ణు, బ్రైమల్ (రేక ఎరచ్) లకు మే, జూన్, జూలై మూడు నెలలకు భోజనం ఖర్చుక్రింద యిదివరకే స్త్రీలకిచ్చినది | 300 |
| (3) ఆరు నెలలకి సేవకుని జీతం | 150 |
| (4) అందరికీ నెలకి తలొక రు 10/- చొ॥న చిల్లరఖర్చులకు | 660 |
| (5) ఆరునెలలకి దీపాలకి, నీళ్ళకి బిల్లులకి అంచనా | 300 |
| (6) దీపాలు, నీళ్ళ బిల్లులు కలిసి మకానానికి నెలకి రు 85/- చొప్పున ఆరునెలల అద్దె | 510 |

| | |
|---|---|
| (7) ఆక్రమించుకున్న తేదీ లగాయతు రోటక్ రోడ్డు యిల్లు అద్దె, — ఏజంటుకి కమిషను, బిల్లులవగైరా | 4,340 |
| (8) వ్యాపారానికి పెట్టుబడి నిమిత్తం | 5,000 |
| (9) మంత్రిమాఫి నుంచి ఢిల్లీకి తరలింపు ఖర్చు | 1,000 |
| (10) మెహెరాబాద్ నుంచి సహచరుల సామానులు తేవడానిక్కి | 1,000 |
| (11) అవసరాలనిమిత్తం — మిగిలిన సొమ్ము | 150 |
| రు | 16,000 |

(35) ఈ క్రింది మొత్తాలు, అప్పు త్వరగా తీర్చే నిమిత్తం, వేరే పెట్టియ వలసినవి —

(a) ఎరచ్, విష్ణు, బైదుల్‌లకు నెలకి రు 150 చొప్పున

(b) ఆగస్టు 1950 నుంచి ఆడవారు అద్దెకింద యిచ్చినది నెలకి రు 100/-

(c) కొత్త పథకం వారి నికరలాభాలలో నూటికి 75 వంతులు.

(d) I-C, II పథకాలలోని సహచరులు పంపినదాంట్లో నూటికి 75 వంతులు.

(e) కేటాయించిన మొత్తాలలోనుంచి – అద్దెకి, తరలించడానికి, సామాను తేవడానికి ఖర్చులకి, — పొదుపు చేసినది, డాన్‌కిన్ సామాను అమ్మగా వచ్చినది

(36) తాత్కాలికంగా గ్రూపు పథకం పనిచేసినంతవరకు, కొత్త పథకం సహచరుల బసలు పథకం షరతులు పాటించడంలోను, నిబంధనలు పాటించడంలోను లోటుపాట్లు నాకు తెలియజేస్తే అప్పుడు ఎవరివల్ల లోపం ఉందో ఆ సహచరుని విడిచి వెళ్ళిపొమ్మంటాను అప్పుడతడు పాత జీవితంలోనుంచి కొత్తజీవితంలో నుంచి తొలగిపోయినట్లు భావించాలి

(37) హరజీవన్‌లాల్, కైన్, కిషన్‌సింగ్, తోడీసింగ్‌లు కొత్తపథకం లోని వారితో సంబంధం కలిగి ఉండడానికి నేను అనుమతించాను – వారికి సహాయం చేయవచ్చునని ఒక షరతుమీద ఒప్పుకున్నాను – ఈ మిత్రులు I–C, II నూతన జీవిత పథకాలవారితో ఎటువంటి సంబంధము కలిగి ఉండరాదు వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు పనికిరావు, వారిని కలుసుకో కూడదు అనేదే ఆ షరతు

(38) కొత్త పథకం సహచరులు హరజీవన్ లాల్, కైన్, కిషన్‌సింగ్, తోడీసింగ్‌లు పై షరతు పాటిస్తేనే వీరివద్ద ఏ సహాయమయినా తీసుకోవచ్చును

(39) I–C, II పథకాల సహచరులు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరప డానికి వీలులేకపోయినా వారు పొదుపుచేసి పంపగలిగే మొత్తాలు నాకు పంపాలి. నూతన జీవిత పర్యులర్లు నాకు యీ క్రింది చిరునామాకు పంపాలి.—

మెహెర్‌బాబా

C/o నారావాలా,

36 లిట్టన్ రోడ్, డేరాడూన్.

మరల మార్పు వ్రాసేవరకు యిక్కడకే పంపవలెను.

(40) అవసరమయితే కొత్త పథకం సహచరుల తరఫున డాన్‌కిన్ డేరా డూన్‌లోనే డాక్టరుగా ఉండవచ్చును.

ఈ అంశాలన్నీ నిర్ణయించిన తరువాత కొత్త పథకం అమలు జరపడం కోసం బాబా కేకి దేశాయికి ఢిల్లీకి యీ క్రింది టెలిగ్రాం పంపించారు.—

"హరజీవన్ పార్టీవారితో రోటక్ రోడ్ యిల్లుగురించి మే 1 వ తేదీన నిశ్చయం చేస్తానని చెప్పవలెను అందుచేత ఏజంటయిన సర్దార్‌జీతో ఆ విధంగా ఏర్పాటు చేయవలెను. హరజీవన్‌కి, కైన్‌కి, తోడీసింగ్ కిషన్‌సింగ్‌లకి 30 వ తేదీ ఆదివారం ఉదయం యిక్కడికి (మంజ్రిమాఫీకి) వచ్చి అదే సాయంకాలం ఢిల్లీకి తిరిగి వెళ్ళవచ్చునని చెప్పవలెను. వాళ్ళతో చెప్పి నీవు (కేకి దేశాయి) వెంటనే యిక్కడికి వారం రోజులుండేలా రావలెను —బాబా"

దానిమీద సహాదయం అభిప్రాయాలు చెప్పారు. వాదోపవాదాలు జరిగాయి. అన్నీ బాబా పరిష్కారం చేసేసారు కాని తగువు రావడానికి ఆస్కారం ఉన్న అంశాలు మాత్రం అపరిష్కృతంగా అప్పటిమట్టుకు వదిలేసారు ఆరోజు లగాయతు నెలాఖరిదరకు రోజుకి రెండుమార్లు అందరినీ సమావేశం అవాలని బాబా చెప్పారు. చివరి నిశ్చయం మే 1 వ తేదీన చేస్తానని బాబా అన్నారు. 10–30 గంటలకి సమావేశం ముగిసింది. బాబా కాక, డాన్‌కిన్, నీలు, విష్ణు, పెండు, ఎరచ్, గుస్తాద్‌జీ బైదుల్, మురళి, కైకోబాద్, ఆలీ, కాకాలు సమావేశానికి హాజరయారు

అందరికీ ఉద్రేకాలు మనోవికారాలు కలిగాయి అందరూ గంభీరంగా ఉన్నారు క్రితం రోజు మధ్యాహ్నం బాబా యీ క్రింది విధంగా కేకి దేశాయికి (ఢిల్లీ) యింకో టెలిగ్రాం యిచ్చారు.

"మంత్రిమాఫి బాపతు దస్తావేజులన్నీ తీసుకురా – బాబా" దానితో సమావేశం ముగిసింది ఆఖరి సమావేశం ఏప్రెల్ 30 వ తేదీన ఉంటుందని బాబా చెప్పారు. అప్పటికి ఎలిజబెత్ నుంచి నిశ్చయమయిన సమాచారం అందుతుంది. అప్పటికి హరజీవన్, క్రైన్, కిషన్ సింగ్, తోడీసింగ్, ఢిల్లీనుంచి ఎప్పుడు వస్తారో కూడా తెలుస్తుంది.

27 వ తేదీ (ఏప్రెల్, 1950) ఉదయాన వాతావరణం నిన్నటిలాగే బాగా ఉందని బాబా నీలు, శత్రుఘ్నలతో బాడ్‌మింటన్ రెండు ఆటలాడారు. బాబా చెప్పిన ప్రకారం కేకి నారావాలా, ఎరచ్ మిస్త్రీ, బర్జోర్ చావా, 8 గంటలకు వచ్చారు బాబా స్త్రీ సహచారిణులతోను, పురుషులతోను సహ మంత్రిమాఫి నుంచీ మే 10 వ తేదీన వెళ్ళిపోతున్నామని వారితో చెప్పారు. సహచరులలో విష్ణు, బైదుల్ యిక్కడ యింకా కొన్నాళ్ళు ఉంటారు బాబా స్త్రీలతో డాన్‌కిన్ బంగళాలో ఉంటారు డేరాడూన్‌లో. డాన్‌కిన్ పురుష సహచరులతో తిన్నగా ఢిల్లీ వెళ్తాడు ఈ నెలాఖరుకి మంత్రిమాఫి ఆస్తి అమ్మివేస్తానని బాబా చెప్పారు. విష్ణుకి బైదుల్‌కి వాళ్ళుండడానికి డాన్‌కిన్ యింటికి దగ్గిరగా ఏదయినా యింకో యిల్లు చూడమన్నారు కేకీ నారావాలా మొద లయినవారు బాబా చెప్పినమాటలు విన్నాక డేరాడూన్ తిరిగి వెళ్ళారు.

నిన్నటిరోజున నజా రెండు తప్పులు చేసింది బాబా ఆమెను ఆగస్టులో బొంబాయికి పంపించేస్తానని సూచించారు. ఆమె అందుకు అభ్యంతరం చెప్పక

పోయినా యింకా అక్కడ ఉంటానని, వంటపనిపి ఎలాగూ చేయాలి గనుక ఆ పని తనే చేస్తానని ఆమె విన్నవించింది ఇలా చెప్పడం బాబా ఆజ్ఞలకి వ్యతిరేకం అదీకాక ఏమంటుందో తనకే తెలియకుండా యిద్దరు పాత జీవితపు వారిగురించి ఏదో వార్త చెప్పింది. ఆమెకు తెలియకుండా చేసిన యీ రెండు తప్పులకు బాబా ఆమెను క్షమించారు. అలాంటి తప్పులు యికముందు జరుగ కూడదని బాబా ఆమెను హెచ్చరించారు.

బాబా కేకి దేశాయి ఢిల్లీనుండి వచ్చాడా అని అడిగి, రాలేదని తెలిసాక యింకా ఎందుకు రాలేదు అని బాబా అనుకున్నారు ఉదయం సాయంత్రం సహచరుల సమావేశాలు జరిపారు ఈ సమావేశాలలో ఏమి జరిగినదీ డైరీలో వ్రాయించి విషయాలన్నీ ఏప్రెల్ 30 వ తేదీన గాని మే 1 వ తేదీనగాని పూర్తిగా తెలియజేస్తానన్నారు. సహచరుల మనస్సులలో కలిగిన అలజడిని బట్టి ఆ సభలలో ఎంత తీవ్రంగా చర్చలు సాగాయో తెలుసుకోవచ్చును.

బాబా 28 ఏప్రెల్ (1950) ఉదయాన 6 గంటలకి సహచరుల నివాసానికి వెళ్ళారు. ఒక అరగంట అయాక ఒక క్రికెట్ బాట్ తీసుకొని శత్రుఘ్న వచ్చాడు. సరిగా 6-30 గంటలకు శత్రుఘ్న రాగానే క్రికెట్ ఆట ఆరంభించారు బాబా బాటింగు చేస్తూ అన్నివైపులకు బంతిని కొడుతూ అద్భుతంగా ఆడుతున్నారు నేల సరిగా లేనందున ఆటస్థలంలో అందరూ జాగ్రత్తగా నిలబడి ఆడుతున్నారు. క్రికెట్ బాల్‌కోసం పరిగెత్తడం అదొక కష్టమైన పని అయింది బాబా కొడుతూంటే తమాషాగా ఉంది. 8 గంటలకి క్రికెట్ ఆట ముగిసింది. అతని జీవితము, వ్యవహారాల గురించి బాబా శత్రుఘ్నతో చాలా సేపు మాట్లాడారు బాబా మాటలు నూటికి నూరుపాళ్ళు వింటానని శత్రుఘ్న ధృవపరిచాడు ఏమీ సంకోచం లేకుండా ఆయన చెప్పినట్లు చేస్తానన్నాడు బాబా యీ మాటవిని చాలా సంతోషించారు.

ఉదయం 9-30 గంటలకి ఢిల్లీనుంచి కేకి దేశాయి వచ్చాడు రాగానే ఎరచ్ ఆ సంగతి బాబాకి చెప్పాడు బాబా యింటికి వచ్చారు. కేకి రావడానికి ఎందుకు ఆలస్యమయిందో బాబాకి వివరించి చెప్పాడు ఢిల్లీలో జరిగిన పని గురించి కేకి సవిస్తరంగా బాబాకి చెప్పాడు ఈ సంగతులేమిటో ఆ పని ఏమిటో అంతా మే 1 వ తేదీన తెలియజేస్తానన్నారు బాబా.

మధ్యాహ్నం సహచరుల సమావేశం అయినపుడు బాబా కేకీని కూడా రమ్మని కూర్చోమన్నారు. అతనికి కూడా వారి చర్చలలో పాల్గొనే అవకాశం యిచ్చారు ఒక గంటసేపు చర్చలు జరిగాయి తరువాత బాబా వారి యింటికి వెళ్ళారు

29 వ తేదీ పెందరాళే, టీ తీసుకోగానే, ఉదయం 5-30 గంటలకే బాబా సహచరుల నివాసానికి వెళ్ళారు. డాన్‌కిన్ యిల్లు చూడటానికి ఒక స్టేషన్ వాగన్‌లో బాబా స్త్రీలతో దేరాడూన్ వెళ్తామని సహచరులతో చెప్పారు డాన్ యింటి దగ్గరనుంచి బాబా వారితో రెండు మైళ్ళున్న నిరంజన్‌పూర్ వెళ్తారు 1946 సం॥ లో బాబా నిరంజన్‌పూర్‌లో కొన్నాళ్ళున్నారు ఆ బంగళాను ఒకసారి చూద్దామని స్త్రీలు తమ అభిలాషను వ్యక్తపరిచారు ఆ ప్రకారం 6 గంటలకి మంజ్రీమాఫిలో బయలుదేరి దేరాడూన్‌లోని డాన్ బంగళాకు వెళ్ళి అక్కడనుంచి నిరంజన్‌పూర్ వెళ్ళారు తిరిగి అందరూ మంజ్రీమాఫికి 10 గంటలకి వచ్చేసారు. ఇదివరకు ఉన్న యిల్లు మళ్ళీ చూడటానికి స్త్రీలు సంతోషపడ్డారు.

బాబా శత్రుఘ్నకి కబురు పంపించి అతడు రాగానే మంజ్రీమాఫీ ఆత్త కొనేవాడెవడయినా దొరికాడా అని అడిగారు. అందుకోసం శత్రుఘ్న శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నానని చెప్పాడు బాబా కేకి దేశాయిని పిలిచి ఢిల్లీలోని క్రైన్‌కి, కిషన్‌సింగ్‌కి, హరజీవన్‌లాల్‌కి, తోడీసింగ్‌కి ఆయన బాబా చెప్పినట్లు సరిగా చెప్పావా అని అడిగారు. వారంతా మరునాటి ఉదయానికి ఢిల్లీ నుంచి రావాలి కేకి చెప్పానన్నాడు బాబా అతనిని మరునాడు ప్రొద్దున్న సైకిల్ మీద స్టేషన్‌కి వెళ్ళి వాళ్ళని తీసుకురమ్మన్నారు. మరునాడు ఉదయం 7 గంటలకి అయ్యే సమావేశానికి రమ్మని డాన్‌కిన్ కి విష్ణుచేత కబురంపారు బాబా ఆ సమావేశానికి క్రైన్, కిషన్ సింగ్, హరజీవన్‌లాల్ తోడీసింగ్ కూడా ఉంటారు III పథకం సహచరుల గతి యేమిటో ఆ సమావేశంలో తెలిపోతుంది వివిధరకాల భావ సంచలనాలు, రకరకాల ఆలోచనలు, ఊగిసలాడే మనోవృత్తులూ, ఆశానిరాశలు, క్రొత్త మార్పుల గురించిన క్రొత్త ఆలోచనలు సహచరుల మనస్సులను ఆక్రమించుకున్నాయి, అందోళన పరుస్తున్నాయి

ఆ సాయంకాలం చల్లగా హాయిగా ఉంది శుక్లపక్ష చంద్రుడు వెన్నెల కురిపిస్తున్నాడు బాబా ఇదివరకే ఆజ్ఞాపించినట్లు సహచరులంతా ఆరాత్రి తెల్లవారు

జామున 4 గంటలకే లేవాలి ఆ సమయానికి సహచరుల యింటికి చుట్టూ చీకటిగానే ఉంది. ఉన్న వెలుతురు కాస్త ఆకాశంలోని నక్షత్ర కాంతి వల్లనే వస్తోంది ఆ సమయంలో ప్రాతర్నక్షత్రం కాంతివంతంగా ఉంది. లక్షలాది తారల్లో అదే ప్రకాశవంతంగా బాగా కనిపిస్తోంది చీకట్లో వెళ్ళే పాంథులకి అదే కాస్త దారి చూపుతోంది.

ఏప్రెల్ 30 (1950) వ తేదీన 5-30 గంటలకి బాబా సహచరుల నివాసానికి వచ్చారు. వచ్చి వారితో గుస్తాద్ జీ సోచరుని కుమారుడు ఆర్. ఎస్. హంసోటియా గురించి చర్చించారు రుస్తుంకి యీ క్రింది ఉత్తరం చెప్పి వ్రాయించి పోస్టులో వేయించారు బాబా.

మాంద్రీమాఫి, 30-4-50.

ప్రియమైన రుస్తుంక్,

మే 1వ తేదీనుంచి III పథకంలోని సహచరులను బాబా I-B పథకంలో చేరవున్నారు. అందుచేత III పథకంలో ఎవరూ ఉండరు గనుక నీవు బాబా ను చేరడమనే ప్రశ్నే ఉండదు కానీ నీవు నిజాయితీ తో నవ్యజీవితంలో చేరాలని ఉంటున్నావు, గనుక నవ్య జీవితపు 5 వ సర్క్యులర్ ప్రకారం నీవు నవ్యజీవితంలో చేరి జీవించవలెను. నీవు బాబాను చూడడానికి వీలులేదు నీవు ఆయనకి ఉత్తరం కూడా వ్రాయడానికి వీలులేదు నీవు ఎక్కడయినా ఉండి నీవు ఏ పనయినా చేయవచ్చును పైన చెప్పిన సర్క్యులర్ లో వర్ణించినట్లు నవ్యజీవితం గడపాలి.

—బాబా ఆజ్ఞ ప్రకారం వ్రాసింది ”

ఉదయం 6-30 గంటలకి శత్రుఘ్న సహచరుల నివాసానికి వచ్చి ఒక గంటసేపు వారితో “గిల్లిదండా” (గూటీబిళ్ళ) ఆడాడు.

పూనా నుంచి సదాశివ్ పటేల్ ఎరచ్ పేరుకి బాబాకి ఒక ఉత్తరం వ్రాసాడు ఆ ఉత్తరం చూసాక బాబా ఆయనకీ సదాశివ్ పటేల్‌కీ మధ్య ఉన్న వ్యవహారం తెచ్చేద్దామనుకున్నాడు సంగతులన్నీ అర్థం చేసుకోవడానికి బాబా ఆదీ (సీ) ని సదాశివ్ తో మాట్లాడ మన్నారు పూనాలో అతనిని కలుసుకుని చర్చించి అన్ని సంగతులూ టెలిగ్రాం ద్వారా మే 9 వ తేదీలోగా తెలియజేయమన్నారు.

బాబా నీలూని యీక్రింది విధంగా ఆదీకి ఉత్తరం వ్రాయమన్నారు–

మంజిమాపి, 30–4–50

**1–C** పథకంలో సహచరుడైన ఆదీ కె ఇరానీకి,

నా కోసం ఎరచ్‌కి సదాశివ్ వ్రాసిన ఉత్తరాల నకళ్ళు యిందుతో పంపుతున్నాను అతడు 26 వ తేదిన వ్రాసిన ఉత్తరం లో తన యిళ్ళు తనకు మెహెర్‌జీ, నారిమన్‌ల చేతను యిప్పించెయ్యమని వ్రాసాడు. అతడు వారికి రు 43,000/– చెల్లించే ఉద్దేశం లేనట్లు వ్రాసాడు ఇంక నాతో సంబంధం ఉంచుకోవడం యిష్టంలేదని వ్రాసాడు సదాశివ్ అభిప్రాయమేమిటో నేను సరిగా అర్థం చేసుకోలేదను కుంటాను. అందుచేత సదాశివ్‌ను నీవు కలుసుకుని యీనకిళ్ళలోని అంశాలు అతనికి వివరించి చెప్పమని, నీవు అతనికి యేమి కావాలో మెహెర్‌జీ నారిమన్‌లకు యివ్వవలసిన పైకం సంగతి ఏం చేయవలెనని యున్నాడో నాతో సంబంధం కలిగి ఉండడం గురించి అతని ఉద్దేశమేమిటో నీవు బాగా అర్థం చేసుకుని నాకు స్పష్టంగా యీ విషయాలన్నీ 1950, మే 9 వ తేదీకి ముందు టెలిగ్రాం ద్వారా తెలియజేయమని నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను.

24, 25 తేదీల నా ఉత్తరాల ప్రకారం సదాశివ్ పేరుకి యిల్లు తిరిగి బదిలీ చేయ వద్దని కోరుతున్నాను. ఒక నెల లోపుగా సదాశివ్‌ని మెహెర్ జీ నారిమన్ లకు డబ్బు యివ్వవలసిందిగా కోరుతున్నాను అందుచేత మార్కెట్ ధరలు చూడకుండా సదాశివ్ యిళ్ళు అమ్మేసి రు 43,000/– ఒక నెల లోపుగా వారికి యిచ్చివేయాలి.

26 వ తేదిన సదాశివ్ వ్రాసిన ఉత్తరం అర్థరహితంగా ఉంది. ఆ ఉత్తరం నేను సరిగా అర్థం చేసు కున్నానో లేదో–నీవు అతనితో మాట్లాడడానికి నాకు అభ్యంతరం లేదు. ఏది ఎలాగయినా నీవు అతడు యిళ్ళు అమ్ముతాడా, అమ్మడా, రు 43,000/– వాళ్ళకి యిస్తాడా, యివ్వడా యీ విషయాలు స్పష్టంగా తెలియజేయాలి. నాతోసంబంధాలు తెంచుకుంటాడా సదాశివ్ ? ఈ సంగతి కూడా కనుక్కొని తెలియజేయి మే 9 వ తేదీలోగా నాకు జవాబు అందాలి.

(1) నా అంతట నేను నవ్యజీవితంలో నుంచి సదాశివ్‌ని పంపించెయ్యడం నా కోరిక కాదు. కాని అతడు తనంతతానుగా నాతో సంబంధం తెంపుకుంటానంటే

నేను సంకోచం లేకుండా వ్యక్తిజీవితం నుండి పాత జీవితం నుంచి తొలగిపొమ్మని అతన్ని ఆజ్ఞాపిస్తాను.

(2) సదాశివ్ యిల్లు అమ్మడం అంటే అతడు తన శాయశక్తులా అందు కోసం ప్రయత్నం చేసి మెహెర్‌జీ నారిమన్‌లకి ఆ కొనుక్కునేవారికి దస్తావేజులు వ్రాయించి పెట్టాలి.

(3) ఇల్లు అమ్మడంలో మెహెర్‌జీ నారిమన్‌లు సదాశివ్ యొక్క సహాయం పొందకపోతే 25 వ తేదీన నేను యిచ్చిన టెలిగ్రాం, వ్రాసిన ఉత్తరం ప్రకారంగా చేయాలి.

ఈ విషయాలు గమనించు.

సదాశివ్‌కి యీ ఉత్తరం చదివి వినిపించు.

బాబా చెప్పి వ్రాయించినది —"

ఈ ఉత్తరంతో సదాశివ్ 26 ఫిబ్రవరి 1950 ని వ్రాసిన మరాటీ ఉత్తరం నకలు, 1 మార్చిని బాబా అతనికి వ్రాసిన ఉత్తరం నకలు, సదాశివ్ మార్చి 6 వ తేదీన "మీరు 1 వ తేదీన వ్రాయించిన ఉత్తరం అందినది. మెహెర్‌జీ నారిమన్‌లకు పూర్తిసొమ్ము చెల్లించడానికి ఏర్పాటు చేస్తున్నాను" అని యిచ్చిన టెలిగ్రాం నకలు, పై ఉత్తరాలు టెలిగ్రాములు అయాక తరువాత బాబా ఏప్రిల్ 20 వ తేదీ వరకు (అంటే ఒకటిన్నర మాసాలపైన) వేచి ఉన్నారు అంతవరకు మెహెర్‌జీ నారిమన్ లకు డబ్బు యిచ్చే ఏర్పాటు సదాశివ్ చేయనందున సదాశివ్‌కి ఏప్రిల్ 20 వ తేదీన యీ టెలిగ్రాం యిప్పించారు.

"ఒక నెలలోపున రు 43,000/- మెహెర్‌జీ నారిమన్‌లకు యివ్వాలని III పథకంలోని సహచరుడవుగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను"

తరువాత 24 వ తేదీన బాబా సదాశివ్‌కి మరాటీలో ఒక ఉత్తరం వ్రాయించారు ఇదిగాక మెహెర్‌జీ నారిమన్‌లకు ఏప్రిల్ 25 వ తేదీన ఒక ఉత్తరం వ్రాయించి ఒక టెలిగ్రాం యిచ్చారు.

టెలిగ్రాం —సదాశివ్ పేరుకి ఆస్తులు బదలాయింపబడ్డ రెండు యిళ్ళ అమ్మకం ద్వారా నెలలోపల రు 43,000/- తిరిగి వసూలు చేయకపోతే అప్పుడు ఆ హొమ్ము వేలంద్వారా గానీ యితర విధంగా గాని వసూలు చెయ్యండి.

ఉత్తరం :—సదాశివ్ పేరుకి యిళ్ళ బదలాయించకండి కానీ అవసర మయితే సదాశివ్ సహాయంతో యిళ్ళ రు 43,000 వేలకి అమ్మడానికి ప్రయత్నించండి సదాశివ్ సహాయం చేయకపోతే మీ యిష్టం వచ్చినట్లు మీ బాకీ పూర్తిగా వసూలు చేసుకోవడానికి మీకు స్వేచ్ఛ యిస్తున్నాను ఈ టెలిగ్రాముకీ ఉత్తరానికీ నకళ్ళు సదాశివ్‌కి పంపించబడ్డాయి. సదాశివ్‌యొక్క 28, ఫిబ్రవరి ఉత్తరంమీద ఆధారపడి బాబా యిళ్ళు అతనిపేర వ్రాసి యివ్వద్దని ఆజ్ఞ యిచ్చారు. పై టెలిగ్రాం ఉత్తరం అందకుండానే సదాశివ్ బాబాకి 26 ఏప్రెల్‌న ఆందేలా ఒక ఉత్తరం వ్రాసాడు బాబా వ్రాసిన 31 వ ఏప్రెల్ ఉత్తరం ప్రకారం ఆవీ (శ్రీ) సదాశివ్‌ను కలిసి మాట్లాడాడు తరువాత మే 6 వ తేదీన దాని ఫలితం యీ విధంగా బాబాకి టెలిగ్రాం యిచ్చాడు—

"మొదట్లో మీకు చేసిన వాగ్దానం ప్రకారం రు 43,000/- ప్ను బదిలీకి అయిన ఖర్చులున్నూ బ్యాంకు ద్వారాగాని ఒమ్మేసిగాని మీకు రెండునెలల లోపల పంపుతానన్నాడు పటేల్ కానీ మెహెర్‌జీ నారిమన్‌లు తనకు బదిలీ ఖర్చులు యిప్పుడే యివ్వాలంటున్నాడు మెహెర్‌జీ నారిమన్‌లు వేరే యీ ఇళ్ళ అమ్మేలా ఉంటే సదాశివ్ అభ్యంతరమూ పెట్టడు, సహాయమూ చేయడట. ఎలా ఉన్నా సదాశివ్ పాతజీవితపుది గాని క్రొత్త జీవితంలో గాని యింక సంబంధం ఉంచుకోనన్నాడు అయినా యీ సంబంధం తెంపుకోవడం గురించి యింకో అవకాశం యివ్వించమని నా అభిప్రాయం—ఆదీ".

దీనిమీద బాబా యీ క్రింది నిర్ణయం తీసుకున్నారు —"నేను నూతన జీవితంలోని సదాశిఫ్ యొక్క తప్పులన్నీ మన్నిస్తున్నాను అతనిని నేను నొప్పించి నట్లయితే నన్ను క్షమించమని కోరుతున్నాను. పాతజీవితం లోను క్రొత్త జీవితం లోను నాతో సంబంధం వదులుకోవాలని సదాశివ్ యొక్క కోరికను నేను అంగీ కరిస్తున్నాను.

ఆ సాయంకాలం బాబా III వ పథకం సహచరులస్థితి గురించిన అంతిమ నిశ్చయం తీసుకున్నారు. III పథకంలోని సహచరులందరు క్రొత్త పథకం బృందంలో చేరాలని యీ పని మరునాడు సాయంత్రం 5 గంటలకి జరగాలని బాబా ఆజ్ఞాపించారు. ఈ క్రొత్త పథకం బృందం ప్రారంభించడానికి దారితీసిన సంఘటనలు అందుకు కారణాలు రేపు (1-5-50) వివరించి చెప్తారు బాబా

30 వ తేదీన ఎలిజబెత్ నుంచి ఒక కేబిల్ వచ్చింది జూలై (1950) నెలలో బాబా పడమరకు వెళ్ళడం లేదని నిశ్చయించుకున్నారు కాని జూలై (1951) నెలాఖరుకి తప్పక వెళ్తానన్నారు. బాబా చెప్పిన ప్రకారం ఢిల్లీ నుంచి హర్‌జీవన్‌లాల్. కైన్, కిషన్‌సింగ్, తోడీసింగ్‌లు 30 ఏప్రెల్, (1950) తేదీ మధ్యాహ్నం 12 గంటలకి వచ్చారు అప్పుడు వారికి క్రొత్త పథకం ఎరచ్ వివరించి చెప్పాడు ఇది జయప్రదంగా అమలు జరిగేందుకు క్రొత్త పథకం సహచరులకు హరజీవన్‌లాల్, కైన్. కిషన్‌సింగ్, తోడీసింగ్‌లు సహాయం చేస్తామని సంకోచం లేకుండా వాగ్దానం చేసారు డబ్బు, బట్టలు, ఆహారము తప్ప మిగిలిన సహాయం వారు అన్నివిధాలా చేయాలని బాబా నొక్కి చెప్పారు ఈ క్రొత్త పథకం సహచరులకోసం వాళ్ళు తమ జేబులోంచి ఒక్కపైసా కూడా ఖర్చు పెట్టకూడదన్నారు బాబా.

జూలై, (1950) నెలాఖరుకి మంత్రిమాఫీ యిళ్ళ అమ్మకం కింద సొమ్ములో రు 7000 బాబాకి యిస్తానని శత్రుఘ్న వాగ్దానం చేసాడు బాబా డబ్బు యీ రోజునే కావాలన్నారు గనుక హరజీవన్‌లాల్ శత్రుఘ్నకి రు 7000 యిస్తానన్నాడు. డబ్బు అందగానే తనకు యివ్వవచ్చునని. హరజీవన్‌లాల్ యిచ్చిన యీ రు 7000 లో నుంచి రు 5000 తోడీసింగ్‌కి క్రొత్త పథకం సహచరుల ఢిల్లీ వ్యాపారం నిమిత్తం యిచ్చారు హరజీవన్‌లాల్‌కి రు 4,340 రోటక్‌రోడ్ యింటి అద్దె క్రింద యివ్వమని యిచ్చారు అందులోనే యిల్లు అద్దెకు యిప్పించినందుకు కమీషన్, ఆరు నెలలకి ఎలక్ట్రిసిటీ, నీళ్ళ బిల్లులకు కూడా యిచ్చారు. సహచరులందరు ఉండగా బాబా హరజీవన్‌లాల్, కైన్, కిషన్‌సింగ్, తోడీసింగ్‌లతో దీర్ఘంగా మాట్లాడారు. ఎలాగయితేనేం వారు బాబా యొక్క నూతన జీవితంతో క్రొత్త పథకం వారికి సహాయంచేసే అంతవరకు సంబంధం కలుగజేసుకున్నారు బాబా మరల వారితో చెప్పారు - ఢిల్లీలో బాబాను చూడకూడదని, ఆయనను కలుసుకోడానికి ప్రయత్నం చేయకూడదని, బాబా వారికోసం రమ్మని కబురు పంపితే తప్ప. అని

స్పష్టం చేసారు కానీ వారు క్రొత్తపథకం సహచరులను ఎప్పుడయినా చూడవచ్చు. ఇప్పుడు వారు బాబాను చూడగలిగినందుకు సంతోషించారు వారి హృదయాలు బాబా ప్రేమతో నిండిపోయాయని వారిని చూడగానే తెలుస్తుంది ఆ రోజు మధ్యాహ్నం ఆలస్యంగా వారు మంజ్రిమాఫినుంచి ఢిల్లీకి పయనమై వెళ్ళారు.

మే 1 వ తేదీన సహచరులందరు సరిగా 4 గంటలకు లేచారు మామూలుగానే ఆకాశంలోని అసంఖ్యాకమయిన నక్షత్రాలలో ప్రాతర్నక్షత్రమే బాగా ప్రకాశిస్తోంది పశ్చిమాన చంద్రుడు వెలవెలబోయి అస్తమిస్తున్నాడు ఉత్తరాన్నుంచి చల్లని గాలి వీచుతూ చాలా హాయిని కలిగిస్తోంది తూర్పుదిక్కున దూరాన అప్పుడే కొంచెం వెలుగు తోస్తోంది అరుణోదయం అవుతోంది

బాబా చెప్పిన ప్రకారం సహచరులు తెల్లటి కఫ్నీలు ఆకుపచ్చని తల పాగాలు ధరించి బాబాకోసం యింటిలో వేచియున్నారు. 6-30 గంటలకి బాబా తెల్ల కఫ్నీ ధరించి సహచరుల యింటికి వచ్చారు. వచ్చి నీలూని కాకాని ఆకుపచ్చ తల పాగా కట్టుకోవడంలో సహాయం చేయమన్నారు వాతావరణం గంభీరంగానూ, బిగువు గాను ఉంది ఒక సూది క్రిందపడినా వినిపించే అంత నిశ్శబ్దంగా ఉంది బాబాముఖం తేజోమయంగా ఉంది. నేత్రాలు ప్రకాశమానంగా ఉన్నాయి. ఆయన వదనం నెమ్మది తోను గంభీరంగాను ఉంది పావుతక్కువ ఏడు గంటలకి మంజ్రిమాఫి ఊళ్ళోకి తన సహచరులతో భిక్షాటనకు బయలుదేరారు బాబా వారంతా రెండుమైళ్ళు నడిచారు దారిలో ఎండిపోయిన నది తగిలింది వారికి అక్కడ వారికోసం నారావాలా, బర్జోర్ చాచా అతని సతి, శత్రుఘ్న అతని తల్లి బాబాకి భిక్ష పెట్టడానికి సిద్ధపడ్డారు. బాబా భిక్షను అంగీకరించి మంజ్రిమాఫీ యింటికి పయనమయారు. రోడ్డుమీద చాలా మంది బాబాకు ప్రణామం చేసారు. బాబా కూడా వారికి తిరిగి ప్రణామం చేసారు. వెళ్ళిన వారంతా నిశ్శబ్దంగా తిరిగివచ్చారు. III పథకం సహచరులకు వారు రాగానే భిక్షాటన చేయడం యిది ఆఖరిసారి అని బాబా చెప్పారు వారందరిని సాయంత్రం 5 గంటలకు కొత్త పథకంలో చేరమంటారు బాబా. భిక్షగా తీసుకువచ్చిన ఆహారం బాబా అందరికీ పంచిపెట్టారు అప్పుడు బాబా "ఈ రోజు సాయంకాలం 5 గంటలకి డాన్, కాకా, గుస్తాద్‌జీ సహితంగా III పథకం రద్దుపరచి ఓ అందరిని కొత్త పథకంలో చేర్చుకుంటున్నాను' అన్నారు బాబా అప్పుడు మాణెక్ మెహతాకి యీ టెలిగ్రాం యిచ్చారు—

"ఏప్రిల్ నెలాఖరులోగా నీ నిశ్చయం తెలియపరచ లేదు గనుక నీవు 1951 జనవరి 1 వ తేదీనుంచి పథకం I-C లో చేరవలసిందిగా నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను.

—బాబా."

సాయంకాలం 5 గంటలకు పథకం III, I-B సహచరులను అనగా — పెండు, నీలు, విష్ణు, ఎరచ్, సురేశ్, అలి, డాన్కిన్, గుస్తాద్‌జీ, కాకా, బైదుల్, సదాశివ్‌పటేల్, పురందరేని కొత్త పథకం బృందములో చేరమని బాబా ఆజ్ఞాపిస్తున్నారు.

క్రొత్త పథకం బృందం ప్రారంభించడానికి కారణములు, అందుకు దారి తీసిన సంఘటనలు. దాని పరిస్థితులు వగైరాలు అన్నీ డైరీలో వ్రాయబడతాయి. III పథకం I-B పథకం సహచరులను సమావేశం అవమని బాబా ఆ సమావేశానికి డాన్కిన్‌ని కూడా హాజరవమన్నారు

1950, మే 4 వ తేదీన బాబా యీ విధంగా ఒక సర్క్యులర్ పంపించారు.—

మొదట షరతులను ఒప్పుకుంటూ (ఆగస్టు 1949) అబ్దుల్‌ఘనీ సంతకం పెట్టినపుడు యింతకు ముందుచేసిన వాగ్దానాల నుండి నన్ను విముక్తిని గావించాడు. కాని అతడు వేరే అభిప్రాయంలో ఉన్నట్టున్నాడు. ఈ నవ్యజీవితం విడిచి పెట్టకుండా ఉండడానికి (I-C పథకం) నేను ఘనీకి రు 35,000/- యిస్తానని చెప్పాను అతని భార్య తాలూకు ఆస్తి నాకు యిచ్చినదాని గుర్తుగా — యీ 1950 వ సంవత్సరాంతం లోపుగా యిస్తానన్నాను.

నవ్యజీవిత నిబంధనల ప్రకారం నేను ధనాన్ని ఎవరినుంచీ తీసుకోలేను; ఎవరికీ యివ్వనూలేను. III పథకం ప్రకారం నేను ఆహారానికి తప్ప దేని కోసమూ భిక్షమెత్తలేను. కాని యిది కేవలం పాత జీవితపు భారం నూతన జీవితంలో తీర్చాలని నేను అంగీకరించి యిలా చేయడానికి నిశ్చయించాను — నా పాత జీవితపు స్నేహితులను ఒక స్నేహితునిగా నాకు యీ మొత్తం సహాయం చేయమని యీనిధికి విరాళంగా విరాళం మొత్తం రు 35,000/- క్రింద యివ్వాలని కోరుతున్నాను ఈ నా

స్నేహితులు ప్రతివారు యీ మొత్తాన్ని ఏర్పాటుదార్లలో ఒకడయిన రంజూకి పంప గోరుతున్నాను.

ఇది నూతన జీవితంలోని ఒక సహచరుని విషయంఅని, యిది ప్రత్యేకం అని, అర్థం చేసుకోవాలి. ఈ నూతన జీవితంలో యిదే మొదటిది, యిదే ఆఖరిదీను. నా స్నేహితులు ఘనీకి సహాయం చేయడం లేదని నాకు సహాయం చేస్తున్నారని జ్ఞాపకం ఉంచుకోవాలి ఆధ్యాత్మిక ప్రయోజనం ఏదీ ఆశించకుండా వారి సహాయం చేయాలి. ఎందుచేతంటే యీ నవ్యజీవితంలో నేను ఆధ్యాత్మిక గురువుగా ఉండడం అనే ప్రశ్నే ఉదయించదు ఘనీ నా నూతన జీవిత సహచరుడుగా ఉండడానికి, దీనికి ఏమీ సంబంధం లేదు రు 35,000/- సమకూడగానే రంజూ అది ఘనీకి అంద జేయాలి—

ఎమ్. ఎస్. ఇరానీ (బాబా)

ఎవరు ఎంత యివ్వాలో ఆ మొత్తం దగ్గర ఖాళీగా ఉంచబడి యీ సర్క్యులర్ ప్రతిని ఏర్పాటుదార్లకి బాబా చేత సంతకం చేయబడినది ఒక ప్రతిన్ని అందింది.

ఏర్పాటుదార్లు యీ సర్క్యులరు ఎవరెవరికి పంపాలో ఎంతెంత ఎవరిని అడగాలో వారి యిష్టానికి వదలబడింది బాబా భక్తులు ఎవరికి యీ సర్క్యులర్ వచ్చిందో వారేగాక వారి స్నేహితులు కూడా రు 500 కి ఎక్కువ గాకుండా రు 50/- లకి తక్కువ గాకుండా విరాళం పంపించవచ్చునని బాబా వ్రాయించారు. మొత్తం రు 35,000/- కి మించకుండ విరాళాలు స్వీకరించబడతాయి తరువాత అంత ఎక్కువగా సొమ్ము పంపించినా అంగీకరించబడదు రంజూ అబ్దుల్లా, నెం. 1, హారిస్‌రోడ్, అహమద్‌నగర్ అని చిరునామా యివ్వబడెను. ఈ సర్క్యులర్ అందినట్లు యింత మొత్తం ఫలానా తారీఖులోగా పంపిస్తున్నానని ఆ చీటీలో వ్రాయబడింది

ఇదివరలో మార్చి 10 వ తేదీన నవ్యజీవిత నిబంధనలు బాబా స్పష్టీ కరించారు కదా అందులో – (3) ఆడవాళ్ళను అనగా తల్లిని, భార్యను, సోదరిని, కుమార్తెను, అవసరం అయితేగాని, యితర స్త్రీలను అసలే తాకరాదు, నీవు వృత్తి రీత్యా డాక్టరైతే తప్ప (5) నోటిమాటచేతగానీ, నీ చేతలవల్ల గాని, ఏ కవిత్వంపు

జరిగినా సరే నీవు కోపం వ్యక్తం చేయకూడదు, ఎవరినీ అన్యాయంగా విమర్శించ రాదు అతని ఎదురుగానూ విమర్శించరాదు అతని వెనుకా విమర్శ చేయరాదు ; నీకు ఒక్కొక్కప్పుడు మనసులో కోపం కలిగినా అది పైకి ప్రదర్శించకూడదు ; (6) ఏ ఏ పరిస్థితులలోను అబద్ధమాడరాదు. అని బాబా వివరించారు ఈ షరతులు ఎవరయినా కావాలని ఉల్లంఘించినట్లయితే నూతన జీవితంలోనుంచి వేరే నా ఆర్డరు అక్కర్లేకుండా తొలగిపోతారు. అని బాబా అందరికీ 9 వ నెంబరు సర్క్యులర్ మూలంగా తెలియపరచారు దేరాడూన్‌లో బాబా యిది మే 13 వ తేదీన చెప్పారు.

బాబా మే 27 వ తేదీన ఎరచ్‌ని పిలిచి దక్కను పీఠభూమిలో సుమారుగా పెద్దదయిన ఒక పట్టణం దగ్గర కొండలు, నది ఉన్న స్థలంలో బాబా వారి సహచరులు ఉండడానికి ఒకచోటు ఏర్పాటు చేయమన్నారు జూన్ నెలాఖరుకి ప్రవేశానికి సిద్ధం చేయమన్నారు బాబా తరువాత వర్షాకాలం వెళ్ళేవరకు బాబా సతారాలో ఉంటా మన్నారు ఢిల్లీ వెళ్ళడానికి వీలు పడలేదు

ఢిల్లీలో బాబా వారి స్త్రీలతో ఉండడానికి సరియయిన యిల్లు కుదరనందున బాబా మహాబలేశ్వర్‌లో గాని, పంచాగ్నిలో గాని, వైలో గాని, సతారాలో గాని, హైదరాబాదులో గాని, ఔరంగాబాదులో గాని లేక మధ్యభారతంలో తగిన వేరొక ఊళ్ళోగాని ఉందామనుకున్నారు

బాబా ఢిల్లీకి వెళ్ళకపోవడంచేత తాత్కాలిక మయిన 'బి' గ్రూపు పథకం సహచరులు బాబా దగ్గరే ఉండాలి గనుక వారు ఢిల్లీలో ఉండలేకపోయారు. అది ఆ పథకంలోని ఒక నియమం అందుచేత వారు బాబావద్ద పుచ్చుకున్న రు 16,000/- అప్పు తిరిగి బాబాకి తీర్చివెయ్యడానికి తీర్మానించుకున్నారు ఢిల్లీలోని వారి నెయ్యివ్యాపారంకూడా ఎత్తివేయడానికి నిశ్చయించారు ఆ అప్పు తీర్చేస్తే పై పథకంనుండి వారు విముక్తులవుతారు ఇంక వారు మొదటి I-B పథకంలో సభ్యులుగా అవుతారు. ఈ పథకంలోని సహచరులు శ్రమించాలి గనుక బాబా వారికి రెండు పద్ధతులు చెప్పి ఏదో ఒకటి అంగీకరించమన్నారు.

మొదటి పద్ధతి :—సవ్య జీవితంలో చివరివరకు బాబాతో ఉండే మెహెరా, మణి, మెహెరూ, గోహర్ అను నలుగురు స్త్రీలద్వారా బాబాకి జీవితాంతము సేవచేయడము ఒక యజమానికి సేవకుడు విధేయుడుగా ఉన్నట్లు బాబాకి విధేయులై ఉండడము.

బాబా వారికి ఏ ఆజ్ఞ అయినా యివ్వవచ్చు ; ఇస్తారుకూడాను ; సహచరులందరు యీ పద్ధతి అవలంబిస్తే బాబాకి సేవకులవుతారు. వారు ఆయనకి సేవకులవలె విధేయులై యుండాలి యజమాని సేవకుని తప్పులు మన్నించినట్లే బాబాకూడా వారి లోపాలను క్షమించవచ్చును ఈ విధంగా జీవితాంతము వరకు తమకు సేవ చేయించుకుంటే అది వారు తీసుకున్న ప్రమాణానికి విరుద్ధం కాదని బాబా అన్నారు ఈ పద్ధతిలో బాబా వారికి ఎలాంటి పనయినా చెప్పి, చేయించుకోవచ్చు, వారిని వ్యవసాయం పని చేయ మనవచ్చు, ఏదయినా ఉద్యోగం చూసుకోమని చెప్పవచ్చు : కూలీలలాగ పనిచేయమని చెప్పవచ్చు. ఏమయినా చేయమనవచ్చు ఈ పని చేసినందువలన యీ సేవక సహచరులు బాబావద్దనుంచి తిరిగి ఏమీ ఆశించకూడదు బహుమతీ అసలే ఉండదు. ఏమి జరిగినా సేవక సహచరులు ఎలా రూపొందినా అది వారి స్వంత బాధ్యతే.

ఈ సహచరులు యీ పద్ధతిలో బాబావద్ద నుంచి స్త్రీలద్వారా ఆహారము పొందవచ్చును ఈఆహారం వారికి సక్రమంగా ప్రతిరోజూఅందవచ్చును లేకపోవచ్చును. అది వారికి చాలను కూడా చాలక పోవచ్చును. శ్రమించే యీ పద్ధతిలో చాలా కష్టాలు పడవలసి రావచ్చును. సరిగ్గా తిండి దొరక్కపోవచ్చు. నిద్ర చాలినంత లేకపోవచ్చు. ఏ రకమయిన పనయినా చెయ్యవలసి రావచ్చు. లేక పరిస్థితులను బట్టి కొన్ని సమయాలలో అసలే పనిఉండకపోవచ్చును. పుష్కలంగా ఆహారం, విశ్రాంతి దొరకవచ్చు.

ఈ పద్ధతిలో సహచరులు యీ నలుగురు స్త్రీల ద్వారా బాబా సేవ చేయాలి. స్త్రీలు డబ్బు తోనే వారికి బాబా భోజనాలు ఏర్పాటు చేయవచ్చును బాబా సేవ యీ విధంగా చేయడానికి నిశ్చయించుకున్నా సహచరులు అన్ని రకాల కష్టాలను ఎదుర్కొవలసి ఉండడానికి సిద్ధంగా ఉండాలి. బాబాని యజమానిలాగ చూస్తూ వారు సేవకులుగా విధేయులై ఉండాలి, అది కాకుండా పథకం I–B లోని నిబంధనలు పాటించాలి కూడా.

ఏ సేవక సహచరుని పనయినా నచ్చకపోతే బాబా అతనిని తొలగించి వెళ్ళిపొమ్మనమని చెప్పవచ్చును. అలా తొలగింప బడినవారు నవ్యజీవితం లోనే ఉంటూఉంటాడు. I–B పథకంలోనూ ఉంటాడు కాని అతడు స్వతంత్రంగా ఉంటాడు తన యిష్టమయిన పని చేసుకోవడానికి అతనికి స్వేచ్ఛ ఉంటుంది వాని యిష్టమొచ్చిన

చోటకి పోవచ్చును. అయితే I–B పథకం నియమాలను పాటిస్తూ ఉండాలి. అతడు తన బ్రతుకు తెరువు తనే చూసుకోవాలి బాబా అతనికి ఏ సహాయమూ చేయరు.

రెండవ పద్ధతి –

వ్యక్తిగతంగా తనకు తానుగా స్వతంత్రంగా I–B పథకం లోని నిబంధనలను పాటిస్తూ శ్రమించి జీవించాలి ఇది ఎన్నుకున్న వానికి బాబా కొంత సొమ్ము యిస్తారు ప్రారంభంలో తరువాత దానితో తనకు తాను ఏది మంచిదని తోస్తే అలాజీవించాలి తాత్కాలికమయిన 'బి' గ్రూపు పథకంలోని పదిమందీ కూడా మొదటి పద్ధతే యెన్నుకున్నారు బాబాకి జీవితాంతము సేవకులుగా ఉంటామన్నారు. వారు ఎవరంటే – పెండు, ఎరచ్, కాకా బారియా, బైదుల్. డాన్‌కిన్, నీలూ, విష్ణు, మురళి, గుస్తాద్‌జీ, ఆలీ అక్బర్‌లు కై కోబాద్ దస్తూర్ నవ్యజీవితంలో ఉన్నా యింతవరకు ఏ పథకం లోనూ లేడు ఇతడు కూడా బాబాకి జీవితాంతము సేవకుడుగా ఉంటానన్నాడు

1950 మే 24 వ తేదీన తీసుకున్న ఏకగ్రీవ తీర్మానం ప్రకారం తాత్కాలిక 'బి' గ్రూప్ పథకంవారు వారి నెయ్యి వ్యాపారం కట్టిపెట్టి బాబాకి రు 16,000/– ఋణం చెల్లించారు. వారివద్ద మిగిలి ఉన్న రు 14,570/– యిచ్చేసారు మిగతా రు 1430/– నలుగురు స్త్రీలు యిచ్చేసారు మొత్తం బాబాకి యిచ్చినది రు 16,000/– ఈ మొత్తం బాబా జీవితాంతము సేవక సహచరులుగా ఉండేవారి యీ నెల పోషణ ఖర్చు, దేరాడూన్ నుంచి ఢిల్లీ నుంచి సతారా వెళ్ళడానికి అయిన ఖర్చులకి తరువాత సతారానుంచి బాబా మహాబలేశ్వర్ వెళ్ళదలచుకున్నారు గనుక సతారాలోను మహాబలేశ్వర్‌లోను ఒక సంవత్సరం పాటు యిళ్ళ అద్దెలకు మొదలయిన ఖర్చులకు వినియోగించడం జరిగింది

బాబా యింకా మెహెరాకు రు 5,000/– మణికి రు 4,000/- గోహర్‌కి రు 1,000/– మరిన్ని రు 5,000/– అత్యవసర ఖర్చులకోసం ఏర్పరచిన నిధికి యివ్వవలసి ఉంది. ఇదేకాక, జీవితాంతము సేవక సహచరులను పోషించవలసి ఉంది స్త్రీలవద్ద డబ్బు ఉంటే అది ఉపయోగించి యీ ఖర్చు చేస్తారు. లేకపోతే I–C పథకం సహచరులనుంచి వచ్చినడబ్బు వినియోగిస్తారు, అది బాబా యింకే ఖర్చుకి ఉపయోగించకుండా ఉంటే

ఇంకొకచోట తగిన నివాసస్థలం దొరకేవరకు ఢిల్లీ వెళ్ళిన సహచరులను అక్కడే కొన్నాళ్ళపాటు ఉండమన్నారు. తరువాత ఎప్పుడు బాబా ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళడానికి సిద్ధంగా ఉండాలి.

మే 25 వ తేదీన బాబా ఏర్పాటుదారులలో ఒకరయిన జాల్ కేరావాలాకి యీ క్రింది విధంగా ఉత్తరం వ్రాయించారు.

మెహెర్‌బాబా C/o నారావాలా, 36 లిట్టన్‌రోడ్,
డేరాడూన్, 25 మే 1951.

జాల్‌కేరావాలాకి,

ఈ క్రింద వ్రాసిన విషయం జాగ్రత్తగా చదివి ఆ ప్రకారం చేసి మరల బాబాకి పై చిరునామాకి జవాబు వ్రాయవలెను ——

బాబా నలుగురు స్త్రీల తోను, 11 గురు సహచరులతోను దక్కన్ పీఠభూమికి గాని, మధ్య పరగణాలకి గాని, బీరార్‌కి గాని డేరాడూన్‌నుంచి, ఢిల్లీనుంచి వెళ్ళి ఉందామనుకుంటున్నారు

బాబా వారి నూతన జీవితపు మూడు భాగాలు, ఫకీరటన, లంగోటీ, జిప్సీ జీవితాలు అక్కడ గడుపుదామనుకుంటున్నారు. సహచరులు శ్రమ జీవితం గడుపుతారు.

ఈ నాలుగు రకాల జీవితాలు గడిపేందుకు బాబా ఆరోగ్యం బాగా ఉండేందుకు తగిన స్థలం వెదకి అక్కడ ఏర్పాటు చెయ్యాలి ఇదంతా మనసులో ఉంచుకుని బాబాకి మహాబలేశ్వర్ పంచాగ్ని, వై, సతారా, ఔరంగాబాద్, హైదరాబాద్ వీటిలో ఏదయినా తగినదేమో అని అనిపిస్తోంది ఈ స్థలాలన్నిటికీ బాబా యిదివరకు చాలా సార్లు వెళ్ళారు కొన్ని చోట్ల నెలలకొద్దీ ఉన్నారు ఈ స్థలాలు ఆయన ఆరోగ్యానికి బాగా సరిపోయాయని బాబా అంటున్నారు నూతనజీవితం గడిపేందుకు కూడా మంచి వని అభిప్రాయపడుతున్నారు పైన వ్రాసిన ఊళ్ళలో మొదట వ్రాసిన వరుసలో మొదటిది మహాబలేశ్వర్ అన్నిటికన్న బాగుంటుందన్నారు.

స్థలం ఎన్నిక చేయడంలో యీ క్రింది సంగతులు కూడా మనసులో ఉంచుకోవాలి—

ఒక మోస్తరుగా అంత పెద్ద నగరమూ కాక చిన్న ఊరూ కాకుండా సమశీతోష్ణస్థితి కలిగిన, నగరంలో ఒక పేటయినా సరే, వర్షపాతం ఎక్కువ లేకుండా ఉండాలి కొండలయినా ఉండాలి. నదీ తీరమయినా కావాలి. రెండూ ఉంటే మరీ మంచిది సమశీతోష్ణంగా అంటే బాబా అభిప్రాయం వేసవికాలంలో మరీ వేడిగానూ కాకుండా శీతాకాలంలో మరీ చలిగాను కాకుండా వర్షాకాలంలో మరీ ఎక్కువ వానలు లేకుండాను ఉండాలని.

అలాంటి ఊళ్ళో బాబాకి ఒకే పెద్ద ఆవరణలో రెండు బంగళాలు కాని రెండు ఆవరణలలో వేరే వేరే రెండు బంగళాలు కాని దగ్గర దగ్గరగా చూసిపెట్టాలి వాటిలో ఎలక్ట్రిక్ దీపాలు నీటికుళాయి ఉండాలి. దీపాలు లేకపోయినా ఏరుపడ్తున్న కుళాయిలయినా ఉండాలి

మహాబలేశ్వర్‌లో ఎలక్ట్రిక్ దీపాలూ లేవు కుళాయిలూ లేవు. అయినా మహాబలేశ్వర్ బాబా యిష్టపడతారు ఎందుచేతంటే మిగతా చోట్లకంటె బాబా ఆరోగ్యం అక్కడ బాగా ఉంటుందని అక్కడ నదీ ఉంది. కొండలూ ఉన్నాయి అక్కడయితే బాబా నవ్యజీవితానికి, సహచరుల శ్రమ జీవితానికి సరిపోతుంది. మహాబలేశ్వర్‌లో వర్షఋతువు మూడు నెలల్లోనూ వర్షాలు చాలా ఎక్కువగానే ఉంటాయి సహచరులందరు పంచాగ్నికి గాని 'వై'కి గాని మారతారు బంగళాలు దొరకలేవని మహాబలేశ్వర్ ఎన్నిక చేయకపోతే రెండవ పక్షంలో బాబా సతారాలో ఉంటారు. అక్కడ శీతోష్ణస్థితి బాగుంటుంది; ఎలక్ట్రిసిటీ ఉంది, కుళాయిలూ ఉన్నాయి వర్షం అంత ఎక్కువా లేదు, కొండలూ ఉన్నాయి, నదీ ఉంది సతారా సంవత్సరం పొడుగునా బాగానే ఉంటుంది ఇవన్నీ ఉన్నా ముందు ఎన్నిక మహాబలేశ్వర్‌దే ఎందుచేతంటే బాబా ఆరోగ్యం సతారాలో కంటె మహాబలేశ్వర్‌లో బాగుంటుందని బాబా చెప్తున్నారు. ఆ తరువాత ఔరంగాబాదు హైదరాబాదు ఉన్నాయి ఈ అన్ని స్థలాల అనుభవమూ బాబాకి ఉంది ఇంకా మంచి స్థలాలు ఉండవచ్చు బాబాకి పొడిగా ఉండే వేడి యిష్టం చలిగాలి లేకుండా చల్లదనం యిష్టం వర్షం ఎక్కువగా లేకుండా ఉండాలి కొండలు, నది ఉండాలి పైన వ్రాసిన దానినిబట్టి మీకు ఏది తగినదని తోస్తే ఆ స్థలాన్ని ఎన్నిక చేయండి, నాగపూర్ తప్ప పచ్‌మాది గాని చికల్ద గాని

పద్దన్నారు మేము సూచించిన వాటిలో బుల్దానా నచ్చింది బాబాకి. ఇంకేమయినా ఉంటే బాబాకి తెలియజేయండి.

ఈ లోపుగా బాబా బుల్దానాలో రెండు బంగళాలు చూడమన్నారు. "చూసి అక్కడి స్థితిగతులు—వర్షపాతము, శీతోష్ణస్థితి, కొండలు, నదులు, ఏమున్నాయో అన్నీ వ్రాయండి. బంగళాలు కుదిర్చెయ్యవద్దు కాని చూసి ఉంటే తెలియపరచండి. అప్పుడు ఎవరయినా వచ్చి అవి కుదుర్చుకుంటారు" అన్నారు.

ఇందుకోసమే ఎరచ్‌ని మహాబలేశ్వర్ పంపించారు. అక్కడ కుదరకపోతే అతడు సతారా వెళ్తాడు. తరువాత ఔరంగాబాదు తరువాత హైదరాబాద్. ఈలోపుగా నీకు చెప్పినట్లు నీవు వెళ్ళి చూసిపెట్టు

రెండు బంగళాలకి ఆడవాళ్ళు సంవత్సరానికి రు 5,000 కంటె అద్దె ఎక్కువ యివ్వలేరు. మహాబలేశ్వర్, సతారా వగైరాల నుంచి తరుచుగా బాబాకి కబురు తెలుస్తూ ఉంటుంది అందుచేత నీవు కూడా వ్రాస్తుండాలి మొదట బుల్దానాలో ప్రయత్నం చేయడానికి ఏర్పాటు చెయ్యి. బాబాకి యింకేదైనా యిన్ని సదుపాయాల తోను ఉన్న ఆదర్శవంతమయిన స్థలం ఉంటే దాన్నిగురించి వ్రాయి.

జూన్ 15 వ తేదీ నాటికి అనువయిన చోటు ఏదో ఒకటి నిర్ణయించు కోవాలి అని బాబా ఎరచ్‌తో అన్నారు. జూన్ నెలాఖరుకి తప్పకుండా వెళ్ళా లంటున్నారు బాబా అందుచేత త్వరగా ప్రయత్నాలు చేసి బాబాకి టెలిగ్రాం యివ్వాలి.

బాబాతో యితర సంగతుల గురించి కాక యీ విషయమై మాత్రమే ఉత్తర ప్రత్యుత్తరాలు జరపాలి.

స్త్రీల వద్ద పరిమితమయిన పైకమే ఉంది గనుక, బాబా ఎవరినీ డబ్బు అడగరు గనుక వారి సహచరులు ఎన్ని కష్టాలు వచ్చినా ఆయనను అంటిపెట్టుకుని ఉంటారు గనుక బాబాకి ఆదర్శవంతమయిన పరిస్థితులు, పరిసరాలు, వాతావరణం గల స్థలం కావాలి, ఆయన నూతన జీవిత విధానానికి, సహచరుల శ్రామిక జీవనానికి తగినట్లుగా ఉండాలి.

ఈ స్థలం ఎన్నిక అయి ఏదో ఒకటి నిశ్చయం చేసుకునేవరకు ఏర్పాటు దారులకి యీ సంగతి చెప్పవద్దు పాత జీవితపు వాళ్ళెవరూ – బింద్రాహౌస్ వాళ్ళ

కూడా - ఈ విషయం తెలుసుకోరాదు. ఈ సంగతులన్నీ ప్రత్యేక సర్క్యులర్ లేఖ మూలంగా అందరికీ తెలియపరచేవరకు ఎవరికీ చెప్పవద్దు

ఉత్తరం అందిన సంగతి టెలిగ్రాం యివ్వు బాబాకి.

ఇట్లు

బాబా ఆజ్ఞప్రకారం — ఎరచ్.

ఎరచ్, జాల్ కేరావాలా యిద్దరు వారి చేతనయినంత ప్రయత్నమూ చేసారు చివరికి వర్షాకాలం వెళ్ళేవరకు బాబా సతారాలో ఉంటామన్నారు. తరువాత మహాబలేశ్వర్‌కి వెళ్తారు.

బాబా, స్త్రీలు, డేరాడూన్ లో ఉన్న సేవక సహచరులు జూన్ 14 వ తేదీన బయలుదేరి సతారా వెళ్ళారు ఢిల్లీలో ఉన్న సేవక-సహచరులు 16 వ తేదీన సతారా కి బయలుదేరారు. ఇప్పుడు అందరూ సతారా చేరుకుని స్థిరపడ్డారు ఎవరికి తగిన నూతన జీవితం వారు గడుపుతున్నారు బాబా సతారాలో యిదివరకు 1947 లో ఉన్న యింటిలోనే ఉన్నారు

బాబా పాత జీవితంలోనే సదాశివ్ పటేల్ బాబా కి చాలా పాత శిష్యుడుగా ఉండేవాడు. అతడు ఆ రోజుల్లో తన ఆస్తినంతా బాబాకు యిస్తానని వాగ్దానం చేసాడు ఒకమారు తనంతట తానే బాబాకి తన ఆస్తి తాలూకు దస్తావేజులు పంపించాడు. ఆస్తి అంటే అతని మూడు యిళ్ళు ఉన్నాయి ఒక జీవితభీమా పట్టా ఉంది

క్రొత్త జీవితం ప్రారంభించే ముందు ఒకనాడు బాబా, తమ సన్నిహిత శిష్యులను సమావేశపరచారు అందులో కొన్ని బాకీలు తీర్మానం నిమిత్తం డబ్బు ఏర్పాటు గురించి వారిమీద ఆధారపడి ఉన్నవారికి ఏదో కొంత యివ్వడానికి ఏర్పాటు గురించి చర్చించారు. ఈ సమావేశంలో సదాశివ్ పటేల్ కూడా ఉన్నాడు చర్చ చేసిన తరువాత ఒక కమిటీ ఏర్పాటు చేసారు బాబా తరుపున పనిచెయ్యడానికి బాబా యీ సంఘానికి అధికారం యిచ్చారు ఆయన మీదనే ఆధారపడిన వారికి బాబా యెలా యెలా కొంత సొమ్ము యిమ్మని యీ సంఘానికి చెప్పారు ఆసమయంలో ఆయనంతట ఆయనే సదాశివ్ పటేల్ కి అన్ని యిళ్ళు తీసేసుకోవడం యిష్టంలేక ఒక యింటికి

సంబంధించిన దస్తావేజులు, జీవిత భీమాపత్రము తిరిగి యిచ్చేసారు. అమ్మవలసిన మిగిలిన రెండు యిళ్ళకు దస్తావేజులు బాబా యీ సంఘానికి యిచ్చారు సదాశివ్ పటేల్ నూతన జీవిత పత్రం మీద 'అపుమ' అని సంతకం చేయక ముందే యీ పని జరిగింది

ఆ తరువాత జరిగిన సమావేశాలలో యీ రెండు యిళ్ళ దస్తావేజులకి బదులు–అవి అమ్మడానికి కొంతకాలం పడుతుంది గనుక– రు 40,000 నగదుగా యిచ్చేస్తే బాగుంటుందని కమిటీవారన్నారు. అందుచేత బాబా సదాశివ్ పటేల్ తో 16-10-49 తేదీ (క్రొత్త జీవితం ప్రారంభం చేసేరోజు) కి ముందర రు 40,000 తెచ్చి సంఘానికి యివ్వవలసిందని అన్నారు ఈ మొత్తం ఆ యిళ్ళు అమ్మినా సరే లేక ఏ యితర ఏర్పాటు చేసయినా తీసుకు వచ్చి యిమ్మని బాబా చెప్పారు అందుకు సదాశివ్ పటేల్ అంగీకరించాడు కానీ అతను అన్నట్టుగా సదాశివ్ నవ్య జీవితంలో బాబా ని చేరమన్న తేదీలోపుగా (15-10-49) యీ ఏర్పాటు చేసి రు 40,000 కమిటీ కి యివ్వ లేకపోయాడు అందుచేత బాబా యీ రెండు యిళ్ళను సదాశివ పటేల్ ని నారిమన్, మెహెర్ జీల పేరుకి బదిలీ చెయ్యమని కోరారు. వారు కూడా సంఘంలో సభ్యులు ఆ ప్రకారం సదాశివ్ పటేల్ ఆ రెండు యిళ్ళు మెహెర్ జీ నారిమన్ల పేరుకి బదిలీ చేసాడు. చేసి నవ్యజీవితంలో చేరాడు. ఆ తరువాత కమిటీవారు తమ పేర యిళ్ళు వ్రాయించుకుని రు 40,000 కమిటీవారికి వారిస్వంత సొమ్ము యిచ్చేసారు. కమిటీ వారికి వారిపనిలో సహాయం చేద్దామని యీ పని చేసారు తరువాత యిళ్ళు ఎవరైనా కొంటారేమో చూడడం ప్రారంభించారు.

ఫిబ్రవరి (1950) మొదటివారంలో నూతన జీవిత సహచరుడయిన డాన్‌కిన్‌ని డేరాడూన్ నుంచి ఏదోపని మీద బొంబాయికి నగర్ కి పంపిచారు బాబా. ఈ పని పూర్తి చేసుకుని డాన్‌కిన్ డేరాడూన్ వచ్చేసాడు. తాను చేసిన పనులు గురించి చెప్తూ డాన్‌కిన్ నారిమన్ మెహెర్‌జీలు సదాశివ్ యిళ్ళు అమ్మడానికి చాలా కష్టపడుతున్నారని బాబా కి చెప్పాడు అందుకు సదాశివ్ అక్కడ ఉంటే గాని యిళ్ళు అమ్ముడు కావని చెప్పారన్నాడు ఈ సంగతి విని వెంటనే బాబా సదాశివ్ ని బొంబాయికి పంపించారు యిళ్ళు అమ్మడంలో మెహెర్ జీ నారిమన్లకి సహాయం చెయ్యమని చెప్పి పంపించారు బాబా రెండు నెలలలో ఆపని పూర్తిచేసి మళ్ళీ డేరాడూన్ వచ్చి బాబాని చేరాలని గడువు కూడా పెట్టారు బాబా.

పూనాకి వచ్చి సదాశివ్ అన్నాడు — నారిమన్ మెహెర్‌జీలు యిళ్ళు అమ్మెయ్యడానికి బదులు రెండూ తన పేరకి మళ్ళీ బదిలీ చేసిన తరువాత తనవిలువని బట్టి రు 40,000/- వారికి యిస్తానని అన్నాడు ఆ డబ్బు యివ్వడానికి గడువు పెట్టకూడదు అన్నాడు ఈ సంగతి సదాశివ్ డేరాడూన్ తిరిగి వెళ్ళడానికి బాబా పెట్టిన గడువు అయిపోతూంటే సదాశివ్ బాబాకి వ్యక్తపరిచాడు బాబా యిది ఒప్పుకోక మళ్ళీ యిళ్ళు త్వరలో అమ్మడానికి సహాయం చేయమని అలా కాకపోతే రు 40,000/- నారిమన్ మెహెర్‌జీలకు యిచ్చి తరువాత వారివల్ల యిళ్ళు రెండు తన పేరకి బదిలీ చేయించుకోమని వ్రాసారు ఈ విధంగా పదేపదే బాబా వ్రాసినాగానీ సదాశివ్ తన పాటమీదే కూర్చున్నాడు. చివరికి యింక బాబా తన యిష్ట ప్రకారం చేయడంలేదని సదాశివ్ తన యిష్టం వచ్చినట్లు ఆదీ (సీ) తో అబద్ధాలు చెప్పడం ప్రారంభించాడు ఆదీకి, యింకా కొందరు పాత జీవితపు ఆసాములకు, ఆ విధంగా పూనాలో చెప్పడం మొదలుపెట్టాడు బాబా తనని మోసగించి, యిళ్ళు తననుంచి లాక్కున్నారని, ఆయన పలుకుబడి ఉపయోగించి బలవంతంగా యిళ్ళు తనవి కాకుండా చేసారని ప్రచారం చేసాడు ఈ సంగతి ఎరచ్ ద్వారా ఆదీ బాబాకు తెలియజేసాడు బాబా దీనికి ఎంతో విచారించి పాతజీవితపు భారంగా దీన్ని తీసుకున్నారు. వెంటనే నారిమన్ మెహెర్ జీలు అతనికి రెండు యిళ్ళు తిరిగి వ్రాసి యిచ్చెయ్యమని వారు కమిటీకి యిచ్చిన రు 40,000 బాబా ఎలాగయినా తిరిగి వారికి యిస్తారని బాబా నిశ్చయించి వారికి వ్రాసారు ఈ నూతన జీవితంలో బాబా ఎవరి దగ్గరనుంచీ ధనం తీసుకోరు అందు కోసం బాబా డాన్‌కిన్‌ని పాశ్చాత్యదేశాలకి పంపించి అక్కడి పాతజీవితపు శిష్యుల వద్దనుంచి ఆ సొమ్ము వసూలు చెయ్యమని చెప్పారు.

సదాశివ్ పటేల్ కి తన రెండు యిళ్ళు మళ్ళీ వచ్చేస్తాయి వాటికోసం అతని దగ్గర నుంచి ఖర్చులు తప్ప మెహెర్ జీ నారిమన్లు ఏమీ తీసుకోరు డాన్‌కిన్ వారికి పాశ్చాత్య దేశాల నుంచి వచ్చిన తరువాత రు 40,000/- యిచ్చేస్తాడు.

ఈ సంగతులన్నీ పాత జీవితపు శిష్యులకు, సహచరులకు, ఏర్పాటుదారులకు నూతన జీవితం వారికి తెలిసేందుకు సర్క్యులర్ ద్వారా బాబా తెలియజేసారు సతారానుంచి 21-7-50 తేదీన బాబా తమ పాత జీవితపు పాశ్చాత్య శిష్యులకు ఒక ఉత్తరం పంపించారు —

"నేను 16-10-49 వ తారీఖున నా నూతన జీవితం ప్రారంభించినప్పుడు ఆ రోజు లగాయతు ఎవరి వద్దనుంచి నేను డబ్బు తీసుకో కూడదని ఎవరికి ఇవ్వ కూడదని నిశ్చయించు కున్నాను ఈ నిశ్చయం మూలాన నేను నూతన జీవితం ప్రారంభించే ముందు డబ్బు వేరే ఉంచుకునే నిధిలాగ ఒకటి ఏర్పాటు చేయించాను, పాత జీవితపు శిష్యులకోసం అనుయాయులకోసం వారికి ఉన్న ఋణాలు తీర్చుకోవడం కోసం ఉపయోగపడుతుందని. ఈ నిధి ఎన్నుకున్న పాత జీవితపు శిష్యులను ఒక సంఘంగా నియమించి నూతన జీవితంలోకి వెళ్ళేముందు వారికి చెప్పవలసినవిచెప్పాను

"నూతన జీవితం ప్రారంభించిన తరువాత డబ్బు యివ్వ వలసిన అత్యవసరపు కేసులు రెండు వచ్చాయి ఇలా వస్తాయని ముందు తెలియక నిధిలో వీటికి డబ్బు ఏర్పాటు చెయ్యలేదు. ముప్ఫై ఏళ్ళ నుంచి నాకు శిష్యులుగా ఉన్న యిద్దరి గురించి ఏర్పడ్డాయి యీ అవసరాలు అందులో ఒకరి గురించి ఇండియాలో రు 35 000/- వసూలు చేస్తున్నారు. ఈ రెండవ శిష్యుని విషయంలో ఇండియాలో నా పాత జీవితపు శిష్యులను పాకిస్తాన్ లోని వారిని రెండవ మారు నేను అడగదల్చుకో లేదు

"పాశ్చాత్య దేశాల లోని నా శిష్యులను అనుయాయులను నాయీ రెండవ భారాన్ని తీర్చమని అడుగుతున్నాను ఇదే నా పాత జీవితపు ఆఖరి బరువు. రు 50,000 వసూలుచేసి యిస్తే యీభారం తీరిపోతుంది. ఈ మొత్తంలో రు 40,000 కమిటీసభ్యులిద్దరికి యివ్వాలి. అంతకుమించి వసూలుచేసిన రు 10,000 గాని అంతకు ఎక్కువగాని ఉంటే అది డా॥ డాన్‌కిన్ యిందుకోసం మీదేశాలకు విమానంలో వెళ్ళి వచ్చినందుకు ఖర్చుల క్రింద వినియోగపడుతుంది. యింకా మిగిలితే దైవోన్మత్తుల తోను పిచ్చివారితోను బీదవారితోను నేను చేసేపని కోసం వినియోగిస్తాను

"ఈ యిద్దరు కమిటీ మెంబర్లకి నేను ఎందుకు యివ్వవలసి వచ్చిందంటే – సదాశివపటేల్ అనే 1922 వ సంవత్సరంలోని పాత జీవితపు శిష్యుడొకడు చాలా సంవత్సరాల నుంచి పూనాలోని అతని యిళ్ళు మూడు నాకు కానుకగా యిస్తానని అంటుండేవాడు. నూతన జీవితంలోకి నేను అడుగుపెట్టేటప్పుడు చాలా రోజులుగా సదాశివ్ యిస్తానంటున్నది కొంతభాగం ఒప్పుకుంటామనుకుని సదాశివ్‌ని అతని

మూడిళ్ళలోను రెండు అమ్మితే వచ్చే రు 40,000/–, నిధిలోకి కమిటీవారికివ్వాలని అనుకున్నాను.

"అక్టోబరు 16, 1949 వ తేదీన క్రొత్తజీవితంలో నాతోబాటు చేరదామను కున్న సదాశివ్ పటేల్ యీ యిళ్ళ అమ్మకం పూర్తిచేయలేకపోయాడు ఆ తేదీనాటికి. అందుచేత అతడు సొమ్ము నిధిని నిర్వహించే ఆ యిద్దరు కమిటీ మెంబర్లపేర ఆ రెండిళ్ళను బదిలీ చేసాడు

"ఆ యిద్దరు కమిటి మెంబర్లు ఆ యిళ్ళ వెంటనే అమ్మలేక వాటి తాలుకు 40,000 వారి స్వంతసొమ్ము కట్టేసారు అందుచేత కమిటీవారు కొత్త జీవితపు ఖర్చులు యిబ్బంది లేకుండా చేయగలిగారు

"సదాశివ పటేల్‌కి కొన్ని కారణాలవల్ల ఆ యిళ్ళ రెండు అతనిపేర తిరిగివ్రాసి యివ్వవలసి వచ్చింది నేను యిలా చేసినందువల్ల కమిటీ సభ్యులిద్దరు వారు యిచ్చిన రు 40,000/- కి వారికి బాకీపడిపోయాను న్యాయంగా వాళ్ళకి ఆ సొమ్ము తిరిగి యిచ్చేయాలి కదా ఇప్పటికే వారు వారికి మించిన త్యాగం చేసారు.

"అందుచేత యూరప్‌లోను అమెరికాలోను ఉన్న నా పాతజీవితపు శిష్యులు అనుయాయులు ఇండియా, పాకిస్తాన్‌లలో తప్ప యితర దేశాలలో ఉన్నవారు అమెరికాలో ఒక్కొక్కరు 500 డాలర్లకి మించకుండాను నూరు డాలర్లకి తక్కువ కాకుండాను, ఇంగ్లండులో 30 పౌనులకి తక్కువ కాకుండాను 150 పౌనులకి మించ కుండాను అలాగే యితర దేశాలలోను ఒక్కొక్కరిని యిమ్మని కోరుతున్నాను.

"డా॥ విలియం డాన్‌కిన్—నా నవ్యజీవితపు సహచరులలో ఒకడు—ఈ పనికోసం మీ దేశాలకి వస్తున్నాడు. నా తరఫున యీ సొమ్ము వసూలు చేయడానికి అధికారం పొందాడు ఐచ్ఛికంగా స్వేచ్ఛగా యివ్వదలచిన వారు అతనికి యివ్వ వచ్చును.

"ఈ రు 50,000/– వసూలు కాగానే నా యొక్క పాత జీవితపు ఆఖరి భారం తీరుతుంది ఇలాటి సహాయం యికముందు తూర్పుదేశాల నుంచి గాని పడమర దేశాలనుంచి గాని కోరబడదు.

1951 జూలైలో నేను పడమటి దేశాలకి రావడం నిశ్చయం. ఎలిజబెత్ నోరీనాలు దీనికి ఏర్పాటు చేస్తామని అన్నారు" ఒక వెలపాటు ఒక ఖవ్వాలి పాటకుని జీతం యిచ్చి రోజూ పాడటానికి నియమించారు బాబా. మండలి ప్రతిరోజూ నవ్య జీవితపు గీతాన్ని పాడించేవారు. ఖవ్వాలు పాడేటప్పుడు బాబా స్త్రీలను ప్రక్కగదిలో కూర్చుని వినమనేవారు వాగా వినిపిస్తోందా, మాటలు తెలుస్తున్నాయా అనికూడా బాబా స్త్రీలను కనుక్కుంటూ ఉండేవారు

బాబా సతారాలో ఉంటున్నారు 1950, జూలై 25 వ తేదీ బాబాయొక్క నూతన జీవితంలో చాలా ముఖ్యమయిన రోజు సేవక-సహచరులందరు ఆనాడు తెల్ల వారుఝామున 4 గంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకుని కొందరు స్నానాలు చేసారు. కొందరు కాళ్ళు చేతులు ముఖాలు కడుగుకున్నారు బాబా చెప్పిన ప్రకారం బాబా రాగానే ఆ రోజు కార్యక్రమం ఉపక్రమించడానికి సిద్ధంగా ఉన్నారు.

ఆరోజు ఉదయం సూర్యరశ్మి లేదు చలి ఎక్కువగా ఉంది వాతావర ణం ఉత్సాహజనకంగా లేదు సతారాలో రాత్రంతా వర్షం కురిసినందువ యింటి చుట్టూ నీరు నిలిచింది, గోతుల్లోనూ పల్లంగా ఉన్న చోట్లాను

ఉదయం 6-45 గంటలకు బాబా సహచరుల బంగళాకు వచ్చారు హాలు క్రితం రాత్రే పెండు, ఎరచ్ శుభ్రంగా కడిగి ఉంచారు బాబా సకాలంలో అనగా 7 గంటలకి హాలులోకివచ్చి తిన్నగా వెళ్ళి వారికి ఏర్పాటయిన కుర్చీలో కూర్చున్నారు. సహచరులందరు హాలులో ప్రవేశించి బాబాకి ఎదురుగా నిలబడ్డారు బాబా వాళ్ళందరినీ కూర్చోమన్నారు నూతన జీవితంలో లేనివారికి (బయటవారికి) అక్కడ ప్రవేశం లేదు. జాల్ (బాబా తమ్ముడు) ని మాత్రం కిటికీలో నుంచి చూడడానికి బాబా అంగీ కరించారు అతడు బయట నిలబడి కిటికీలో నుంచి చూస్తున్నాడు మిగిలిన ద్వారాలు కిటికీలు అన్నీ మూయబడ్డాయి

హాలు లోపల వాతావరణం గంభీరంగా ఉంది. బాబా ముఖం మీద నవ్వులేదు కానీ ముఖాన్ని ఉన్న తేజస్సు అందంగా ప్రకాశంగా ఉంది మిరుమిట్లు గొలిపే ఆయన కళ్ళు అన్ని దిక్కులకు చూస్తున్నాయి బాబా అందరివైపు చూసి తాము కోపం యింకా పూర్తిగా నిగ్రహించుకోలేకన్నారు అందుచేత ఆయనకు కోపం కలిగించేలాగ ప్రవర్తించవద్దని హెచ్చరిక చేసారు అయిన తమ వైఖరిని

నిగ్రహించుకుంటానని చిన్న చిన్న తప్పులను క్షమిస్తానని బాబా అభయం యిచ్చారు. తనను అదేవనిగా భావిస్తే కోపాన్ని ఒరాకును జయించడం ఆయనకు కష్టం కాదన్నారు బాబా చెప్పినట్లు తు-చ-తప్పకుండా చేస్తే ఏ బాధా ఉండదన్నారు. అప్పుడంతా సవ్యంగా జరుగుతుందని అంతా బాగ ఉంటుందని బాబా అన్నారు. అందరినీ చేతులు కాళ్ళు ముఖాలు కడుక్కున్నారా అని బాబా అడిగారు వారు కడుక్కున్నామని జవాబు చెప్పారు అప్పుడు బాబా డా॥ డాన్కిన్ చేత వారి యీ క్రింది సందేశాన్ని చదివించారు —

"నా క్రొత్త జీవితంలోని చాలా ముఖ్యమయిన యీ రోజున నా పాత జీవితపు శిష్యులకు - స్త్రీలకు, పురుషులకు - భక్తులకు, నా క్రొత్త జీవితంలోని సహచరులకు నేను నమస్కారం చేస్తున్నాను. అత్యంత దయామయుడయిన భగవంతుని మా అందరియొక్క లోపాలను, విఫలత్వాలను, బలహీనతలను క్షమించి పాత జీవిత శిష్యులను, భక్తులను వారి నమ్మకంలోను ప్రేమలోను దృఢంగా ఉండుటకు సహాయంచేయమని కోరుతున్నాను, భగవంతుని యెడల ఆయన దివ్య వ్యక్తీకరణ యెడల వారికున్న అవగాహనను దృఢపరచి, వారికి ధైర్యాన్ని బలాన్ని యిచ్చి యీ క్రొత్త జీవిత సహచరులను సత్యాన్ని అవలంభించి క్రొత్త జీవిత నియమాలను విశ్వాసంతోను విజాయితీతోను పాటించేలా చేయమని భగవంతుని కోరుతున్నాను."

ఈ విధంగా దేవుని ప్రార్థన చేసి బాబా తమ సహచరులందరను గదిలో నుంచి బయటకువెళ్ళి పది నిమిషములవరకు లోపలకు రావద్దని బయటనుంచి తలుపు సందులలో నుంచి లోపలకు చూడకూడదని కఠినంగా శాసించారు. అప్పుడు బాబా క్రొత్త జీవితం ప్రారంభించే ముందు మొదటివారు తీసుకున్న ప్రమాణాలు మరియొక మారు తీసుకుని అవి ధృవపరచుకున్నారు. అది ఆయన తరువాత బాబా వారి సహచరులందరిని లోపలకు రమ్మని చప్పట్లు కొట్టి పిలిచారు బాబా అప్పుడు ఒకరొకరినే వారి వద్దకు రమ్మని వారి పాదముల మీద శిరసునుంచి మ్రొక్కారు.

తరువాత నీలకంఠ్‌ని దశావతార స్తోత్రం చదవమన్నారు విష్ణుకూడా అతనితో కలిసి చదివాడు క్లైకోబాద్‌ని జొరాస్ట్రియన్ ప్రార్థన చేయమన్నారు అతనితో ఎరచ్, పెండు, కాకాలు కలిసి చదివారు. ఆ తరువాత వైదుల్‌ని ముస్లిమ్ ప్రార్థన

చదవమన్నారు. అఖరున డాన్‌కిన్ చేత క్రిష్టియన్ ప్రార్ధన చదివించారు. ఈ ప్రార్ధనలు (జొరాస్ట్రియన్, ముస్లిమ్, క్రిస్టియన్) బాబాయే చెప్పి వ్రాయించినవి. తరువాత సర్ ఎడ్విన్ ఆర్నాల్ట్ రచించిన ది సాంగ్ సెలెస్టియల్ (భగవద్గీతకు ఆంగ్ల అనువాదము) నుండి సీలూని డాన్‌కిన్‌ను చదవమన్నారు. వీటి తరువాత నూతన జీవిత గీతాన్ని నూతన జీవిత ప్రార్ధనను చదివారు. ఇవి చదువుతూ ఉండగా బొంబాయి నుంచి వచ్చిన ఒక ఖవ్వాల్ హార్మోనియమ్ వాయించాడు. తరువాత 10 గంటలకి మొదట మస్తులకి తరువాత సహచరులకు బాబా స్వయంగా వడ్డించారు.

సరిగ్గా మధ్యాహ్నం 2 గంటలకి మస్తులతోను, పిచ్చివారితోను, బీదవారితోను బాబా పని ప్రారంభించారు. మొదట వారి తలలు గొరిగి తరువాత వారి శరీరాలను సబ్బుతో తోమి వారికి వేడినీళ్ళతో స్నానాలు చేయించారు. స్నానాలు చేయించాక మస్తులకు పిచ్చివారికి బీదవారికి బాబా బట్టలు యిచ్చి ఒక్కొక్కరికి పరుండుటకు తడకలు కూడా యిచ్చారు. ఇవిగాక ఒక్కొక్కరికి ఒక పైజమా, ఒక బంకానా, రెండు దళసరి దుప్పట్లు, ఒక చాప యిచ్చారు బాబా. వీరంతా బంగళాలో వేరే వేరే గదులలో ఉంటున్నారు. వారి యోగక్షేమాలు చూడటానికి ఎరచ్, బైదుల్, గుస్తాద్‌జీ, పెండు, మురళీలను నియమించారు. నిలకంఠ్‌ని వారి ఆరోగ్యాలు జాగ్రత్తగా చూసుకుంటూ ఉండమన్నారు. ఆ రోజంతా బాబా భోజనం చేయలేదు. ద్రవపదార్ధాలు తీసుకుంటూ ఉపవాసం చేసారు. మర్నాడు ఉదయం 9 గంటలకు భోజనం చేసారు. ఆయన ఆ ఉదయం అక్కడ రహదారి బంగళాకి ఖాన్‌సామాగా ఉన్న హూస్సేన్ యింటిలో భిక్ష అడిగి తీసుకుని భోజనం చేసారు.

జూలై 28 నాటికి అబ్దుల్ ఘనీ మున్సిఫ్ పాత జీవితపు ఋణ విముక్తికి ఏర్పాటు చేసిన నిధికి రు 35,000/- మంజూవలె అప్పటికి రు 23,919 నగదురూపంగా వసూలయింది. ఇంకా రు 2,949 వరకు వాగ్దానాలు చేసారు. జూలై 31 వ తేదీ నాటికి రంజా అబ్దుల్లాచేత యీ వివరాలన్నీ ఒక సర్క్యులర్ లేఖమూలంగా అహమద్ నగర్‌నుంచి వ్రాయించి పంపించారు. ఆ డబ్బు యిచ్చినవారికి, యివ్వవలసిన వారికి, యింకా యిస్తారని అనుకున్నవారికి, యిదివరకు సర్క్యులర్‌తో అది చేరినట్లు సంతకం చేసి పంపమన్న చీటీలు చాలామంది పంపలేదు. అయినా చాలామంది డబ్బు పంపించారు. జూలై నెలలోనే చాలామంది ముందు వ్రాయకుండానే పంపించారు. కొంతమందికి చిరునామాలు సరిగా లేనందున పంపిన ఉత్తరాలు అందలేదు. ఆగష్టు

4 తో నిధి ముగించబడుతుందని వ్రాయగా ఆ తేదీకి అభ్యంతరం చెప్పారు కొందరు. అంతకు ముందు వ్రాసిన ఉత్తరంలో యీ సంవత్సరాంతము లోపల అని వ్రాయబడింది గనుక ఆ తారీఖు 31 డిసెంబరు వరకు పొడిగించాలన్నారు. త్వరలో కాని చేద్దామని ఏర్పాటుదారులు ఆగష్టు 4 వ తారీఖున నిధి మూసేస్తున్నామని వ్రాసారు. ఇప్పుడింకా రు 8,132 రావలసి ఉంది, మొత్తం రు 35,000/- అవడానికి. అందుచేత రంజా యీ సంవత్సరం ఆఖరు వరకూ మొత్తాలు పంపుతే స్వీకరించబడతాయని యిప్పుడు వ్రాసాడు ఇంతవరకు ఏమీ పంపనివారిని రు 50/- కి తక్కువ కాకుండాను రు 500/-కి ఎక్కువ కాకుండాను వెంటనే పంపించమన్నారు వెంటనే పంపలేని వారిని ఏ తారీఖునాటికి పంపగలరో వ్రాయమని వ్రాసాడు

సతారాలో ఒక రోజున బాబాకి అజీర్తి చేసింది అందుకు ఆయన పథ్యం చేయవలసి వచ్చింది ఏకాంతవాసాలు ఉపవాసాల వల్ల ఆయన ఆరోగ్యం చెడింది.

నూతన జీవితం ప్రారంభించక ముందే కిట్టీ రానోలను బాబా పిలుస్తే బయలుదేరి రావడానికి సిద్ధంగా ఉండమని చెప్పారు వారి ఆరోగ్యాలు జాగ్రత్తగా చూసుకుంటూ బొంబాయిలో వీలయినంత నడక రోజూ నడుస్తూ సిద్ధంగా ఉన్నారు బాబా రమ్మనగానే బయల్దేరుదామని సతారాలో ఉండగా వారిద్దరిని బాబా రమ్మని తంతి యిచ్చారు వారిరువురు రాగానే అందరూ మళ్ళీ కలిసినందుకు అంతా సంతోషించారు వా లొక నెలరోజులుండి బాబా చెప్పగానే వెళ్ళి వారి ఉద్యోగాలు చేసుకోవడానికి బొంబాయి తిరిగి వెళ్ళిపోయారు.

సతారాలో ఒక పొట్టి ఆడ గుఱ్ఱాన్ని కొన్నారు బాబా అక్టోబరులో సతారా నుంచి మహాబలేశ్వర్ వెళ్ళారు బాబా వెళ్ళేటప్పుడు దాన్నికూడా తీసుకు వెళ్ళారు. ఆ గుఱ్ఱానికి బాబా 'బీగమ్' అని పేరు పెట్టారు. మహాబలేశ్వర్‌లో వాతావరణం, అక్కడ నీడలలో షికారుకి వెళ్ళడం, బాబాకి బాగా నచ్చింది షికారుకి వెళ్ళినప్పుడల్లా బీగమ్ బాబాతో నడిచి వెళ్ళేది బాబాతో యింటికి వచ్చాక మెట్లు ఎక్కి బాబావద్దకు వసారాలోకి వచ్చేది బాబా లోపల గదిలో కూర్చుంటే తిన్నగా బాబావద్దకు వెళ్ళేది అప్పుడు బీగమ్‌కి బాబా కారెట్‌లు తినిపించేవారు ఒక్కొక్కప్పుడు బాబా లేకపోయినా ఆయన కుర్చీవద్దకు వెళ్ళి బాబా కోసం వేచి ఉండేది.

ఇదివరకటి నిబంధనలు, ఆజ్ఞలు, నూతన జీవిత సహచరులకి చెప్పిన నియామాలు వగైరా, పాత జీవితపు శిష్యులకు చెప్పినవి, ఏర్పాటుదార్లకి చెప్పినవి అన్నీ పాటించాలి బాబాతో గాని, శ్రీంతోగాని, బాబాతోఉన్న సహచరులతో గాని ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపకూడదు. వారిని కలుసుకోవడానికి గాని, చూడడానికి గాని ప్రయత్నించకూడదు

సతారా వచ్చిన తరువాత బాబా ఆదీ అక్బర్‌ని ఏదో ప్రత్యేకమయిన పని చెప్పి బొంబాయి పంపించాడు బాబా కొన్ని సంవత్సరాలనుంచి సాధువులతోను, యోగులతోను, మహాత్ములతోను, మస్తులతోను సాంగత్యం చేస్తూనే ఉన్నారు. ఈ పనేగాక బీదవారికి బియ్యం, గోధుమలు, జొన్నలు, వేరుశెనగకాయలు, గుడ్డలు యిలాంటివి పంచిపెట్టడం వల్ల బాబా అనేక వేలమంది ప్రజలతో సాంగత్యం కలిగింది ఎవరి వద్దనుంచయినా అంటు తగిలిందో యేమో బాబాకి యీమధ్య కళ్ళు పుసి కట్టడం, కళ్ళలోనుంచి ద్రవమేదో కారడం, కళ్ళు నొప్పి పెట్టడం మొదలయిన వాటితో బాధపడుతున్నారు హరిద్వార్ రిషీకేశ్‌లో బాబా చేసిన కుంభమేళాపని తరువాత అకస్మాత్‌గా బాబాకి యీ జబ్బు చేసింది అందుచేత డేరాడూన్‌లో కంటి డాక్టరయిన డా॥ బి ఎస్ రాత్కోని పిలిచి కళ్ళు పరీక్ష చేయించుకున్నారు. అతడు అతని కుమారుడు బల్దేవ్‌సింగు బాబాకి చికిత్స చేసారు. ఇప్పుడు బాబాకి చాలా నయంగా ఉంది

ఈ మధ్య దేశంలో, అస్సాం, బెంగాల్, బీహార్, రాష్ట్రాలలో, కలిగిన భూకంపాలు, వరదలు వాటివలన విషాద సంఘటనలు జరిగాయి. మన దేశంలోనే గాక సాధారణంగా ప్రపంచం అంతటా అశాంతి అలజడి ప్రబలి ఉందని బాబా అన్నారు ఇదంతా బాబాయొక్క నిరాశా నిస్పృహలతోకూడిన నూతన జీవితంమీద ప్రభావం కలిగి ఉంటుందని బాబా అక్టోబరు '49 లోనే నూతన జీవితం ప్రారంభించేటప్పుడు అన్నారు. సుమారు యీ సంవత్సరం నుంచి చూస్తే బాబా తమ బలహీనతలవల్ల సహచరుల బలహీనతల వల్ల నూతన జీవితం అసలు నిబంధనల ప్రకారం జరిగించ లేదని అనవలసి వస్తోంది కొంతవరకు బాబా స్వంతంగా అప్పుడప్పుడు తెచ్చుకున్న కోపతాపాలు వారు మొదట్లో తీసుకున్న ప్రమాణాలకి విరుద్ధంగా, 'పోనీలే ఎలాగోలాగు నూతన జీవితం గడుపుదాం' అని అన్నట్టుగా ఉంది గాని కఠినంగా నియమబద్ధంగా జరిగినట్టు లేదు.

సుమారు యీ 12 నెలల నూతన జీవితపు అనుభవంతో బాబా సెప్టెంబరు 20 వ తేదీనాటికి వ్యక్తిగతమయిన బలహీనతలను, వారి ఆజ్ఞలను పాటించడంలో లోపాలను జాప్యాలను యికముందు ఎంతమాత్రము సహించకూడదని నిశ్చయించారు. తప్పు యితరులదయినప్పుడు బాబా నిబంధనలు సరిగా పాటించడంలో తమ బలహీనతను ఒప్పుకునేవారు సహచరుల యెడల దయ చూపడం వల్ల తాము మొదట మెహెరాబాద్‌లో తీసుకున్న ప్రమాణాలకి భంగం కలుగుతున్నట్లు భావించారు బాబా. అక్టోబరు 16 వ తేదీ నుంచి బాబా తమ సహచరులకు నూతన జీవితంలో కొనసాగేందుకు గాని పాత జీవితపు శిష్యుడుగా ఉండేందుకు గాని వారికి స్వేచ్ఛనిస్తూ యింకో అవకాశం యివ్వబోతున్నారు. నూతన జీవితంలో ఉండడమో లేక వారు మరల పాతజీవితపు శిష్యులుగా ఉండడానికి నిశ్చయించుకోవడమో జరగాలి ఇంత వరకు సంపాదించిన నూతన జీవిత అనుభవాన్ని బట్టి జాగ్రత్తగా అన్ని విషయాలు సింహావలోకనం చేసుకుని వారి వారి స్వంత బలహీనతలను దృష్టిలో పెట్టుకుని ఏదో ఒక నిశ్చయం చేసుకోవాలి. వారందరు బాబాతో ఉండి నవ్యజీవితం కొనసాగించాలని నిర్ణయం తీసుకుంటే బాబా వారితో కొందరు సహచరులను తీసుకుని మూడు నెలల పాటు – నవంబరు, డిశెంబరు (1950) జనవరి, 1951 మస్తులతోను, బీదవారితోను ప్రత్యేకపు పనిమీద బయలుదేరి పర్యటిస్తారు మిగిలిన సహచరులను మహాబలేశ్వర్‌లో వదిలేస్తారు వారు అక్కడ ఉండి ఆడవారిని కనిపెట్టుకుని వారి సదుపాయాలు చూస్తూ ఉంటారు.

మహాబలేశ్వర్‌లో బాబా ఉన్నపుడు ఒక రోజున ఒక గజల్ చెప్పారు. అది ప్రియతముడు రచించినదే అందులో బాబా ఏమి చెప్పారంటే — "నా మౌనము అంతమగుటకు సమయము వచ్చినట్లు సంకేతమేమిటంటే, అప్పుడు నా మాట నా సందేశము ప్రతీ మనిషి పెదవులమీద నాట్యం చేస్తూంటాయి అంటే ప్రతియొక్క ఆత్మనుండి హృదయాన్ని కదిలించే ఆక్రోశం వినిపించాలి నానోటి నుండి ఆ పలుకు రావడమునకు సర్వమానవులకు జాగృతి కలుగడానికి ఎంతో వ్యవధి ఉండదు" అని వివరించి చెప్పారు, తాము చెప్పిన గజల్ యొక్క తాత్పర్యం

బాబా మహాబలేశ్వర్ నుంచి నవంబరు మొదటి వారంలో బయలుదేరి కొల్హాపూరు, మీరజ్, హుబ్లీ, హైదరాబాద్, బొంబాయి నగరాలు, తరువాత అస్సాం, బెంగాల్, ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలు తిరిగి వారి మస్తు పనులు తరువాత వారి

నూతన జీవితపు మూడు రకాలు — భిక్షాటనం, లంగోటీ, జిప్సీ జీవితాలుగా జరుప డానికి వెళ్ళడానికి నిశ్చయించారు.

16 అక్టోబరు 1950 తేదీ తరువాత చేసే పర్యటనలలో కాలినడక, రైలు ప్రయాణాలు, బస్సుమీద వెళ్ళడం అన్నీ ఉంటాయి ఈ ప్రయాణాలలో సహచరులు కొందరు బాబాతో ఉంటారు.

16 అక్టోబరు (1950) తేదీన నూతన జీవితపు పథకాలు I, II రద్దు చేస్తానన్నారు "కాదు" గాళ్ళన్నమాట. యికమీదట ఉండదు. ఆతేదీనుండి పథకాలు I-B, I-C లలో ఉన్న సహచరుల వద్దనుండి బాబా డబ్బు తీసుకోరు వారు ఏదైనా పంపితే అంగీకరించారు ఆ తారీఖునుంచి అసలు ఆ పథకాలే ఉండవు.

బాబా వారి సహచరులు యీ జరిగిన సంవత్సరం నూతన జీవితం సరియైన మార్గంలో జరుపలేదని బాబా అంటున్నారు అందుచేత 16-10-50 వ తేదీన కొద్ది గంటలకాలం పాత జీవితంలోకి అడుగుపెట్టాలనీ ఆ గడువు తీరిపోగానే వెంటనే మరల క్రొత్త జీవితంలోకి వెళ్ళిపోవాలని బాబా నిశ్చయించుకున్నారు అందుచేత ఆ కొద్దిసేపటికి నవ్య జీవితపు సహచరులందరు I-B, I-C పథకాలవారు అందరూ, బాబాకి యావజ్జీవిత సేవకసహచరులతో సహా, పాత జీవితపు శిష్యులుగా మారతారు. అక్టోబరు, 16, 1950 నుంచి ప్రారంభమయ్యే సక్రమ నూతన జీవితంలో ఉండి పోవడమా లేదా అని వారు నిశ్చయించుకుందుకు బాబా వారికి నూతనంగా ఒక అవకాశం యిస్తున్నారు. మొదట వారంతా 'అవును' అని సంతకం పెట్టిన నిబంధనలన్నీ వారి మీద బంధితమై ఉంటాయి 16 అక్టోబరు, 1950 నుంచి యింక పాత జీవితపు శిష్యులు, ఏర్పాటుదార్లు, బాబాయొక్క సేవకులు ఉంటారు. ప్రస్తుతం నూతన జీవితంలో ఉన్నవారికి పైన చెప్పిన నూతనావకాశం ఉంటుంది. క్రొత్త వాళ్ళకి కాదు. నూతన జీవితంలో ఉండిపోవాలని నిశ్చయించుకున్న సేవక—సహచరులు బాబాను అన్నివిధాల నిజాయితీతోను భక్తి శ్రద్ధలతోను సేవిస్తూ ఆయనకి నూటికి నూరుపాళ్ళు విధేయులై ఉంటారు. మొదటి నిబంధనలకు వ్యతిరేకంగా బాబా చెప్తున్నారని తోచినా బాబా ఏది చెప్తే అది పొల్లు తప్పకుండా ఆయనకి విధేయులై ఆచరించాలి వారు.

బాబా నవ్యజీవితం శాశ్వతమయినది ఈ నూతన జీవితంలో బాబా సేవకులు కాక యితరులు ఎవరు ఆ జీవితం జీవించాలని కోరుతారో వారు స్వతంత్రంగా అలా చేయవచ్చును అని బాబా యీ విధంగా వివరించి చెప్పారు.—ఈ ప్రవచనానికి శీర్షిక — ఇదిగో —

## నూతన జీవితం బాబా అనంతరం ఎలా ఉంటుంది ?

"ఈ నవ్యజీవితం అనంతమయినది నా శారీరక మరణం తరువాతకూడా ఎవరయితే అబద్ధాన్ని పూర్తిగా వదిలేస్తారో, ద్వేషాన్ని, కోపాన్ని, అసత్యాలని, ఆశలని, కామాన్ని ఎవరు త్యాగం చేస్తారో, ఎవరయితే యీ పని నిర్వర్తించడానికి కామవికారమయిన పనులు చేయకుండా ఉంటారో, ఎవరు ఎవరికీ ఎట్టిహానీ చేయరో, ఎవరు ఎవరిమీదా చాడీలు చెప్పరో, పరోక్షనిందలు చేయరో, ఎవరు భౌతికమయిన ఆస్తులకోసం పదవులకోసం ప్రాకులాడరో, ఎవరివలనా జోహార్లు అంగీకరించరో, ఎవరు గౌరవాన్ని ఆశించడము, అవమానాన్ని వద్దని దూరంగా పోవడము చేయకుండా ఉంటారో ఎవరు ఏమన్నా ఎవరన్నా భయపడకుండా ఉంటారో, ఎవరయితే దేవుని మీదమాత్రమే పూర్తిగా నమ్మకం ఉంచుతారో, ప్రేమించడం కోసమే దేవుని ఎవరు ప్రేమిస్తారో, దేవుని ప్రేమికుల మీద నమ్మకం ఎవరు ఉంచుతారో. వ్యక్తీకరణలలో ఎవరు విశ్వాసం కలిగి ఉంటారో, అయినా ఎవరు భౌతికంగా కానీ ఆధ్యాత్మికంగా గానీ లాభం ఆశించకుండా ఉంటారో సత్యాన్ని ఎవరు విడనాడరో, ఎవరు కష్టాలను క్లేశాలను ధైర్యముతోను హృదయపూర్వకంగా నూటికి నూరు పాళ్ళ సంతోషంతో ఎదుర్కొనగలుగుతారో, ఎవరయితే కులమతాలకి, మత సంబంధమయిన కర్మకాండలకి ప్రాధాన్యత యివ్వరో-వారి వారివలన నవ్యజీవితం సజీవంగా ఉంచబడుతుంది" అని బాబా చెప్పారు

నవ్యజీవితం దానంతట అదే, అది జీవించడానికి ఎవరూ లేకపోయినా, జీవిస్తుంది అన్నారు బాబా నిజంగా, యిలాంటి జీవితం మానవమాత్రుడయిన వాడు జీవించగలిగితే వాడు దేవుడయిపోతాడు పాత జీవితపు శిష్యులకి, ఏర్పాటుదార్లకి, పాత ఆశ్రమ స్త్రీలకి బాబా ఏ బాధ్యతలు అప్పగించారో యిదివరకు, ఏమేమి వారికి ఆచరించమని చెప్పారో అవన్నీ యిప్పటికీ ఎప్పటికీ వర్తిస్తాయి

మహాబలేశ్వర్‌లో 16-10-50 తేదీన ఉదయం 7 గంటలనుంచి 11 గంటల వరకు జరిగే కార్యక్రమానికి రమ్మని పాత జీవితపు శిష్యులను, (ఆడవాళ్ళని కాకుండా) ఏర్పాటుదార్లని ఆహ్వానించారు. వీలుగా ఉన్నవారందరూ రావచ్చును. ఎవరయితే రాలేరో వారు విచారించవకూడదు. వారందరికి 16-10-50 వ తేదీన బాబా యిచ్చిన సందేశం ఒక ప్రతి పంపబడుతుంది. అయినా నూతన జీవితంలోని సహచరులందరు, I-B, I-C పథకంలో వారందరిని, ఏర్పాటుదార్లని కలిపి, 16-10-50 వ తేదీ ఉదయం జరిగే కార్యక్రమానికి తప్పక హాజరవాలి- అని బాబా చెప్పారు.

ఈ ఆహ్వానాన్ని అంగీకరించినవారు, వారు మహాబలేశ్వర్ వచ్చినప్పుడు, వారి వసతి భోజన సదుపాయాల గురించి, రాకపోకలకి బళ్ళగురించి వారే ఏర్పాటు చేసుకోవాలి. కార్యక్రమం అయిపోగానే వారి వారి ఊళ్ళకి వెళ్ళిపోతారు. వచ్చినవారు ఏ ఏ పరిస్థితులలోను వారి పాత జీవిత వ్యవహారాలు గురించి బాబాతో గాని వారి సహచరులతోగాని మాట్లాడకూడదని హెచ్చరిక చేస్తున్నారు.

నూతన జీవితంలో బాబా ఎవరి దగ్గరనుంచీ డబ్బు తీసుకోరు, ఎవరికీ యివ్వరు. కానీ యిదివరకు పంపిన సర్క్యులరు ప్రకారం పాత జీవితపు ఆశ్రమ స్త్రీల దగ్గరనుంచి కానుకలు మాత్రం తీసుకుంటారు. నూతన జీవితంలో బాబాతో ఉండిపోయి మిగిలిన వారిదగ్గరనుంచి కూడా వారిచ్చే ఆస్తి వగైరా తీసుకుంటారు. ఈ డబ్బు, అత్యవసర నిధికి వచ్చినది మస్తు కాతాలో జమ కట్టబడుతుంది. నలుగురు స్త్రీల పోషణ నిమిత్తం వారికి వేరే వేరే కాతాలున్నాయి.

జీవితాంతము వరకు సేవక - సహచరుల పోషణ కొరకు కాకా దగ్గర ఉన్న డబ్బు జూన్ 1951 నెలాఖరు వరకు కావలసినది 16 అక్టోబరు 1950 తేదీన తీసుకుని మస్తు కాతాలో జమ చేయబడుతుంది. అందుచేత 16 అక్టోబరు, 1950 నుంచి రెండే కాతాలుంటాయి — స్త్రీల కాతా ఒకటి, మస్తుల కాతా రెండవది. ఈ మస్తు కాతాలో నుంచి బాబా మస్తులతోను పేదవారితోను చేసె పనికోసము, సేవకుల పోషణ కోసము ఉపయోగిస్తారు. ఈ రెండు కాతాలలోను ఉన్నడబ్బు బాబా స్వేచ్ఛగా ఖర్చు పెడతారు.

అక్టోబరు 16, 1950 నుంచి దేవుడు, నూతన జీవితం గడపడానికి ఆయన కోరినట్లు ఆయనకు ధైర్యాన్ని, బలాన్ని యిస్తాడని బాబా భావిస్తున్నారు — అని బాబా విశదీకరించారు.

## 16 అక్టోబరు 1950 తేదీన జరిగే కార్యక్రమ వివరాలు :—

క్రొత్త జీవితపు సహచరులందరు ఉదయం 7 గంటలకు చేతులు, కాళ్ళు, ముఖము కడుక్కొని, వీలయితే స్నానం చేసి, సిద్ధంగా ఉండాలి.

ఉదయం 7 గంటలనుంచి 11 గంటల వరకు —

(1) బాబా దేవుని క్షమాపణ వేడుకుంటారు.

(2) నూతన జీవిత సహచరులందరు బాబాని క్షమించమని కోరుతారు. బాబా వారిని క్షమిస్తారు

(3) బాబా, వారి సహచరులు 16-10-50 వ తేదీన నాలుగు గంటలపాటు పాత జీవితంలోకి ప్రవేశిస్తారని ప్రకటన, దానితో బాబా సందేశము చదివి బడతాయి.

(4) బాబా వారి పాతజీవితపు శిష్యులందరకు నమస్కారం చేస్తారు తరువాత ఏర్పాటు దార్లకి ఉన్న బాధ్యతలను వారికి మరల చెప్తారు.

(5) ప్రమాణం తీసుకుని బాబా నవ్యజీవితంలో ప్రవేశిస్తారు.

(6) బాబాయొక్క నవ్యజీవితంలో బాబాయెడల నూటికి నూరుపాళ్ళు విధేయత చూపడానికి ఎవరు నిశ్చయించుకున్నారో నూతన జీవిత నిబంధనలు నూటికి నూరుపాళ్ళు పాటించడానికి ఎవరు నిశ్చయించుకున్నారో చెప్పాలి అని సహచరులను బాబా అడుగుతారు.

(7) బాబా దేవుని బలాన్నిమ్మని వేడుకుంటారు.

(8) హిందూ, జొరాస్ట్రియన్, ముస్లిమ్, క్రిస్టియన్ ప్రార్థనలు.

(9) ఒక ఖవ్వాల్ నూతన జీవితపు పాట పాడి నూతన జీవితపు ప్రార్థన చదువుతాడు.

(10) బాబా ఒక మస్తుకి క్షవరం చేసి అతనికి స్నానం చేయించి ఆ మస్తుకి నమస్కారం చేస్తారు

(11) ఉందామనుకున్నవారు ఉండి నూతన జీవితంలో బాబాను సేవించ దలచిన వారు తప్ప మిగిలిన వారంతా వెళ్ళిపోతారు.

బాబాను నవ్య జీవితంలో సేవించడానికి నిశ్చయించుకున్న వారందరూ యీ క్రింది నిబంధనలు పాటిస్తామని మొదట్లో 'అవును' అని సంతకాలు చేసారు—

(1) వారికి ఏమి జరిగినా బాబాను బాధ్యులుగా ఎంచకూడదు.

(2) బాబా అద్భుతాలు చేస్తారని ఆశించకూడదు. వారి ఆధ్యాత్మికమయిన 'తాళం చెవి' త్రిప్పుతారని గాని వారి 'నజర్' తమమీద ఉంచుతారనిగాని ఆశించరాదు

(3) బాబావద్ద నుంచి ఆధ్యాత్మికంగా గాని భౌతికంగా గాని ఏ విధమయిన లాభమూ ఆశించకూడదు.

(4) ఎవరితోనూ ఎటువంటి కామవికారమయిన పనులూ చెయ్యకూడదు.

(5) ఎవరి వద్దనుంచి ఎవరికొరకు, బాబా కోసం కూడా డబ్బు అంగీకరించ రాదు.

(6) రాజకీయాలతో ఏ విధమయిన సంబంధమూ కలిగి ఉండరాదు.

(7) మాటలవలన గాని చేతలవలన గాని కోపం వ్యక్తం చేయరాదు.

(8) అన్యాయంగా విమర్శ చేయరాదు.

(9) ఎటువంటి పరిస్థితులలోను అబద్ధాలు చెప్పకూడదు.

(10) ఎవరి వద్దనుండి సన్మానము పొందయకూడదు: బాబాకు గాని తమకు గాని సన్మానంచేసే పరిస్థితులు సృష్టించకూడదు

(11) అన్ని విధములయిన "ఆశాభంగాలకి కష్టాలకి సిద్ధంగా ఉండాలి. 16-10-50 తేదీనుంచి బాబాకి సేవ చేసేటట్లు నిశ్చయించుకున్నవారు తీసుకున్న నిర్ణయం వారంతట వారే ఐచ్ఛికంగా తీసుకున్నారని, దానికి ఫలితం ఎలా ఉన్నా,వారి నిర్ణయానికి వారే బాధ్యులని బాబా సమక్షంలో ప్రకటించాలి"— అని బాబా చెప్పారు.

ఈ పైన జరిగిన తతంగం అంతా సెప్టెంబరులోనే జరిగింది. మరల యిది జరిగిన వారంరోజుల్లో బాబా అందరికీ యీ క్రింది విషయాలు తెలియపరిచారు.

(1) పాత జీవితపు భారాలన్నీ తొలగించ బడ్డాయి.

(2) ఈ నూతన జీవితంలో బాబా ఎవరికీ డబ్బు యివ్వరు ఎవరి వద్దనుంచి స్వీకరించరు. ఈ నియమం యింకా ముఖ్యంగా 16-10-50 నుండి ఆఖరివరకు అసలులో ఉంటుంది

(3) 16-10-50 నుంచి రెండే కాతాలుంటాయి — స్త్రీలకాతా, మస్తు కాతా.

(4) మస్తు కాతాలోనుంచి బాబా మస్తులకోసం పేదవారికోసం ఖర్చు పెడతారు. ఇంకా మిగులుతే బాబా సేవకులకోసం వారి యిష్టం వచ్చిన పనికోసం ఖర్చు చేస్తారు.

(5) మస్తు కాతా పరిమితి కలిగి ఉంది అందులో సుమారు రు 5,000/- ఉన్నాయి. ఈ డబ్బు అయిపోతే బాబా, వారి సేవకులు నిష్పాయులయే అదృష్టం వారికి కలుగుతుంది

(6) బాబా నవంబరు, డిసెంబరు, జనవరి యీ మూడు మాసాల్లోనూ వారు చేయదలచుకున్న గొప్ప మస్తు పనికి డబ్బు కావాలి

(7) పాత జీవితంలో ప్రవేశించే యీ నాలుగు గంటలలోనే యిందుకోసం బాబా డబ్బు అంగీకరిస్తారు అంగీకరించి ఆడబ్బు మస్తుకాతాలో వేసుకుంటారు.

(8) ఎవరయితే నిజంగా వారికి డబ్బు యిద్దామనుకుంటున్నారో ఒక్కొక్కరు రు 50/- లకి తక్కువగాకుండాను, రు 500/- లకి ఎక్కువ కాకుండాను యివ్వాలి.

(9) తప్పించుకోలేని కారణాల వల్ల ఎవరయితే మహాబలేశ్వర్‌లో 16-10-50 ఉదయాన్ని జరిగే కార్యక్రమానికి హాజరుకాలేదో వారికి నిజంగా మస్తు కాతాకి డబ్బుయివ్వాలని ఉంటే ఆ డబ్బు ఆదీ కె ఇరానీ, కింగ్స్ రోడ్డు, అహమద్ నగర్ అనే చిరునామాకి అక్టోబర్ 13 వ తేదీ లోపున ఆతనికి అందేలా పంపవలెను ఈ డబ్బు పోగుచేసి స్వయంగా ఆదీ తీసుకు వచ్చి బాబాకి ఆయన పాత జీవితంలో ప్రవేశించిన నాలుగు గంటల కాలం లోను యివ్వగలడు — అని బాబా అందరికీ ఉత్తరాలు పంపించారు ఇదివరకు బాబా పంపించిన ఆహ్వానం ప్రకారం పాత జీవిత శిష్యులు, బాబా భక్తులు (బాబా వు అక్టోబరు 16 కి మహాబలేశ్వర్ కి వస్తామని వ్రాసినవారు)

ఏర్పాటు దారులు I-C పథకం లోని నలుగురు సహచరులు కలిసి మొత్తం అందరూ 20 మంది అక్టోబరు 16 వ తేదీకి మహాబలేశ్వర్ లో హాజరయ్యారు. బాబా తో ఉంటూ ఉన్న సేవక సహచరులందరు వచ్చారు.

బాబా వారిని సరిగ్గా పావు తక్కువ 7 గంటలకి రమ్మన్నారు చాలా మంది బాబా చెప్పిన సమయానికి ముందే వచ్చి ఆవరణలో వేచియున్నారు. వచ్చారు గదా అని వారందరిని ఒకరి తరువాత ఒకరిని రమ్మని బాబా ఆలింగనం చేసుకున్నారు. సమవేశం అయేవేళకి సరిగా 7 గంటలకి లోపలికి రమ్మన్నారు. అందరూ వచ్చాక తలుపులు మూసారు బాబా కుర్చీలో కూర్చుని కొద్ది గంటలకాలము వారు పాత జీవితంలోఅడుగుపెట్టానని అన్నారు బాబా కుర్చీ కుడివైపున అబ్దుల్ ఘనీ కూర్చునిఉన్నాడు. సహచరులందరు పాతజీవితం లోనికి వచ్చేసారని బాబా ప్రకటించారు. I, I-B, I-C, II పధకాలు రద్దు అయాయని కూడా బాబా ప్రకటించారు. అందుచేత I-B, I-C పథకాలలో ఉన్నవారి వద్దనుండి డబ్బు అంగీకరించనని బాబా అన్నారు.

(1) 16 అక్టోబరు, 1949 వ తేదీ నుంచి నూతనజీవితం వారు అనుకున్నట్లుగా జీవించలేక పోయినందుకు భగవంతుని క్షమించమని బాబా వేడుకున్నారు

(2) నూతన జీవిత సహచరులందరిని నూతన జీవిత నిబంధనలను పాటించలేనందుకు వారిని క్షమించానని బాబా చెప్పారు సహచరులను కూడా బాబాను క్షమించమని బాబా కోరారు.

(3) డా॥ డాన్‌కిన్ బాబా ఉపదేశాన్ని చదివాడు డా॥ దేశ్‌ముఖ్ దానికి హిందీ అనువాదాన్ని చదివాడు వచ్చిన వారందరికీ బాబా స్వయంగా ఉపదేశం యొక్క ఒక ప్రతిని పంచి పెట్టారు. ప్రతివారిని బాబా ఉపదేశపాఠాన్ని జాగ్రత్తగాచదివి అర్ధంచేసుకోవాలని బాబా చెప్పారు. ప్రతులన్నీ, వారికి అందులో ఉన్నది అర్ధంకాకపోతే, బాబాకి తిరిగి యిచ్చివేయమని అన్నారు. అందరూ వారి వారి ప్రతులు అట్టేపెట్టుకున్నారు

(4) పాతజీవితపు శిష్యులకు భక్తులకు బాబా వందనం చేసారు.

(5) మస్తులతోను బీదవారితోను బాబా చేసే పని కోసం యిచ్చిన విరాళాలన్నీ అంగీకరించారు బాబా ఆవీ తీసుకు వచ్చిన సొమ్ము అంతా కూడా బాబా అంగీకరించారు.

21 వ అక్టోబరు '50 వ తేదీన ప్రారంభించే మస్తు పని పేదవారితో ప్రత్యేకంగా పైన చెప్పిన మొత్తాలన్నీ ఉపయోగిస్తారని బాబా ప్రకటించారు.

(6) తరువాత బయటకు పోవలసిన వారికోసం 15 నిమిషాలు విరామం యివ్వబడినది

(7) అక్టోబరు 15 తేదీన మహాబలేశ్వర్ చేరుకున్న బాబా భక్తులందరు పాత జీవితపు శిష్యులందరు బాబా చెప్పినట్లు ఆయన పాటించడంలో ఏదయినా కష్టం ఉంటే అవి కాగితం మీద రెండు ప్రతులు వ్రాసి యిచ్చి వారి వద్ద ఒక నకలుంచుకోమని బాబా చెప్పారు వాటికి బాబా ఒకటి తరువాత ఒకటి చదివించి జవాబులు చెప్పారు.

(8) గోడమీద ఉన్న బాబా చిత్రానికి పాత జీవితము కొత్త జీవితము అంశాలు ఎడమ వైపున కుడివైపున అతికించారు కుడివైపున ఉన్న పాతజీవితం "సంపూర్ణదివ్యత్వము—దివ్యమానవుడు" అని, ఎడమ వైపున ఉన్న కొత్తజీవితం "సంపూర్ణ నమ్రత — సాధరణ మానవుడు" అని వ్రాసి పెట్టారు.

(9) ఒక అరగంట విరామం యివ్వబడింది. ఈ సమయంలో ఒక చిన్న లడ్డు బాబా ప్రసాదం పంచిపెట్టారు అందరికీ తరువాత అందరూ టీ తీసుకున్నారు ఆశ్రమస్తులయిన స్త్రీలలో మిస్ అన్సారీ దేశాయి అను నామెకు వారసత్వంలో రెండు వేల రూపాయిలు రాగా అది ఆమె బాబాకు సమర్పించమని సరోష్‌కు యిచ్చింది సరోష్ అక్టోబరు 16 వ తేదీన మహాబలేశ్వర్‌లో ఆ మొత్తాన్ని బాబాకి పాతజీవితంలో ఉండగా అందజేసాడు బాబా యీ సొమ్ము అంగీకరించి మస్తు కార్యక్రమానికి ఉపయోగిస్తానన్నారు

ఆ రోజున సమావేశమయిన ప్రేమికులందరకు బాబా ఒక సెర్మన్ (ఉపదేశం) యిచ్చారు, డాన్‌కిన్ చేత చదువబడిన యీ ఉపదేశం యొక్క అంశాల మీద ప్రతిరోజూ ధ్యానం చెయ్యమని ప్రేమికులకు బాబా చెప్పారు ఈ ఉపదేశపు సారం యీ క్రింది విధంగా ఉంది.

## బాబా ఉపదేశం (సెర్మన్ 16_10_50)

ప్రస్తుతము యీ కొద్ది గంటల కాలము పాత జీవితము నందున్నాను. గనుక సుస్థిరమయినటువంటి దివ్యమైన యదార్థములను మీకు నేను చెప్తాను

అవశ్యంగా మనమందరము ఒక్కటే. అందులకు విరుద్ధముగా నున్నామని యనుకొనడం అజ్ఞానము వల్లనే. జీవుడు తననుతాను తెలుసుకొనుటకు చైతన్యమును (తెలివిని) కోరుతాడు ఈ లక్ష్యమును సృష్టిమీద ఆధారపడకుండా స్వతంత్రముగా సాధించలేడు గనుక మానవుడు ప్రత్యగాత్మగా అనుభవములను పొందుట ద్వారా జ్ఞానమును సంపాదించవలెను ఇదంతా ఊహాజనితమే కావున జీవాత్మకు ప్రథమంగా జ్ఞానమునకు బదులు అజ్ఞానము ఎదురగుచున్నది. ద్వైతరూపములు మాయాసృష్టి జాలము అంతా అజ్ఞానసంజనితమే జననము, మరణము – సుఖము, దుఃఖము – పుణ్యము, పాపము - మంచి, చెడ్డ అన్నీ సమముగా యీ అజ్ఞానము యొక్క ఆవిర్భావమే నీవు ఎప్పుడూ పుట్టనూలేదు – చావనూలేదు , నీవు ఎప్పుడు బాధపడనూ లేదు – ఇక పడేదీలేదు , నీవు ఎల్లకాలముల యందు ఉంటివి, ఎల్లప్పుడూ ఉందువు, నీ ప్రత్యేకస్థితి ఊహాజనితము.

జీవాత్మ అనేక రూపములలో అనుభవమును సంపాదిస్తుంది , రాజా, బిచ్చగాడు , ధనికుడు, పేదవాడు – పొడుగు, పొట్టి_బలవంతుడు, బలహీనుడు, రూపవంతుడు, కురూపి , హంతకుడు, హతుడు జీవాత్మ ఎంతకాలము నిజముగా ఒకటి అవిభాజ్యము అయినా తాను వేరు అని భావిస్తూ ఉంటుందో యీ అనుభవములు పొందుతూనే ఉండవలసి ఉన్నది మాయామయమయిన యీ అనుభవముల యొక్క సంస్కారములను జీవాత్మ ఎప్పుడైతే కడిగి వేసుకుంటుందో దాని అసలు నగ్న స్వరూపమును పొంది ఏకము, అవిభాజ్యము, సత్యము, అనంతము అగు పరమాత్మతో తన ఏకీభావమును పూర్తిగా గుర్తించును

ఈ సంస్కార బంధనముల నుండి జీవాత్మ అనేక మార్గముల వలన స్వేచ్ఛను పొందును భగవత్సాక్షాత్కారము పొందుటకు యీ మార్గములలో అతి ముఖ్యమైనది ప్రేమ ఈ ప్రేమద్వారా జీవాత్మ భగవంతునిలో పూర్తిగా లీనమయి

పోతుంది తుదకు తనను తాను పూర్తిగా విస్మరించును ఆ సమయంలోనే ఏదుగు పడి స్పృశించిన దానినల్లా భస్మీపటలం చేసినట్లు అకస్మాత్తుగా జ్ఞానోదయమయి అజ్ఞానాన్ని పటాపంచలు గావిస్తుంది.

ఈ జ్ఞానము భ్రాంతులను, సంశయములను, చింతలను నిర్మూలిస్తుంది. సకలమైన బాధలుపోయి జీవిత పరమావధి అయిన శాశ్వతశాంతి, నిత్యానందము కలుగుతుంది జీవాత్మ యిప్పుడు సమస్తమయిన మాయల నుండి ముక్తి పొంది స్వస్వరూపమును తెలుసుకుంటుంది

ఈ జ్ఞానము ఆశలకు కోరికలకు అతీతమయినది. గావున మనము ఆశించవద్దు.

ఈ జ్ఞానము మనకు భావనాతీతమయినది. మనము అవగాహనను చేసుకోలేనటువంటిది, గావున మనము దానిని తర్కించవద్దు

ఈ జ్ఞానము నిశ్చయములలో కెల్ల నిశ్చయమయినది కావున మనము సంశయించవద్దు.

కామయుక్తము, ఆశాసహితము, అసత్యము, అపవిత్రము అను మనస్సు యీ జ్ఞానమును అందుకోలేదు గావున మనము ఇంద్రియలోలత్వము గల జీవితమును గడపవద్దు.

మన ఆత్మలకు ఆత్మగా భగవంతుని మనము ప్రేమించుదము. ఈ ప్రేమ యొక్క పరాకాష్ఠయందే యీ జ్ఞానమున్నది.

దైవత్వముతో సంపూర్ణులయిన సత్పురుషులు వారిచ్చవచ్చిన ఎవరికయినను ఎప్పుడయినను యీ జ్ఞానమును ప్రసాదించగలరు

మనమందరము అచిర కాలములోనే యీ జ్ఞానమును పొందెదము గాక.”

ఇది చదివించిన అనంతరము బాబా దీని నకళ్ళను అందరికీ పంపిపెట్టారు. తరువాత అక్టోబరు 21 వ తేదీన ప్రారంభం కానున్న మస్తు, పేదల కార్యక్రమము నకు బాబా విరామములు నందిస్తున్నారు

ఆ రోజునే తరువాత యీ సందేశాన్నికూడా యిచ్చారు బాబా.

"నేను నా పాత జీవితపు శిష్యులు భావిస్తున్న భగవంతుడినే అయితే వారిని హృదయపూర్వకంగా వారి నమ్మకానికి ప్రేమకి అంటిపెట్టుకుని ఉండమని నా కోరిక. వారు నా పాత జీవితపు ఆజ్ఞలను పాటించాలని, బలవంతంగా వారికి బంధనం కలిగిందనే భావం లేకుండా నిజమైనప్రేమకు యోగ్యమయిన జీవితం జీవించాలని. నేను ఎవరిని అయినప్పటికీ పరమదయానిధి అయిన భగవంతుడు వారికి ఆధ్యాత్మికంగా బహుమానం యిస్తాడు. వారు కావాలని కోరికపోయినా నా ఏర్పాటుదార్లుగురించి వారికి ధైర్యాన్నిచ్చి చివరివరకు వారి బాధ్యతలను నిర్వర్తించేలా చేయమని భగవంతుని అడుగుతాను

నా పాత జీవితం నన్ను భగవంతుని దివ్యపీఠం మీద దివ్యమైన సంపూర్ణత్వంతో ఉంచుతుంది. నా క్రొత్త జీవితం నన్ను ఒక అణకువ కలిగిన భగవంతుని యొక్క ప్రజల సేవకునిగా చేస్తుంది నా క్రొత్త జీవితంలో సంపూర్ణ దివ్యత్వం స్థానంలో సంపూర్ణమయిన అణకువ ఉంటుంది. నా క్రొత్త జీవితంలో నేను అన్వేషకుడను, స్నేహితుడను ఈ రెండు రీతులు—సంపూర్ణ దివ్యత్వము, సంపూర్ణమయిన అణకువ భగవంతుని ఇచ్ఛప్రకారం ఉంటాయి అవి శాశ్వతంగా భగవంతుని శాశ్వత జీవితంతో సంబంధించి ఉంటాయి నన్ను ఎవరయినా ఎవరిగానైనా నమ్మవచ్చు. కానీ ఎవరూ నా ఆశీస్సులను, అద్భుతాలను, ఏ విధమైన బహుమానాలను యీ నూతన జీవితంలో కోరరాదు నా క్రొత్త జీవితం శాశ్వతమయినది నా సేవకులు కాక నా క్రొత్త జీవితంలో ఎవరయినా ఎక్కడయినా ఉన్నా ఆ జీవితం జీవించాలంటే స్వతంత్రంగా జీవించవచ్చు

" నేను పాత జీవితం లోకి మరల ప్రవేశించి కొద్ది గంటలుంటున్నాను. మిమ్ములనందరను చూడటానికి నాకు సంతోషంగా ఉంది మీకు నా యందున్న ప్రేమకు నేను చాలా సంతోషిస్తున్నాను. మిమ్ములను అందరను, యింకా యీ రోజున యిక్కడకు రానివారిని నేను కోరేదేమనగా నాకు పాతజీవితపు శిష్యుల యెడల భక్తుల యెడల ఉన్న ప్రేమ అపారము అని మీరు తెలుసుకోండి

1949 అక్టోబరు 16 వ తేదీన నేను క్రొత్తజీవితం అవలంభించాను ఈరోజుకి సరిగ్గా సంవత్సరం అయ్యింది క్రొత్త జీవితం యొక్క నియమాల ననుసరించి జీవితం సాగించ లేకపోయామని నేను చెప్పాలి క్రొత్తజీవితంయొక్క నిబంధనలను నేను అనుకున్నట్లుగా నా సహచరులు నడుచుకోలేదు అయితే యిది మాత్రం వారి యెడల న్యాయంగా చెప్పాలి. వారు అందుకు శాయశక్తులా వారి సమర్థతను బట్టి వారి అవగాహనను బట్టి ప్రయత్నించారు. అందుచేత యీ సంవత్సరం పరాజయం పొందామని కాకుండా మాకు కనువిప్పు కలిగించదని నేను భావిస్తున్నాను.

ఇప్పుడు నా సహచరులకు యీ క్రొత్త జీవితం లో నన్ను చేరుతామని వారు మొదట చేసిన నిర్ణయాన్ని పునారాలోచన చేయమని కావాలంటే వారు నా సేవకులుగా నన్ను చేరమని వారికి నేను అవకాశం యిస్తున్నాను లేకపోతే క్రొత్త జీవితంలో నుంచి తప్పుకుని పాతజీవితపు శిష్యులుగా స్వేచ్ఛగా ఉండి యీ ప్రపంచంలో స్వతంత్ర జీవనం సాగించవచ్చును.

( అయిదవ భాగము సమాప్తము )

తరువాయి 6 వ భాగంలో